శ్రీ

# హరి కథామృతసారము

ప్రథమ సంపుటము

జగన్నాథదాసార్యవిరచిత కన్నడ హరి కథామృత సారమునకు ఆంధ్రానువాదము




అనువాద కర్త: హరికథారత్న - ఆశు కవితా విశారద

విద్వాన్ ఆదవాని వెంకోబరావు

# పరిచయము

హరికథామృతసారము దాససాహిత్యమునందు మేరుకృతి. పురందరదాసాది హరిదాస సాహిత్యమునకు వ్యాఖ్యానరూపమైనది. శ్రుతి-స్మృతి-పురాణరహస్యముల పెన్నిధి. ఈ ఒక్కగ్రంథపు అధ్యయనమే సకల హరిదాసుల మఱియు శ్రీ మధ్వాచార్యులవారి గ్రంథములందడగియున్న అపూర్వ ప్రమేయములను పరిచయము గావింపగలదు.

ఈ కృతికి ప్రస్తుతము 12 వ్యాఖ్యానములు ఉపలబ్ధమగుచున్నవి. వీనియందు 3 వ్యాఖ్యానములు సంస్కృతమందు రచితమైయున్నవి. ఆ గ్రంథపు వైశిష్ట్యమును ఉత్తమత్వమును సాటిచెప్పుచున్నది. కన్నడ వాఙ్మయ ప్రపంచమునందు ఈ వ్యక్తిత్వము మఱియే గ్రంథములకు దొరకజాలదు. దీని రచనోద్దేశము అమోఘము. సకల సాత్త్వికజీవుల ఉద్ధారముకొఱకు రచింపబడినది. ఈ సాహిత్యము. అందువలననే ఇది విశ్వసాహిత్యము.

హరికథామృతసారపు హృదయావిష్కరణమునకై బయలుదేరిన వ్యాఖ్యానము లన్నియు అపూర్వములైనవే. అందరు వ్యాఖ్యానకారులు జగన్నాథదాసుల అనుగ్రహమునకు పాత్రులే. వ్యాఖ్యానకారులందరు తమ వ్యాఖ్యానగ్రంథములందు క్రొత్త క్రొత్త విషయములను ఆవిష్కరించి శబ్ద రచనయందు కొలతయందు వామనునియట్లున్న హరికథామృతసారపు అర్థవిషయక త్రివిక్రమ రూపమును చూపించి యున్నారు.

అనేకులైన వ్యాఖ్యానకారులందు సంకర్షణ ఒడయులొకరు. వీరుసన్యాసులు. తమ అంతశ్శుద్ధి కొఱకు కన్నడగ్రంథమైన హరికథామృతసారమునకు దివ్యమైన వ్యాఖ్యానమును వ్రాసి ధన్యులనిపించుకొనిరి. ఇదియును హరికథామృతసారమయొక్క భవ్యమైన వ్యక్తిత్వమునకు నిదర్శనము.

ఈ అపూర్వమైన గ్రంథపు చవిని అన్నిప్రాంతముల జనాంగము చవిచూడవలెను. అయిన దీనికి భాష కొంచెము ఆతంకమైయున్నది. తెలుగు మొదలగు ప్రాంతపు జనులకు కన్నడమందు రచితమైయున్న ఈ హరికథామృతసారము అందని మ్రానిపండైయున్నది.

ఈ గ్రంథపు దివ్యామృతమును సకల భాషాభిమాన జనులకు అనుభవింపజేయవలసి యున్నది. ఇది హరిదాస సాహిత్యాభిమానులందరి ముఖ్యకర్తవ్యము.

ప్రస్తుతము ఈ మహత్కార్యసాధనకు ముందుకురికిన ధీమంతులైన వ్యక్తి

శ్రీ ఆదవాని వెంకోబరావుగారు తెనుగు కన్నడ భాషలయందు సవ్యసాచియైయున్న శ్రీయుతులు హరికథామృతసారమును తెలుగులో అనువదించి తెనుగుప్రాంతపు జనులకు మహోపకారమును చేసియున్నారు. మూలమునకు తెనుగులో అనువదించుటయేకాక సంకర్షణ ఒడయుల వ్యాఖ్యానమునుకూడ తెలుగునందనువదించి సమాజమునకు రెండవ ఉపకారమును చేసియున్నారు. వీరి గురునిష్ఠ అపూర్వము. గురుగోవింద దాసులచే 'వేణువినోదవిట్ఠల' అను అంకితమును హొంది సాధన మార్గమందు సాగిన వీరికి హరిగురువుల అనుగ్రహఫలరూపమందు ఈ అనువాద రూప మహాభాగ్యము దొరకియున్నది.

ఒకభాషనుండి మఱియొకభాషకు అనువాదమనినచో అది కత్తిమీదసాముపతె అయినప్పటికీ శ్రీ ఆదవాని వెంకోబరావుగారు ఈకార్యమునందు కృతకృత్యులైయున్నారు. వీరి అనువాదము జగన్నాథదాసులకు సమ్మతమైయున్నదనుటకు సాక్షి ఈగ్రంథము యొక్క ప్రచురణకు శ్రీనివాసునిచే సహాయము దొరకుటయే.

వెంకోబరావుగారి అనువాదకార్యము హరికథామృతసారహృదయమును ప్రతిబింబించునదైయున్నది. మొత్తముమీద శ్రీయుతుల జన్మధన్యము. హరికథామృత సారపు చదివి తెనుగుప్రాంతపు సాత్త్వికులు వెంకోబరావుగారి అనువాదమును మణిఖచితసువర్ణ పాత్రయందు ఆస్వాదించి ఆనందింతురని నమ్ముచున్నాను. వీరి సుమధ్వ విజయపు అనువాదము తెనుగుప్రాంతమునకు మొదటి తొడవైనచో ఇది రెండవ తొడవు. దీనియట్లు ద్వైతసిద్ధాంతప్రమేయములను తెలియజేయు అనేకకృతులు శ్రీయుతులచే వెలువడుగాకయని శ్రీనివాస పరబ్రహ్మయందు ప్రార్థించుచు విరమింతును.

12-12-1995

కె. అప్పణాచార్యులు
విశేషాధికారి, దాససాహిత్యప్రాజెక్టు
తి.తి. దేవస్థానములు, తిరుపతి

# శ్రీ 108 శ్రీ విద్యాధీశతీర్థ శ్రీపాదులవారు
# జగద్గురు శ్రీ మధ్వాచార్య సంస్థానము
పలిమార్ మఠము, ఉడుపి (మకాం), తిరుపతి

## ఆశీర్వచనము

హరిదాస వాఙ్మయమందు హరికథామృతసారము విశిష్ట స్థానమును పొందియున్నది. మంత్రతుల్యముగా పఠించుచున్నాము. సంస్కృత వ్యాఖ్యానము పడసియున్న విశిష్టప్రాకృతకృతి ఇది. అందువలన నిత్యపాఠ ప్రవచనమందు వచ్చియున్న అపూర్వ కృతియిది. దీని ప్రచారము కేవలము కర్ణాటకము మాత్రము. పరిమితముకాదు.

దేశము మొత్తము వ్యాపించవలసియున్నది. ఇందుకొఱకు మా విద్వాన్. ఆదవాని వెంకోబరావు వీరు తిరుపతి శ్రీనివాసుని స్థానమైన ఆంధ్రప్రదేశపు భాషకు భాషాంతరీకరణ ప్రయత్నము చేసియున్నారు. పది సంధుల ప్రథమభాగము ముద్రితమైనది. మిగిలిన భాగము అనువదింపబడియున్నది. వారి ప్రతిభాఫలము సకల సజ్జన జనతకు లభించుగాక. వారి మిగిలిన భాగములుకూడ అచిరకాలములో ప్రచురణయగుగాక. ఈవిధముగా హరిదాసవాఙ్మయమంతయు తెలుగుభాషయందు వెలువడవలయునని ఉడుపి శ్రీకృష్ణరామ మధ్వులయందు ప్రార్థించుచు శ్రేయోతిశయమును ప్రార్థింతుము.

ఇతి నారాయణస్మరణలు

విద్యాధీశతీర్థులు

16-12-1995

# పీఠిక

శ్రీ హరికథామృతసారము కర్ణాటకభాషలో అత్యుత్తమమైన ద్వైతవేదాంత పద్యకావ్యము. దీనిని నారదాంశ సంభూతులైన శ్రీపురందరదాసులవారి దాస పరంపరలోని శ్రీ జగన్నాథదాసులు సహృదయ పండిత రంజకముగా ద్రాక్షాపాకశైలిలో రచించియున్నారు. ఈ కావ్యము దేశీయఛందస్సులో భామినీషట్పది పద్యములతో నలరారుచున్నది. బహురమణీయమైన సంస్కృత సుకుమార సమాస భూయిష్ఠమై మృదుమధురమై అనర్గళ ధారావాహినియై కవితామృతము జలజల ప్రవహించు చున్నది. ఎన్నిపర్యాయములు పఠించినను తనివితీరనిది.

కొన్నిసంవత్సరములకు క్రితము నాకును ఆగ్రంథమును పఠించు భాగ్యమబ్బినది. చాలసార్లు చదివితిని. తనివితీరలేదు. ఈకావ్యమును తెలుగులో అనువదించిన యెంతటి ఆనందానుభూతి తెలుగువారికేర్పడునోయని యొకభావము నాహృదయములో అంకురించినది. అంకురించుటయేకాదు. మొక్కయై స్థిరపడినది. చిగురించినది. శాఖలతో విస్తరించినది. పుష్పించినది. మనోరంజకమైన సువాసనల వెదజల్లినది. ఇక ఊరకుండుటతగునా?

అనువాదమును ప్రారంభించితిని. మంగళాచరణ సంధి ముగిసినది. ఆరాత్రి స్వప్నములో దేవాంశావతారులైన దాసశ్రేష్ఠులు నలువురు ఘల్లుఘల్లురను కాలియందెలతో నర్తించుచున్నారు. నన్నుద్దేశించి 'ఓ బాలకా! నీకవితరమణీయము. నీవు ధన్యుడవే. కాని నీయనువాదము నిలుపుము. నీవింకను ఉపనిషత్తులు పఠించలేదు. కొంతకాలము ఆగుము' అని అదృశ్యులైరి. వారి ఆదేశముతో నిలిపితిని. మనస్సు విచారపూరితమైనది. కొన్ని సంవత్సరములే గడచినది.

ఉన్నట్లుండి దాసు వారి నుండి ఒకసందేశమందినది. మైసూరు గురుగోవింద విట్ఠలదాసులవారి విరచితమైన ఉత్తరము. చూచుటతోనే ఒడలుపులకరించినది. ఆహా! ఎంతఅద్భుతము. వారి అంకితోపదేశ భాగ్యమునకు భగవంతుని ప్రేరణము. రమ్మనిపిలుపు. మరువరాని అనుభూతి. మైసూరు చేరితిని. పాండురంగ దేవాలయసన్నిధి. ఆ దినము రాక్షసనామ సంవత్సరము శ్రావణబహుళ చవితి సోమవారము శుభలగ్నమునందు శ్రీవేణువినోద విట్ఠలుని అంకితనామము. మహామంత్రోప దేశము లభించినది. ధన్యుడనైతిని. వారిచే దశోపనిషత్తుల గ్రంథములు పొందితిని. శ్రీగురుగోవింద విట్ఠలదాసువారి దర్శనభాగ్యముచేతను అనుగ్రహబలముచేతను కన్నడములో ఆశుకవిత్వము అలవడినది.

అప్పుడు: ఆశువుగా పాడినపాట - చూదుడు..........

## మకాంభోజి - జంపెతాళ

ఏసుజన్మద ఫలవో - దాసత్వకొడిసిదీ।
దాస గురుగోవింద - విట్ఠలదాసరలీ॥
మైసూరు నగరదలి - దాసరామందిరది।
వాసిసువశ్రీపాందు - రంగవిట్ఠలనే॥ ॥ఏసు॥

రాక్షస సువత్సరది - రమ్యశ్రావణ కృష్ణ।
పక్ష చౌతిందుదిన - శుభకాలదల్లీ॥
'సుక్షేమ నినగిత్తు - రక్షిసువహరియెందు'।
రాక్షసాంతకనామ - సార్థకెనిసిదకరుణి॥ ॥ఏసు॥

గురుపూర్ణవాత్సల్య - దొరకిదరెనా ఒలివె।
సరియెందు తోరిసువ - సంభ్రమది యెనగే॥
శిరదమేలిరిసి శ్రీ - హరియ సాలగ్రామ
పరమాభిషేక వా - దరది మాడిసిదీ॥ ॥ఏసు॥

రోమాంచవాయితో - శ్రీమనోహర! దుష్ట
కామాదిషడ్వైరిగళ - కాటకళితో॥
ప్రేమాంకితదవేణు - వినోదవిట్ఠల।
నామంత్ర బలవిత్తు - శ్రీమంతనెనిసిదే॥ ॥ఏసు॥

దశోపనిషత్తులను పఠించుచు శ్రీవేణువినోద విట్ఠల మహామంత్రమును అనుదినమును జపించుచుంటిని. ఒక్కదినము స్వప్నమున బింబరూపకునిదర్శన భాగ్యము కలిగినది. మహానందము. మహాశ్చర్యము.

## కల్యాణి ఆదితాళము

బింబమూరుతియ - దరుశనవాయితు।
సంభ్రమవేనెందు - పొగళలీ॥
అంబుజాక్షహృద - యాంబరదలి రవి।
బింబనంతె మెరెయువ మురళీధర॥ ॥బింబ॥

అందిగెకిదు గెజ్జె - ఘంద శోభిసువ
సుందరవాదపా - దాంబుజగళలి||
ఎందిగు ఘల్లుఘు - ల్లెందు నర్తిసువ
మందరధర గోవింద మూరుతి యు|| || బింబ||

గోపతియర మధ్యది కొళలూదుత|
రాసక్రీడా - లాస్యదికుణియుత||
లాసతి తుళసీ - హారగళిందలి|
భాసితవాగువ - కంబుకంధరన|| || బింబ||

బలదలి రుక్మిణి - యెడదభాగదలి|
చెలువాగువ శ్రీ - సత్యభామెయరు||
నలియుత శోభిసు - తిరలు ప్రేమదలి|
చెలువతోరిసువ - జలరుహనాభన|| || బింబ||

శ్రీగంధవు క-స్తూరీలేపిత|
వాగువ సుందర-వాదరూపవను|
బేగనెతోరుత - మోక్షకొడువ స
ర్వాగమవందిత - నాగశయనహరి|| || బింబ||

శిఖిపింఛవు - శిరదల్లిశోభిసలు|
ముఖదలి తిలకవు - ముద్దుసురియుతిరె|
సకలసురోత్తమ - పంద్యనాగిరువ|
ప్రకటవేణువి - నోదవిట్ఠల|| || బింబ||

గుర్వనుగ్రహ భాగ్యమెట్టిదని ఉప్పొంగుచుంటిని. ఇంకొక దినము పూర్వమువలె స్వప్నమున దాసచతుష్టయమువారు దర్శనమొసగి 'ఇపుడు నీఅనువాదమును కొనసాగింపుము. భగవదనుగ్రహమున కృతకృత్యుడవయ్యెదవుగాక' అని ఆదేశించి అదృశ్యులైరి. గురువుల ఆదేశానుసారము ప్రక్రమించితిని. విఘ్నములు పరిహారమై ఆంధ్రానువాదము నిరాతంకముగా సాగినది. మూడు సంవత్సరములపాటు మూలానువాద పద్యరచనము వ్యాఖ్యానముతోపూర్తియైనది. ఆంధ్రహరికథామృతసార కావ్యనిర్మాణ భాగ్యమును బింబరూపకుని దయచే పొందగలిగితిని. కొన్ని పర్యాయములు పురాణప్రవచనము చేయుటకూడ జరిగినది. హరికథామృతసార హోమమును చేయగలిగితిని.

ఈ కాలమున గ్రంథరచనము మాత్రమున కవితాయజ్ఞము సమాప్తము కాజాలదు! ఆ గ్రంథమును ముద్రించిననే యజ్ఞపరిసమాప్తియని విదితముకదా.

ముద్రణముకానిచో ప్రయోజనమేమి? ఈ ఆలోచనలతో నుంటిని. శ్రీ అప్పణాచార్యుల వలను తి.తి. దేవాలయపు గౌరవనీయులైన శ్రీ ఇ.ఓ. గారి ఆర్థికసహాయమువలన ఈ హరికథామృతసారకావ్యము ముద్రించుట జరిగినది.

కన్నడ హరికథామృతసారములో ముప్పదిరెండు సంధులున్నవి. ఆకావ్యము పూర్తిగా అనువాదముచేసి యుండినప్పటికిని పూర్తిగా ముద్రించుటకు అవకాశము ఆర్థికసహాయము దొరకనందువలన ప్రస్తుతము పది సంధులుమాత్రము ప్రథమ సంపుటముగా ముద్రితమైనది. అవకాశము దొరికినపుడు మిగిలిన భాగము ముద్రింపబడును. ఔత్సాహికులైన సహృదయులు ఈ కావ్యమును పఠించి రసానుభూతితో జగన్నాథదాసులవారి అంతర్యామియైన శ్రీ లక్ష్మీనరసింహాభిన్న శ్రీవేంకటేశ్వరుని కృపకు పాత్రులగుదురని విశ్వసింతును.

అనువాదమునకు ముఖ్యోద్దేశమేమనగా ఆంధ్రములో ద్వైతగ్రంథములు చాల తక్కువగానున్నది. సంస్కృతభాషా పరిజ్ఞానములేని వారికి, మహాకవులైన నన్నయ తిక్కన పోతనాదులచే అనువదింపబడిన భారతభాగవతాది పురాణగ్రంథములు లభ్యమగుటచే జ్ఞానసముపార్జనకు అవకాశమేర్పడియున్నది. కాని మధ్వాచార్యుల వారి గ్రంథములు అనువాదము చేయుకున్నచో తెనుగువారి కెట్లు లభ్యముకాగలదు. అందువలన ద్వైతవేదాంతసారముతో విరాజిల్లు శ్రీజగన్నాథ దాసులవిరచితమైన కన్నడ హరికథామృతసారమును తెలుగులో అనువదించితిని. ఇది సాహసకార్యమే కావచ్చును. అంతటి సామర్థ్యము నాకు చాలకయుండవచ్చును. కవితాప్రచారమునకుగాని పాండిత్యప్రకర్షమునకుగాని యిట్టిసాహసమును చేసినవాడనుకాను. ద్వైతసాహిత్యము మఱియు సహృదయుల సేవార్థముగనే యీ కార్యమునకు గడంగితినని విన్నవించుచున్నాడను. ఏకారణమైననేమి? సాహితీవేదాంతప్రియులీకావ్యమును పఠించి ఆనందానుభూతిని పొందగలరని భావించుచున్నాను.

ఈ గ్రంథముద్రణమునకు నాకు ఆర్థిక సహకారమొసగిన తిరుమల - తిరుపతి దేవాలయం నిర్వహణాధికారులు గౌరవనీయులైన శ్రీ నిమ్మగడ్డ - రమేష్‌కుమార్ (I.A.S.) వారికి అమూల్యములైన సలహాలనొసగి పరిచయము వ్రాసి యిచ్చిన గౌరవనీయులు (దాస సాహిత్యప్రాజెక్టు........ విశేషాధికారి తి.తి. దేవస్థానము)........ శ్రీ అప్పణాచార్యుల వారికి నా కృతజ్ఞతాభివందనములను సమర్పించుకొనుచున్నాను. వాఖ్యానము వ్రాయుటలో నాకు సహకరించిన పలమనేరు వాస్తవ్యులు సంగీత విద్వాన్ శ్రీ పి. రామమూర్తిగారికి నా హార్దికమైన కృతజ్ఞతలు. ఈ కావ్యమును ముద్రింపవలెనని నాకు మిక్కిలి ప్రోత్సాహమిచ్చిన (M.B.B.S.

డాక్టరు. బైరెడ్డిపల్లి) కె. కదిరప్ప అను నా శిష్యునకు నావాత్సల్యపూర్వకమైన శుభాశీస్సులు.

ఇంకను చాలామంది సహృదయులు శ్రీజగన్నాథదాసులవారి అంతర్యామి శ్రీవెంకటేశ్వరుని ఆంతరంగిక భక్తులు ఈ గ్రంథప్రచురణ కార్యమందు ఎనలేని సహాయము నందించియున్నారు వారికందరికిని నా హార్దిక కృతజ్ఞతలను సమర్పించుకొనుచున్నాను. గ్రంథమును సర్వాంగసుందరముగా సకాలములో ముద్రించి ఇచ్చిన పద్మావతి కమర్షియల్ సెంటర్, భువనేశ్వర్ ప్రొప్రైటర్ శ్రీ రవిశంకర్..........గారికి వారి ముద్రణాలయ బృందము వారికి నా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను. మూలమునందు, అనువాదమునందు ఏవైన లిపి, భాషా, విషయాది దోషములు ఏర్పడియున్నచో పాఠకులు క్షమింతురని ప్రార్థించుచున్నాను.

21-04-2011 — విద్వాన్ ఆదవాని వెంకోబరావు

# శ్రీ జగన్నాథ దాసులవారి చరిత్ర

శ్రీహంస నామకుడైన పరమాత్ముని అజ్ఞచే వాయుదేవుడు కలియుగము నందు శ్రీమధ్వాచార్యులుగా అవతరించెను. ఆ మధ్వాచార్యులకు శిష్యులై పద్మనాభ తీర్థులు, నరహరి తీర్థులు, మాధవ తీర్థులు, అక్షోభ్య తీర్థులను వారు అవతరించిరి. వారి పరంపరలో జయ తీర్థులును, వారి శిష్యులు విద్యాధిరాజతీర్థులు, రాజేంద్రతీర్థులు, జయధ్వజతీర్థులు పురుషోత్తమతీర్థులు బ్రహ్మణ్యతీర్థులు ఉదయించిరి. పద్మనాభ తీర్థుల పరంపరలో స్వర్ణవర్ణ తీర్థులను వారు ప్రసిద్ధులైరి. వారి శిష్యులే శ్రీపాదరాజస్వాములు (లక్ష్మీనారాయణ తీర్థులు) బ్రహ్మణ్య తీర్థుల వారి శిష్యులే శ్రీవ్యాసరాజస్వాములు.

నారదాంశ సంభూతులైన వారు పురందర దాసులు. వీరి శిష్యులు విజయదాసులు (భృగ్వంశసంభూతులు) వీరి శిష్యులు గణపతి అంశ సంభూతులు గోపాలదాసులు. గోపాలదాసుల వారి శిష్యులు జగన్నాథదాసులవారు. వీరి మహా మహిమోపేతమైన చరిత్రను తెలియుట అత్యావశ్యకమై యున్నది.

మానవీ గ్రామమునకు సమీప మందు 'బ్యాగవట్టె' అనుగ్రామమున్నది. ఆ గ్రామ మందు భాగవత శ్రేష్ఠులై శ్యానుభోగ వృత్తిలో నరసింహాచార్యులు నివసించు చుండిరి. వారు జ్ఞాన భక్తి వైరాగ్య సంపదచే తమ ఉద్యోగమును త్యజించిరి. జ్ఞానిశ్రేష్ఠులైన తిమ్మణ్ణాచార్యు లందు నామాంకితముతో దాస దీక్షను పొందిరి.

ఆ నరసింహాచార్యులు-లక్ష్మక్క అను దంపతుల యందు సహ్లాదాంశచే జనించిన పుత్రుడు శ్రీనివాస సూరి. వీరు శ్రీవరదేంద్ర తీర్థుల కడ విద్యాభ్యాసము చేసి సంస్కృత కర్ణాటక భాషల యందు ఉద్దండ పండితులైరి. తండ్రి వలన దాససాహిత్యమును నేర్చిరి. గృహస్థాశ్రమమును అవలంబించి శాస్త్రి ప్రవచనములచే జీవించుచుండిరి.

పండితోత్తములైన శ్రీనివాసాచార్యులు దేవాంశ సంభూతులైనను మానుషాన్న ప్రభావముచే అహంకారమునకు లోబడి విజయదాసులను ద్వేషించిరి. ఉత్తముల నిందించుటచే రాజ యక్ష్మమో గుల్మమోయని తెలియని వ్యాధికి గురియైరి.

ఎట్టి వైద్యోపచారములకు వ్యాధి నయము కాకుండుటచే బాధ పడుచు తిరుపతి శ్రీనివాసుని సేవించిరి. స్వప్నమున వేంకటేశ్వరుడు దర్శన మొసగి విజయదాసుల శరణు పొందుమని ఆజ్ఞాపించెను. వెంటనే విజయ దాసుల వారిని శరణు పొందిరి. వారు దయామయులై తమ శిష్యులైన గోపాలదాసుల కడుకు పంపిరి. కరుణామయులైన గోపాలదాసుల వారు ధన్వంతరీ జపము చేసి తమ ఆయుస్సు నందు నలుపది సంవత్సరములు వారికి ధారపోసి పండరాపురి లోని

పాండురంగని సేవింపు మనిరి. అట్లు సేవింప చంద్ర భాగానదిలో స్నానము చేయుచుండ పరమాత్ముని అనుగ్రహముతో 'జగన్నాథవిట్ఠల' అను అంకిత నామము లభించెను. నాటి నుండి జగన్నాథ విట్ఠల దాసులని సార్థక నామధేయులై దాసశ్రేష్ఠులైరి.

వీరు దాస దీక్షతో అనేక తీర్థక్షేత్రములను సందర్శించుచు మరల గోపాలదాసుల కడకు చేరి జరిగిన వృత్తాంతములను వినిపించి అరోగగాత్రులైరి. అనంతరము వేణీసోమ పురమందున్న భక్తశ్రేష్ఠులైన వ్యాస తత్త్వజ్ఞ తీర్థులను దర్శించుకొని మంత్రాలయము చేరి శ్రీపాదీంద్ర తీర్థులను సేవించి గురువరేణ్యులైన విజయదాసుల సన్నిధి చేరి వారి అనుగ్రహమును పొంది మాన వీక్షేత్రమునకు వచ్చిరి. అచట శిష్యులకు పాఠ ప్రవచనములు చేయుచుండిరి. అపుడు ప్రాణేశ విట్ఠల దాసులు, శ్రీద విట్ఠల దాసులు శిష్యులైరి.

ఒకానొకప్పుడు కర్జగి క్షేత్రమును చేరిరి. అచట భార్య కోరిక మేరకు ఒక జమీందారు శరణు వేడగా అతని ప్రారబ్ధమును పోగొట్టి హనుమంతుని దర్శింప జేసిరి. ఆ వ్యక్తి సంతోషించి వారిచే దాసత్వమును స్వీకరించి శ్రీదవిట్ఠలాంకితమును పొందిరి. ఇంకను అనేక మంది జగన్నాథ దాసులకు శిష్యులైరి. రిత్తి క్షేత్రము చేరి శ్రీధీరేంద్ర తీర్థులను దర్శించి వారి అనుగ్రహమును పొందిరి. అచటి నుండి సోదాపురమును చేరి శ్రీత్రివిక్రమ దేవుని మందిర మందు ధ్వజస్తంభమందు హంసారూఢు లైయున్న వాది రాజ యతీంద్రులను వర్ణించి నమస్కరించిరి. ధవళ గంగాస్నానము చేసి శివుని హనుమంతుని కృష్ణుని అశ్వత్థ వృక్షమును సేవించి పంచబృందావనమును దర్శించిరి. హరిహరక్షేత్రము, మద్దూరు, అబ్బూరు మున్నగు స్థలము లందలి హరి గురువులను సేవించుచు శ్రీరంగ పట్టణమున రంగనాథుని దర్శించి మైసూరు నగరమునకు వచ్చిరి. అచట మహాపండితుల సభల యందు ద్వైతతత్త్వములను ఉపన్యసించుచు మహా పండితుల మన్ననలను పొందిరి. దాసుల వారు మైసూరు నుండి శిష్యులతో కదలి ముళబాగిలు, వేంకటగిరి, ఘటికాచలము, కంచి, ఉడుపి, కొంగు, కేరళ చోళ పాండ్య దేశము లందు సంచరించి ఉత్తమ గౌరవములను పొందిరి.

శ్రీప్రసన్న శ్రీనివాస దాసులవారు దాసుల వారి చరిత్రను సంక్షేపముగా వివరించి గురు పరం పరా స్వరూపమును తెలిపియున్నారు. పురందర దాసులవారు నారదాంశావతారులు. భృగు అవతారులే విజయదాసులు. విశ్వోపాసకులు వర గణేశాంశులే గోపాలదాసులు. ప్రహ్లాదసహోదరుడైన సహ్లాద వరాంశచే శిష్యోద్ధారమునకై జగన్నాథ దాసులై యవతరించిన నరసింహాచార్య నందనులని పొగడబడి యున్నారు. ఈ నరసింహాచార్యులు సుర గంధర్వాంశ సంభూతులు. సూరికుల తిలక శ్రీ వరదేంద్రయతీశ్వరుల శిష్యులు.

జగన్నాథ దాసులు శ్రీపాదరాజ విరచితమైన మధ్వనామమునకు ఫలశ్రుతిని, తత్త్వమును బోధించు 'తత్త్వసువాలిని' రచించి యుండుట యే కాక అనేక కీర్తనలను రచించి యున్నారు. శ్రీహరి వాయువులు శ్రీపాదరాజస్వాములు, వ్యాస రాజస్వాములు, వాది రాజస్వాములు, పురందర దాసుల వారి అంతర్యాములై స్వప్నము నందు ప్రేరేపింపగా వారి ప్రేరణచే దివ్యామృతసారమైన హరి కథామృత సారమును విరచించి యున్నారు. జగన్నాథ దాసుల వారు ఈ హరి కథామృతసారమును స్వాదిక్షేత్ర మందు ప్రారంభించి చిప్పగిరిక్షేత్రమున విజయ దాసుల వారి మఱియు శ్రీకృష్ణుని సన్నిధి యందు మంగళము గావించినట్లు ప్రసిద్ధమైయున్నది. అనంతరము దాసుల వారు తమయుప దేశములచే భక్త బృందమునుద్ధరించుచు మాన వీక్షేత్రమందు నివసించుచుండిరి. ఇట్లు ఎనుబది రెండు సంవత్సరములు జీవించి శాలివాహన శకము 1731 శుక్లనామ సంవత్సరము భాద్రపదశుద్ధ నవమి భానువారము మూలానక్షత్రము ఈ శుభ కాలము నందు వైకుంఠ పురమునకు పయనించిరి. ఒక అంశచే నరసింహ స్థంభము నందును, ఇంకొక అంశచే శ్రీరాఘువేంద్ర బృందావన సన్నిధి మఱి సత్యబోధుల సాన్నిధ్య స్తంభము నందును విరాజిల్లుచున్నారు.

'జగన్నాథ' అను నామము భయమును పోగొట్టి సర్వ పీడలను పరి హారించి సర్వోత్తమస్వామి సుఖమునొసగి అన్నధనమునిచ్చి సంరక్షించునను అర్థమును సూచించు చున్నది.

సీ॥ శ్రీనారద పరాంశ క్షితిలో జనించిన
గురుపురందరదాస వరులఁ దలఁతు
భృగు మునీంద్రాంశచేఁ బృథ్వి జనించిన
విజయ దాసార్యుల వేడ్కఁదలఁతు
గణపతి యంశ లోకమున జనించిన
గోపాల దాసులఁ గోరి తలఁతు
పహ్లాదు నంశచే జగతి జనించిన
యా జగన్నాథ దాసార్యుఁదలఁతు

తే.గీ. నట్టి దాస పరం పర నవ తరించి
ద్వైత తత్త్వంబు గీర్తనా రీతులలర
దాస పంథాన సరళి లో ధన్యులైన
యఖిల కర్ణాట దాసుల నభినుతింతు.
జల జేష్ట నిభాకారం జగదీశ పదాశ్రయం।
జగ తీ తల విఖ్యాతం జగన్నాథ గురుం భజే ॥

# విషయ సూచిక

శ్రీరస్తు

శ్రీగురుభ్యోనమః హరిః ఓమ్

శ్రీగురుగోవింద విట్ఠలాత్మక శ్రీ వేణువినోద విట్ఠలాయనమః

శ్రీ

# హరికథామృతసారము
## (ఆంధ్రానువాదము)

## ఇష్టదేవతా స్తుతి

శ్రీ వైకుంఠ పదంబుజేరుటకునై చింతించెదన్ రుక్మిణీ
దేవీ చిత్త సరోజమిత్రు సుజనార్తిత్రాణ పారాయణున్
బ్రావృణ్ణీరదనీలదేహు నఖిలబ్రహ్మాండ భాండోదరున్
లావణ్యోజ్జ్వల కోటిమన్మథకళాలంకారు గోపాలునిన్.

## (1)
## మంగళాచరణసంధి (ఒకటవ సంధి)

### అవతారిక

మూలగ్రంథకర్తలు శ్రీ జగన్నాథ దాసుల వారు తాము రచించు గ్రంథము యొక్క నామమును దెల్పి ఆ గ్రంథము నందు అత్యంతాదరమును జూపింప వలెనని భక్తులను ప్రార్థించుచున్నారు. మఱియు ఈ గ్రంథమునకు అధికారులను తెల్పుచున్నారు.

మూలము:

హరికథామృతసార గురుగళ
కరుణదిందాపనితు పేళువె
పరమ భగవద్భక్తరిద నాదరది కేళువదు*॥

* మొదట కన్నడమూలము తరువాత తెలుగు అనువాదము చూపబడును.

తే॥ హరి కథామృతసారము గురువుల దయ
మెఱయ వర్ణించువాడను పరమ భక్త
వరులు సజ్జనులాదర భావమొదవ
వినవలయు భక్తిమీఱగ వీనులలర.

తా॥ సర్వోత్తముడైన శ్రీహరి యొక్క సృష్ట్యాది వివిధ వ్యాపార రూపమైన విషయమనెడి అమృతము యొక్క సారమును మధ్వాచార్యులే మొదలగు గురువుల యొక్క అనుగ్రహ బలముతో వివరించుచున్నారు. దీనిని సజ్జనులు మిక్కిలి భక్తిశ్రద్ధలతో వినవలయును.

వి॥ శ్రీ హరి గుణానువర్ణనము రసజ్ఞులకు అమృతము కంటె మధురమైనది.

శ్లో॥ 'దధి మధురం మధుమధురం ద్రాక్షామధురం సుధాపిమధురైవ
మధురాపి తన్మధురం మధురానాథస్య నామ యద్గీతం॥'

అను భగవద్గుణగానమే మధురాతి మధురమని తెలియుచున్నది. శ్రీమన్నారాయణుని మహిమా ప్రతిపాదకమైన వేదాదుల యందలి హరికథయే మోక్షసారము. సామగానముచే ఆనందోద్రేకమగుటవలన 'ఏ తత్సామగాయన్నాస్తే'అనునీ శ్రుత్యాదులచే జ్ఞాతమగు చున్నది. ఇట్టి గ్రంథమును మధ్వాచార్యులు ఇంకను తత్త్వేశులే మొదలైన గురువుల అధీనమగుటచే తమరచనాకర్తృత్వము బహుపరాధీనమైనదని అర్థము. ఇట్లు పరమత నిరాకరణమును స్వమతస్థాపనమును సంక్షేపముగా ప్రతిజ్ఞా వాక్యమట్లు సంధి సూచన యని సహకరించు అర్థమును పద్యము నందు చెప్పి 'సంక్షేప విస్తరాభ్యాంచ కథయంతి మనీషిణః' అనున్యాయానుసారము నాందీ సంధి యను నిర్విఘ్న ప్రచయాద్యనేక ఫలప్రదమైన మంగళా చరణ సంధి యందు శ్రీ పరమాత్ముని మొదలు కొని సకల దేవతలను విష్ణుభక్తులను స్తోత్రము చేసి గ్రంథమును ప్రారంభించు చున్నారు.

## శ్రీనృసింహస్తుతి

శ్రీరమణీకర కమల పూజిత।
చారు చరణ సరోజ బ్రహ్మాస।
మీర వాణి ఫణీంద్ర వీంద్ర భవేంద్ర ముఖవినుతా।
నీరజభవాండోదయ స్థితి।
కారణనె కైవల్యదాయక।
నారసింహనె నమిపె కరుణిపుదెమగె మంగళవ॥

సీ॥ శ్రీ రమణీ కరాం భోరుహ పూజిత!
సుందర పద పద్మ శుభ చరిత్ర!
వారిజ భవ వాయు వాణీ ఫణీశ్వర
పక్షీంద్ర శంకర వాసవ నుత!
యాదోరుహాసనాండోదయకారణ!
సుస్థితి కైవల్య సూత్రధారి!
సకల సత్సుర సాధు సంతాన సంతత
శ్రీ ప్రదాయక! నార సింహ! వరద!

ఆ॥ వె॥ నీదుపాదయుగళ నీరజముల మది
నిలిపి భక్తి మీఱ దలంతు నయ్య
మంగళంబులొసగి మమ్మెల్ల గావుము
పద్మ పత్రనేత్ర! భవ్య గాత్ర! (1)

తా॥ కాంతి సంపన్నురాలును, శ్రీమన్నారాయణుని రాణియైన లక్ష్మీదేవి యొక్క కరకమలములచే పూజింప బడు పాదపద్మములు గలవాడును, చతుర్ముఖ బ్రహ్మ వాయు సరస్వతి గరుడ శేష రుద్ర దేవేంద్రాదులచే పొగడబడు వాడును, సృష్టి స్థితిలయములకు కారణమైన వాడును, మోక్ష ప్రదాతయునగు ఓ నరసింహా! నిన్ను ప్రార్థింతును. మాకు మంగళములను దయ చేయుము.

## లక్ష్మీస్తుతి

ము॥ జగదుదరనతి విమలగుణ రూ।
పగళనాలోచనది భారతి।
నిగమతతిగళతిక్రమిసి క్రియా విశేషగళ॥
బగెబగెయ నూతనవకాణుత।
మిగె హరుషదిం పొగళి హిగ్గువ।
త్రిగుణమాని మహాలకుమి సంతైసలనుదినవు॥ 2

చ॥ జగదుదరుండునై యలరు శౌరిగుణావళులన్ విచారతం
బొగడుచు వేద భారత మనోహర భావము లెల్లదాటి త
న్నగధరు సత్క్రియా మహిమ నవ్యనవత్వము గాంచి పొంగు నా
త్రిగుణ గుణాభి మానియగు శ్రీరమ కావుత మమ్ము నిచ్చలున్.

తా॥ ఈ స్థావర జగములను మఱియు అనంతానంత జగములను తనయుదరము నందుగలవాడై ప్రకాశించు శ్రీమన్నారాయణుని మిక్కిలి కల్యాణ గుణములతో కూడిన రూప విశేషములను వర్ణించుచు మఱియును చతుర్వేదములందును మహా భారతము నందును కానరాని భగవంతుని మహిమాతి శయములను చింతించుచు ఆ శ్రీహరి జగద్వ్యాపార విశేషము లందు నానావిధములైన నిత్యనూతనములను గాంచి ఆశ్చర్యముతో ఉప్పొంగునటువంటి గుణత్రయాభిమానినియైన శ్రీలక్ష్మీదేవి మమ్ము సదా సంరక్షించుగాక.

వి॥ ప్రతి దినము నందును చేయునటువంటి ఏకాదశేంద్రియ జనితమైన కర్మలయందు అంతర్గతుడైన బింబరూపి పరమాత్ముడున్నాడను జ్ఞానమును, భక్తియును ఆ ప్రకారముగా తెలియుట యందు శక్తియునిచ్చి లక్ష్మీదేవి మమ్ములను రక్షణము సేయు గాకయని ప్రార్థించుచున్నారు.

## బ్రహ్మస్తుతి

నిరుపమానందాత్మ భవ ని।
ర్జర సభా సంసేవ్య ఋజుగణ।
దరసె సత్త్వ ప్రచుర వాణీ ముఖ సరోజేన॥
గరుడ శేష శశాంక దళ శే
ఖరర జనక జగద్గురవె త్వ।
చ్చరణగళిగభినందిసువె పాలిపుదు సన్మతియ॥ 3

చ॥ నిరుపమ హర్షితాత్మ! భవ నిర్జర సర్వ సభాంగణ స్తుతా!
వర ఋజుకోటి లోకపతి! వాణీముఖాం బుజమిత్ర! సన్మయా
గరుడ ఫణీంద్ర రుద్ర జనకా! బహు సత్త్వ గుణ ప్రభూ! జగ
ద్గురు వర! నీ పదాబ్జముల గొల్చెద సన్మతి నిచ్చి కావుమా!

తా॥ ఇమ్నూరుమంది ఋజుగణస్థులలో శ్రేష్ఠుడైన వాడును దోషరహితమైన ఆనందము గలవాడును, శ్రీ మన్నారాయణుని పుత్రుడును, గరుడ శేష రుద్రులకు తండ్రియు సత్త్వ ప్రచురుడును సరస్వతీ దేవి యొక్క ముఖ మనెడి కమలమునకు సూర్యుని వంటి వాడును ముక్తి యోగ్యులగు జీవులకు గురువునగు బ్రహ్మ దేవుని దివ్యజ్ఞాన భక్త్యాది బుద్ధిని ఐశ్వర్యమును దయ చేయుటకు ప్రార్థింతును.

# వాయుస్తుతి

ఆరుమూరెర డొందుసావిర।
మూరెరడు శతశ్వాసజప గళ।
మూరు విధ జీవరాళ గబ్జజకల్ప పర్యంత॥
తారచిసి సత్వరిగె సుఖ సం।
సార మిశ్రరి గధమజనరిగ।
పార దుఃఖగళీవ గురుపవమాన సలహెమ్మ॥ 4

చ॥ ఇరువది యొక్క వేలపయి నెన్నగ షట్ఛతమైన లెక్కతో
బరగెడు శ్వాసమన్ జపము బట్టి గుణత్రయ జీవకోటిలో
నరయగ బ్రహ్మ కల్పసమయంబొనరించి సుఖంబు మిశ్ర దు
ర్భరమగు దుఃఖమున్నిడు ప్రభంజన! కావుము మమ్ము నిచ్చలున్.

తా॥ సాత్త్విక రాజస తామసులను త్రివిధ జీవుల యందు వాయుదేవుడు స్థూల దేహము నందుండు వాడై ప్రతి దినమును ఇరువది యొక్క వేల ఆరునూర్ల సంఖ్య గల శ్వాస జపమును చేయుచున్నాడు. బ్రహ్మ దేవుని ఆరంభించి తృణాంత ముక్తి యోగ్యులు, పురంజనుని ఆరంభించి తృణాంత నిత్య సంసారులు మఱియు కలిని ఆరంభించి తృణాంత తమోయోగ్యులు ఈ త్రివిధ జీవుల యందు కాక బ్రహ్మదేవుని ఆరంభించు ఇన్నూరు మంది ఋజువుల యందు శ్వాస కార్యము శ్రీ పరమాత్ముడే వాయు దేవుని రూపమున నుండి చేయును. తదన్యమైన రుద్రాదిత్రి విధ జీవుల యందు శ్వాసకార్యమును వాయుదేవుడు స్థూల దేహము నందుండి చేయును. ఇట్లు బ్రహ్మ కల్పము వఱకు త్రివిధ జీవుల యందుండి శ్వాస జపము చేయుచు ముక్తి యోగ్యులైన సాత్త్వికులకు సుఖమును నిత్య సంసారులైన రాజసులకు మిశ్రమ సుఖమును తమోయోగ్యులకు అపార దుఃఖముల నిచ్చుచున్నాడు. అట్టి వాయుదేవుడు మమ్మురక్షించుగాక.

వి: హంస యను శబ్దముచే 'నిత్యంహీనోఖిలైః దోషైః సారరూపో యతోహరిః' అని ముక్తి యోగ్యుల యుపాసనము. ఇదే హంస మంత్రము చేత తమో యోగ్యులు వర్ణవ్యత్యాసము చేసి 'సోహం' అని ఉపాసనము చేయుదురు. నిత్య సంసారులు 'స్వాహా' యని ఉభయ సంబంధమైన సందేహ జ్ఞానముతో ఉపాసన చేయుదురు. త్రివిధ జీవుల సృష్టి యనునది వారి వారి స్వరూపముల అభివ్యక్తి కొఱకే గాని అన్యమైన కారణము కాదు. అందువలన లింగ శరీర

భంగానంతరము త్రివిధ జీవులకు త్రివిధమగు గతి ప్రాప్తించును. వాయుదశ యందు త్రివిధ జీవులను జీవన్ముక్తులుగా చేసి, బ్రహ్మ దశ యందు లింగ శరీర భంగులుగా చేయును. విరజా స్నానము చే ముక్తి యోగ్యులకు, వాయు పదమునకు వచ్చిన వాయు దేవునిచే నిత్య సంసారులకు తమోయోగ్యులకు లింగ శరీర భంగమును విధింపగలడు'.

## సరస్వతీ స్తుతి

చతురవదనన రాణి అతిరో।
హిత విమల విజ్ఞాని నిగమ।
ప్రతతి గళిగభిమాని వీణాపాణి బ్రహ్మాణి॥
నతిసి బేడువె జనని లకుమీ।
పతియ గుణగళ తుతిపుదకె స
న్మతియ పాలిసి నెలసునీ మద్వదన సదనదలి॥ 5

క॥ చతురాననుని వరరాజ్ఞీ!
యతిరోహిత విమల జ్ఞాని! యాగమమానీ!
నుతియింతు నిన్ను లక్ష్మీ
పతి గుణముల దెలుపరమ్మ వదనము లోనన్

తా॥ చతుర్ముఖ బ్రహ్మదేవుని రాణియు తిరోధానము కాని నిర్దోషమైన రుద్రాదుల కంటె విశేషమైన జ్ఞానము కలదియు వేద సమూహము లందు మిక్కిలి అభిమానము కలదియునగు ఓ సరస్వతీ! నిన్ను వందనము చేసి ప్రార్థించు చున్నాను. తల్లీ! లక్ష్మీపతి యైన శ్రీమన్నారాయణుని సృష్ట్యాది అనంత గుణములను స్తోత్రము చేయుటకు నీవు నా నాలుకపై నెలకొనుము.

## భారతీస్తుతి

కృతి రమణ ప్రద్యుమ్న నందనె।
చతుర వింశతి తత్త్వపతి దే।
వతి గళిగె గురువెని సుతిహ మారుతననిజపత్ని॥
సతత హరియలి గురుగళలి స।
ద్రతియ పాలిసి భాగవత భా।
రత పురాణ రహస్యతత్త్వ గళరుపు కరుణదలి॥

మ॥ కృతిపతి యాత్మ జాతవయి యిర్వది నాలుగు మూలతత్త్వదే
వతలకు సద్గురుండగు ప్రభంజన మూర్తికి ధర్మ పత్ని! భా
రతి యన నొప్పు నోజనని! రంగనిపై గురు పర్యలందు స
ద్రతినిడి భారతాది వర తత్త్వములం గరుణించి కావుమా! 6

తా॥ కృతి దేవికి పతియైన ప్రద్యుమ్నుడను పేరు గల శ్రీమన్నారాయణునిచే సూక్ష్మ సృష్టి కాలము నందు పుత్రియై జనించిన దానా! ఇరువది నాలుగు తత్త్వాభి మానులైన దేవతలగు రుద్రాదులకు స్వామియున దగు జయాపతి శ్రీసంకర్షణుడను పరమాత్ముని వలన పుత్రుడైన వాయు దేవునికి నియుత పత్నివగు దానా! నిరంతరము పరమాంతః కరణముచే గుణపూర్ణుడైన శ్రీమన్నారాయణుని యందును జగద్గురువైన వాయుదేవుని యందును దోషరహితమైన తారతమ్య పంచ భేదాత్మకమైన జ్ఞాన భక్తి వైరాగ్య పూర్వకమైన ఆసక్తి నిచ్చిన దానవై మహాభారత భాగవతాది సత్పురాణములందలి భగవత్తత్త్వములను నాకు తెలియజేయు మమ్మా!

## వేదవ్యాసస్తుతి

వేద పీఠవిరించి భవ శ
క్రాది సుర విజ్ఞానదాయక।
మోద చిన్మయ గాత్ర లోక పవిత్ర సుచరిత్రా॥
ఛేద భేద విషాద కుటిలాం।
తాది మధ్య విదూర ఆదా।
నాది కారణ బాదరాయణ పాహి సత్రాణా॥ 7

తే॥ గీ॥ వేద పీఠ విరించి భవాది శక్ర
దివ్య విజ్ఞాన దాయక! భవ్య గాత్ర!
శుభద! లోక పవిత్రదా! సుచరితాఖ్య!
ఛేద భేద విషాద కుత్సిత గుణాది
మధ్యమాం తాది దూర! సన్మహిత సృష్టి
కారణా! బాదరాయణ! కావుమయ్య!

తా॥ రమాదేవికిని బ్రహ్మరుద్ర దేవేంద్రాదులకును సాధన పరిపాకాను సారమైన విశేష జ్ఞానము నిచ్చువాడును మఱియు ఆనంద జ్ఞానాదులే శరీరముగా

గలవాడును ముక్తి యోగ్యులైన జీవులకు లింగ శరీర భంగ రూపమైన పావిత్ర్యమును గలుగ చేయు వాడును మంగళమైన చరిత్ర కలవాడును ఖేద విషాదాది దోషరహితుడును అది మధ్యాంతరహితుడును సృష్ట్యాదులకు నిమిత్త కారణుడును అగు బాదరాయణుని స్తోత్రము చేయుచున్నారు.

## మధ్వాచార్యుల స్తుతి

క్షితియొళగె మణిమంత మొదలా।
దతి దురాత్మరు ఒందధిక విం।
శతికుభాష్యవ రచిసె నడుమనె యెంబ బ్రాహ్మణన।
సతియ జఠరదొళవతరిసి భా।
రతి రమణ మధ్వాభిధానది।
చతురదశలోకదలి మెరెద ప్రతిమ గొందిసువె॥

మ॥ క్షితిలోనన్ మణిమంతుడే మొదలుగా క్లిష్టాత్ములౌ దైత్యులు
ద్ధతి గావించిన యేక వింశతి కుతత్త్వఖ్యాతి ఖండింపగా
క్షితి దేవోత్తము మధ్యగేహ సతికిన్ శ్రేయోమతిం బుత్రుఁడై
నుతుడౌ జీవతతీశు మధ్వ గురు చంద్రున్ సన్నుతింతున్మదిన్. 8

తా॥ ఈ భారత భూమి యందు మణి మంతుడు మొదలైన దైత్యులు భగవద్ద్వేషులై దుష్ట స్వభావముతో హరి సర్వోత్తమత్వమునకు విరుద్ధమైన ఇరువది యొక్కకు భాష్యములను రచించిరి. అట్టి వానిని ఖండించి హరిసర్వోత్తమత్వమును స్థాపించుటకై బ్రాహ్మణ శ్రేష్ఠులైన మధ్యగేహ భట్టు యొక్క ధర్మపత్ని వేదవతి యను సతి యందు జీవోత్తముడైన వాయు దేవుడు మధ్వాచార్యులుగా అవతరించెను. అట్టి జగద్గురువులైన శ్రీమధ్వాచార్యులకు సాష్టాంగ నమస్కారము.

పంచభేదాత్మక ప్రపంచకె।
పంచ రూపాత్మకనె దైవక।
పంచముఖ శక్రాదిగళు కింకరరు శ్రీహరిగె।
పంచ వింశతి తత్త్వ తరతమ।
పంచికెగళను పేళ్ద భావి వి।
రించి యెనిప పానంద తీర్థర నెనెవెననుదినవు. 9

సీ॥ జీవజీవులకును క్షితిలోన భేదంబు
జడజడంబునకట్టు లడరు భేద
మారీతి జీవ జడాదులకును మఱి
జడ పరమాత్మకుఁజను నటంచు
నఖిల జీవులు పరమాత్మకున్ భేదంబు
విలసిల్లు నిటు పంచ భేద మనుచు
బంచాస్య శక్రాది వరదివ్యులందఱు
శ్రీరమాధీశుని సేవకులని
పంచ వింశతి తత్త్వంబు బంచ భేద
తార తమ్యంబు వివరించి ధన్యులగుచు
భావి పంకజభవులన బ్రతిభ వెలయు
నట్టి యానంద తీర్థుల నభినుతింతు.

తా॥ (1) జీవులకు జీవులకు భేదము. (2) జడమునకు జడమునకు భేదము. (3) జీవునకును జడమునకును భేదము. (4) జడమునకు పరమాత్మునకు భేదము. (5) జీవులకు పరమాత్మునకు భేదము గలదు. ఇదియే పంచ భేదమనబడును. మఱియు శివుడు దేవేంద్రుడు మున్నగు దేవతలందఱు పరమాత్ముని సేవకులనియు పంచ వింశతి తత్త్వమును పంచ భేద తార తమ్యమును వివరించి భవిష్యద్బ్రహ్మ పదవి నధిష్ఠింప దగిన శ్రీమదానంద తీర్థులను ప్రశంసింతును.

## శివస్తుతి

వామదేవ విరించితనయ ఉ
మామనోహర ఉగ్ర ధూర్జటీ
సామజాజిన వసన భూషణ సుమనసోత్తంస॥ 10

కామహర కైలాస మందిర।
సోమ సూర్యానల విలోచన।
కామితప్రద కరుణి సెమగె సదా సుమంగళవ॥

తే॥ వామదేవ! విరించి సంభవ! యుమేశ!
యుగ్ర! ధూర్జటి! దేవకులోత్తమనుత!
సామజాజిన పరిధాన! కామహరణ!
యబ్జ సూర్యాగ్నిలోచన! యఖిల శుభద!
మంగళములిడు కైలాస మందిర! హర!

తా॥ ఓ వామదేవా! విరించి తనయా! పార్వతీ రమణా! జగత్సంహారకా! ధూర్జటీ! దేవేంద్రాదులచే పొగడ దగిన వాడా! గజ చర్మాంబరధారీ! మన్మథుని దహించిన వాడా! చంద్ర సూర్యాగ్ని లోచనా! సమస్త కోరికల నిచ్చు వాడా! కైలాస మందిరా! ఈశ్వరా! భక్తులకు సకల మంగళములను దయచేయుము.

కృత్తివాసనె హిందె నీ నా
ల్వాత్తు కల్ప సమీరనలి శి
ష్యత్వ వహిస్య ఖిళాగమార్థ గళోది జలధి యలి॥
హత్తు కల్పది తపవ గైదా
దిత్యరొళగుత్తమనెనిసి పురు
షోత్తమన పరియంక పదవైదిదియొ మహదేవ॥ 11

తే॥ మునుపు నీవు నల్వది కల్పములు సమీరు
నందు శిష్యత్వమును బొంది యాగమార్థ
ముల గ్రహించియు దశ కల్పములను జలధి
దపము గావించి సుమనసోత్తముడవగుచు
భావిశేషపదంబును బడసితౌర!

తా॥ ఓ రుద్రదేవా! పూర్వము నీవు నలువది బ్రహ్మ దిన కల్పముల కాలము వాయుదేవుని శిష్యుడవై యుండి సమస్త వేదార్థములను యోగ్యతానుసారము చదివి గ్రహించియు పది బ్రహ్మ దినకల్పములందు లవణ సముద్రము నందు తపస్సు చేసియు దేవతా శ్రేష్ఠుడవై రాబోవు కల్పము నందు శేష పదమును పడయుచున్నావు కదా!

## ఇంద్రాదిస్తుతి!

పాకశాసన ముఖ్య సకల ది
వౌకసరి గభినమిపె ఋషిగళి
గేక చిత్తది పితృగళిగె గంధర్వ క్షితిపరిగె॥
ఆ కమలనాభాది యతిగళ
నీకకానమిసువెను బిడదె ర
మా కళత్రన దాస వర్గకె నమిపెననవరత॥ 12

తే॥ పాక శాసన ముఖ్య దివౌక సులను
ఋషివరుల బితృదేవతా శ్రేణిని మఱి
పరమ గంధర్వ ధరణీశవరులను యతి
వరులఁ బద్మనాభాదుల హరిప దాబ్జ
దాసకూటమున్ మదిలోన దగనుతింతు.

తా॥ దేవేంద్రుదు మొదలగు ముప్పది మూడు కోటి దేవతలను ఋషి పితృగణములను గంధర్వ చక్రవర్తి గణములను యతీశ్వరులైన పద్మనాభ తీర్థులు మొదలగువారిని భక్తులైన హరిదాసులను నుతింతును.

పరిమళవు సుమన దొళ గనలను
అరణి యొళగిప్పంతె దామో
దరను బ్రహ్మాదిగళ మనదలి తోరి తోరదలె।
ఇరుతిహా జగన్నాథ విట్ఠలన
కరుణ పడెవ ముముక్షు జీవరు
పరమ భాగవతరను కొండాడువదు ప్రతి దినవు॥ 13

చ॥ పరిమళమున్ సుమంబులను పావకుడుందగ గాష్ఠమందు నం
బరగుచు నున్నయట్లు సురవంద్యుడు మాధవుడెల్ల వేళలం
దరయ నజాది దేవ హృదయంబుల గన్పడి కానకుండగా
మెఱయు రమేశు సత్కరుణ మించెడు భక్తుల గొల్వగా దగున్

తా॥ పూవునందు పరిమళమును అరణి యందు అగ్నియు ఎట్లు ప్రకాశించు చుందునో అట్లు సుర్యవంద్యుడైన భగవంతుడు నిరంతరమును బ్రహ్మాది

దేవతల హృదయంబులందు కనపడియు కనపడకుండునట్లు ప్రకాశించును. అట్టి హరి యొక్క దయతో సంతోషించు భక్తులను సేవింతును.

వి॥ పూవు నందు పరిమళమున్నట్లు అరణి యందు అగ్ని యున్నట్లు బ్రహ్మాదుల మనస్సు నందు కనబడుచు పూర్తిగా కనబడక భక్తి నిమిత్తము యశోదాదేవి చే దామ బద్ధ ఉదర మందు శ్రీ కృష్ణుదున్న వాడు. ఇట్టి జ్ఞానప్రదుడైన ఆస్వామి దయను సంపాదించు ముముక్షువులు పూర్వోక్త పరమ భాగవతులైన బ్రహ్మాదులను సదా తారతమ్య క్రమముతో స్తుతింప వలెను. పుష్పగత దృష్టాంతముచే కార్య భూతమైన యీజగత్తుకు కారణ భూతమైన భగవంతుదున్నాడని శ్రుతి స్మృతులచే తెలిపిరి. అరణిలో అగ్ని ప్రాప్తించుటకు మథనమట్లు గురుసేవ శాస్త్రాభ్యాసము మొదలైనవే గాని అన్యముచే దేవుడు దొరకదను విషయము తెలుపుటకు పై రెండు దృష్టాంతములు చూపబడినవి.

ఇది శ్రీ హరికథామృతసారము నందు మంగళాచరణ సంధి

## కరుణాసంధి - (రెండవసంధి)

హరికథామృత సారగురుగళ
కరుణదిందా పనితు పేళువె
పరమ భగవద్భక్తరిద నాదరది కేళువదు॥

తే॥ హరికథామృతసారము గురువుల దయ
మెఱయ వర్ణించువాడను పరమ భక్త
వరులు సజ్జనులాదర భావ మొదవ
వినవలయు భక్తి మీఱగ వీనులలర.

తా॥ సర్వోత్తముడైన శ్రీహరి యొక్క సృష్ట్యాది వివిధ వ్యాపార రూపమైన విషయమనెడి అమృతము యొక్క సారమును మధ్వాచార్యులే మొదలగు గురువుల యొక్క అనుగ్రహ బలముతో వివరించుచున్నారు. దీనిని సజ్జనులు మిక్కిలి భక్తిశ్రద్ధలతో వినవలయును.

చ॥ శ్రవణ మనకానంద వీవుదు
భవజనిత దుఃఖగళ కళెవుదు
వివిధ భోగ గళిహపరంగళలిత్తుసలహువదు।
భువన పావన నెనిప లకుమీ
ధవన మంగళకథెయ పరమో
త్సవది కివిగొట్టాలిపుదు భూసురరు దినదినది॥

చ॥ శ్రవణమునన్ మనంబునకు సంతసమున్ గలిగించు దుష్టమౌ
భవ జనితాఘ సంఘమును బారగద్రోలుచుc దానొసంగెడిన్
వివిధములైన భోగములc బ్రీతి నిహంబుc బరంబునన్ రమా
ధవు శుభమౌ చరిత్రల సదా చెవులార వినుండు భూసురుల్

తా॥ ఏ గ్రంథమును సంపూర్ణముగ వినుటచే ఎవరి మనస్సులకైనను సంతోషము నిచ్చునో అట్టి గ్రంథము వారి సంసారమునకు కారణమైన లింగ దేహము నుండి ఉత్పన్నములైన జనన మరణాది దుఃఖములను పరిహారము చేయును. స్వర్గము మొదలైన మహరాది లోకములందు సుఖము నిచ్చి సంరక్షించును. అందువలన శ్రీమన్నారాయణుని శుభ చరిత్రలను అత్యంత మనోల్లాసముచే ప్రతి దినము శ్రద్ధగా వినవలెను.

రమా బ్రహ్మేంద్రాది రూపములతో స్వరమణుడను వాడు. నిర్దోషమైన మంగళకరములైన సుగుణ సమూహములచే రమాదేవిని ఆశ్చర్యము గావించు విచిత్ర గుణములు గలవాడు. ఇట్టి గుణపూర్ణుడైన శ్రీహరి నిత్యమును తన పాద సేవా సక్తులైన నిష్కామ మనస్కులగు భక్తులొనర్చు నిష్కపటమైన స్తోత్రము నకు ప్రత్యక్షమైనవాడై అపరోక్షమొసగువాడగును. ఇంకను అల్పాధికారుల అల్పమైన స్తోత్రాదులకు ప్రత్యక్షుడగు నట్టి దయాసముద్రుడు.

మన వచన కతిదూర నెనెవర
నను సరిసి తిరుగువను జాహ్నవి
జనక (జనరొళగిద్దు జనిసువ జగదుదరతాను)
ఘన మహిమ గాంగేయనుత గా
యనవ కేళుత గగన చరవా
హన దివౌకసరొడనె తిరుగువను మనెమనెగళల్లి॥ 4

వ॥ మనముల్ వాక్కుల కందరాని మహిమన్ మా నాథుడై యుండి తా
జనులన్ వెంబడు జాహ్నవీజనకుడుం జన్మించు లోకస్థులా
జనులందుండి జగత్సుకుక్షియను నా సర్వేశుడుం భీష్మస
ద్వినుతుండై ఖగవాహనుండు దిరుగున్ దేవాలితో నెల్లెడన్.

తా॥ ఇంకను గంగాజనకుడైన శ్రీహరి మనస్సు నందాలోచన చేసి అతని మహిమను చక్కగా దెలియ గోరు రమాదేవికిని భక్తుల మనస్సులకును అపౌరుషేయమైన వేద వాక్యములకును మిక్కిలి దూరమైనవాడు. అగోచరమైనవాడు. దూరమైన ఆకాశ మెట్లు గోచరము కాదో అట్లు అగోచరమైనవాడు. వారి వారి యోగ్యతానుసారముగా ధ్యానోపాసనాదులు చేయు వారి స్వరూప యోగ్యతల ననుసరించి అపరోక్షము కాగల వాడగును. మఱియును సమస్త జనుల యొక్క స్వరూప దేహములలో బింబ రూపియై యుండువాడు. స్థూల దేహములతో పుట్టినచో అవియోగియైన బింబరూపియగు తానును జనించు వాడగును. అత్యంత మహిమ గలవాడు. శరతల్ప మందు శయనించిన భీష్మాచార్యుల స్తోత్ర గానములను విను చుండువాడు. అట్టి గరుడవాహనుడైన శ్రీ కృష్ణుడు తన భక్తులైన దేవతలతో గూడి భక్తుల యిండ్ల యందును సర్వేంద్రియములందును సంచారము చేసి ఇంద్రియాభిమానులైన దైత్యుల దుష్కార్యములు జరుగకుండునట్లు భక్తులను సంరక్షించును.

మలగి పరమాదరది పాడలు
కుళితు కేళువ కుళితు పాడలు
నిలువ నింతరె నలివ నలిదరె ఒలివె నిమగెంబ।
సులభ నో హరి తన్నవర నర
ఘళిగె బిట్టగలను రమాధవ
నొలిసలరియదె పామరరు బళలువరు భవదొళగె॥ 5

ఉ॥ జానుగ సందుకొంచు మది శౌరి దలంచిన వించు కూర్చొనున్
మానకతాను కూర్చొనిన మాధవుడాదట నిల్చు నిల్చినన్
శ్రీ నిలయుండు నర్తనము సేయు నటించిన భక్తుజేరి య
వ్వాని వశంబగున్ హరిని భక్తి భజింపక ఖిన్నులాదురే!

తా॥ అధికారులైనవారు పరుండిన కాలము నందు బాహ్య వ్యాపార శూన్యములైన దశేంద్రియములను మనోయింద్రియమందులయమొనర్చి ఆ మనస్సును స్వప్నకాలపు సంచారమును విషయాదులందు పోనీక శ్రీ పరమాత్ముని పాదపద్మములందు లీనము చేసి అంతర్నిష్ఠమైన సమాధియుక్తుడై ఆదరముతో స్తోత్రము చేసినచో భగవంతుడు మన యొక్క హృదయాకాశము నందు కూర్చును వాడగును. మనకు పరమాత్ముని యందు ఎంత ఆదరముండునో అంతటి వాత్సల్యము మన యందు పరమాత్మునకుండును. ఈ ప్రకారము అధికారియైనవాడు తదేక ధ్యానముతో కూర్చొని స్తుతించినచో తన సందర్శన రూపమైన అపరో క్షము నిచ్చిన వాడై యెదుట నిలబడును. మేఘాచ్ఛాదితుడైన సూర్యునివలె ఎదుట నటించును. ప్రత్యక్షమైన వాడై మనకు వశమగును. ఇంతటి అతి సులభుడైన వాని అనుగ్రహమును సంపాదించినచో మనలను వదలి దూరము కాజాలదు. అట్లుకాక శ్రీమన్నారాయణుని వశము చేసికొను మార్గము తెలియక స్మృతి రహితులై ఐశ్వర్యముల యందును అహం మమతాదులయందును ఆసక్తిగల జనులు అజ్ఞాన మను అంధకారమందు నశ్వరమైన సంసార కూపము నందు కష్టములనుభవించు చుందురు.

మనదొళగె తానిప్ప మనవెం
దెనిసికొంబను మనద వృత్తిగ
ళనుసరిసి భోగగళ నీవను త్రివిధ చేతనకె।
మనవ నిత్తరె తన్ననీవను
(తనువ దండిసి దిన దినది సా
ధనవ) మాళ్పరిగిత్తపను స్వర్గాదిభోగగళ॥ 6

ఉ॥ ఒక్కని యందునన్నిలిచి యుత్సుకమొప్పఁగ నాడుమందు వే
ఱొక్కని యందుఁజూచు మఱియొక్కనియందున వేడుమందు నిం
కొక్కనియందునీఁగలుగు నొక్కనియందునఁబల్కు నెవ్వరిన్
లెక్కఁగొనంగలేక తనలీలలజూపుచు సర్వకర్తయై
యొక్కఁడె బాధ్యబాధకుడు నొప్పదుగర్వము నిర్భయుండగున్.

తా॥ పాదాభిమానియైన జయంతునియందు దామోదర రూపముతో అంతర్యామియై గమనాగమనములతో సంచారముచేయును. నేత్రాభిమానియైన సూర్యునియందు మధుసూదనరూపముతో అంతర్యామియై చూచి జీవులను చూచువారినిగా చేయును. ఘ్రాణేంద్రియాభిమానియైన దక్ష ప్రజేశ్వరునియందు పద్మనాభ రూపముతోనుండి యాచనాది క్రియలను చేయించును. వాగింద్రియాభిమాని యైన అగ్ని దేవుని యందు హృషీకేశరూపముతో నుండి మాటలాడించును. మనోభిమానియైన రుద్రుని యందు గోవింద రూపముతో నుండి ఆశ్చర్యయుక్తులుగా జేయును. ఇట్లు పరమాత్ముడు తనక్రియద్వార తత్వాభిమానదేవతలచే జీవుల దేహమునందలి ఇంద్రియముల కర్మ వికర్మములను చేసి చేయించి వాని ఫలములను తాననుభవింపక జీవులనుభవించునట్లు చేయును. తనకు సంబంధించిన ముక్తియోగ్యులను సంరక్షించును.

శరణాజనమందార శాశ్వత
కరుణీ కమలా కాంత కామద
పరమ పావన తర సుమంగళ చరిత పార్థసఖ।
నిరుప మానందాత్మ నిర్గత
దురిత దేవ వరేణ్య నెందా
దరిది కరెయలు బందొదగువను తన్నవర బళిగె॥ 10

తా॥ శరణ మందార! శాశ్వతకరుణ! కమల!
నాయకా! సర్వకామద! నవ్యతర సు
మంగళ చరిత్ర! నరసఖ! మహిత సౌఖ్య!
దురిత హర! యన భక్తుల నరసి కాచు

తా॥ పరమాత్ముడు శరణు బొందిన సజ్జనులను గాచును. శాశ్వతమైన దయాసముద్రుడు. రమానాథుడు. పవిత్రమైన చరిత్ర కలవాడు. పార్థునకు మిత్రుడు. సమస్త కోరికల నిచ్చువాడు. ఇట్లు ప్రార్థించిన భక్తులను తప్పక సంరక్షించును.

ఇట్టికల్లను భకుతి యిందలి
కొట్ట భకుతగె మెచ్చి తన్ననె
కొట్ట బడబ్రాహ్మణన ఒప్పిడి యవిలిగఖిళార్థ।
కెట్ట మాతుగళెనదె వైద్యన
పొట్టె యొళగింబిట్టు బాణద
లిట్ట భీష్మనవగుణగళెణిసిదనేనొ కరుణాళు॥ 11

తే॥ ఇటుక నిచ్చిన భక్తునకిచ్చెఁదన్ను
నడుకు లిచ్చిన నైశ్వర్య మతనికొసఁగెఁ
జెడుగులాడిన శిశుపాలు చేర్చెఁగుక్షి
శరములంగొట్టినట్టి యా భరతవీరు
భీష్మునవగుణంబుల హరి పేరుకొనెనె?

తా॥ పుండరీకుడు చేయు మాతాపితల భక్తిని పరీక్షింప వచ్చి అతని వెనుక నిలబడినపుడు భక్తితో విసరిన ఇటుకకే మెచ్చి అతనికి ప్రత్యక్షమయ్యెను. బ్రహ్మజ్ఞానముతో భక్తి పూర్వకముగా పిడికెడదుకులు సమర్పించిన కుచేలునకు సమస్తమైన ఐహిక పారత్రికమైన ఐశ్వర్యమునిచ్చి యుద్ధరించెను. శిశుపాలుని సంహరించి అతని తేజస్సును తన ఉదరము నందుంచుకొనెను. యుద్ధము నందు ఆయుధమును పట్టనని ప్రతిజ్ఞ చేసి యుండినను చక్రాయుధము బట్టు నట్లు చేసిన భీష్మాచార్యుల దుర్గుణము నెంచక కాపాడెను. అట్టి శ్రీకృష్ణుని మహిమ నేమని కొనియాడగలము.

ధనవ సంరక్షిసువ ఫణి తా
నుణదె మత్తొబ్బరిగె కొడదను
దినదినోడుత సుఖిసువందది లకుమి వల్లభను।
ప్రణతరను కాదిహను నిష్కా
మనిది నిత్యానందపయ దు
ర్జనర సేవెయనొల్ల నప్రతిమల్ల జగకెల్ల॥ 12

మ॥ ధనముంగాచెడు దందశూకమది తా ద్రవ్యంబు భోగింపకా
ధనమున్నోరికిడంగ లేక కను చందంబొప్ప లక్ష్మీశుడున్

ప్రణతాలింగని కామముండును సదా భావింప నిష్కాముడై
ఘన సంతోషి గ్రహించునే? కుజనులుం గావించు సేవాదులన్

తా॥ సర్పమెట్లు భూస్థాపితమైన ద్రవ్యమును తానుపయోగించుకొనక అన్యులకీయక కాచుకొని కాపాడు చుండునో అట్లు లక్ష్మీపతియైన శ్రీమన్నారాయణుడు నిష్కాములైన తన భక్తుల నుండి దేనిని అపేక్షింపక వారిని కాచుకొని సంరక్షించుచుండును. పరమాత్ముడు నిత్యానందమయుడు. భక్తి హీనులైన వారి సేవాదులను స్వీకరింపడు. మిక్కిలి సంతోషియైనవాడు.

జననియను కాణదిహ బాలక
నెనెనెనెదు హలుబుతిరె కత్తలె
మనెయొళ గడగిద్దవన నోడుత నగుత హరుషదలి!
తనయనం బిగదప్పి రంబిసి
కనలికెయ కళవంతె మధు సూ
దనను తన్న వరిద్దెడెగె బందొదగి సలహువను॥ 13

మ॥ జననిం గానగలేని బాలకుడు తా స్వాంతంబులో భీతిప
జ్జననిం గూర్చి తలంచు చుండ దమమున్ స్థానంబు నందుండు పు
త్రుని వీక్షించి కవుంగిలించునటులార్తుల్ పిల్వ గోపాలకుం
డొనరన్ వారినిగాచు వారికెపుడ త్యంతాప్తుడై యుండునన్

తా॥ చీకటి యందున్న శిశువు తల్లిని చూడలేక మాటిమాటికి తల్లిని తలంచు కొనుచు కలవరించు చుండినను వాని కలవరమును గాంచి నవ్వుచు సంతోషముతో తన బిడ్డను తనచేతులతో నెత్తి ప్రేమతో లాలించుచు తన విషయకమైన కలవరము నెట్లు పరిహారము చేయునో అట్లు శ్రీపరమాత్ముడు తన భక్తులున్న చోటికి వచ్చి తల్లివలె సంరక్షించును.

వి॥ 1. మాతృ సదృశుడు పరమాత్ముడు

2. లింగశరీరమే చీకటిల్లు

3. వేద శాస్త్రములందు పొగడబడిన పరమాత్ముని నామరూపములను వెదకి ధ్యానము చేయుటయే తల్లిని గానక కలవరించుట.

4. పరమాత్ముడు ప్రత్యక్షుడై మోక్షమును ఇచ్చుటయే కలవరమును పరిహారము చేయుట.

చరాచరాత్మకమైన యీ జగత్తును తన ఉదరము నందు ధరించి ప్రళయకాలానంతరము సృష్టి కాలము నందు జీవుల నందరిని తన ఉదరము నుండి వెలుపల సృష్టి చేయువాడగుటచే పరమాత్ముడు జగత్తుకు తల్లివంటివాడు.

బాలకన కలభాషె జననియు
కేళి సుఖపడువంతె లకుమీ
లోల భకుతరు మాడుతిహ సంస్తుతిగె హిగ్గువను
తాళ తన్నవరల్లి మాడువ
హేళనవ హెద్దైవ విదురననాలయది పాలుండు కురుపన
మానవనె కొండ॥ 14

ఉ॥ బాలకుఁడాడు సన్మధుర భాషల విన్న సుఖించు మాతనా
శ్రీలలనా మనోహరుఁడు చెల్వుగఁ దావిను సాధు సన్నుతుల్;
తాళడు భక్తులన్ సలుపు తత్కుజనావలి హేళనంబులం
బాలనుద్రాగి యవ్విదురు భక్తికి మెచ్చి సుయోధనాధమున్
బాలిశబుద్ధికిన్వగచి భంగమొనర్చెను మానహీనుగా.

తా॥ తల్లియైనది తన పుత్రుడు అస్పష్టముగ మాట లాడిన విని సంతోష పడు విధముగా సృష్టికి తల్లి వలె నున్న పరమాత్ముడు తన కుమారులైన భక్తులు వచ్చిరాని స్తోత్రములు చేసిన విని వానిని జ్ఞాన భక్తి యుక్తములైన స్తోత్రములుగా పరిగ్రహించి సంతోష పడును. ఇట్టి భక్తులను అవమానము చేయు వారిని సహింపడు. తన భక్తులైన పాండవులందు వాత్సల్యము గలవాడై దుర్యోధనుడొనర్చిన అవమానమును సహింపక మహాత్ములకు అభీష్టముల నిచ్చువాడగును. ఈ విధములైన అభీష్టములను అనుసంధాన పూర్వకముగ ఐక్య చింతనతో పరమాత్మున కర్పించిన ఆ పుణ్యములను అనంతములైన వానిగా ఫలింప జేయును. జీవులకు అపవిత్రమైన లింగదేహమును నిర్మూలించి పవిత్రులుగా జేసి మోక్షమును మంగళము నొసగును.

ఏను కరుణానిధియొ హరి ఎ
త్తేను భక్తాధీననో ఇ
న్నేను ఈతనలీలె ఇచ్ఛా మాత్రదలి జగవ
తానె సృజసువ పాలిసువ ని

ర్యాగా మొదలాదఖిల లోక
స్థానదలి మత్తె వర నిట్టా నంద బడిసువను 16

ఉ॥ ఏనిదయామయుండొ హరి యెంతయధీనుడొ భక్తులందుఁ ల
క్ష్మీమహిళామనోహరుడు మేలగు నాతని లీలలెట్టివో?
యీ మహినిన్ సృజించు మహనీయతగాచు హరించు; సాధులం
బ్రేమను బుణ్యలోకములఁ బ్రీతిగ జేర్చి సుఖింప జేయడే!

వా॥ పరమాత్ముడు అపార కరుణా సముద్రుడు. భక్తపరవశుడు. అతని మహిమ లత్యంతాశ్చర్యకరములు. చరాచరాత్మకమైన ప్రపంచమును తన ఇచ్ఛా మాత్రము చేతనే సృష్టించును పోషించును. ప్రళయకాలము నందు లింగదేహ భంగము నొందిన జీవులను శ్వేత ద్వీపము అనంతాసనము వైకుంఠము మొదలగు లోకములందుంచి స్వరూపానందము నొసగును.

వి॥ భగవంతుడెట్లు జీవులపై కరుణ చూపునను విషయమును నిరూపించు చున్నారు. అనుసంధాన పూర్వకముగ సత్కర్మలు చేసి సమర్పించిన వానిని స్వీకరించి శుభ ఫలము లొసగును. తన భక్తులు ఎట్టి పాపకర్మములు చేసినను వానివలన జనించిన పాప ఫలములను దైత్యులకు పంచి యిచ్చి దైత్యులు చేసిన పుణ్య ఫలములను భక్తులకు పంచి యిచ్చును.

జనప మెచ్చిదరీవ ధన వా
హన విభూషణ వసన భూమియ
తనువనగళిత్తాదరి వరుంటేనా లోకదొళు।
అనవరత నెనెవరనంతా
సనవె మొదలాదాలయదొళి
ట్టణుగనందదలవర వశనాగువ మహోమహిమ॥ 17

చ॥ జనపతి మెచ్చెనేనియు నొసంగునుగాదె ధనంబు వాహనం
బును వరభూషణంబులను భూములఁ; దన్స్మరియింపలోకముం
దనువు మనంబులిచ్చి సముదంబున గాచెడు వారలుందురే?
యునయము శ్రీ వికుంఠ సుపురాది త్రిలోకములందు నుంచి సౌ
ఖ్యనిధి సుఖింపఁజేయు వశుడై తన భక్తుల కమ్మహాత్ముడున్.

తా॥ సామాన్యమైన మానవ భూపతియే తన్ను భయ భక్తులతో సేవించు సేవకులకు సత్వరమైన ఐశ్వర్యము నిచ్చి సంతోషింప జేయును. అట్లుండ పదునాలుగు లోకములకు ప్రభువైన పరమాత్ముడు భక్తి శ్రద్ధలతో తన్ను సేవించు భక్తులకు శాశ్వతమైన అనంతాసనము శ్వేత ద్వీపము వైకుంఠము అనులోకము లందు యోగ్యతానుసారము శాశ్వతమైన సుఖములిచ్చి సంతోషింప జేయును. నిత్యానందమును కలిగించును. తల్లి వలె సంరక్షించును.

భువన పావన చరిత పుణ్య
శ్రవణ కీర్తన పాపనాశన
కవి భిరీడిత కైరవ దళ శ్యామ నిస్సీమ।
యువతి వేషది హిండె గౌరీ
ధవన మోహిసి కెడిసి ఉళిసిద
నివన మాయవ గెలువ నావను ఈ జగత్రయది॥ 18

చ॥ భువన పవిత్ర సచ్చరిత పుణ్యసుకీర్తన పాపనాశనా
ద్యవిరళ సద్గుణుండు విబుధావలి వంద్యుడు నీల నీరదో
త్పల తను దీపకుండు మును దా సితకంఠుని మాయచేసెగా
నెవడాకా! వీని మాయను జయింపగ శక్యుడు లోక మందునన్.

తా॥ పరమాత్ముడెట్టి వాడన? చతుర్దశ లోకములందు పవిత్రమైన చరిత్ర కలవాడు. మోక్షము కోరు జీవులచే సచ్ఛాస్త్ర పఠన పూర్వకమైన స్తోత్రములు జేయించుకొనువాడు. బ్రహ్మ జ్ఞానులచే స్తుత్యుడైన వాడు. నీలోత్పలముల వంటి మంగళకరమైన దేహము గలవాడు. అత్యంతమైన పరాక్రమము గలవాడు. ఇట్టి పరమాత్ముడు పూర్వము స్త్రీ రూపము ధరించి పార్వతీ రమణుడైన రుద్రుని మోహితుని గావించి అజ్ఞానము నిచ్చి చెడిపి మరల జ్ఞానము నిచ్చి సంరక్షించి యున్నాడు. ఇట్టి మహిమ గల పరమాత్ముని సామర్థ్యమును జయించు వారు ఏ లోకమునందైనను గలరా?

పాపకర్మవ సహిసువరె ల
క్ష్మీ పతిగె సమరాద దివిజర
నీ పయోజ భవాండ దొళగావల్లి నా కాణె।
గోప గురువిన మడది భృగు నగ

మాత్రమున ఘోరమైన నరకము నందు బడియున్న జీవులను పాప విముక్తులను గావించి మహాజ్ఞానులుగా నొనర్చి ధర్మార్థకామముల నొసగి సంరక్షించును. భగవన్నామోచ్చారణమునకు ఇట్టి మహిమ గలదు.

మనదొళగె సుందర పదార్థవ
నెనెదు కొడె కైకొండు బల్లునూ
తన సుశోభిత గంధ సురసోపేత ఫలరాశి।
ద్యునది నివహగళంతె కొట్టవ
రను సదా సంతైసువను స
ద్గుణవ కద్దవరఘవ కదివను అనఘనెందెనిసి॥ 22

సీ॥ మదిలోన సుందర మధుర పదార్థంబు
సక్కగా దర్శించి సంతసమున
బలు నూతనము రసాస్వద సుగంధ సమేత
ఫలరాశి గంగా నివహము లట్లు
పూజాది సాధన రాజిలో రాజిల్లి
పూజింప బడువాడు ఫుల్లనేత్రు
డేయనుచు నభేద మెంతయు భావించి
తగ సమర్పించిన దాగ్రహించి

తే॥ వారి నెల్ల వేళల యందు వదలకుండ
గాచు సుగుణముల్ హరియింప జూచు వారి
యఘము లన్నింటి బరిహార మాచరించి
యనఘుడంచును పేరొందు నవని యందు

తా॥ సులక్షణమైన పరమాత్ముని రూపమును మనను నందు నిలుపుకొని పూజోప యోగ్యమైన జడపదార్థములు అతనికి అశుభములగుటచే ప్రతిమాకారుడైన పరమాత్ముడే పూజాసాధన ద్రవ్యములందు తద్వాచ్యుడుగను తదాకారుడు గను ఉన్నాడని అను సంధానము గావించి సమర్పించినచో వానిని స్వీకరించును. ఇట్లు పరమాత్ముని స్వాఖ్య రసములచే గూడిన ఫలసమూహములను గంగానది యందలి నీటికిని అలలకును ఎట్లు భేదము లేదో అట్లు పరమాత్ముని రూపములను పదార్థము లందలి పరమాత్ముని అంతర్యామి రూపములకు

అభేద ముని విశ్వ చింతనతో సమర్పించు నటువంటి భక్తులను ఎల్లప్పుడును కాపాడును. పరమాత్ముడు గుణపూర్ణుడు. నిర్దోషి సర్వస్వతంత్రుడు. పై విధముగా తలంచి స్మరింప దగిన భక్తులు కర్మవశముచే చేసినటువంటి పాపములను తానపహరించి అహం మమతాదుల నుండి విడిపించి దివ్యజ్ఞానము ఇచ్చి కాపాడును.

చేతనా చేతన విలక్షణ
నూతన పదార్థదొళగె బలు
నూత నతిసుందరకె సుందర రసకె రస రూప।
జాతరూపోదర భవాద్య రొ
ళాతత ప్రతిమ ప్రభావ ధ
రాతళదొళెమ్మొడనె యాడుతలిప్ప నమ్మప్ప॥ 23

తే॥ చేతనా చేతనముల విశిష్టుడగుచు
నూతన పదార్థముల బహు నూతనుడయి
రమ్యుడగు రమ్యములకును రసమున రస.
రూపుడై యజాదులలోన రూఢి మెఱయు.

క॥ బహుళ ప్రభావ యుతుడై
మహిలోనన్ వ్యాప్తుడగు రమానాయకుడున్
విహరించు చుండు మనలో
నహరహ లీలాత్ముడగుచు నచ్చపు మహిమన్.

తా॥ సర్వ జగత్తునకు సృష్టి కారణుడైన పరమాత్ముడు. తాను సృష్టించిన జీవులు జడపదార్థములు దోష యుక్తము లైనప్పటికి తానుమాత్రము సులక్షణుడును పూర్ణుడునై యుండును. నిత్య నూతనములుగా . నిర్మాణములు కాదగిన పదార్థము లందు సర్వాంతర్యామి యగుటచే నూతన నామముల చేతను ఆయా ఆకారముల చేతను శోభిల్లును. సుందర పదార్థము లందు అత్యంత సుందర రూపములతోను లవణాది రస పదార్థములందు రసరూపుడైన వాడై బ్రహ్మ రుద్రాది దేవతలందు వ్యాప్తుడైన వాడై అధిష్ఠానముల యొక్క ఆకారుడై యుండును. ఇట్లుండినను పదార్థములట్లు దుర్బలుడు కాడు. జగత్తు నందు సమస్త జీవులలో అంతర్యామియై యుండి బింబక్రియ ద్వార ఇంద్రియ వ్యాపారములను నడిపించుచు క్రీడించు చుండును.

తందె తాయ్గళు తమ్మ శిశువిగె
బంద భయగళ పరిహరిసి నిజ
మందిరది బేడిదుద నిత్తాదరిసు పందదలి
హిందె ముందెడ బలది ఒళ హొర
గిందిరేశను తన్నవరనెం
దెందు సలహువ నాగసదవో లెత్త నోడిదరు॥ 24

మ॥ తలిదండ్రుల్ దమ బిడ్డలుం భయము నొందం జూచి తారింటిలో
పలికిం దెచ్చి భయంబువాపి సుఖమున్ వారిం ఒగం గాచు న
ట్లలరన్ ముందును వెన్క లోన వెలి నింటన్ వీధులందెల్లెడం
జలజేశుండు తదీయ భక్తుల సదా సంరక్ష గావించెదున్.

తా॥ తల్లిదండ్రులు తమ బిడ్డలు యింటి వెలుపల నాడు కొనునపుడు దుష్ట గ్రహము సోకి భయపడినచో ఇంటికిం బిలుచుకొని వచ్చి భయమును పోగొట్టుటకు మంత్ర తంత్రములతో నుపచరించి స్వగృహమును వదలి పోకుండు మార్గమును ఎట్లు కల్పింతురో అట్లు పరమాత్ముడు తన భక్తులను సర్వకాలములందును సర్వస్థలములందును కాపాడును.

వి॥ భక్తులకు ఆటలాడు స్థలమేది? దుష్ట గ్రహము లేవి? భయ మేది? నిజమందిరమేది? మంత్ర తంత్రములేవి?

1. అస్పృశ్యరాశి నుండి సృష్టికి వచ్చు ప్రదేశమే ఆటలాడు స్థలము.
2. లింగ దేహమే దుష్ట సహవాసము.
3. అహం మమతాదులే దుష్ట గ్రహములు.
4. అహం మమతాదుల నుండి పుట్టిన పాపకర్మములు చేయుటకు భయపడుటయే భయము.
5. జ్ఞాన భక్తి వైరాగ్యములను పుట్టించుటయే మంత్ర తంత్రములు.
6. వైకుంఠమే నిజ మందిరము.

ఈ విధముగా అస్పృశ్యరాశి నుండి సృష్టికి వచ్చిన వెంటనే దుష్ట గ్రహములైన అహం మమతాదులు పుట్టును. వాని నుండి పాపకర్మములు చేసి భయపడును. అట్టి భక్తులైన తన పుత్రులకు భక్తి వైరాగ్యములను మంత్ర తంత్రములను వారి దేహము లందు ప్రవేశింప జేసి ఆభయమును పాఱద్రోలి బహిస్సంచారము చేయుటకు కారణమైన లింగ దేహమును దుష్టుడైన స్నేహితుని తరుము గొట్టి నిజ మందిరమైన వైకుంఠలోకమునకు పిలుచుకొని వెళ్ళి, అందుంచి

స్వరూప యోగ్యతానుసారముగా వేడినయట్లు ఫలాను భూరి నొసగి పరమాత్ముడు భక్తులను సంరక్షణ చేయును.

ఒడల నెళ లందదలి హరి న
మ్మొడనె తిరుగువ ఒందరక్షణ
బిడదె బెంబలనాగి భక్తాధీన నెందెనిసి
తడెవ దురి తౌఘగళ కామద
కొడువ సక లేష్టగళ సంతత
నడెవ నమ్మం దదలి నవసువిశేష సన్మహిమ॥ 25

ఉ॥ నీడయు దేహమున్ వదలనేరక యేగతి వెంటనంటునో
తోడుగ నట్టులన్ మనకుఁ దోడ్పడు నొక్క క్షణంబు వీడలే
కోడక బింబరూపి మహిమోన్నతుడై నిజ భక్త కోటి వెం
టాడుచునుండు శౌరి దురితౌఘము బాపి సుఖంబు లిచ్చుచున్.

తా॥ మన దేహపు నీడ మనలను అనుసరించు కొని యుందు రీతిగా పరమాత్ముడు మనకాధారుడైన వాడై భక్త పరాధీనుడను పేరు పొందుటకు క్షణ కాలమైనను వదలక భక్తులతో సంబంధము లేని వాడై తిరుగ గలదు. భక్తుల సత్సాధనకు ప్రతి బంధకమైన దుష్టమైన పాప కర్మములు వచ్చు కాలము నందు వానిని నిలుపు వాడగును. తన భక్తుల అభీష్టములను పూరించి స్వరూప యోగ్యతానుసారము నడచును. పరమాత్ముడు మహా మహిమ గలవాడు.

వి॥ బింబరూపియైన వాడు పరమాత్ముడు. దేహమను నదియే బింబ సదృశము. నీడయనునదే ప్రతి బింబము. అట్లే ప్రతి బింబమైన వాడే జీవి. బింబ రూపి యైన పరమాత్మునకు ప్రతి బింబ రూపుడైన జీవునకు ఏ కాలము నందును వియోగము లే నందున బింబ రూపుదు పరమాత్ముడనిరి.

బిట్టపర భవపాశదిందలి
కట్టువను బహుకఠిణనివ శి
ష్టేష్ట నెందరి తవర సద్భక్తి పాశదలి
కట్టువర భవ కట్టు బిడిసువ
సిట్టి నవనివనల్ల కామద
కొట్టు కావను సకల సౌఖ్యవ నిహపరంగళలి॥ 26

చ|| ఘన భవపాశముం బిగియుగట్టును శ్రీహరి కర్మకాత్ముడై
తను విడిపోవు వారల; ముదంబు వహించుచు భక్త వత్సలుం
డని తలపోసి సాధుజను లాహరి గట్టిన వారి బంధముల్
నెనరున ద్రెంచి సౌఖ్యమిడు లేదట కోపము వానికెప్పుడున్.

తా|| ఎవడైనను అశాశ్వతమైన సంపదలచే మదించి భగవంతుడు సర్వోత్తముడను జ్ఞానమును సంపాదింపక దుర్వ్యాపారరతుడై యుండునో వానిని పరమాత్ముడు జనన మరణ రూపమైన సంసారమును త్రాటిచే గట్టి నరకము నందు బడవేసి దుఃఖములను పొందించును. అట్లుకాక పరమాత్ముడు గుణపూర్ణుడు సర్వోత్తముడు సృష్ట్యాది అష్ట కర్తృడని తెలిసికొని మాహాత్మ్యజ్ఞాన పూర్వకమైన సుదృఢ స్నేహముతో పరమాత్ముని రూపమును హృదయాకాశము నందు నిలుపు కొని ధ్యాన పరుడై యుండునో వానిని సంసారమునకు కారణమైన లింగ దేహమును పాశమును విరజానదీ స్నానము చే తొలగించి దివ్యలోకము నందుంచి సంరక్షించును. మఱియు సంచితాగామి కర్మల నుండి రాదగిన పాప కర్మల నుండి నిర్లిప్తుల గావించి జీవన్ముక్తులుగా జేసి మోక్షము నిచ్చి సంరక్షించును.

చ|| కనులకు రెప్ప చందమునగాయమునందలి తీటకుంగరం
బొనర సుఖంబు గూర్చునటు లొప్పుగ బండ్లను దించు సద్రసం
బునునిడి పండ్లు నాలుకకు మోదమొసంగెడు భంగి వెండియుం
దనరెడు పుణ్యముల్ ఫలము దద్దయు నిచ్చు విధంబునం జగం
బునఁ గన లక్ష్మణాగ్రజుడు ప్రోచు సురావలితోడవచ్చుచున్.

తా|| పరమాత్ముడు స్వప్రయోజనము లేక తన భక్తులను సంరక్షణము చేయునను విషయము దేహ మందున్న అవయవముల దృష్టాంతముతో జూపు చున్నారు. నేత్రద్వయమునకెట్లు రెప్పలు స్వప్రయోజనము లేక అవసరముగా సహకరించునో అట్లును దేహ మందు తీట పుట్టిన చేతులెట్లు సహకరించో అట్లును నోటిలో నుండు పండ్లు ఫలములు మొదలైన పదార్థములను నమిలి దాని రసమును నాలుక కెట్లు దత్తము సేయునో అట్లు పరమాత్ముడు తన భక్తులను స్వప్రయోజనము లేకయే వచ్చి సంరక్షణము చేయును.

కొట్టదను కైకొంబ రక్షణ
బిట్టుగల తన్నపర దురితగ
ఘట్టపను దూర దలి దురి తారణ్యపావకను।

కొట్ట వస్తువ కొంబ సిదవరొళు
సిట్టు మాడదనే హరి కం
గెట్టె మందరగె సుధెయనుణిసిద మురిదనహితరన॥ 28

ఉ॥ ఇచ్చిన దాని గైకొను రమేశుడు భక్తుల వీడ డెప్పుడున్
మెచ్చిన వారిపాపముల నీరౌ సహించును వాని వీపునన్
హెచ్చిన పర్వతంబిడిన యేలని దివ్యుల గోపగించెనే
యిచ్చె సుధారసంబు మరిపించెను దైత్యుల మోహనాకృతిన్

తా॥ జ్ఞానాను సంధానముతో భక్తులిచ్చిన పదార్థము లం దుండ గల స్వాభ్యారసమును స్వీకరించును. అల్పమునకైనను తన భక్తులను వదలి దూరము కాక వారి ఉత్పాదకము ప్రతి బంధకములైన అజ్ఞానాది దోషములను సహించి తనకు ద్వేషులైన దైత్యులను వారి సమీపమునకు రానీక చీకటిని నాశనము చేయు సూర్యుని వలె తరిమి వేయును. ఇది యెట్లనగా కూర్మావతార మెత్తిన పరమాత్ముని వీపు పై దేవతలు మందర పర్వతమును పెట్టి మోపించినను వారికి అమృత పానమును చేయించెను. దైత్యులెంత కష్టముతో ప్రయత్నించినను వారికి అమృత పానము చేయింపక భంగము గావించెను.

ఖేదమోద జయాపజయ మొద
లాద దోషగళిల్ల చిన్మయ
పాదరది తన్నంఘ్రి కమలవ నంబి తుతిసువర
కాదు కొండిహ పరమ కరుణా మ
హోదధియు తన్నవరు మాడిదప
రాధగళ నోడదలె సలహువ సర్వకామదను॥ 29

ఉ॥ వేదుర ఖేదమోదములు మేల్మి జయాపజయాది దోషముల్
లేదు తలంప చిన్మయుని లీలల పారము తత్పదంబు ల
ల్యాదరతిన్ భజించిన యా సుజనావళి గాచు సద్దయా
మోద పయోధి కాచు మరి ముందగ దోసము లెంచకుండగన్

తా॥ ఖేదం తమస్సులో కల్యాది దైత్యులనుభవింప దగిన దుఃఖములు నిత్య సుఖలోకమైన వైకుంఠ లోకమందు బ్రహ్మాదులనుభవింప దగిన సుఖ సంతోషములును అన్యుల జయించుటయు అపజయము నొందుటయు మొదలైన జీవ నిష్ఠమైన దోషములు బింబరూపుడైన పరమాత్మునకు లేవనియు తెలియ

వరిసు ఆ పరమాత్మని భారతీ రమణ ముఖ్య ప్రాణాంతర్యామి యని చింతించి ఇతడే సర్వోత్తముడను దృఢ మనస్సులో నమ్మి తన్ను స్తోత్రము చేయు వారి సమీపము నందే పరమాత్ముడు కాచుకొని యుండును.

మీన కూర్మ వరాహ నరహం
దానవాతుళ శౌర్య వామన
రేణుకాత్మజ రావణాది నిశాచరధ్వంసి
ధేనుకాసురమథన త్రిపురవ
హోని గైసిద నిపుణ కలిముఖ
దానవర సంహరిసి ధర్మది కా య్దు సుజనరను॥ 30

తే॥ మీన! కూర్మ! వరాహ! సుజ్ఞాననృహరి!
వామనాకార! భార్గవ! రామ చంద్ర!
ధేనుకాసుర మర్దన! త్రిపుర దహన
కారణా! కల్కి! సుజనుల గాచితి కద

తా॥ పరమాత్ముడు మీన కూర్మ వరాహ నృసింహ వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ, కల్కి మొదలగు దశావతారములను దాల్చి దుష్టులైన రావణ కుంభ కర్ణాది రాక్షసులను సంహారము చేసిన వాడనియు దశావతారముల స్తోత్రము.

శ్రీ మనోహర శమల వర్జిత
కామి తప్రద కైరవ దళ
శ్యామ శబలశరణ్య శాశ్వత శర్క రాక్షసఖ
సామ సన్నుత సకల గుణగణ
ధామ శ్రీ జగన్నాథ విట్ఠల
నీ మహిమెయొళవతరిసి సలహిదె సకల సుజనరను॥ 31

ఉ॥ శ్రీమహిళా మనోరమణ! శిష్టసుఖప్రద! దోషవర్జితా!
శ్యామలరూప! సచ్ఛరణ! శాశ్వత! సర్వమహాగుణాంబుధీ!
సామశ్రుతిస్తుతా! శబల! శంకరసత్సఖ! యీ జగంబునం
ప్రేమ జనించి కాచితివి విశ్వపతీ! జగదీశవిట్ఠలా!

ఇది శ్రీ హరికథామృతసారము నందు కరుణాసంధి.

## 3. వ్యాప్తి సంధి

హరికథామృతసార గురుగళ
కరుణ దిందాపనితు పేళువె
పరమ భగవద్భక్తరిద నాదరది కేళువుదు॥

తే॥ హరి కథామృతసారము గురువుల దయ
మెఱయ వర్ణించు వాడను పరమ భక్త
వరులు సజ్జనులాదర భావ మొదవ
వినవలయు భక్తి మీఱగ వీనులలర

మూ. పురుష రూపత్రయ పురాతన
పురుష పురుషోత్తమ క్షరాక్షర
పురుష పూజితపాద పూర్ణానంద జ్ఞానమయ।
పురుషసూక్త సుమేయ తత్త
త్పురుష హృత్పుష్కర నిలయ మహ
పురుషజాండాంతరది బహిరది వ్యాప్త నిర్లిప్త॥

సీ॥ హరియు రూపత్రయ పురుషుండు పురుషోత్త
ముండు క్షరాక్షర పురుషపూజ్య
పాదుడు వెండియు నాదియౌ పురుషుండు
సతత పూర్ణానంద జ్ఞాన మయుడు
పురుషసూక్త సుమేయుడరయ పురుషకోటి
హృదయాబ్జనిలయుడహీన పురుషు
డగుచును బ్రహ్మాండ మంతయు బహిరంత
రములందు వ్యాపించి ప్రబల శక్తి

తే॥ నన్నియును దనరూపుగా నలరు వాడు
మఱియు నిర్లిప్తుడనగ విస్ఫురణ మీఱ
వెలయుచున్నాడు భక్తుల బ్రేమజూడ
నట్టి పరమాత్ము వర్ణింప నలవియగునె?

తా|| పరమాత్ముని వ్యాప్తి యెట్టదనగా? పరమాత్ముడు పురుషుడని పిలువబడి మూడు రూపములతో మూడు విధములైన వ్యాపారములు చేసినవాడు. ఒక రూపము చేత మహత్తత్త్వమును, రెండవ రూపముచే బ్రహ్మాండమందును, మూడవ రూపము చే సర్వ జీవుల యందును ప్రకాశించు వాడు. అభివ్యక్తమైన అనిరుద్ధాది రూపముల కంటె ముందుగనే అభివ్యక్తమైన వాసుదేవరూపము గలవాడు. అందువలన పురాతన పురుషుడు లక్ష్మీదేవి కంటెను బ్రహ్మాది జీవుల కంటెను ఉత్తముడైన వాడు. లింగదేహ బంధకముతో కూడిన బ్రహ్మాది తృణాంత జీవులకును, లింగ దేహము లేని నిత్యముక్తయైన లక్ష్మీదేవికిని విలక్షణుడైన వాడు. ఆమె అంతర్గతుడై యుండి ఆమెచే అర్చింప దగిన పాద పద్మములు గలవాడు. త్రివిధ జీవుల యందుండినప్పటికిని అవికారుడై సంతోష జ్ఞానాదులచే ప్రచురమైన శరీరము కలవాడు. వేద మందలి పురుష సూక్తముచే బాగుగా తెలియ దగిన వాడు. ఇట్టి పరమాత్ముడు జగత్తును సృష్టించి ఆ జగత్తు నందును అందుండగల లక్ష్మీదేవి యొక్క స్వరూప దేహ మందును త్రివిధ జీవుల స్థూల దేహము నందు ఆ వాసుడైన వాడై యున్నాడు. రమాదేవికి కూడ లభ్యము కాని స్వాఖ్య ప్రదేశము గలవాడై అపరిచ్ఛిన్నమైన వ్యాప్తి గలవాడు. అందువలన గుణముచే పరమాత్ముని కంటెను లక్ష్మీదేవి అసమురాలు.

మూ. స్త్రీ నపుంసక పురుష భూ సలి.  
లానలానిల గగన మన శశి  
భాను కాల గుణ ప్రకృతి యొళ గొందు తానల్ల!  
ఏను ఇవన మహా మహిమె కడె  
గాణ రజ భవ శక్ర ముఖరు ని  
ధానిసలు మానవరి గళవడువదే విచారిసలు|| 2

చ|| పురుష నపుంసకాంగనల భూ సలిలా నిల వహ్నియున్ నభం  
బరయ మనంబు జంద్రుడు నహర్పతి కాలము నుం గుణంబులున్  
మఱి ప్రకృతి స్వరూపముల మాధవుఁ డొక్కటి కాడ దేమనం  
బఱగునొ తామెఱుంగరట బ్రహ్మ శివామర వల్ల భాదులున్

తా|| పరమాత్ముని స్త్రీ యనియును, నపుంసకమనియును, పురుషుడనియును చెప్పుటకు వీలు లేదు. ఇట్టి వాడనుటకు వీలులేని విలక్షణములైన అనేక

రూపములు గలవాడు. స్త్రీల యందు, పురుషుల యందు, నపుంసకుల యందు అంతర్యామియై యుండు వాడు. ఇరువది నాలుగు తత్త్వములచే నిర్మితములైన ఇట్టి వారి స్థూల దేహములందును ఆయా తత్త్వాభిమాన దేవతల యందును, జీవుల ఆయుః ప్రమాణము నందును, గుణత్రయము నందును ఉపాదాన కారణమైన శుక్లశోణితాఖ్య ప్రకృతి చేత ఉత్పన్న మైన చరాచరములైన సర్వ ప్రాణుల స్థూల దేహమునందును అంతర్యామియై యుండునే కాని వీనిలో తాను ఏ ఆకాశాది తత్త్వములు కాదు. ఇట్టి పరమాత్ముని అద్భుతమైన అ పరిచ్ఛిన్నమైన మహిమల నేమని చెప్పవలయును. రమాదేవికిని బ్రహ్మ రుద్రేంద్రాదులకును అసాధ్యమై యుండ మానవు లెట్లు తెలియుటకు సమర్థులగుదురు.

మూ. గంధ రస రూప స్పరశ శ
బ్దొందు తానల్ల దరదర పెస
రింద కరెసుత జీవరనె తర్పకను తానాగి॥
పొంది కొండిహ పరమ కరుణా
సింధు శాశ్వత మనవె మొదలా
దింద్రియగళొళగిద్దు భోగి సుతిహను విషయగళ॥ 3

తే॥ శబ్దమున్ స్పర్శ రూపంబు సౌరభ రస
మందు నొక్కటికాక నాయభిధ లందు
బఱగుఁ దర్పకుడగుచు జీవ తతి యందు
గలదు హరి యింద్రియముల భోగముల గొనుచు

తా॥ నాసిక యందలి గంధ తన్మాత్రము, నాలుక యందలి రసతన్మాత్రము, నేత్రములందలి రూప తన్మాత్రము, చర్మము నందలి స్పర్శ తన్మాత్రము, కర్ణము లందలి శబ్ద తన్మాత్రము ఈ అయిదు తత్త్వము లందును, ఇచ్ఛాది మనోతత్త్వము లందేవియు తాను కాకున్నాడు. కాని అన్నింటి యందును ఆయానామములతో నున్నాడు. సమస్త జీవులకు ఆయా తన్మాత్రల ద్వార తృప్తి నొందించు వాడగును. సమస్త జీవుల యందు తర్పకుడైనప్పటికిని ఉత్తములైన తన భక్తుల యందు దయా సముద్రుడై యున్నాడు. మనస్సు మొదలైన ఇంద్రియములందు జీవుని లింగ శరీర భంగము పలుకు విషయములను భోగించు చున్నాడు.

మూ. శ్రవణ నయన ఘ్రాణ త్వగ్రస
నిపుగళలి వాక్పాణి పాదా
ద్యవయవగళలి తద్గుణ గళలి తత్పతిగ ళొళగె।
ప్రవితతను తానాగి కృతి పతి
వివిధ కర్మవ మాడి మాడిసి
భవకె కారణనాగి తిరుగిసుతిహను తిళిసదలె॥ 4

తే॥ శ్రవణమును నయనంబును ఘ్రాణమునను
త్వక్కు రసనంబు వాక్పాణి పాదములను
నవయవంబుల గుణముల నాపతులకు
నంతరాత్మయు దానయి యఖిల కర్మ
ములను జేయుచు జేయించు ముదము తోడ
భవమునకుఁ గారణుండయి బ్రహ్మ నుతుడు

తా॥ శ్రవణేంద్రియముచే శబ్దము వినుట నయనేంద్రియముచే పదార్థములను చూచుట నాసి కేంద్రియముచే వాసన చూచుట చర్మముచే శీతోష్ణములను తెలియుట నాలుకచే రసమును స్వీకరించుటయు మొదలగు జ్ఞానేంద్రియ కార్యముల యందును నోటితో మాట్లాడుట చేతులతో నిచ్చుట తీసుకొనుట కాళ్ళతో గమ నాగమనము సేయుట పాయ్వింద్రి యముచే మల విసర్జనాదులు సేయుట. ఇట్లు దశేంద్రియము లందును తద్గుణములందును తత్పతుల యందును బాగుగా వ్యాప్తుడైన వాడై కృతిపతియైన ప్రద్యుమ్న రూపి పరమాత్ముడు వివిధములైన కర్మలను చేసి చేయించి జీవులను అనాది కర్మలననుసరించి జనన మరణాదులలో ఆ జీవులకు తెలియకుండునట్లు త్రిప్పుచున్నాడు.

మూ. గుణి గుణ గళొళ గిద్దు గుణి గుణ
నెనిసువను గుణ బద్ధ నాగదె
గుణజ పుణ్యాపుణ్యఫల బ్రహ్మాది చేతనకె।
ఉణిసుత వరొళ గిద్దు వృజినా
ర్దన చిదానందైక దేహ ను
కొనిగె సచరాచర జగద్భుకు వెనిప నవ్యయను॥ 5

క॥ గుణి యందు గుణములందును
గుణి గుణుడై యుండు కాదు గుణబద్ధుడు త
ద్గుణ పుణ్యా పుణ్యంబుల
జనార్దను డ జాదులకు నొసంగు సుఖంబున్

తే॥ బ్రహ్మ మొదలు తృణాంత జీవముల యందు
సచ్చిదానంద దేహుండు సంచరించి
తుదకు సచరాచరసజగ ద్భుకువనుస
మాఖ్య విలసిల్లు నవ్యయుడైన హరియు

తా॥ త్రిగుణములైన జీవుల యందు వారి వారి స్వాభావిక గుణములలో పరమాత్ముడు, గుణి గుణిసాంకేతులైన జీవుల స్వరూపములందుండి గుణి యుంచును, గుణ పిలువ బడును, సాంకేతమైన లింగ దేహ మందుండి గుణముంచును లింగదేహా అయినను త్రిగుణాత్మకమైన లింగ దేహముచే బద్ధుడుకాక ఆ లింగశరీరము పాదానముచే జనితములైన ఆవరణములైన వైషయికమైన పాది లింగశరీరము దీనిపై నున్న ఇరువది నాలుగు తత్వముల చేకూడిన అనిరుద్ధ శరీరము దీనిపై జడ ప్రకృతి జనితమైన పాంచ భౌతిక స్థూల దేహము నందును తజ్జనితములైన యింద్రియముల ద్వార చేయబడు పుణ్యా పాప కర్మములను దేవతలకును దేహము అనుభవింప చేయును. బ్రహ్మాది సమస్త తత్వాభిమాన అనుభవింప నందున్న జీవునకును వారి వారి యోగ్యతాను సారముగా తమో యోగ్యులకు జేయును. నిత్య సంసారులకు ఉదాసీన కర్మ ఫలమును జీవులకు పాప కర్మ ఫలములు ఈ విధముగా త్రివిధ దేహము లందున్న తత్త్వేశ్వరుల బింబ క్రియ ద్వార స్వాఖ్య ఫల రసములు తాననుభవించి తుదకు ప్రళయ ద్వార జీవులకు కర్మ ఫలముల ననుభవింప జేయును. జగద్భుకు కాలము నందు సమస్త జీవులను తనకుక్షి యందుంచు కొనుటచే వను సమాఖ్యుడై నాశరహితుడగుటచే అవ్యయుడని పిలువ బడును.

వి॥ 1) సత్త్వ గుణ స్వభావులైన సుఖ రూపులైన భగవద్భక్తులు విష్ణువునే సర్వోత్తముడందురు.

2) రజోగుణ స్వభావులైన నిత్య సంసారులు పంచ భేదము నంగీకరించి తార తమ్యమును అంగీకరింపక పరమాత్ముడు సర్వోత్తముడను విషయము నందు మిశ్రమ జ్ఞానము కలవారు. సుఖ దుఃఖ మిశ్రమమైన స్వరూపము గలవారు.

3) తమోగుణ స్వభావులైన వారు దుఃఖరూపులైన తమో యోగ్యులు. భగవంతుని ద్వేషించు వారు. అహం బ్రహ్మ యన దగిన వారు.

మూ. విద్య తానెందెని సి కొంబని
రుద్ధ దేవను సర్వ జీవర
బుద్ధియోళ్ నెలెసిద్దు కృతిపతి బుద్ధి యెనిసువను
సిద్ధి యెనిసువ సంకరుషణ ప్ర
సిద్ధి నామక వాసు దేవన
వద్య రూప చతుష్ట యగ ళరి తవనె పండితను॥ 6

మ॥ అని రుద్ధుండును విద్య తానగుచు నాఖ్యాతుండు జీవాలికె
ల్లను బుద్ధిన్ విలసిల్లి బుద్ధియనఁ జాలన్వెల్గు సంకర్షణుం
డును సిద్ధాఖ్యను సిద్ధినాముడగు చుండున్ వాసుదేవుండుత
ద్ఘనమౌ రూప చతుష్ట యంబుఁదెలియంగా వాడె విద్వాంసుడౌ.

తా॥ అహంకారముచే బుట్టిన అహం మమతాదులను పోగొట్టి తారతమ్య పంచభేద సుజ్ఞానమను విద్యను వ్యక్తముగావించి జీవుల విద్యావంతులజేయువాడు అనిరుద్ధుడను పరమాత్ముడు. ముక్తి యోగ్యులైన సమస్తజీవుల బుద్ధియందు వసించువాడై బుద్ధియని పిలువబడువాడు ప్రద్యుమ్నుడు. అట్టినిశ్చయ జ్ఞానమందు మరల వికల్పముగాకుండునట్లు మనోవృత్తిద్వార విశేషముగా సిద్ధిగావింపజేసి సిద్ధియనబడువాడు సంకర్షణుడు. అట్లు సిద్ధియైన జ్ఞానము నుండి హృదయాకాశమునందు పరమాత్ముని ధ్యానాదులచేయవలయునను ప్రసిద్ధమైన ధ్యానోపాసన ప్రయత్నమును చిత్తమునుండి నడిపించువాడు వాసుదేవుడను పరమాత్ముడు. ఈ అనిరుద్ధాది నాల్గురూపములు తెలిసినవాడే పండితుడనబడును.

వి॥ మనోవృత్తులు నాలుగు - మనస్సుతో చేరి అయిదు.

| | | | |
|---|---|---|---|
| 1) | అహంకారము | - అస్వరూపేస్వరూపతామితి | - అనిరుద్ధుడు |
| 2) | బుద్ధి | - నిశ్చయజ్ఞానము | - ప్రద్యుమ్నుడు |
| 3) | చిత్తము | - స్మరణేచ్ఛ | - వాసుదేవుడు |
| 4) | మనస్సు | - సంకల్పము-వికల్పము | - సంకర్షణుడు |
| 5) | అంతఃకరణము | - ఫలభోగము | - నారాయణుడు |

ఈ అయిదును జీవుని ఉద్ధారముచేయు రూపములు.

మూ. తను చతుష్ట యుగళొళు నారా
యణను హృత్కమలాఖ్య సింహా
సనదొ ళని రుద్ధాది రూప గళింద శోభిసుత।
తనగె తానే సేవ్య సేవక
ననిసి సేవాసక్త సుర రొళ
గనవరత నెల సిద్దు సే వెయ కొంబ న పరంతె॥ 7

ఉ॥ దేహ చతుష్టయంబులను ధీరత హృత్కమలాఖ్య పీఠమున్
శ్రీహరి తాను శోభిలును చెల్వుగ నాయని రుద్ధుడాదియౌ
నా హరి సేవ్య సేవకుడు నై తను సేవల సేయు నిర్జర
వ్యూహము నందు రాజిలుచు నొప్పుగ సేవల నొందు వారిచే.

తా॥ పైన వివరించిన స్వరూప - లింగ - అని రుద్ధ - స్థూల ఈ నాలుగు దేహముల యందు అనిరుద్ధాది రూప చతుష్టయముతో పరమాత్ముండుండిన వాడై విద్యాది తత్త్వాభిమాన దేవతల యందును పూజా సాధన ద్రవ్యముల యందును పూజ చేయు వారి యందును తానే నిలిచి జీవులట్లు తన సేవ తానే చేసు కొనును.

వి॥ 1. ఆర్యకా 2. వజ్రికా 3. ప్రకాశికా 4. వైద్యులి 5. సుషుమ్న అని అయిదు విధములు. ఈ సుషుమ్నకు నాలుగు దిక్కులందు నాలుగు నాడులున్నవి. మధ్య యందు సుషుమ్న. ఈ అయిదు నాడులందు పూర్వోక్తమైన మనస్సు మొదలగు పంచ వృత్తులు. అనిరుద్ధాది అయిదు భగవద్రూపములున్నవి. దాని యందు మధ్య నాడి యందు అంతఃకరణ వృత్తి యందు నారాయణుడున్నాడు. ఈ అయిదు నాడుల యందు ప్రతి నాడిలోను హృదయ ప్రదేశ మందు అష్ట దళకమలములున్నవి. దాని యందు అయిదు భగవద్రూపములున్నవి.

మూ. జాగరస్వప్నం గళొళు పర
భోగి శయన బహు ప్రకార వి
భాగ గైసి విరంచి జీవర చిచ్ఛరీరవను।
భోగ విత్తు సుషుప్తి కాలది
సాగరవ నది కూడువంతె వి
యోగ రహితను అంశగళనేకత్రవైదిసువ॥ 8

ఉ॥ జాగర స్వప్న కాలముల సర్వ విధాల నిరంశ జీవులం
బాగుగ కాంతి రూపమును ప్రాకృత దేహము వేరు వేరుగా
భాగమొనర్చి యాపయిని బ్రహ్మనుతుండు సుషుప్తి యందునన్
వేగమె యంశి జేర్చు తగ ప్రీతిగ భోగములన్ సుషుప్తిలో
సాగర సంగమం బొదవు సన్నది వోలెను గూర్చు నంశలన్.

తా॥ 'సర్వేంద్రియాణా ముపరమ ఏవ సుషుప్తిః' అను ప్రమాణము రీతిగా జాగర స్వప్నముల యందు అంశలేని జీవుల కాంతి రూపమును, స్థూల శరీరమును సర్వకాలముల యందును విభజించి సకల భోగములను చేయించి అనంతరము సుషుప్తి యందు మేఘములు సముద్రోదకమును పానము జేసి వర్షించి నది ద్వార పానము చేసిన ఉదకమునే సముద్రమును చేర్పించునట్లు ఏకత్ర నొందించును. అనగా అంశముల అంశి యందు చేర్చును.

మూ. భార్య రిందొడ గూడి కారణ
కార్యవస్తుగళల్లి ప్రేరక
ప్రేర్య రూప గళింద పటతంతుగళవోలిద్దు।
సూర్య కిరణ గళంతె తన్నయ
వీర్యదిందలె కొడుత కొళుతిహ
నార్యరిగె ఈతన విహారవు గోచరిపుదేనో॥ 9

ఉ॥ భార్యలతోడఁ గూడి బహుభంగులఁ గారణ కార్యవస్తులం
బ్రేర్యుఁడుఁ బ్రేరకుండగుచు శ్రీహరియుం బటతంతులట్టులన్
సూర్యునికాంతి పుంజముల చొప్పునఁ దానిడు సత్ఫలంబులే
యార్యులకేని గోచరములా? పరమాత్ముని సద్విచారముల్.

తా॥ పరమాత్ముడు తనభార్యలైన శ్రీ, భూ, దుర్గా దేవేరులచే యుక్తుడై సమస్త జీవులకు సకల పదార్థముల నిచ్చి మరల వారికి ప్రేరణ చేసి వారిచే నర్పింప జేసుకొని వారివారి యోగ్యతానుసారముగా ఫలములను తీసుకొనును. ఇటువంటి పరమాత్ముని అచింత్యాద్భుత శక్తి యెవరి చేతను తెలియుటకు అసాధ్యమని తెలియవలయును.

మూ. జనక తన్వాత్మజగె పర భూ
షణ దుకూలవ తొడిసి తా పం
దనెయ కైకొళు తవన హరసుత హరుష బడు వంతె।

వనరుహేక్షణ పూజ్య పూజక
నెనిసి పూజా సాధన పదా
ర్థను తనగె తానాగి ఫలగళ నీవ భజకరిగె॥ 10

చ॥ జనకుడు తాఁ గుమారునకుఁ జక్కగ భూషలలంకరించి వం
దన మిడ దాని గైకొని ముదంబున దీవన లిచ్చి తృప్తుడౌ
నన సరసీజ లోచనుడ నంతుడు బూజ్యుడు బూజకుండనన్
దనరి సమర్చ సాధనల దాగొని భక్తుల కిచ్చు సౌఖ్యముల్.

తా॥ లోక మందు తండ్రియైనవాడు తన పుత్రుని వాత్సల్యముతో చక్కగా అలంకరించి ఓ బిడ్డా! నమస్కారము చేయుమని నమస్కారము చేయగా ఎట్లు ఆశీర్వాదము సేయునో అట్లు సర్వాంతర్యామియై యున్న పరమాత్ముడు తనచే సృష్టింప బడిన సర్వ వస్తువుల యందు తానుండి పూజ్యుడంచును పూజించు వాని యందు పూజకుడంచును పిలువ బడిన వాడై పూజా సాధన పదార్థములందు అంతర్యామియై యుండినను పదార్థములతో తాను పూజ చేయించుకొని తన భక్తులైన జ్ఞానులకు వారి వారి యోగ్యతానుసారముగా సుఖములనిచ్చును. తండ్రి సమానుడైన శ్రీహరి పుత్ర సమానులైన సజ్జనుల నుద్ధరించుటకు భక్తులకు పూజోప యోగ్యములైన పదార్థములనిచ్చి ఆ పదార్థములచే పూజితుడై నమస్కరింప జేసి కొనిన వాడై వారిని సుఖ వంతులనుగా చేయును.

మూ. తందె బహు సంభ్రమది తన్నయ
బంధు బళగవ నెరహి మదువెయ
నందనగె తా మాడి మనెయొళగిడువ తెరనంతె।
ఇందిరాధవ తన్న ఇచ్ఛెగ
ళింద గుణగళ చేతనకె సం
బంధ గైసి సుఖా సుఖాత్మక సంసృతి యొళిడువ॥ 11

చ॥ సుతునకుఁ దండ్రి సంతసము శోభిల బంధుల నెల్లఁజేర్చి య
ద్భుతగతిఁ బెండ్లి చేసి సతితో గృహమందున నుంచు రీతి న
చ్యుతుడు నిజేచ్ఛ మీఱ సుగుణౌఘము చేతనరాశిఁ గూర్చి సం
సృతిని సుఖా సుఖాత్మకుఁ డదెంతయు వారలఁ బెట్టు నిద్ధరన్.

స్వాదు ఫల వీ వందదలి సర్వేశ్వరను జనరా।
రారాధనెయ కైకొండు బ్రహ్మ భ
వాది గళ నామదలి ఫలవి
త్తాదరి సువను తన్న మహిమెయ తోరగొడ జగకె॥ 13

ఉ॥ భూరహకోటికిం జలము వోసిన దజ్జలముం గ్రహించి తా
మూరచు శాఖలన్ సుమము లొప్పగు స్వాదు ఫలంబులిచ్చున
ట్లారయ నచ్యుతుండు సుజనావలి యర్చనలెల్లఁగొంచు నం
భోరుహసూతి శంభులనఁ బోషణ సేయును గానకుండగన్.

తా॥ వ్రేళ్ళచే నీళ్ళను గ్రహించి వృక్షము పుష్పములను ఫలములను ఎట్లు జనుల కిచ్చునో అట్లు బ్రహ్మాది దేవతలు మనకు ఫలములిచ్చినట్లుండును. కాని పరమాత్ముడు తానే అందరి యందు నుండి ఫలముల నిచ్చుచున్నాడని తెలిసి కొనవలయును. వేరు సామ్యముగల పరమాత్మునకు ఉదకముతో సామ్యమైన శుభాశుభకర్మము లను అర్పించినచో వారికి సత్ఫలము లిచ్చును. దుష్టులైన దైత్యులకు అశుభమైన ఫలము నిచ్చును.

మూ. శ్రుతి తతి గళిగె గోచరి సద
ప్రతిమ జానందాత్మ నచ్యుత
వితత విశ్వాధార విద్యాధీశ విధిజనక।
ప్రతి దివస చేతన రొళగె ప్రా
కృత పురుష నందదలి సంచరి
సుత నియమ్య నియామకను తానాగి సంతైప॥ 14

మ॥ శ్రుతి సంవేద్యుఁడనాది మధ్య లయుడున్ శుద్ధుండు నప్రాకృత
ప్రతిముం డబ్జభవాశ్రితుండు మఱి విద్వన్మాన్య విశ్వాత్ముడున్
బ్రతి నిత్యంబును బ్రాకృతుండనఁగ సంచారంబుఁ గావించియ
చ్యుతుడున్ సర్వనియామకుండగుచుఁ బ్రోచుం జీవులందెప్పుడున్.

తా॥ వేద ప్రతి పాద్యుడును, ఆది మధ్యాంత రహితుడును, సమస్త జగజ్జీవాధారకుడును సంహారకుడును, అంతర్యామియు జ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞానమయుడును అప్రాకృతుడునైన పరమాత్ముడు ప్రతిదిన మందును ప్రతి కల్ప మందును ప్రకృతి సంబంధమైన స్థూల దేహముతో కూడిన

చేతనులందు కూడుకొని తానును సాధారణ మానవులట్లు బాహ్యమందు సంచారము చేయుచు దుష్ట నిగ్రహము, శిష్ట పరిపాలనము చేయుచు ఆయా తత్త్వాభి మాని దేవతలకు ఆయా యింద్రియ వ్యాపారములను సద్వ్యాపార మందే చేయునట్లు ఆజ్ఞ చేయుచు దుష్టులైన దైత్యుల బాధ లేకుండునట్లు వారిని నిగ్రహించి తన భక్తులైన వారిని సంరక్షించును.

మూ. మన విషయ దొళ గిరిసి విషయవ
మనదొళగె నెలెగొళిసి బలు నూ
తనవు సుసమీచీన విదుపాదేయ వెందరుపి।
కనసి లాదరు తన్న పాదద
నెనెవ నీయదె సర్వరొళగి
ద్దనుభవిసువను స్థూల విషయవ విశ్వనెందెనిసి॥ 15

తే। గీ। మనము విషయంబునం జేర్చి మఱి విషయము
మనమునందున సంధించి మాధవుండు
నూతనమును సమీచీనమై తనరెడు
నిది యుపాదేయ. మంచును మదిదలంచి.

తే। గీ। స్వప్న మందైన తనపాద పద్మయుగళి
స్మరణనీయక యందరి స్వాంతములను
వెలసి స్థూల విషయముల వివిధగతుల
ననుభవించును విశ్వాఖ్యుఁడైన హరియు

తా॥ స్థూల దేహము నందలి మనస్సును లింగదేహము నందలి అనాదియైన జడమనస్సును పరంపరాత్మకముగ వచ్చి వ్యాపించి యున్నది. అట్టి మనస్సును విషయము నందు చేర్చి మనస్సు ద్వార యింద్రియములచే స్వీకరించిన విషయములను స్థూల దేహము నందలి ఇంద్రియ మార్గముచే ప్రవేశ పెట్టి అనగా? బింబక్రియ ద్వార పెట్టినవాడై జీవుడైన వాడు అనేక పర్యాయములు అనుభవించిన వానిని తన స్వాఖ్య విషయములను అనుభవించి జీవునితో గూడి సంతోష పడునట్టి భాగ్యమునిచ్చువాడగును. జీవునకు ఉపచయ భాగమేదియు లేదు. దేహము నందలి తాత్త్విక దేవతలకు విశ్వతైజసుల విధముగా భోగము.

మూ. తోదకను తానాగి మన మొద
లాద కరణదొళిద్దు విషయవ
నైదువను నిజసుఖ పూర్ణమయ గ్రాహ్యగ్రాహకను।
వేద వేద్యను తిళియదవనో
ప్పాది భుంజిసు తెల్ల రొళగా
హ్లాద పడువను భక్తవత్సల భాగ్య సంపన్న॥ 16

ఉ॥ తోదకుఁడుం గడున్ముదముతో హరితానయి మానసాఖ్య స
త్సాధనలందునుండి పలుసంతసమౌ విషయంబులందు న
త్యాదర పూర్ణసౌఖ్యమయుఁ డచ్చుగ గ్రాహ్యుఁడు గ్రాహకుండునై
యేది యెఱుంగలేనియటు తృప్తి భజించి ముదంబు సెందెడున్.

తా॥ స్థూల దేహమందు వ్యాప్తుడైన జీవుని ద్వార కుడికంటిలో నుండు విశ్వనామకుడు స్థూలదేహేంద్రియాదులచే స్థూలకర్మములు చేయించి తన స్వాఖ్య స్థూల రసమును తాననుభవించు ననియు, అట్లు స్థూలదేహములందున్న తన స్వాఖ్య రసములను తాను భుజించి ఆవాసుడై యున్నాడనియు అనుసంధాన పూర్వకముగా విషయ విరక్తుడై నిస్సంగుడైన వాడై పరమాత్ముని విషయమైన సంతోషమును ఎవడుపొందునో అట్టి భక్తునకు జ్ఞానభక్తి వైరాగ్యముల ద్వార అపరోక్ష భాగ్యమును ఇచ్చి లింగదేహభంగమును పొందించి మోక్ష సంపద నిచ్చును.

మూ. నిత్య నిగమాతీత నిర్గుణ
భక్తవత్సల భయవినాశన
సత్యకామశరణ్య శ్యామల కోమలాంగ సుఖి।
మత్తనందది మర్త్యరొళ హొర
గెత్త నోడలు సుత్త లిప్పను
అత్యధిక సంతృప్తి త్రిజ గద్వ్యాప్త పరమాప్త॥ 17

మ॥ నిగమాతీతుఁడు నిత్యనిర్గుణుఁడు నెంతే భక్త వాత్సల్యుఁడుం
దిగులుం బాపెడు సత్యకామదుడు సత్తేజోశరీరుండు శ్రీ
భగవంతుండు సుఖుండు మత్తునివలెన్ మర్త్యాలిలోనన్ వెలిం
జగమందెచ్చటఁ జూడఁ దృప్తుఁడగుచున్ సంచారముం జేసెడున్

తా॥ పరమాత్మని వలె అనాదియైన నిత్యమైన యాశ్వర రచితము కాని యాశ్వరాధీనమైన శ్రీ పరమాత్మని దివ్యమాహాత్మ్యములను చెప్పదగిన ఋగ్వేదాది నాల్గు వేదములకు అతీతనైన ప్రాకృత గుణములు లేని అనంత కల్యాణ గుణపరి పూర్ణుడైన వాడును జ్ఞానులకు అత్యంత ప్రేమాస్పదుడునైన హరి తన్ను తెలిసిన జ్ఞానుల యొక్క భయమును పోగొట్టును. సర్వోత్తముడైన పరమాత్ముడు రమా బ్రహ్మాది సర్వత్రివిధ జీవులను లక్ష్యము సేయక బ్రహ్మాండము లోపలను వెలుపలను వ్యాప్తుడై యున్నాడు. అట్టి పరమాత్ముడు తారతమ్యానుసారముగా ఉత్తములైన భక్తులకు మోక్షము నిచ్చు వాడగును.

మూ. పవి హరిన్మణి విద్రుమద స
చ్ఛవిగళందది రాజిసుత మా
ధవ నిరంతర దేవమానవ దానవరొళిద్దు।
త్రివిధ గుణ కర్మ స్వభావవ
పవన ముఖ దేవాంతరాత్మక
దివస దివసది వ్యక్తమాడుత లవరొళిద్దుణిప॥ 18

చ॥ పవియును నీలరత్నమును భవ్యతరంబగు విద్రుమంపు స
చ్ఛవుల విధంబునన్ రుచుల సంతసమొప్పు సురాసురావలిం
ద్రివిధములైన కర్మముల నిచ్చలు వాయుముఖాంతరాత్ముఁడై
తవిలియొనర్చుచున్ సుఖము దాభుజియింపఁగఁ జేయు జీవులన్.

తా॥ బ్రహ్మదేవుని ఆయుః ప్రమాణమగు నూఱు సంవత్సరములు నారాయణునకు ఒక పగలు. అట్లు నూఱు సంవత్సరములొక రాత్రి. ఈ ప్రకారమొక దినమందు నారాయణునకు జీవుల సృష్ట్యాదుల సాంకేతమగును. ఇట్టి తన ప్రతి దివసముల యందు రాశి యందున్న జీవులను స్థూల సృష్టికి తెచ్చి సాధనము పూర్తి చేయించి వారివారి స్వరూప సుఖములను వారి వారి బింబరూపుడు అనుభవింప జేయును. ఎట్లనగా వజ్రము నీలము పగడము ఈ మణుల యందు ప్రసరించిన సూర్యకిరణములు ఆయా వర్ణములతో ప్రకాశించునట్లు పరమాత్ముడు బ్రహ్మాది త్రివిధ చేతనులందు ప్రకాశించు చుండును.

మూ. అణుమహత్తినొళిప్ప ఘన పర
మాణు వినొళ డగిసువ సూక్ష్మవ
ముణుగిసువ తేలిసువ స్థూలగళవన మాయ విదు।
దనుజ రక్కస రెల్లరివనొళు
మునిదు మాడువదేనులూఖల
ఒనకెగళు ధాన్యగళ హణివందదలి సంహరివ॥ 19

చ॥ అణు మహిమాదులందుఁ గలడాహరియుం బరమాణు వందునం
ఘనమడఁగించు సూక్ష్మమును గ్రక్కున ముంచును దేల్చు స్థూలమున్
వనరుహనాభు మాయయిది వంచన సేతురు వాని దానవుల్
దనుజులఁగూల్చు ధాన్యముల దంచెడు రోకలి త్రోలు చందమున్.

తా॥ పరమాత్ముడు అణువు లందు పరమాణువుగను మహత్తులందు మహత్తుగను ఉండును. 'అణోరణీయాన్ మహతోమహీయాన్' అను వేదార్థము వ్యక్తమగును. పరమాణువు నందు ఘనము అడగునట్లును సూక్ష్మమైన దానిని నీటిలో మునుగునట్లును స్థూలములను దేలునట్లును చేయు మాయామయుడు. అట్టి పరమాత్ముని దానవులు మోసగింపజాలురు. ఇది సాధ్యమగునా? అట్టి దానవులను త్రోటిలో వేసిన ధాన్యమును దంచు రోకలి వలె వారిని సంహరించును. అణు మహత్తులను శక్తి జీవకోటి ప్రవిష్టులందు లేదు. ఈశ కోటి మాత్రమే. అనగా? రమానారాయణులకు మాత్రమే అని తెలియవలయును.

మూ. దేవ మానవ దానవరు ఎం
దీవిధద లావాగలిప్పరు
మూవరొళగివగిల్ల స్నేహోదాసీన ద్వేష।
జీవరధికారాను సారద
లీవ సుఖ సంసార దుఃఖవ
తావుణదొళ వరవరిగుణిసువ నిర్గతాశనను॥ 20

చ॥ అరయగ దేవమానవ మహా సురులెప్డు వసించుచుంద్రు శ్రీ
హరికినిలేదు స్నేహము నిరాదరమున్మటి ద్వేషభావముల్
గరుణను వారివారి యధికారము వోలినయట్లు సౌఖ్య సం
సరణము దుఃఖభాజనుల సల్పును దాభుజియింప కెంతయున్.

తా॥ పైన చెప్పిన పద్యపు భావానుసారముగా పరమాత్ముడు త్రివిధ జీవుల యందు ఉన్నప్పటికిని వీరి యందు తాను ప్రత్యేకముగా స్నేహము ఉదాసీనములను చూపింపక వారివారి స్వభావ యోగ్యతానుసారముగా సుఖదుఃఖముల నొసగి తాను మాత్రము దేనిని అనుభవింపక నిత్య తృప్తుడై యుండును.

ఎల్లికేళిద రెల్లి నోడిద
రెల్లి బేడిద రెల్లినీడిద
రెల్లి ఓడిద రెల్లి ఆడిద రల్లి ఇరుతిహను।
బల్లిదరిగతి బల్లిదను సరి
యిల్ల ఇవగావల్లి నోడలు
ఖుల్లమానవరొల్ల నప్రతిమల్ల జగకెల్ల॥ 21

చ॥ ఎచటను విన్న జూచిన మఱెచ్చటఁ గోరిన నెక్కడిచ్చినన్
ఎచట బిరానబాఱిన నదెచ్చట నాడిన నందునుండు స
ర్వ చరుడనంగ బల్లిదుల బల్లిదుడౌ సరిసాటి లేదు స
త్ప్రచురుడు దుష్టశత్రుడు నపార పరాక్రముడిజ్జగంబునన్

తా॥ కర్మేంద్రియముల యొక్కయు జ్ఞానేంద్రియముల యొక్కయు సర్వవ్యాపారముల యందు పరమాత్ముడు ఆయా యింద్రియ గోళకములందును / ఆయా యింద్రియము లందును యింద్రియాభిమాని దేవతల యందును యింద్రియ వ్యాపారములు జరుగు పదార్థముల యందును ఉండువని అనుసంధానము చేయు వారిని తన వారిని గౌరవించును. వీరే అంతరంగ భక్తులు. ప్రతిష్ఠ సంపాదించు నిమిత్తముగా పరమాత్ముని యందు భక్తివిశ్వాసాదులు చేసిన సరిసమానస్థులు శ్రేష్ఠులైనవారు ఎచట చూచినను లేరు. ఈ పరమాత్ముడొక్కడే సర్వవ్యాపకుడై యుండు నేకాని వేరొకరికి ఈ సామర్థ్యము లేదు.

మూ. తప్తలోహపు నోళ్ప జనరిగె
సప్త జిహ్వన తెరది తోర్పదు
లుప్త పావక లోహకాంబుదు పూర్వదోసాది।
సప్తవాహన నిఖిళ జనరొళు
వ్యాప్త నాదుదరింద సర్వరు
అప్తరాగిహరెల్ల కాలది హితవ కైకొండు॥ 22

ఉ॥ లోహము తప్తమైకడు వెలుంగుచునుండిన నగ్నియోయనన్
మోహమొసంగు నాయనలముం గనకుండినఁ బూర్వమట్లుగన్
దేహుల సప్తవాహనుడు దేజరిలం దను తత్త్వదేవతా
వ్యూహము జీవుడున్వెలయుచుందురు సంతతమున్ హితార్థులై

తా॥ పరమాత్ముడు లోహము నందలి అగ్ని వలె దేహ మందు వ్యాప్తుడై యుండుకాలము వఱకు దేహమునందలి తత్త్వాభిమాని దేవతలు దేహము నుండి కాదగుసుఖ దుఃఖములను స్వీకరించి తమ పాలు తాము తీసుకొని పరమాత్ముని పాలు అతనికి సమర్పణము చేయుదురు. దేహము నందలి జీవుడు పరమాత్ముడు తత్వాభిమాని దేవతలు వెళ్ళి పోయినను లోహము నందున్న అగ్ని ఆరిపోయినచో తేజోహీనముగా పూర్వమట్లు ఎట్లు కన్పడునో ఆ ప్రకారముగా దేహము తేజో హీనమై నిశ్చేష్టిత మగును. ఈ ప్రకారముగా నిశ్చేష్టితమైనప్పటికిని పరమాత్ముడొక్కడే అంతర్యామియై యుండునేకాని తక్కిన తత్త్వాభిమాన దేవతలు జీవియు ఉండజాలరు.

అగ్నికి సప్తజిహ్వాలేవనగా

| జిహ్వాల పేర్లు | వర్ణము | త్రివిధస్వీకార విధానము | | |
|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 |
| 1. కాలీ | హిరణ్యము | ఔపాసనము | అగ్నిహోత్రము | అగ్నిష్టోమము |
| 2. కరాలీ | కనకము | వైశ్వదేవము | దర్శపౌర్ణిమ అమావాస్య | అత్యగ్నిష్టోమము |
| 3. మనోజవా | రక్తము | స్థాలీపాకము | పిండపితృ యజ్ఞము | ఉద్యము |
| 4. సులోహితా | కృష్ణము | అష్టకము | పశుబంధము | షోడశము |
| 5. సుధూమ్రవర్ణా | సుప్రభా | మాసశ్రాద్ధము | అగ్రయణము | వాజపేయము |
| 6. స్ఫులింగినీ | అతిరక్తము | ఈశానబలి | చాతుర్మాస్యము | అతిరాత్రము |
| 7. విశ్వరుచి | బహురూపి | సర్వబలి | సౌత్రామణి | అప్తోర్యావము |

మూ. వారిదను మళెగెరెయ బెళదిహ
భూరుహంగళ చిత్ర ఫలరస
బేరె బేరిప్పంతె బహువిధ జీవరాశిగిద్దు।
మూరమణన పరపర యోగ్యతె
మీరదలె గుణకర్మ గనను
సార నుడిసువ దేవనిగె వైషమ్య వెల్లిహుదా॥ 23

ఉ॥ భూరి ఘనంబు వృష్టినిడ భూరుహముల్ ధర సద్రసంబులన్
సారతరంబుగా నిడిన చందమునం బహు జీవకోటులన్
మూరమణుండు రాజిలుచు మర్త్యుల యోగ్యత మీఱకుండఁగా
వారిగుణానుసార కృతి వైఖరుల న్నడిపించు సాక్షియై.

తా॥ పరమాత్ముడు అంతఃకరణ రూపమైన జలమునకు సమానుడు. జీవులు బీజములకు సమానులు. జలస్పర్శ లేకున్న బీజములకు ఫలించుట యనునది లేదు. ఆకారణముచే నీటి యందు అంతఃకరణమున్నది. ఈ అంతఃకరణము సమస్త బీజముల యందు సరిసమానముగా నున్నది. అట్లు పరమాత్మునకు అంతఃకరణము జీవులయందు సరిసమానముగా నున్నది. అయినను నీరు ఆయాబీజముల సంబంధమైనచో ఆయాబీజములను ఎట్లు వ్యక్తము చేయునో ఆప్రకారముగా వానివాని గుణములను పరమాత్ముడు జీవుల సంబంధముచే వైషమ్యము లేకయే ఆయాజీవుల గుణకర్మానుసారము భిన్న భిన్నములైన ఫలముల నిచ్చును. మేఘము తన ఉదకము నుండి వానివాని స్వరూప యోగ్యతానుసారము బీజముల స్వభావములను తెలుపును. దోషము బీజములందున్నది. సురసోపేతమైన పదార్థములు కలుషితమైన జిహ్వాకు చేదుగా తోచును. దోషము జిహ్వదే కాని పదార్థము నకు సంబంధము లేదు.

మూ. వారి జొప్తన కిరణ మణిగళ
సేరి తత్తద్వర్ణగళను వి
కారగైసదె నోళ్పరిగె కంగొళిసువందదలి।
మూరమణ లోకత్రయదొళిహ
మూరు విధ జీవరొళగిద్దు వి
హార మాడువనవర యోగ్యతె కర్మ వను సరిసి॥ 24

ఉ|| వారిజమిత్రు కాంతులవి వారకచేరి మణిత్రయంబునన్
శ్రీరమణీయ వర్ణముల జెల్వొనరం బ్రసరింపఁ జేయు నా
తీరున మాధవుండు జగతి త్రయమందుఁ ద్రిజీవుల న్మదం
బార విహారముల్సలుపు నాగలి యోగ్యత కర్మలట్లుగన్.

తా|| ఒకే ఉదకము ఆయా బీజముల స్వభావ గుణములను వ్యక్తము చేయు రీతిగా సూర్యుని కిరణములు ఉదకము రీతిగా నిర్దోషమైనది. అయినను వివిధ వర్ణ యుక్తములైన మణులకు సంబంధము కాకయే ఆయా మణుల స్వరూప యోగ్యతను వ్యక్తము చేయునట్లు పరమాత్ముడు నిర్దోషియైన కారణముచే సత్వరజస్తమోగుణముల జీవుల యందు వ్యాప్తుడై వారి వారి స్వరూప యోగ్యతలను వ్యక్తము చేసి వారివారి యోగ్యతానుసారముగా ఫలముల నిచ్చువాడగును.

మూ. జలవనపహరిసువ ఘళిగె బ
ట్టలనుళిదు జై ఘంటె కైపిడి
దెళెదు హాడెవందదలి సంతత కర్త తానాగి।
హలధరానుజ పుణ్య పాపద
ఫల గళను దేవా సురర గణ
దొళు విభాగవ మాడి ఉణిసుత సాక్షియాగిప్ప॥ 25

మ|| జల మాకర్షణ మాచరింపఁ దగు నాస్థాలిం దగంగాచి చే
తులతోడం జయగంటఁ బట్టుకొని యెంతోశక్తి మ్రోగించు న
ట్లలరన్ శ్రీహరి కర్తతానగుచుఁ బుణ్యాంబుల్ మహాపాపముల్
ఫలముల్ భాగములం భుజింపనిడు దేవశ్రేణి దైత్యాలికిన్.

తా|| ఈ విధముగా పరమాత్ముడు సమస్త జీవులందు కర్మసాక్షిగా నుండి కర్మ ఫలములను మూడు విధములుగా విభజించి దేహమునందున్న జీవునకు తత్త్వాభిమాన దేవతలకు అట్లే దైత్యులకు యోగ్య తానుసారముగా జీవునిది జీవున కొసగి దేవతలకు పాత్రకు సమానమైన సుఖమును దైత్యులకు జయగంటకు సదృశమైన దుఃఖమును ఇచ్చి కర్మ సాక్షియై యుండి సంరక్షణము చేయును.

తా॥ పరమాత్ముని వలె అనాదియైన నిత్యమైన యీశ్వర రచితము కాని యీశ్వరాధీనమైన శ్రీ పరమాత్ముని దివ్యమాహాత్మ్యములను చెప్పదగిన ఋగ్వేదాది నాల్గు వేదములకు అతీతమైన ప్రాకృత గుణములు లేని అనంత కల్యాణ గుణపరి పూర్ణుడైన వాడును జ్ఞానులకు అత్యంత ప్రేమాస్పదుడునైన హరి తన్ను తెలిసిన జ్ఞానుల యొక్క భయమును పోగొట్టును. సర్వోత్తముడైన పరమాత్ముడు రమా బ్రహ్మాది సర్వత్రివిధ జీవులను లక్ష్యము సేయక బ్రహ్మాండము లోపలను వెలుపలను వ్యాప్తుడై యున్నాడు. అట్టి పరమాత్ముడు తారతమ్యానుసారముగా ఉత్తములైన భక్తులకు మోక్షము నిచ్చు వాడగును.

మూ. పవి హరిన్మణి విద్రుమద స
చ్ఛవిగళందది రాజిసుత మా
ధవ నిరంతర దేవమానవ దానవరొళిద్దు।
త్రివిధ గుణ కర్మ స్వభావవ
పవన ముఖ దేవాంతరాత్మక
దివస దివసది వ్యక్తమాడుత లవరొళిద్దుణిప॥ 18

చ॥ పవియును నీలరత్నమును భవ్యతరంబగు విద్రుమంపు స
చ్ఛవుల విధంబునన్ రుచుల సంతసమొప్ప సురాసురావలిం
ద్రివిధములైన కర్మముల నిచ్చలు వాయుముఖాంతరాత్ముఁడై
తవిలియొనర్చుచున్ సుఖము దాభుజియింపఁగఁ జేయు జీవులన్.

తా॥ బ్రహ్మదేవుని ఆయుః ప్రమాణమగు నూఱు సంవత్సరములు నారాయణునకు ఒక పగలు. అట్లు నూఱు సంవత్సరములొక రాత్రి. ఈ ప్రకారమొక దినమందు నారాయణునకు జీవుల సృష్ట్యాదుల సాంకేతమగును. ఇట్టి తన ప్రతి దివసముల యందు రాశి యందున్న జీవులను స్థూల సృష్టికి తెచ్చి సాధనము పూర్తి చేయించి వారివారి స్వరూప సుఖములను వారి వారి బింబరూపుడు అనుభవింప జేయును. ఎట్లనగా వజ్రము నీలము పగడము ఈ మణుల యందు ప్రసరించిన సూర్యకిరణములు ఆయా వర్ణములతో ప్రకాశించునట్లు పరమాత్ముడు బ్రహ్మాది త్రివిధ చేతనులందు ప్రకాశించు చుండును.

మూ. అణుమహత్తినొళిప్ప ఘన పర
మాణు వినొళ డగిసువ సూక్ష్మవ
ముణుగిసువ తేలిసువ స్థూలగళవన మాయ విదు॥
దనుజ రక్కస రెల్లరినొళు
మునిదు మాడువదేనులూఖల
ఒనకెగళు ధాన్యగళ హాణివందదలి సంహరిప॥ 19

చ॥ అణు మహిమాదులందుఁ గలడా హరియుం బరమాణు వందునం
ఘనమడఁగించు సూక్ష్మమును గ్రక్కున ముంచును దేల్చు స్థూలమున్
వనరుహనాభు మాయయిది వంచన సేతురు వాని దానవుల్
దనుజులఁగూల్చు ధాన్యముల దంచెడు రోకలి తోలు వందమున్.

తా॥ పరమాత్ముడు అణువు లందు పరమాణువుగను మహత్తులందు మహత్తుగను ఉండును. 'అణోరణీయాన్ మహతోమహీయాన్' అను వేదార్థము వ్యక్తమగును. పరమాణువు నందు ఘనము అడగునట్లును సూక్ష్మమైన దానిని నీటిలో మునుగునట్లును స్థూలములను దేలునట్లును చేయు మాయామయుడు. అట్టి పరమాత్ముని దానవులు మోసగింపజాలురు. ఇది సాధ్యమగునా? అట్టి దానవులను తోటిలో వేసిన ధాన్యమును దంచు రోకలి వలె వారిని సంహరించును. అణు మహత్తులను శక్తి జీవకోటి ప్రవిష్టులందు లేదు. ఈశ కోటి మాత్రమే. అనగా? రమానారాయణులకు మాత్రమే అని తెలియవలయును.

మూ. దేవ మానవ దానవరు ఎం
దీవిధద లావాగలిప్పరు
మూవరొళగివగిల్ల స్నేహోదాసీన ద్వేష॥
జీవరధికారాను సారద
లీవ సుఖ సంసార దుఃఖవ
తావుణదొళ వరవరిగుణిసువ నిర్గతాశనను॥ 20

చ॥ అరయగ దేవమానవ మహా సురులెప్డు వసించుచుంద్రు శ్రీ
హరికినిలేదు స్నేహము నిరాదరమున్మఱి ద్వేషభావముల్
గరుణను వారివారి యధికారము వొలినయట్లు సౌఖ్య సం
సరణము దుఃఖభాజనుల సల్పును దాభుజియింప కెంతయున్.

తా॥ పైన చెప్పిన పద్యపు భావానుసారముగా పరమాత్ముడు త్రివిధ జీవుల యందు ఉన్నప్పటికిని వీరి యందు తాను ప్రత్యేకముగా స్నేహము ఉదాసీనములను చూపింపక వారివారి స్వభావ యోగ్యతానుసారముగా సుఖదుఃఖముల నొసగి తాను మాత్రము దేనిని అనుభవింపక నిత్య తృప్తుడై యుండును.

ఎల్లికేళిద రెల్లి నోడిద
రెల్లి బేడిద రెల్లినీడిద
రెల్లి ఓడిద రెల్లి ఆడిద రల్లి ఇరుతిహను।
బల్లిదరిగతి బల్లిదను సరి
యిల్ల ఇవగాఫల్లి నోడలు
ఖుల్లమానవరొల్ల నప్రతిమల్ల జగకెల్ల॥ 21

చ॥ ఎచటను విన్న జూచిన మఱెచ్చటఁ గోరిన నెక్కడిచ్చినన్
ఎచట బిరానబాఱిన నడెచ్చట నాడిన నందునుండు స
ర్వ చరుడనంగ బల్లిదుల బల్లిదుడౌ సరిసాటి లేదు స
త్ప్రచురుడు దుష్టశత్రుడు నపార పరాక్రముడిజ్జగంబునన్

తా॥ కర్మేంద్రియముల యొక్కయు జ్ఞానేంద్రియముల యొక్కయు సర్వవ్యాపారముల యందు పరమాత్ముడు ఆయా యింద్రియ గోళకములందును / ఆయా యింద్రియము లందును యింద్రియాభిమాని దేవతల యందును యింద్రియ వ్యాపారములు జరుగు పదార్థముల యందును ఉండువని అనుసంధానము చేయు వారిని తన వారిని గౌరవించును. వీరే అంతరంగ భక్తులు. ప్రతిష్ఠ సంపాదించు నిమిత్తముగా పరమాత్ముని యందు భక్తివిశ్వాసాదులు చేసిన సరిసమానస్థులు శ్రేష్ఠులైనవారు ఎచట చూచినను లేరు. ఈ పరమాత్ముడొక్కడే సర్వవ్యాపకుడై యుండు నేకాని వేరొకరికి ఈ సామర్థ్యము లేదు.

మూ. తప్తలోహవు నోళ్ప జనరిగె
సప్త జిహ్వన తెరది తోర్పదు
లుప్త పావక లోహకాంబుదు పూర్వదోసాది।
సప్తవాహన నిఖిళ జనరొళు
వ్యాప్త నాదుదరింద సర్వరు
అప్తరాగిహరెల్ల కాలది హితవ కైకొండు॥ 22

ఉ॥ లోహము తప్తమైకడు వెలుంగుచునుండిన నగ్నియోయనన్
మోహమొసంగు నాయనలముం గనకుండినఁ బూర్వమట్లుగన్
దేహుల సప్తవాహనుడు దేజరిలం దను తత్త్వదేవతా
వ్యూహము జీవుడున్వెలయుచుందురు సంతతమున్ హితార్థులై

తా॥ పరమాత్ముడు లోహము నందలి అగ్ని వలె దేహ మందు వ్యాప్తుడై యుండుకాలము వఱకు దేహమునందలి తత్త్వాభిమాని దేవతలు దేహము నుండి కాదగుసుఖ దుఃఖములను స్వీకరించి తమ పాలు తాము తీసుకొని పరమాత్ముని పాలు అతనికి సమర్పణము చేయుదురు. దేహము నందలి జీవుడు పరమాత్ముడు తత్త్వాభిమాని దేవతలు వెళ్ళి పోయినను లోహము నందున్న అగ్ని ఆరిపోయినచో తేజోహీనముగా పూర్వమట్లు ఎట్లు కన్పడునో ఆ ప్రకారముగా దేహము తేజో హీనమై నిశ్చేష్టిత మగును. ఈ ప్రకారముగా నిశ్చేష్టితమైనప్పటికిని పరమాత్ముడొక్కడే అంతర్యామియై యుండునేకాని తక్కిన తత్త్వాభిమాన దేవతలు జీవియు ఉండజాలరు.

అగ్నికి సప్తజిహ్వాలేవనగా

| జిహ్వాల పేర్లు | వర్ణము | త్రివిధస్వీకార విధానము | | |
|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 |
| 1. కాలీ | హిరణ్యము | ఔపాసనము | అగ్నిహోత్రము | అగ్నిష్టోమము |
| 2. కరాలీ | కనకము | వైశ్వదేవము | దర్శపౌర్ణిమ అమావాస్య | అత్యగ్నిష్టోమము |
| 3. మనోజవా | రక్తము | స్థాలీపాకము | పిండపితృ యజ్ఞము | ఉద్యము |
| 4. సులోహితా | కృష్ణము | అష్టకము | పశుబంధము | షోడశము |
| 5. సుధూమ్రవర్ణా | సుప్రభా | మాసశ్రాద్ధము | అగ్రయణము | వాజపేయము |
| 6. స్ఫులింగినీ | అతిరక్తము | ఈశానబలి | చాతుర్మాస్యము | అతిరాత్రము |
| 7. విశ్వరుచి | బహురూపి | సర్వబలి | సౌత్రామణి | అప్తోర్యామము |

మూ. వారిదను మళెగెరెయ బెళదిహ
భూరుహంగళ చిత్ర ఫలరస
బేరె బేరిప్పంతె బహువిధ జీవరాశిగిద్దు।
మారమణన వరపర యోగ్యతె
మీరదలె గుణకర్మ గనను
సార నుడిసువ దేవనిగె వైషమ్య వెల్లిహుదా॥ 23

ఉ॥ భూరి ఘనంబు వృష్టినిడ భూరుహముల్ ధర సద్రసంబులన్
సారతరంబుగా నిడిన చందమునం బహు జీవకోటులన్
మారమణుండు రాజిలుచు మర్త్యుల యోగ్యత మీఱకుండఁగా
వారిగుణానుసార కృతి వైఖరుల న్నడిపించు సాక్షియై.

తా॥ పరమాత్ముడు అంతఃకరణ రూపమైన జలమునకు సమానుడు. జీవులు బీజములకు సమానులు. జలస్పర్శ లేకున్న బీజములకు ఫలించుట యనునది లేదు. ఆకారణముచే నీటి యందు అంతఃకరణమున్నది. ఈ అంతఃకరణము సమస్త బీజముల యందు సరిసమానముగా నున్నది. అట్లు పరమాత్మునకు అంతఃకరణము జీవులయందు సరిసమానముగా నున్నది. అయినను నీరు ఆయాబీజముల సంబంధమైనచో ఆయాబీజములను ఎట్లు వ్యక్తము చేయునో ఆప్రకారముగా వానివాని గుణములను పరమాత్ముడు జీవుల సంబంధముచే వైషమ్యము లేకయే ఆయాజీవుల గుణకర్మానుసారము భిన్న భిన్నములైన ఫలముల నిచ్చును. మేఘము తన ఉదకము నుండి వానివాని స్వరూప యోగ్యతానుసారము బీజముల స్వభావములను తెలుపును. దోషము బీజములందున్నది. సురసోపేతమైన పదార్థములు కలుషితమైన జిహ్వాకు చేదుగా తోచును. దోషము జిహ్వాదే కాని పదార్థము నకు సంబంధము లేదు.

మూ. వారి జాప్తన కిరణ మణిగళ
సేరి తత్తద్వర్ణగళను వి
కారగైసదె నోళ్పరిగె కంగొళిసువందదలి।
మారమణ లోకత్రయదొళిహ
మూరు విధ జీవరాశిగిద్దు వి
హార మాడువనవర యోగ్యతె కర్మ వను సరిసి॥ 24

ఉ॥ వారిజమిత్రు కాంతులవి వారకచేరి మణిత్రయంబునన్
శ్రీరమణీయ వర్ణముల జెల్వొనరం బ్రసరింపఁ జేయు నా
తీరున మాధవుండు జగతి త్రయమందుఁ ద్రిజీవుల న్మోదం
బార విహారముల్సలుపు నాగలి యోగ్యత కర్మలట్లుగన్.

తా॥ ఒకే ఉదకము ఆయా బీజముల స్వభావ గుణములను వ్యక్తము చేయు రీతిగా సూర్యుని కిరణములు ఉదకము రీతిగా నిర్దోషమైనది. అయినను వివిధ వర్ణ యుక్తములైన మణులకు సంబంధము కాకయే ఆయా మణుల స్వరూప యోగ్యతను వ్యక్తము చేయునట్లు పరమాత్ముడు నిర్దోషియైన కారణముచే సత్త్వరజస్తమోగుణముల జీవుల యందు వ్యాప్తుడై వారి వారి స్వరూప యోగ్యతలను వ్యక్తము చేసి వారివారి యోగ్యతానుసారముగా ఫలముల నిచ్చువాడగును.

మూ. జలవనపహరిసువ ఘళిగె బ
ట్టలనుళిదు జై ఘంటె కైపిడి
దెళెదు హొడెవందదలి సంతత కర్త తానాగి।
హలధరానుజ పుణ్య పాపద
ఫల గళను దేవా సురర గణ
దొళు విభాగవ మాడి ఉణిసుత సాక్షియాగిప్ప॥ 25

మ॥ జల మాకర్షణ మాచరింపఁ దగు నాస్థాలిం దగంగాచి చే
తులతోడం జయగంటఁ బట్టుకొని యెంతోశక్తి వ్రోగించు న
ట్లలరన్ శ్రీహరి కర్తతానగుచుఁ బుణ్యంబుల్ మహాపాపముల్
ఫలముల్ భాగములం భుజింపనిడు దేవశ్రేణి దైత్యాలికిన్.

తా॥ ఈ విధముగా పరమాత్ముడు సమస్త జీవులందు కర్మసాక్షిగా నుండి కర్మ ఫలములను మూడు విధములుగా విభజించి దేహమునందున్న జీవునకు తత్త్వాభిమాన దేవతలకు అట్లే దైత్యులకు యోగ్య తానుసారముగా జీవునిది జీవున కొసగి దేవతలకు పాత్రకు సమానమైన సుఖమును దైత్యులకు జయగంటకు సదృశమైన దుఃఖమును ఇచ్చి కర్మ సాక్షియై యుండి సంరక్షణము చేయును.

1. ఉదక యుక్తమైన పాత్రయే పరమాత్ముడు.
2. అందలి ఉదకమే పరమాత్ముని గుణములు.
3. పాత్రయే జీవుడు
4. పాత్రకున్న రంధ్రమే జీవుడైన తాను ఛిద్రముతో కూడిన అపూర్ణుడను జ్ఞానము.
5. ఆ ఛిద్రము నుండి ఉదక స్వీకార మేది యున్నదో అదే పరమాత్ముని అసదృశమైన గుణముల ఉపాసనారూపమైన పానము.
6. పాత్రమునుగుట యనునదే బాహ్య జ్ఞాన శూన్య మైన వాడై గుణోదక ముందు మునుగుట అంతర్లక్షణమగుట.
7. కాలము అన్యులకు చూపింప జేయుట అనునదే కాలనామక పరమాత్ముని గుణములను అన్యులైన భగవద్భక్తులకు తెలియజేయుట.

మూ. పొంది కొండిహ సర్వరొళు సం
బంధ వాగదె సకల కర్మవ
రందదలి తా మాడి మాడిసి తత్ఫలగళుణదె।
కుందదణు మహత్తెనిప ఘట
మందిరది సర్వత్ర తుంబిహ
బాంధవద తెరనంతె ఇరు తిప్పను రమారమణ॥ 26

ఉ॥ జీవులతో వెలుంగు హరి జీవులొనర్చెడు నట్టి సర్వ క
ర్మావలి బంధ వర్జితుడునై యొనరింపఁగఁడానొనర్చి నా
నా విధమౌ ఫలంబుల జనంబులకున్ భుజియింప నిచ్చి తా
నే విషయుంబులంటక స్వకీయ సఖుండగు నాకసంబనన్.

తా॥ ఘటమునకు సమానులైన దేహములు దేహములందున్న పరమాత్ముడు పరమాత్మునకు ఉపమానమైన ఆకాశమునకు లేపము లేదనియు ఈ ప్రకారముగా పరమాత్మునకు ఛేద భేదాదులు లేకయు తన స్వాభ్య రసములు తానుభుజించుచు సర్వత్ర నిండియుండును.

మూ. కాద కబ్బిణ హిడిదు బడియులు
వేదనెయు లోహగళిగల్లదె
అదుదేనై అనళగా వ్యథె ఏనుమాడిదరు।

అది దేవను సర్వ జీవర
కాదు కొండిహ నొళహొరగె దుః
ఖాదిగళు సంబంధ వాగు వదేనా? చిన్మయగె॥ 27

ఉ॥ శ్రీ చెలువుండు తాసకల జీవుల నెప్పుడు బ్రోచులోవెలిన్
గాచుచునుండు నాహరికిఁ గల్గునె? యారయ దుఃఖ బంధముల్
గాచిన లోహఖండమును గట్టిగ సమ్మెటఁ గొట్ట వహ్నికిం
జూచిన బాధ యేర్పడునె? క్ష్మోణిని లోహము సెందకుండునే?

తా॥ క్రాగిన యినుమును బట్టి సమ్మెటతో గొట్టినచో దానివలన గలుగు బాధ వికారము లోహమునందున్న అగ్నికి ఎట్లు సంబంధింపక లోహమును వికారమొందించునో అట్లు దేహమున అంతర్యామియైన పరమాత్మునకు జీవుని కర్మ ఫలముచే గలుగు సుఖదుఃఖాదులు జీవునకు సంబంధించునే కాని పరమాత్మునకు సంబంధింపదు. ఇట్టి నిరంజన సంబంధమైన సుఖదుఃఖాదులు సంబంధము కాకయే స్వాఖ్య సుఖ సంబంధము చే పరిపూర్ణుడై యున్నాడు.

మూ. మళల మనెగళ మాడి మక్కళు
కెలవు కాలదలాడి మోదది
తుళిదు కెడిసువ తెరది లకుమీరమణ లోకగళ
హలవు బగెయలి నిర్మిసువ ని
శ్చలను తానాగిద్దు సలహువ
ఎలరుణియవోల్ నుంగువగె ఎల్లిహుదొ సుఖదుఃఖ॥ 28

చ॥ నిసుగులు వీధినాడుచును నెమ్మదిఁ దీర్చిన బొమ్మరిండ్ల సం
తసమున నిండ్లకేగుతఱిఁ దద్గృహముల్ చెడఁగొట్టి వెళ్ళు న
ట్లసమ పరాక్రముండు హరి యబ్జభవాండము దాసృజించి కాఁ
చు సతతమున్మదంబున నశోభతఁ గూల్చును దుఃఖమున్నదే?

తా॥ ఆటలాడుట కొఱకు బిడ్డలు అనాయాసముగా ఇసుకతో గాని మట్టితో గాని చిన్న చిన్న యిండ్లను కట్టుకొని కొంతకాలము ఆడి ముగిసిన తరువాత ఆ యిండ్లను నాశనము చేయునట్లు పరమాత్ముడు తన యిచ్ఛా మాత్రమున అనాయాసముగా జగత్తును సృష్టించి సంహారము గావించి సర్పము ఎట్లు గాలిని అనాయాసముగా కడుపులోపలికి పీల్చుకొనునో అట్లు పరమాత్ముడు

జగత్తును తన ఉదరము నందుంచుకొనును. ఎప్పుడనగా? (ప్రళయకాలము నందుంచుకొనును) ఇట్టి పరమాత్మునకు సుఖ దుఃఖాదులు లేవు గదా? ఎప్పటికిని లేవు.

మూ. వేషభాష గళింద జనర ప్ర
మోషగైసువ నటపురుషనోళ్
దోషదూరను లోక దొళు బహురూప మాతినలి।
తోషి సువనవరవర మన దభి
లాషెగళు పూర్తై సుతనుదిన
పోషిసువ పూతాత్మ పూర్ణానంద జ్ఞాన మయ॥ 29

ఉ॥ వేసము బాసలంజనులు వింతవహింపఁగఁ జేసి నర్తకుం
డాసల మోదమిచ్చునటు లాహరి దోషవిదూరకుండిలం
భాసిలు మార్దవంపు బహు భాషల రూపము లొప్పఁదృప్తులం
జేసి సుఖింపఁజేయు జనచిత్తములందలి కోర్కెలట్లుగన్.

తా॥ నటపురుషుడైన వాడు అన్యములైన వేషములను దాల్చినప్పటికిని బహిర్వేషముచే తన నైజ దేహ వికారమును పొందక ఆయావేషమునకు అనుగుణమైన మాటలాడుచు జనులకు సంతోషము కొందించు రీతిగా పరమాత్ముడు వివిధమైన స్థావర జంగమాత్మకమైన ప్రాణులందరును నిర్లిప్తుడైన వాడై వారివారి బాహ్య కర్మానుసారముగా భాగ్యము దౌర్భాగ్యము అన్నోదకాదుల నిచ్చి సుఖదుఃఖాదులను అనుభవమునకు తెచ్చి యిచ్చును. స్వరూప కర్మములు వ్యత్యాసమగుటచే లింగదేహ భంగానంతరము త్రివిధ జీవులకు మూడు విధములైన భోగము లిచ్చును.

మూ. అధమమానవనోర్వ మంత్రౌ
షధగళను తానరితు పావక
ఉదక గళ సంబంధ విల్లదె ఇప్పనదరొళగె।
పదుమజాండోదరను సర్వర
హృదయదొళగిరె కాలగుణ క
ర్మద కలుష సంబంధవాగువదే నిరంజనగె॥ 30

చ॥ అధమ మనుష్యుఁడొక్కఁడు మహౌషధ మంత్రములం గ్రహించి తా
బుధుఁడను భావముందెలుప భూరి జలంబున వహ్నియందుఁ ద
ద్విధమగు బంధమున్ వదలి వేవిలసిల్లు; నజాండ కుక్షి చ
క్ర ధరుఁడు. హృన్నివాసునకుఁ గల్గునె? కాల గుణాది కర్మముల్.

తా॥ అల్ప మనుష్యుడు క్షుద్రమంత్రములను, ఔషధములను తెలిసిన వాడై ప్రత్యక్షముగా అగ్ని యందును ఉదకములందును ప్రవేశించి వాని నైజ స్వభావ గుణములచే వికారమును పొందకయే నిర్లిప్తుడై వెలుపలికి వచ్చునపుడు ఇట్టి అనేక మంత్రములు ఔషధములను తత్త్వాభిమానదేవతలను స్థావర జంగమ జీవులచే నిండిన అనంతమైన బ్రహ్మాండములను సృష్టించి అందులో నుండి వాని వాని సామర్థ్యములను తన అధీనము చేసుకొని వ్యక్తము చేయుచుండును. తన ఉదరము నందు ధరించిన జీవుల ఆయుః పరిమితి కర్మఫలములు తజ్జనితమైన విషయ కర్మములచే పుట్టు దోషములకు లింబమైయున్నను మంత్రౌషధములను తెలిసిన ఆ మనుష్యుడు అగ్ని ఉదకముల యందు సంబంధ పడక యెట్లున్నాడో అట్లు గుణ పరిపూర్ణుడైన పరమాత్ముడు జీవుల యొక్క దోషములతో సంబంధము లేక యున్నాడు.

మూ. ఒందు గుణదొళనంత గుణగళు
ఒందు రూపదొళిహవు లోకగ
ళొందురూపది ధరిసి తద్గత పదార్థదొళ హొరగె।
బాందళదవోలిద్దు బహు హెస
రింద కరెసుత పూర్ణ జ్ఞానా
నందమయ పరిపరి విహారవ మాడి మాడి సువ॥ 31

ఉ॥ ఒక్క గుణంబునందు సుగుణోన్నతిఁ జూపు ననంతమౌ గుణం
బొక్క సురూపమున్నెలయు నొప్పుగ లోకము నొక్క రూపముం
జక్కఁగఁ దాల్చి లో వెలిని సర్వ పదార్థము లందు నాకసం
బొక్కొ! యనంగ దావెలుఁగుచుండి చరించును బ్రేరకుండునై.

తా॥ భోజనము సేయదగిన ఒక పదార్థము నందు షడ్రసములు చేరి ఒక ద్రవ పదార్థముగా ఒక పదార్థము ఎంత ఎట్లు పిలువ బడునో అట్లే పరమాత్ముడు అనంతా నంతమైన అపరిచ్ఛిన్న గుణములు అపరిచ్ఛిన్నములుగాను ఒక రూప మందు అనంతానంతమైన రూపములు పదార్థమునకు అందలి ఆహ్లాది

రసములకు ఎట్లు అవియోగమో ఆ ప్రకారముగా ఒక రూప మందు అపరిచ్ఛిన్నమైన విలక్షణమైన అనేక రూపములు ధరించిన వాడై స్థావర జంగమాత్మకమైన పదార్థముల లోపలను వెలుపలను ఆకాశము వలెనే నిర్లిప్తుడై యుండి ఆయా పదార్థముల నామములైన వానిచే పిలువ బడుచు ఆయా అధిష్ఠానముల అపూర్ణము అల్పానందకరములై యున్నను తాను పూర్ణానంద స్వరూపుడై వారి వారి స్వరూప స్వభావ కర్మమును అనుసరించి కర్మ సాంకేతమైన ఆటలు తాను ఆడి వారిచే ఆడించును.

మూ. ఎల్లరొళగిలానిప్ప తన్నొళ
గెల్లరను ధరిసిహను అప్రతి
మల్ల మన్మథ జనక జగదాద్యంత మధ్యగళ
బల్ల బహు గుణ భరిత దానవ
దల్లణ జగన్నాథ విట్ఠల
సొల్ల లాలిసి స్తంభ దిందలి బంద భకుతనిగె|| 32

ఉ|| అందఱి యందుఁ దావెలుఁగు నందఱినిం దనలో ధరించు సం
క్రందన వంద్యుఁడౌ బహుపరాక్రమ వంతుఁడు సద్గుణాబ్ధియా
నందముతోడ దైత్యవిభునందనుఁడుం దను బిల్వ కంబమున్
విందుగ నుండి వచ్చెఁగద వేణువినోదన విట్ఠలుండొగిన్.

తా||. పరమాత్ముడు తాను రమాసమేతుడై సమస్త ప్రాణుల యొక్క స్వరూప మందును స్థూలదేహ మందును తాత్త్విక దేవతా సమేతుడై యుండును. తన యందు అందఱిని ధరించి యున్నాడు. మన్మథ జనకుడైన భగవంతుడు బహు పరాక్రమ వంతుడు. దయా సముద్రుడు. అమలమైన భక్తితో ప్రహ్లాదుడు పిలువగా స్తంభము నుండి వచ్చి నరసింహ రూపముతో రక్షించినవాడు. అట్టి శ్రీ వేణు వినోద విట్ఠలాభిన్నుడైన జగన్నాథ విట్ఠలుడు భక్తులను రక్షించుగాక.

ఇది శ్రీహరికథామృతసారమందు వ్యాప్తిసంధి.

క్రోడ ఎప్పత్తెరడు సావిర
నాడిగత దేవతి గళొళగి
ద్దాడు తానందాత్మ చరిసువ లోకదొళు తాను॥ 2

మ॥ తలరం గూడువిధంపు లింగమునకుద్యత్ షోడశాత్మాభిదం
బుల నొప్పారు రసంబులన్ విభజనంబుంజేసి యాషోడశీ
కళలం జేర్చుచు దేహనాడితతిఁ జక్కన్వెల్గు నాదేవతా
త్మలలోనం జరి యించు సంతసమునం దైత్యారి యెల్లప్పుడున్

తా॥ జడ ప్రకృతి ఉపాదానముచే నిర్మితమైన గూడు వలె నున్న లింగదేహమునకు షోడశ కళాత్మకమైన భోజనము చేయదగిన పంచభూతాత్మక ద్రవ్యములందలి సంసృష్ట రసములను విభాగము చేసి ఆ పదునారు కళలకే యే రసములో ఆయా రసములను అనుభవింప జేయుచు అంతర్యామియైన వరాహరూపి పరమాత్ముడు డెబ్బది రెండువేల నాడుల యందున్న దేవతల కూడ సంచారము చేయుచు వ్యాప్తుడై ఆనంద స్వరూపుడై యున్నాడు.

మూ. వారివాచ్యను వారియొళగి
ద్దారు రసవెందెనిసి మూవ
త్తారుసావిర స్త్రీపురుష నాడియొళ తద్రూప।
ధారకను తానాగి సర్వశ
రీరగళలి అహశ్చరాత్రి వి
హారమాళ్పను బృహతియెంబ సునామదింకరెసి॥ 3

ఉ॥ వారి సమాఖ్యుఁడైనహరి వారివసించి రసంబులారునై
యారయ నాడికాతతుల యందలరారు తదీయరూపుడై
ధారకుఁడౌచు సర్వతను తత్త్వకుఁడై నిరతంబుఁ దాను సం
చార మొనర్చెడుం బృహతి నామకుఁడై వెలుగొందువాడునై

తా॥ పరమాత్ముడు నీళ్ళ యందు ఆరు రసములని పిలువబడి అందటి శరీరముల యందున్నట్టి ముప్పదియారువేల స్త్రీ నాడుల యందును ముప్పదియారువేల పురుష నాడుల యందును ఆయానామరూపములతో ఆయా ఆకారములతో బృహతి నామకుడై యుండి సంచారము చేయుచు దేహమును సంరక్షించును.

మూ. ఆరురస సత్వాది భేదది
ఆరుమూరాగిహవు సారా
సార నీతాప్రమర ఖండాఖండ విత్ప్రమర।
ఈరధిక ఎప్పత్తుసావిర
మూరమూరన రసాఖ్య రూప శ
రీరదలి భోజ్య ను పదార్థది తిళిదు భుంజిపుదు॥ 4

తే.గీ. రసములయ్యావి సత్వాది ప్రకటభేద
ములను నష్టాదశంబులై యులర సార
సార సీతా ప్రమర ఖండ మటులఖండ
విత్ప్రమర విధానంబులఁ జెలఁగుచుండు.

క॥ ఓలిండెబ్బది రెండగు
వేలస్వాలసిల్లు నాడివితతి వెలయునా
శ్రీలలనేశుడు రస రూ
పాలం దనువందుఁ దినఁగ వలయును భుక్తుల్

తా॥ ప్రతి పదార్థము లందు పదునారు కళలకు ఉపచయము కాదగిన రస భేదములు డెబ్బది రెండువేల నాడులకు అన్ని రస భేదములుండునట్లు అవి వానికి చేరును. దేహము నందలి దేవతలకు దైత్యులకు నిత్య సంసారులకు జీవునకు చేరునట్టి క్రమమను తెలియవలయును. సాత్త్వికులకు సత్త్వరసము రాజసులకు రజోరసము తామసులకు తామసరసము ఈ ప్రకారము రసములందును దేహము నందును అభిమానులై యున్నారు. వారి వారికి ఆయా రసములు చేరగలవు అని అనుసంధానముచే భోజనము చేయదగినది.

వి. ఆరు రసములు: మధురము - ఆమ్లము - లవణము - కటు - కషాయము - తిక్తము.

మూ. క్షీర గత రస రూపగళు ము
న్నూరు ప్యాలైవత్తు నాలకు
చారు ఘృతగత రూప గళు ఇప్పత్త రొంబత్తు।
సార గుడ దొళ గైదు సావిర
నూర ఒందు సురూప ద్విసహ
స్రారెరడు శత పంచవింశతి రూప ఫలగళలి॥ 5

శా॥ క్షీరంబున్ రసరూపముల్ ద్విశతిపైఁ జెల్వొందుఁగా నేబదిం
పారున్నాల్గు ఘృతంబునం ద్విదశమూపైఁ దొమ్మిదా శారికిన్
సారంబౌ గుడమందుఁ బండ్లను సహస్రా లైదు నూటొక్కటిన్
మీఱున్ వేలునురెండు నూర్లెనిమిదిన్ మీదిర్వదేనై తగన్

తా॥ ఒక ఫలము కావలసినచో మొదట లేతపీచు కాయిగా నుండు కాల మందు ఏర్పడు రసములు ఏవియున్నవో వానికి క్షీర రసమని సాంకేతము. దీనికి ప్రతి నామము 'విశద' అని పేరు. ఈ రసము నందు భగవద్రూపములు 354 (వి4 - శ5 - ద3) (కుడి నుండి ఎడమకు లెక్క) నేతి యందు 29 రూపములు (స్థి9 - ర2) గుడము నందు పరమాత్ముని రూపములు నిరహర (ని5 - ర2 - హ - 4 - ర 2) 2425. ఈ నాల్గింటి యందును మొత్తము రూపములు 7200 - అగును.

మూ. విశద స్థిర తీక్ష్ణవు నిరహర
రస గళొళు మూరైదు సావిర
త్రిశతనవ రూప గళ చింతిసి భుంజిపుదు విషయ।
శ్వసన తత్త్వేశ రొళ గిద్దీ
పెసరి నిందలి కరెసు పను ధే
నిసి దరీ పరి మనకె పొళెవను బల్ల విబుధరిగె॥ 6

తే.గీ. తెలియ విశదయు స్థిర యును తీక్ష్ణములును
నిరహరాఖ్యల రసముల హరి వెలుంగు
నెనిమిదియు మూడు సున్నపై నెసగు నారు
సంఖ్యలొ రూపము లెఱింగి చనుభుజింప

క॥ మరుతాది తత్త్వపతి స
త్పురలందీ పేర్ల వెలయు సురపతినుతునిం
బరిపూర్ణమతి భజించిన
పరవిబుధుల మదివసించుఁ బద్మేశుండున్.

తా॥ విశద స్థిర తీక్ష్ణ నిరహర అను రసములందు మొత్తము 8309 పరమాత్ముని రూపములను చక్కగా తెలిసి భుజింపవలయును. పరమాత్ముడాయా పేర్లతో దేహాంతర్యామియై వాయుదేవుని యందును తత్త్వాభిమాన దేవతల యందు నుండిన వాడై పిలువబడుచున్నాడు.

వి. 1. విశద - విశదరస ప్రతి నామము క్షీరము - 354 రూపములు
2. స్థిర - స్థిర రస ప్రతి నామము ఘృతము - 29 రూపములు
3. తీక్ష్ణ - ఈ రస ప్రతి నామము గుడరసము - 5101 రూపములు
4. నిరహార- ఈ రస ప్రతినామము ఫలరసము - 2825 రూపములు

పై రసముల యందు మొత్తము 8309 రూపములు

కపిల నరహరి భార్గవత్రయ
వపుష నేత్రది నాసి కాస్యది
శఫరనామక జిహ్వెయలి దంతదలి హంసాఖ్య।
త్రిపదిపాద్య హయాస్య వాచ్యదొ
అపరిమిత సుఖ పూర్ణ సంతత
కృపణరొళగిద్దవరవర రస స్వీకరిసి కొడువ॥ 7

తే.గీ. కపిల నరహరి భార్గవాఖ్యుల వసించు
కాయమున నేత్రముల నాసికలను మఱియుఁ
దనరు శఫరుండు నాల్కపై దంతములను
హంసనాముండు వెలుగొందు నని తెలియుము.

తే.గీ. త్రిపద పాద్య హయాస్యుఁడౌ దేవవిభుఁడు
ముఖము నందునఁ బరిపూర్ణ సుఖుఁడు సతము
రహి వెలుంగుచుఁ గృపణుల రసములనొగి
స్వీకరించి యొసంగును చిత్తమలర

తా॥ అధికారులు దేనిని భుజించినను పైన చెప్పిన విధముగా ఆయా యింద్రియములందలి భగవద్రూపములను వ్యాపారములను అనుసంధాన పూర్వకముగా భోజనము చేయవలయును. అదే ప్రకారము అన్యులకు భోజనము చేయించినను ఈ అనుసంధానమును చేయవలయును.

వి. 'కం సుఖం పిబతీత్యానందాను భవాత్ లాత్సర్వాదా నాచ్చ' కపిలః అని అర్థము.

మూ. నిరుప మానందాత్మ హరి సం
కరుషణ ప్రద్యుమ్నరూపది
ఇరుతిహను భోక్తృ గళొళగె తచ్ఛక్తిదను యెనిసి।
కరెసువను నారాయణనిరు
ద్ధెరడునామది భోజ్యవస్తుగ
నిరుత తర్పకనాగి తృప్తియనీవ చేతనకె॥ 8

తే.గీ. నిరుపమానంద నిలయుఁడౌ సురనుతుండు
భోక్తృ లందు సంకర్షణ మూర్తియగుచు
నలరు ప్రద్యుమ్న నామకుండగుచు వారి
యందుఁ దచ్ఛక్తి దుండన ననవరతము.

క॥ మునినుతుఁడగు నారాయణుఁ
డనిరుద్ధుఁడనంగ భోజ్యమగు వస్తువులం
దనయంబు వెలయు వాడై
తనియించును జేతనములఁ దర్పకుఁడగుచున్.

తా॥ సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్ముడు త్రివిధ జీవులు స్వతంత్రముగా భోజనాది క్రియాశక్తి శూన్యులగుట వలన మనస్సు నందు హరి రూపకుడైన వాడై జ్ఞానేంద్రియములందు సంకర్షణ రూపుడైన వాడై కర్మేంద్రియములందు ప్రద్యుమ్న రూపుడైన వాడై త్రివిధ జీవుల యొక్క యింద్రియము లందుండి జ్ఞాన శక్తియనుచును కర్మశక్తియనుచును ఇచ్ఛాశక్తియనుచును పిలువబడి ఆయా యింద్రియముల యోగ్యతా తార తమ్యానుసారముగా భోజ్యములైన అన్నము నందు నారాయణ రూపము చేతను పానమునకు యోగ్యమైన ఉదక మందు అనిరుద్ధ రూపముచేతను తర్పక శబ్ద వాచ్యుడై జీవుల యొక్క జిహ్వాదం తాదుల యందుండి భోజనము చేయించి క్షుత్పిపాసాదులను పోగొట్టి తృప్తి పొందించును. ఎట్లనగా? దేహము నందలి తత్త్వేశులకు ఆత్మ ప్రదర్శనము చేతను, వ్యాప్తుడైన జీవునకు చూచి సంతోషము చేతను దేహమునకు ఉపచయ రూపము చేతను జఠరాగ్నికి అగ్ని ప్రజ్వలన రహితాదుల చేతను తృప్తి పొందించును.

ము. వాసుదేవను ఒళహొరగె అవ
కాశకొడువ నభస్థనాగి ర
మాసమేత విహారమాళ్పను పంచరూపదలి।
ఆసరోరుహ సంభవభవ
వాసవాద్యమరాది చేతన
రాశియొళగిహ నెందు అరితవనె కోవిదను॥ 9

చ॥ వెలుపల లోపలన్వెలసి విశ్వము యుండగు వాసుదేవుఁడున్
లలినవకాశ మిచ్చుఁదన నాతినిఁగూడి నభస్థుడై మనం
బలరగఁ బంచరూపియు విహార మొనర్చు విరించి శంకరా
దుల మఱి వాసవాది సుర తోయమునందెఱియుం బుధుండగున్.

తా॥ వాసుదేవ రూపుడైన పరమాత్ముడు మాయాదేవీ సహితుడై కంఠ మందలి ఆకాశమునందున్నవాడై భోజనము చేసిన ద్రవ్యములు ఉదర ప్రదేశమునకు లోపల ప్రవేశమైదిగను ఉదర మందలి ఆకాశ మందు నుండి భోజనాదులకు అవకాశమిచ్చును. గుణ పూర్ణుడైన ఒక్క పరమాత్ముడే తన అనేకమైన భిన్నాంశ రూపములతో ప్రాణుల సంరక్షణార్థము బ్రహ్మాది ఋజువులు, రుద్రాది శతస్థ దేవతాంతము, కర్మజ పుష్కరాంతము, ఆజానజులు దేవ గంధర్వాంతము, మానుష్యాది తృణాంతముగా ఈ అయిదు విధములైన జీవుల యందు సంకర్షణాది ఆరు రూపములతో విహరించును.

ము. వాసుదేవను అన్న దొళు నా
నా సుభక్ష్యది సంకరుషణ కృ
తీశ పరమాన్నదొళు ఘృత దొళగిప్ప ననిరుద్ధ।
ఆసుపర్ణాం సగను సూపది
వాస వానుజ శాక దొళు మూ
లేశ. నారాయణను సర్వత్రదలి నెలనిహను॥ 10

తే.గీ. వాసుదేవుఁడన్నంబున నాసుభక్ష్య
రాశి సంకర్షణుండును రహిఁగృతీశుఁ
డలరు పరమాన్నమున ఘృత మందుఁజూడ
నమరు ననిరుద్ధుఁడా సుపర్ణాంసగుండు

క॥ సూపంబున వెలుఁగొందును
శ్రీపతి యింద్రానుజుండు క్షితి శాకముఁ౦
దేపుగ నారాయణుఁడుం
దోపఁగలండఖిల నియమనుండనఁ బడుచున్.

తా॥ అన్నము నందు వాసుదేవుడును, భక్ష్యముల యందు సంకర్షణుండును, పరమాన్నము నందు ప్రద్యుమ్నుడును, ఘృత మందు అనిరుద్ధుడును సూపము నందు ఉపేంద్రుడును, శాకము లందు నారాయణుండును ప్రకాశించును.

మూ. అగణితాత్మ సుభోజన పదా
ర్థగళ ఒళగె అఖండవాదాం
దగళినొళనం తాంశదిందలి ఖండనెందెనిసి।
జగది జీవర తృప్తి పడి సువ
స్వగత భేద వివర్జితన ఇ
ర్భగెయ రూపవనరితు భుంజిసి అర్పిసువనడిగె॥ 11

చ॥ అగణిత మూర్తి భోజ్యముల యందలరారు నఖండ రూపియై
జగతి ననంతరూపములఁ జక్కఁగ ఖండ పదార్థరాశిలో
స్వగత విభేదవర్జితుఁడు సంతతముందనియించు జీవులన్
సుగుణత రెండురూపములఁ జూచి భుజించి యొసంగు శౌరికిన్.

తా॥ పరమాత్ముడు సాకార సావయవుడై అనంతానంతము లైన ఖండా ఖండ రూపములతో జీవుడు భోజనము సేయ దగిన పదార్థముల యందును, పాంచ భౌతిక స్థూల దేహము నందును పూర్వోక్త ప్రకారముగా నుండి భోజనము ద్వార స్వాఖ్యమైన రసమును తాను స్వీకరించి వారి వారి యోగ్యతానుసారముగా తృప్తి పొందించును. ఈ ప్రకారము పదార్థములందున్న ఖండాఖండ రూపమును, దేహమునందున్న ఖండరూపమును అఖండరూపమును ప్రకాశించునట్లు వెలుగుచుండును. ఆయా రూపములను భేదము లేదనియు పదార్థములను భోజనము చేసి పరమాత్ముని పాదములందు సమర్పించు వాడవగుము.

మూ. ఈ పరియలరితుంబ నరని
త్యోపవాసి నిరామయను ని
ష్పాపి నిత్య మహాత్మయజ్ఞగళాచరిసిదవను।
పోపదిప్పుదు బప్పుదెల్లర
మాపతిగధిష్ఠానవెన్ను కృ
పాపయోనిధి మాతనాలిసుతిహ జననియుంతె॥ 12

సీ॥ ఈరీతి నెఱిగి భుజించిన నరుడు ని
త్యోపవాసియనంగ నొప్పుచుండు
పలు నిరామయుడు నిష్పాపియై పొందును
జన్నంబులొనరించు సత్ఫలంబు
మఱియు నహంకార మమకారములవీడి
యస్వతంత్రుడు జీవియనుచు దెలియు
సర్వస్వతంత్రుండు సర్వేశ్వరుండను
సుజ్ఞానమును బొంది శుద్ధుఁడగుచు

తే॥ శ్రీమనోహరు నపరోక్ష సిద్ధిచేత
దర్శనము సేయుచుండుఁ బ్రత్యక్షగతుల
నిట్టి భక్తులు దన్ను నుతించుచుండ
వినుచు రక్షించుచుండును జననియట్లు

తా॥ పూర్వము చెప్పినట్టి క్రమమైన అనుసంధానముతో దేహమందలి పదార్థముల యందున్న భగవంతుని రూపములతో ఐక్యచింతనము చేయవలెను. ఇట్లు అనుసంధానము చేసినవాడు భోజనము చేయుచుండినను నిత్యోపవాసియనబడును. పాపరహితుడనియు, ప్రతినిత్యము భగవత్ప్రీతికరములైన యజ్ఞములు చేయువాడనియు పిలువబడును. ఇట్టి అధికారి అహంమమతాదులు వదలిన వాడగును. జీవుడు అస్వతంత్రుడనియు పరమాత్ముడు సర్వస్వతంత్రుడనియు అపరోక్షమును పొందగలడు.

మూ. ఆరెరడు సావిరద మేలి
న్నూర ఐవత్తొందు రూపది
సార భోక్తనిరుద్ధదేవను అన్నమయనెనిప।

మూరెరడువరె సావిరద రూపది
మూరధిక నాల్వత్తు రూపది
తోరుతిహ ప్రద్యుమ్న జగదొళు ప్రాణమయనాగి॥

సీ॥ పంద్రెండు శతములపైనేఁబదియునొక
కైన ఖండాఖండ మనఁగఁబఱఁగు
రూపంబులం దనిరుద్ధ రూపకుడయి
స్థూలదేహంబుల నోరివెలుఁగు
నన్నమ యాత్మకమగు కోశమున జీవ
భుక్తప్రాకృతరసమును దృజించి
స్వాఖ్యమౌ తద్రస సారంబు భుజియించి
యన్నమయుండును నాఖ్యఁజెలఁగు
వారిమయాత్మక ప్రాణకోశంబునఁ
బ్రద్యుమ్నరూపియై బ్రహ్మజనకుఁ

తే॥ డైదువేలకుపై మఱియైదునూర్ల
కంతపైనల్వదియు మూటనగు సురూప
ముల వెలుంగు మరీచ్యాది సురలొసంగు
పూజలం గొనుచుండును పూర్ణసుఖుడు

తా॥ పరమాత్ముడు అనిరుద్ధరూపముతో స్థూల దేహమందు పృథ్వీసాంకేతమగు అన్నమయమను కోశమందు ఎనిమిదివేల యిన్నూట ఏబది యొక్క ఖండాఖండములైన రూపములతో నుండిన వాడై జీవభుక్తమైన ప్రాకృతాన్నమును త్యజించి స్వాఖ్యమైన సారభూతమైన దానిని బోజనముచేసి అన్నమయుడని పిలువబడును. అట్లే పరమాత్ముడు ప్రద్యుమ్నరూపముతో ప్రాణాధారమైన ఉదకప్రాచుర్యమైన ప్రాణమయమైన కోశమందు అయిదువేల అయిదునూర్ల నలువదిమూడు రూపములతో నుండి పైవిధముగా మరీచి మొదలైన వారిచే పూజలందుకొని తనరూపమును చూపించుచు ప్రాణమయుడని పిలువబడును.

వి॥ అక్షర సాంకేతమైన రూపములు:
అ1 - ని.5 - రు - 2 - ద్ధ - 8 (కుడినుండి ఎడమకు) 8251 రూపములగును
ప్ర - 3 - ద్యు - 4 - మ - 5 - న - 5 (కుడినుండి ఎడమకు)
5543 రూపములగును

మూ. ఎరడుకోశద ఒళహొరగె సం
కరుషణైదు సులక్షదరవ
త్తెరడుసావిరదేళధిక దశరూపగళ ధరిసి।
కరెసికొంబ మనోమయను ఎం
దరవిదూరను ఈరెరడు సా
విరద మున్నూరాద మేల్నాల్కధిక ఎప్పత్తు॥

14

సీ॥ సంకర్షణుండు లక్షలునైదు నరుపది
రెండువేలకుమీద నుండునట్టి
శతసంఖ్యకునుబయి సప్తఖండాఖండ
రూపంబులయ్యవి రూఢిమెఱయఁ
దగ మనోమయకోశ తలమందుఁ జక్కఁగా
నలరి మహేంద్ర రుద్రాదులైన
తత్త్వాభిమత దేవతలచేతఁ బూజితు
డగునట్టివాఁడని యాత్మ నెఱిఁగి

తే॥ హరియు విజ్ఞానమయకోశ మందునాల్గు
వేలపై నైదునూర్లుగా వెలయు డెబ్బ
దియును నాలుగురూపాల దీపితుడగు
వాసుదేవ రూపకుడగు బ్రహ్మనుతుడు

తా॥ మనోమయమను కోశస్థానమందు అయిదులక్షల అరువది రెండువేల నూటఏడు (562107) రూపములతో సంకర్షణుడను పేరు గల పరమాత్ముడు ఖండాఖండ రూపములతో నుండి యింద్రరుద్రాది తత్త్వాభిమానదేవతలచే పూజితుడై యున్నాడనియు, విజ్ఞానమయకోశము నందు నాలుగువేల అయిదునూర్ల డెబ్బది నాలుగు (4574) రూపములతో వాసుదేవరూపియైన పరమాత్ముడు బ్రహ్మవాయువులచే పూజితుడై యున్నాడనియు తెలియవలయును.

మూ. రూపదిం విజ్ఞానమయనెం
బీపెసరినిం వాసుదేవను
వ్యాపిసిహ మహదాది తత్త్వప తత్పతిగళొళగె।

ఈ పురుష నామకన శుభస్వే
దాపళెనిసి రమాంబ తా బ్ర
హ్మాపరోక్షిగళాదవర లింగాంగ కెడిసువళు॥ 15

తే॥ వెలయు విజ్ఞాన మయుడను పేరిచేత
వ్యాప్తుడగు మహదాది తత్త్వములఁ దత్త్వ
పతుల నీపురుషాత్మక భవ్య స్వేద
జనిత విరజాస్వరూపియౌ జలజతాను

క॥ బ్రహ్మాద్యపరోక్షులకును
బ్రహ్మానందమున లింగభంగమొసఁగుచున్
బ్రహ్మాత్మకమగు సుఖమిడి
బ్రహ్మలకుం బ్రహ్మయైన వానింజేర్చున్.

తా॥ పూర్వమున చెప్పబడిన నాలుగువేల మున్నూటడెబ్బది నాలుగు (4374) రూపములతో వాయుసాంకేతమైన విజ్ఞానమయమను కోశమునందు తదాకార రూపుడై విజ్ఞాన మయుడని వాసుదేవరూపుడైన పరమాత్ముడు వ్యాప్తుడై యున్నాడు. ఆనందమునకు ఆధారభూతమైనది ఆనందమయకోశము. ఇదియే ఆకాశప్రచురమైన ఆకాశమయమైన కోశము. ఇందు నారాయణుడున్నాడు. ఈ కోశమందు మహత్తత్త్వమారంభించి పృథ్వీతత్త్వము వఱకు అన్నితత్త్వములతో కూడిన అవ్యక్తతత్త్వమున్నది. ఆ నారాయణుని భార్యయైన లక్ష్మీదేవి అండమువెలుపల సూక్ష్మసృష్టికాలమందు బ్రహ్మసృష్టికొఱకు ఆ బ్రహ్మదేవుని మహత్తత్త్వమైన వీర్యముతో వాసుదేవుడు ధరించినవాడై తనపత్నియైన మాయాదేవియందు ఆ వీర్యమును సేచనము చేయును. అట్టికాలమందు ఆ దేవుని అంగమునుండి చెమటయను ఉదకరూపమునబడి అభివ్యక్తమైనపుడు జగత్తుకు తల్లియైన లక్ష్మీదేవి పరమాత్ముని ఆ జ్ఞానుసారముగా జీవన్ముక్తులైన బ్రహ్మాదులను విరజానదీస్నానము చేయించి లింగదేహభంగమునొందించి బ్రహ్మాదులను తనగర్భనందుదాల్చి మరల పరమాత్ముని ఉదరమునందు చేర్చును.

మూ. ఐదుసావిర నూర ఇప్ప
త్తైదు నారాయణన రూపవ
తా ధరిసికొండనుదినది ఆనందమయనెనిప।

ఐదు లక్షదమేలె ఎంబ
త్తైదు సావిర నాల్కు శతగళ
ఐదు కోశాత్మక విరించాండదొళు తుంబిహను॥ 16

తే॥ ఐదు వేల్నూటడెబ్బది యైదు సంఖ్య
గలుగు నారాయణుని రూపములధరించి
హరియు నానందమయుడను నాఖ్యజెలగ
శ్రీరమాదేవితోగూడి చిత్తమలర

తే॥ అయిదులక్షల నెనుబదియైదువేల
పైన నాలుగు నూర్లుగాఁ బరగునట్టి
మొత్తమగు రూపముల గోశములనజాండ
మందు నిండియున్నాడు నిత్యంబు సూడ

మొత్తము భగవద్రూపముల వివరము

| సంఖ్య | అఖండ రూపము | ఖండరూప ములు | కోశముల పేరు | భగవద్రూపముల పేరు |
|---|---|---|---|---|
| 1 | 1 | 8251 | అన్నమయకోశము | అనిరుద్ధుఁడు |
| 2 | 1 | 5543 | ప్రాణమయకోశము | ప్రద్యుమ్నుఁడు |
| 3 | 1 | 562107 | మనోమయకోశము | సంకర్షణుడు |
| 4 | 1 | 4374 | విజ్ఞానమయకోశము | వాసుదేవుడు |
| 5 | 1 | 5125 | ఆనందమయకోశము | నారాయణుఁడు |
| 5 | 5 | 585400 | 5 | 5 |

| కోశముల పేరు | భగవద్రూ | కోశములందు నడుపదగిన కార్యము |
|---|---|---|
| 1. అన్నమయ | అనిరుద్ధుడు | ప్రాణులకు క్షుత్తును గలిగించువాడు |
| 2. ప్రాణమయ | ప్రద్యుమ్నుడు | భోజనపదార్థములను చింతనం చేయించువాడు |
| 3. మనోమయ | సంకర్షణుడు | దానిప్రయత్నముచేయించు వాఁడు |
| 4. విజ్ఞానమయ | వాసుదేవుడు | నానాప్రకారముల పచనాదులు చేయించి దానిని జతనము చేయువాడు. |
| 5. ఆనందమయ | నారాయణుడు | దానిని భోజనము చేయించి ఆనందమును పొందించువాడు. |

ము. నూరనొందు సురూపదిం శాం
తీరమణ తానన్న నెనిపై
నూర మేల్మూరధికదశ ప్రాణాఖ్య ప్రద్యుమ్న।
తోరుతిహనైవత్తు ఐదు వి
కార మనదొళు సంకరషణై
నూరు చతురాశీతి విజ్ఞానాత్మ విశ్వాఖ్య॥ 17

సీ॥ శాంతీధవుండును సరవినూటొక్క రూ
పముల నన్నమయాఖ్య పరలుచుండు
ప్రద్యుమ్న రూపుండు ప్రాణాఖ్యుడౌశత
పంచకంబాపైన పదియు మూడు
రూపాల వెలుగొందు రూఢి సంకర్షణుఁ
డేబది యైదుగా నెసగు స్వాంత
కోశంబునందునఁ గొమరొప్ప విశ్వాఖ్యుఁ
డాతండు విజ్ఞాన మనెడుకోశ

ఆ.వె. మందు పంచశతక మామీద నెనుబది
యైన రూపములను తాను బొంది
జీవులందు వెల్గు నీవిధంబెల్లయుఁ
దెలియ వలయు బుధులు తెల్లముగను.

తా॥ తన నూటొక్క స్వాఖ్య రూపముల చేత అనిరుద్ధుడు అన్న మనబడి తాను అన్న సాంకేతమైన కోశ మందు తదాకారముతో నుండి ఆ నామముతో పిలువ బడును. ఇప్పుడు చెప్పబడిన కోశాకారము అఖండ రూపము. అయిదు నూర్ల పదుమూడు రూపములతో ప్రద్యుమ్నుడను పేరు గల పరమాత్ముడు పూర్వోక్త ప్రకారమైన ఖండ రూపములతో నుండి తదభిమానులకు తన రూపమును చూపుచుండును. ఏ బది యైదు రూపములతో ప్రాణులను నానా విధములైన వికారములు పొందించు సంకర్షణుడు మనశ్శబ్ద వాచ్యుడై మనో కోశము నందున్నాడు. అయిదునూర్ల ఎనుబది నాలుగు ఖండ రూపములతో విజ్ఞాన శబ్ద వాచ్యుడై విజ్ఞాన కోశ మందు విశ్వనామకుడైన భగవంతుడున్నాడు.

మూ. మూరు సావిరదర్ధశత మే
లీరధిక రూపగళ ధరిసి శ
రీరదొళగా నందమయ నారాయణాహ్వయను।
ఈరెరడు సావిరద మేల్మూ
న్నూరఐదు సురూపదిందలి
భారతీశనొళిప్ప నవనీతస్థ ఘృతదంతె॥ 18

తే॥ మూడువేలేబదియు రెండు మొత్తమైన
రూపములను నారాయణుఁ డేపు మీఱి
వెలయు నానందమయుడన విశ్వమందుఁ
దేజరిల్లుచు నున్నాఁడు దేవ విభుడు

క॥ నవనీ తస్థంబగు ఘృత
మపుననఁగా భారతీశునందలరు రమా
ధవుఁడున్ నాలుగు వేల్ మీ
ద వెలయు మున్నూరు నైగు తగు రూపములన్.

తా॥ మూడువేల యేబది రెండు రూపములతో ఆనందమని పిలువబడి అన్నాది పంచ కోశము లందు నాలుగువేల మున్నూటయిదు తగిన రూపములతో భారతీ రమణుడైన వాయుదేవుని అంతర్యామియై ఆయా కోశము లందు ఆయా ఆకారములతో నేయి యెట్లు వెన్నయందడగి యుండునో అట్లు వ్యాప్తుడైయున్నాడు.

మూ. మూరధికవైవత్తు ప్రాణ శ
రీరదొళగనిరుద్ధ నిప్పె
నూరు హన్నొందధికపాననొళిప్ప ప్రద్యుమ్న।
మూరనే వ్యానదళగైదరె
నూరు రూపది సంకరుషణై
నూర మూవత్తైదుదానదొళిప్ప మాయేశ॥ 19

తే॥ ఏఁ బదియు మూడు రూపాల నెసఁగు ప్రాణ
మునకు నందనిరుద్ధుండు ప్రబలు మఱియు
నైదు నూర్లపై పదు నొకం డాయపాన
మందుఁ బ్రద్యుమ్ను రూపకుఁ డలరుచుండు.

తే॥ వ్యానమందున నేబదియైదు రూప
ములను సంకర్షణుండును మఱియు నూట
ముప్పదియునైదు దానంబుఁ దప్పకుండు
రూపములను మాయేశుండు దీపితుడగు.

తా॥ ముఖ్య ప్రాణుని రూపములైన ప్రాణాపానాదులైన పంచ రూపముల యందు ప్రాణ రూపుడైన వాయుదేవుని యొక్క అన్నమయ కోశ మందున్న తదాకారమైన మహత్తత్వాత్మకమైన స్థూల శరీర మందు అనిరుద్ధ నామకుడైన పరమాత్ముడు ప్రాణాకారుడై ఏబది మూడు రూపములతో అఖండ రూపుడై ప్రాణమను పేరు గల వాడై యున్నాడు. అయిదు నూట పదునొకండు రూపములతో అపానమను పేరుగల వాయుదేవుని యందు తదాకార తన్నామ వాచ్యుడై ప్రద్యుమ్నుడు అఖండ రూపుడై అక్షర సంకేతమైన ఖండ రూపములతోను ఉన్నాడు. వాయుదేవుని మూడవ రూపమైన వ్యానము నందు ఏబది అయిదు రూపములతో మనోమయమను కోశము నందు అఖండము మఱియు ఖండ రూపములతో సంకర్షణుడను పరమాత్ముడున్నాడు. అయిదు నూట ముప్పది అయిదు రూపములతో విజ్ఞాన మయమను కోశము నందున్న ఉదాన వాయువు నందు వాసుదేవుడను పరమాత్ముడున్నాడు. ఆనంద మయమను కోశమందున్న సమాన వాయువు నందు అయిదు నూట ఏబడి యేడు ఖండా ఖండ రూపములతో మూల రూపుడైన నారాయణుడున్నాడు.

మూ. మూల నారాయణను ఐవ
త్తేళధిక ఐనూరు రూపవ
తాళి సర్వత్రది సమాన నొళిప్ప సర్వేశ।
లీలెగైవను సావిరద మే
లేళు నూర్హన్నొందు రూపవ
తాళి పంచప్రాణరొళు లోకగళ సలహువను॥ 20

తే॥ అయిదు నూర్ల యేబది యేడు నగుచు నొప్పు
రూపముల సమానంబున నేపు మీఱు
మూల నారాయణుండును మొత్తముగను
పంచ ప్రాణుల యందు సర్వప్రభుండు.

| భగవద్రూపముల సంఖ్య | భగవద్రూపములు |
| --- | --- |
| 101<br>513<br>55<br>584<br>3052 | రూపములతో అనిరుద్ధనామక పరమాత్ముడు అన్నమందుండి అన్నమని పిలువబడును.<br>రూపములతో ప్రద్యుమ్నుడు ప్రాణమందుండి ప్రాణమని పిలువబడును.<br>రూపములతో సంకర్షణుడు మనమందుండి మనస్సని పిలువబడును<br>రూపములతో వాసుదేవుడు విజ్ఞానమందుండి విజ్ఞానమని పిలువబడును.<br>రూపములతో నారాయణుడు ఆనందమందుండి ఆనందమని పిలువబడును. |
| 4305 | రూపములతో పంచరూపాత్మక పరమాత్ముడు పంచకోశ శబ్ద వాచ్యుడై 'భోజ్య'మని పిలువబడును |
| 53<br>511<br>55<br>535<br>557 | రూపములతో అనిరుద్ధుడను పరమాత్ముడు ప్రాణవాయువు నందుండి ప్రాణమని పిలువబడును.<br>రూపములతో ప్రద్యుమ్నుడను పరమాత్ముడు అపానవాయువు నందుండి అపానమని పిలువబడును.<br>రూపములతో సంకర్షణుడను పరమాత్ముడు ఉదానవాయువు నందుండి ఉదానమని పిలువబడును.<br>రూపములతో వాసుదేవుడను పరమాత్ముడు ఉదానవాయువు నందుండి ఉదానమని పిలువబడును.<br>రూపములతో నారాయణుడను పరమాత్ముడు సమానవాయువు నందుండి సమానమని పిలువబడును. |
| 1711 ఒక వెయ్యిఏడునూర్ల పదునొకటి. | రూపములతో పంచరూపాత్మకుడైన పరమాత్ముడు పంచప్రాణు లందు అతర్యామియై యుండి లోకమును సంరక్షించును. ఇచటికి పంచకోశముల విచారము పూర్తి అయినది. |

మూ. త్రినవతి స్వరూపాత్మకనిరు
ద్ధను సదా యజ మాననాగి
ద్దనల యమ సోమాది పితృ దేవతి గళిగె అన్న।
నెనిప నా ప్రద్యుమ్న సంకరు
షణ విభాగవ మాడి క్రాం
డుణిప నిత్యా నంద భోజన దాయి తుర్యాహ్వ॥ 21

ఉ॥ తొంబది మూడు రూపములతో ననిరుద్ధుడు సర్వకాల మం
దింబుగ కర్త తానగుచు నేర్పడ నగ్ని శశాంకుడాది యా
చుం బెనుపొంది పైతృతతి శోభిలు నన్నమయుండనంగ భా
గంబుల మూడు రూపములుగా హరి వారి భుజింప జేయుతన్

తా॥ తొంబది మూడు స్వకీయములైన రూపములు గల పితృ దేవతలకు పితృలకు దేహధారియైన జీవునకు స్వామియైన తదాత్మకుడై ఆయా పేర్లతో పిలువ బడి అంతర్యామియైన అనిరుద్ధుడను పరమాత్ముడు. అతని 93 రూపము లేవనగా అధికారి శరీర విచారమును వివరించు చున్నారు.

1. పితృ రేతస్సు - 1. మాతృశుక్లము
2. పితామహునిరేతస్సు - 2. పితామహి శుక్లము
3. ప్ర పితామహుని రేతస్సు - 3. ప్రపితామహిశుక్లము మొత్తము మూడు
మొత్తము మూడు

ఈ ప్రకారము 6 విధములుగా దేహ నిర్మాణ మగును. ఈ రేతస్సంబంధ పరం పరచే వచ్చి దేహ మందు సంబంధపడి యున్నది. ఈ రేతస్సంబంధముచే సూతకాదులు. రేతస్సంబంధము తప్పినపుడు సూతకము లేదు. గోత్రదాయాదులని పిలువ బడుదురు. పితృ రేతస్సు దేహమునకు సంబంధించి యుండుట వలన పితృదేవతలైన వసుదేవతలు (ఎనిమిది) మంది దేహము నందున్న జీవుని పితృరేతోంశమును ఆశ్రయించి యున్నారు. పితామహుని రేతోంశమును ఏకాదశ రుద్రులు ఆశ్రయించి యున్నారు. ప్రపితామహుని రేతోంశమును ద్వాదశాదిత్యులు ఆశ్రయించి యున్నారు. ఈ ముప్పది యొక్క మంది యందు అనిరుద్ధ రూపములు 93. ఎట్లనగా ఒక్కొక్కరి శరీరము

1. వైకారిక సాంకేతికమైన మనస్సు
2. తైజస సాంకేతికమైన దశేంద్రియములు.

3. తామస సాంకేతమైన పంచ భూతములు. మొత్తము మూడు అహంకారములతో కూడి యున్నది. ఈ ప్రకారము 31 దేవత లందు చేర్చి గుణించినచో 31 X 3 = 93 అగును. ఒక్కొక్కరి యందు ఒక్కొక్క అనిరుద్ధుని రూపము మేరకు 93 అనిరుద్ధ రూపములగుటచే త్రినవతి స్వరూపాత్మకుడన బడును.

మూ. షణ్ణవతి నామకను వసు మూ
గణ్ణ భాస్కర రౌళగె నింతు ప్ర
పన్నరనుదిన నిష్కపట సద్భక్తియలి మాళ్పు।
పుణ్య కర్మవ స్వీకరిసి కా
రుణ్య సాగరనా పితృగళి గ
గణ్య సుఖ విత్తవర పొరెవను ఎల్లకాలదలి॥ 22

ఉ॥ షణ్ణవతి ప్రసిద్ధుఁడును చక్కఁగఁదా వసు రుద్ర సూర్యులం
జెన్నుగనిల్చి నిష్కపట చిత్తములందున వారొనర్చు నా
పున్నెపుఁ గర్మముల్ గొనుచుఁ బూర్ణదయాంబుధి పైతృకోటి క
త్యున్నతసౌఖ్య మిచ్చి ముదమొప్పగ గాచును సర్వకాలమున్.

తా॥ షణ్ణవతి నామకుడు పరమాత్ముడు. అనగా 96 తొంబదియారు నామములు గల అనిరుద్ధుడు షణ్ణవతి శ్రాద్ధముల యొక్క వివరణము:

| | |
|---|---|
| 1. మన్వాదులు | 14 |
| 2. మహాలయ పితృపక్షములు | 16 |
| 3. యుగములు పుట్టిన దినములు | 4 |
| 4. మేషాది పర్వకాలములు | 12 |
| 5. అమావాశ్యలు | 12 |
| 6. వ్యతీపాతములు | 13 |
| 7. వైధృతులు | 13 |
| 8. త్రిస్పాష్టములు | 12 |
| మొత్తము | 96 |

ఈ షణ్ణవతి శ్రాద్ధముల పేర్లతో పిలువబడు చు అష్ట వసువులకు అహంకార త్రయ మందు ప్రద్యుమ్నుడు 24 ఇరువది నాలుగు రూపములతోను, త్రినేత్రుడైన రుద్రాదులు అహంకార త్రయమందు 33 ముప్పది మూడు సంకర్షణ రూపములతోను ద్వాదశాదిత్యుల అహంకార త్రయ మందు వాసుదేవుడు 36 ముప్పదియారు రూపములతోను ప్రకాశింతురు. మఱియు అనల - యమ - సోమాదు లందు మూడు రూపములతోను మొత్తము 96 తొంబదియారు రూపములతోను అధికారి శరీర మందుండ దగిన పూర్వోక్తమైన దేవతల యందు నిలిచి అనుసంధానము తెలిసిన జ్ఞానులు తెలియ వలెను. పితృలకు మానవ మానమైన ఒక సంవత్సరము ఒక దినమగును. అందువలన దిన సంకేతమైన ప్రతి సంవత్సర మందు నిష్కపటముగా మాహాత్మ్య జ్ఞాన పూర్వకమైన సుదృఢ స్నేహమైన భక్తితో పరమాత్ముని యందును పితృల యందును చేయదగిన పుణ్యమును స్వీకరించి అఖండ రూపుడైన అనిరుద్ధుడు ఈ అధికారి ఏ రేతస్సుచే ఉత్పన్నుడైనాడో ఆ పితృలకు అగ్ని యమాదుల ద్వార యిచ్చి ఆ పితృలను కార్యము చేసిన అధికారిని బాగుగ భక్తి జ్ఞానాదులను పుత్ర పౌత్రాదులను ఇచ్చి సంరక్షించును. ఇదియే కాలశ్రాద్ధ వ్యతిరిక్తమైన అన్యశ్రాద్ధ విచారము.

మూ. సుతపనే కోత్తర సుపంచా
శత వరణ కరుణాది చతుర్విం
శతి సుతత్త్వాది ధాతుగళొళగిద్ద విరతనిరుద్ధ।
జతన మాళ్పను జగది జీవ
ప్రతతిగళ షణ్ణవతి నామక
చతురమూర్తి గళర్చిసువర దరింద బల్లవరు॥ 23

మ॥ సుతపుండేబది యొక్క వర్ణములలో శోభిల్లుచున్ సర్వదా
చతురాధిక్య సువింశతి ప్రబుధులన్ సద్ధాతులందాను సు
స్థితుండై యాయని రుద్ధుడుం జతనముం జేయుం జగంబందు జీ
వ తతిన్ షణ్ణవతి ప్రసిద్ధుండతనిం భావించు వారే బుధుల్.

తా॥ విష్ణు సహస్ర నామము నందు 'హిరణ్య నాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః' అని యుండుట వలన పరమాత్ముని చే సృష్టింప బడిన ప్రాణులన్నియు పరమాత్మునకు పుత్రులని పిలువ బడుదురు. ఎట్లనగా

బ్రహ్మాది జీవులను పాలనము చేయ దగిన భగవంతుడు అకారాదిగా క్షకారము అంతముగా గల ఏబది యొక్క అక్షర వ్యాప్యముగా చక్రాబ్జాదిక మండల సంకేతమైన కంకణాకారమైన చక్రపు హృదయు మందలి అష్ట దళ కమలమునకు వలయాకారముతో నుండ దగిన ఏబది యొక్క దళములతో కూడిన కమల మందు అజాది ఏబది యొక్క రూపములతో నున్నాడు. మఱియు దేహ మందలి (మూలాధార మందు) గుదస్థాన మందున్న చతుర్దళ కమల మందుక ఆరంభించి ఫ వ అకు నాలుగు వర్ణములు, నాభిషడ్దళ కమల మందు బ ఆరంభించి ఞ వఱకు ఆరు వర్ణములు, హృదయ మందున్న అష్టదళ కమల మందు ట ఆరంభించి దవఱకు ఎనిమిది వర్ణములు, కంఠమందున్న షోడశ దళ కమల మందు ధ ఆరంభించి ళ వఱకు పదునారు వర్ణములు, భ్రూమధ్య మందున్న చతుర్దళ కమల మందు అ ఆ అం అః అను నాలుగు వర్ణములు, శిర మందున్న ద్వాదశ దళ కమల మందు ఇఈ ఆరంభించి ఔ వఱకు పండ్రెండు వర్ణములు, బ్రహ్మ రంధ్ర మందున్న ద్వాదశ దళ కర్ణికా మధ్య మందు క్ష వర్ణమొకటి మొత్తము 51 ఏబది యొక్క వర్ణములు. ఈ ప్రకారముగా కమలము లందు అజాది రూపములతో దేహ మందు పరమాత్ముడున్నాడు. ఏకాద శేంద్రియము లందు శక్తి ప్రతిష్ఠాది పదునొకండు రూపములు, ఇరువది నాలుగు తత్త్వము లందు కేశవాది ఇరువది నాలుగు రూపములు (11 + 24 + 7 + 3 = 45) మొత్తము 96 తొంబదియారు రూపములగును. అజాది రూపములు 51 శక్తి ప్రతిష్ఠాదులు 45 మొత్తము రూపములతో దేహమందుండి అనిరుద్ధుడు తత్త్వేశ్వరుల ద్వార సంరక్షణము చేయుచున్నాడు.

మూ. అబుజ జాండోదరను విపినది
శబరి యెం జలనుండు గోకుల
దబలె యర నొలిసిదను ఋషి పత్నియరు కొట్టన్న॥
సుభుజతా భుంజిసిద స్వరమణ
కుబుజె గంధకె వలిద మునిగణ
విబుధసేవిత బిడువనే నావిత్త కర్మఫల॥ 24

చ॥ విపినము నందు నాశబరి ప్రీతిగ నిచ్చిన పండ్లు మెక్కి ని
ష్కపటత గోకులాం గనలఁగాచి వరించి మహర్షి పత్నుల

చ్చపు మది నిచ్చు నోగిరముఁ జక్క భుజించినఁవాడు కుబ్జకుం
గృపనిదువాఁడు జీవతతు లిచ్చెడు కర్మఫలంబు లొందదే?

తా॥ పరమాత్ముడు పూర్వము అరణ్య మందు శబరి యిచ్చిన ఎంగిలి పండ్లను తిని గోకుల మందలి గోపికలను కాపాడి వరించి ఋషి పత్నులు ప్రీతి మనస్సుతో సమర్పించిన అన్నమును ప్రియముతో నారగించెను. కుబ్జకు కృపతో దివ్య సౌందర్యమును ప్రసాదించెను. అట్టి పరమాత్ముడు తన భక్తులైన జీవరాసులొసగు కర్మ ఫలములను స్వీకరింప కుండునా?

మూ. గణనె యిల్లద పరమసుఖ స
ద్గుణగణంగళ లేశ లేశకె
ఎణెయెనిసదు రమాబ్జభవ శక్రాది గళసుఖవు।
ఉణుతుణుత వైెమరెదు కృష్ణా
ర్పణవెనలు కైకొంబ నర్భక
జనని భోజన సమయదలి కైపద్దు పందదలి॥ 25

ఉ॥ అంతములేని నిర్మల సుఖాత్మకుఁడౌ హరి సద్గుణంబులన్
సుంతయు సాటిలేనిదన శోభిలునట్టి రమాబ్జసూతి పా
కాంతక సౌఖ్యముల్; దినుచు నంగమునేమరిభోజనంబు గం
పాంతక! ప్రీతియన్నఁ గొను నర్భకుచేఁగొను తల్లియట్లుగన్.

తా॥ లక్ష్మీదేవి యొక్కయు, బ్రహ్మ రుద్ర ఇంద్రాదుల యొక్కయు సుఖ సంతోషములు గుణగణాదులు శ్రీ పరమాత్ముని సుఖ సంతోష గుణ గణాదులకు ఎంత మాత్రము సాటికా జాలవు. అట్టి పరమాత్ముడు భక్తులు తాము భుజించునపుడు బిడ్డలు భుజించునపుడు చేయి పట్టి ఎట్లు గ్రహించునో అట్లు స్వీకరించును.

మూ. జీవకృత కర్మగళ బిడదె ర
మావరను స్వీకరిసి ఫలగళ
నీవనధికారాను సారదల వరిగన వరతి।
పావకను సర్వస్వ భుంజిసి
తా వికారవనైద నొమ్మెగె
పావనకె పావననెనిప హరి యంబుదే నరిదు॥ 26

క॥ జీవకృతమైన పలుక
ర్మావళులన్ స్వీకరించి మాధవుఁడిడు జీ
వావళికి యోగ్య ఫలములఁ
బావకుఁడు భుజించి సర్వపావనుఁడనఁగా

ఆ.వె. నిర్వికారుడగుచు వెగడెడు నా రీతిఁ
గర్మ లిడిన నంట గలదె? హరికి
పావనంబులకును పావనుండ గుగాదె
యుబ్బురం బదేమి? యుతని యందు.

తా॥ సృష్టి ప్రారంభము నుండి త్రివిధ జీవులు చేయునట్టి అనాది లింగ దేహప్ర తృతీయ పరి చ్ఛేదము నందలి వివిధ విచిత్రములైన అనాది కర్మలను జీవుల యొక్క బింబ రూపుడైన పరమాత్ముడు అనాది నుండి వదలక స్వీకరించును. అనాది కర్మల ద్వార అగామి సంచిత కర్మలను వృద్ధి చేసి సాధనమును పూర్తి చేయించి లింగ శరీరము భంగమైన తరువాత అవిచ్ఛిన్నముగా భోగింప దగిన ఆయా జీవుల యోగ్యతానుసారముగా ముక్తి యోగ్యులకు సుఖమును తమో యోగ్యులకు దుఃఖమును నిత్య సంసారులకు మిశ్రమ ఫలమును ఇచ్చి ప్రళయ కాల మందు చరాచరమైన సర్వ ప్రపంచమును మ్రింగునే కాని వికారమును పొంద జాలడు. ఇట్టి శక్తి సంపన్నుడైన పరమాత్ముడు జీవులిచ్చునటువంటి పదార్థములను భుజించి వికారమును పొందకుండుననుటలో ఆశ్చర్యమేమి?

మూ. కలుష జిహ్వాగె సుష్టు భోజన
జల మొదలు విష దోరు వదు ని
ష్కలుష జిహ్వాగె సురస తోరువు దెల్ల కాలదలి।
సులలితాంగగె సకల రస మం
గళ వెని సితిహుదన్నుమయు కై
కొళదె బిడు వనె పూతనియ విషమొలెయనుండవను॥ 27

చ॥ కలుషపు జిహ్వకున్ మిగుల కమ్మని భోజ్యములుం జలంబులుం
బలు విషముంచుఁదోచు రస నంబది పావనమైన సద్రసం
బలరు మహా పవిత్రుఁడగు నాహరికెల్ల రసంబులెప్డు మం
గళముగుఁ గైకొనండె? విషకారిణి పూతన చన్నుబాలొగిన్.

తా॥ రోగాది దోషములచే కలుషయుక్తమైన నాలుక గల వానికి సమస్తమైన భోజన పదార్థము లెట్లు విషముగా దోచునో అట్లు శ్రీ పరమాత్ముని సురసోపేతమైన చరిత్రలు ఆ పరమాత్ముని ద్వేషించు దైత్యులకు రుచింప నేరదు. నిషిద్ధానిషిద్ధములైన సర్వ పదార్థములు పరమాత్మునకు శుభ రసములే యగును. అధికారులైన వారు అనుసంధాన పూర్వకముగా ఇచ్చు ద్వంద్వ రసములు, కర్మములను స్వీకరించును. ఎట్లనగా పూర్వము తన్ను చంపుటకు వచ్చిన పూతన యొక్క విషపూరితములైన చనుబాలను శ్రీకృష్ణుడు త్రాగినాడు కదా!

మూ. పేళలేను సమీర దేవను
కాలకూటవనుండు లోకవ
పాలిసిద తద్దాసనోర్వను అమృత నెనిసిదను।
శ్రీలకుమి వల్లభ శుభాశుభ
జాలకర్మ గళుంబ నుపచయ
దేళిగగ ళవగిల్ల వెందిగు స్వరసగళ బిట్టు॥ 28

ఉ॥ ఏమని చెప్పఁగానగు సమీరణదేవుఁడు కాలకూటముం
బ్రేమ భుజించి లోకమును వేడుకఁగాఁచెఁదదీయ దాసుఁడుం
దామహిఁద్రాగెఁ దద్దయు సుధారస మంచు భుజించు జీవ దు
ష్టామల కర్మ జాలముల నాహరి తాఁగొనునే వికారముల్?

తా॥ పరమాత్ముని ఆజ్ఞచే క్షీర సముద్ర మందు పుట్టిన విషమును జీవోత్తముడైన వాయుదేవుడు త్రాగిన వాడై లోక మందలి ప్రాణులను రక్షించెను. ఆ వాయుదేవునిచే నీయబడిన స్వల్పమైన విషమును ద్రాగి రుద్రుడు అమృతుడని పిలువ బడెను. పరమాత్ముని అనుగ్రహముతో ఆ యిద్దరిని ఆ విషమేమియు చేయలేదు. పరమాత్ముడు తన అవతారము లందు శుభ ద్రవ్యములను అ శుభ ద్రవ్యములను భోజనము చేసి యుండినను వాని వలన ఎట్టి దోషములు కలుగవు కదా!

మూ. ఈ పరియ లచ్యుతను తత్త
ద్రూప తన్నామగళ సలె నా
నా పదార్థది నెనె నెనెదు భుంజిసుతలిరు విషయ।

ప్రాపక స్థాపక ని యామక
వ్యాప కను ఎందరిదు నీ ని
ర్లేప నాగిరు పుణ్యా పాపగ ళర్పి సవనడిగె॥ 29

ఉ॥ ఈ విధమైన రూపముల నింపగు శ్రీహరి నామధేయముల్
శ్రీ వింసిల్ల వస్తుతతి చిత్త మెఱింగి భుజింపు చుండుమా
వావిరి స్థాపకుండు మఱి ప్రాపక వ్యాపకుడున్ నియామకుం
డై వెలుగొందు నాహరికి నర్పణసేయుము పాప పుణ్యముల్.

తా॥ ఈ విధముగా బింబ రూపకుడైన పరమాత్మునిచే కల్పింప బడిన భోజనోప యోగ్యములై ద్రవ్యాధిష్ఠానము లందు ఆయా పదార్థముల ఆకార రూపముల చే కూడి యుండిన పదార్థములు ఏయే నామములతో పిలువ బడునో ఆయా నామములతో నుండ దగిన పరమాత్ముని రూపములను మాటి మాటికి స్మరించు కొనుచు భోజనమునకు విషయములైన ద్రవ్యములను భోజనము చేయుచు పరమాత్ముని యందే మనసు నిల్పి యుండుము. పరమాత్ముడు సృష్టికి కారణుడు. అన్నాదుల నిచ్చువాడు. సర్వ వ్యాప్తుడైన వాడు. అట్టి పరమాత్ముని మహిమలను చక్కగా నెఱిగిన వాడ వై సంసార మందు నిర్లేపుడవై యుండుము. అన్ని కర్మలను అతని కర్పింపుము.

మూ. ఐదుల లక్షెం భత్త రొంభ
త్తాద సావిర దేళు నూరర
ఐదు రూపవ ధరిసి భోక్తృగ భోజ్య నెందెనిసి
శ్రీధరా దుర్గారమణ పా
దాది శిర పర్యంత వ్యాపిసి
కాదు కొండిహ సంతత జగన్నాథ విట్ఠలను॥ 30

ఉ॥ శ్రీపతి యైదు లక్షలును జెల్వగు నెన్బది తొమ్మిదైన వే
లా పయినేడు నూర్ల యిదు హెచ్చగు రూపములం ధరించి స
ద్వ్యాపిత భోక్తృ భోజ్యుడన నా రమణీ ధర దుర్గ భర్తయున్
వ్యాపకుఁడై శరీరమును నారయఁగాచును విట్ఠలుండొగిన్.

తా॥ బ్రహ్మాండమును ఆ బ్రహ్మాండము నందలి సమస్త పదార్థములను పంచ కోశాత్మకము చతుర్వింశాత్మక తత్త్వముగా సృష్టింప బడినవి. అందువలన

భోజ్య వస్తువు అందు దేహము నందలి రూపములట్లున్నాడు.

| | |
|---|---|
| అన్నమయాది కోశములందలి రూపములు: | 5,85,400 |
| అన్న కోశాది రూపములు | 4,305 |
| మొత్తము<br>(అయిదు లక్షల ఎనుబది తొమ్మిదివేల ఏడునూర్ల అయిదు రూపములు) | 5,89,705 |

ఇది శ్రీ హరికథామృతసారము నందు
భోజన రస విభాగ సంధి సమాప్తము.

# విభూతి సంధి (అయిదవ సంధి)

మూ. హరికథామృతసార గురుగళ
కరుణదిందా పనితు పేళువె
పరమ భగవద్భక్త రిద నాదరది కేళువదు॥

తే॥ హరికథామృతసారము గురువుల దయ
మెఱయ వర్ణించు వాడను పరమ భక్త
వరులు సజ్జను లాదర భావ మొదవ
విన వలయు భక్తి మీఱగ వీనులలర.

తాత్పర్యము మొదటి సంధిలో నున్నది యే

మూ. శ్రీ తరుణి వల్లభన పరమ వి
భూతి రూపవ కండ కండ
ల్లితెరది చింతి సుత మన దలి నోడు సంభ్రమది।
నీత సాధారణ విశేష స
జాతి నైజా హి[illegible] సహజ వి
జాతి ఖండాఖండ బగెగళనరితు బుధరింద॥

క॥ నీతయు సాధారణయు స
జాతియు నైజాహితయు విజాతి విశేష
ఖ్యాత సుఖండా ఖండయు
నా తెఱగున సహజములను నాఖ్యలబదియై

తే॥ శ్రీమనోహరు పరమ విశిష్టమైన
ఘన విభూతి రూపంబులఁ గాంచికాంచి
యెల్లచోటుల నీరీతి నుల్లమలర
నరసి చింతించి చూడు బింబాఖ్యు నిటుల.

తా॥ పరమాత్మని విభూతి సంకేతమైన రూపములను [illegible]
లోక విలక్షణమైన వ్యాపారములను [illegible] ఆయా [illegible]
ఈ క్రింది విధముగా చింతించ వలెను [illegible]

రూపములను నీ హృదయాధిష్ఠాన బింబరూప మందు అనుసంధానముతో ఐక్య చింతనము చేయుచు ధ్యానరూపముతో నీ యొక్క బింబరూపుని చూచు చుందుము. ఆ విభూతులెన్ని?

అధిష్ఠానము లేవి? అనగా:

1. నిత, 2. సాధారణ, 3. విశేష, 4. సజాతి, 5. నైజ, 6. అహిత, 7. సహజ, 8. విజాతి, 9. ఖండ, 10. అఖండము అని పది విధములు. వాని వివరణము.

| విభూతి పేరు | వాని విధానములు | అధిష్ఠానములు |
|---|---|---|
| 1. నిత | ఎప్పటికిని చెడని విభూతి | రమాదేవి. |
| 2. సాధారణ | మితమైన విభూతి | నిత్యసంసారులు. |
| 3. విశేష | అతిశయమైన విభూతి | బ్రహ్మాది ఋజుపులు- రుద్రాది దేవతలు - దేవ గంధర్వులు. |
| 4. సజాతి | సమానమైన విభూతి | మనుష్యగంధర్వుల మొదలుకొని తృణాంతమైన ముక్తియోగ్యులవఱకు. |
| 5. నైజ | చెడక నైజముగా నుండునది | జ్ఞానులు- అనాది నైజస్వరూపులు. |
| 6. అహిత | హితరహితమైన విభూతి | జడప్రతిమలు-తీర్థక్షేత్రములు. |
| 7. సహజ | సహజమైనది. | |
| 8. విజాతి | అన్యజాతి విభూతి | తమోయోగ్యజీవులు. |
| 9. ఖండ | భిన్న భిన్నమైనది ఉండును, లేకుండును. | అర్జునాదులు. |
| 10. అఖండ | ఏకాకార విభూతి | బ్రహ్మాది ఋజుపులు. |

పదా. జలధరాగసదొళగె చరిసువ
హలవు జీవర నిర్మిసిహనద
రొళు సజాతి విజాతి సాధారణ విశేషగళ
తిళిదు తత్త స్థానదలి వె
గ్గళిసి హబ్బిద మనది పూజిసు
తలవ వ్యాప్తద రూపగళ నోడుతలి హిగ్గుతలి॥ 2

తే॥ జలధ రాకాశముల యందు సంచ రించు
బహుళ జీవుల సృష్టించి వాని యందుఁ
దగ సజాతి విజాతి సాధారణాల వి
శేషములనెల్లఁ దెలిసి నిశ్చింతుడగుము.

క॥ ఆ యాస్థానంబుల నా
రాయణు కళ హెచ్చుచేసి వ్యాప్తమగు మదిన్
శ్రీయుతునిం బూజించుచు
నాయనఘు సురూపముల మహామతిగనుమా

తా॥ సమస్తమైన ఉదకములందును, భూలోకాదుల యందును ఊర్ధ్వ లోకము లారింటి యందును, ఆయాస్థానముల యందు సంచారము చేయు కొన్ని ప్రాణి సమూహములను స్థూల దేహములచే సృష్టి చేసి ఆయా స్థూల దేహములందు విభూతి సాంకేతమైన ప్రవిష్టరూపములతో పరమాత్ముడున్నాడు. స్థూల దేహములతో సృష్టించిన జీవుల సమూహ మందు స్వరూపమును తెలిసిన వారై తారతమ్య పంచ భేద జ్ఞానముతో కూడిన వారైన ముక్తి యోగ్యజీవులైన జాతి విజాతి సాధారణ విశేషములను తెలిసిన వారై ఆయా దేహ స్థానములందు తన సన్నిధాన మాహాత్మ్యము నధికము చేసి విభూతి నధికము చేయు నిమిత్తముగా వ్యాప్తుడైన పరమాత్ముడును స్థూలమైన హృదయాకాశ మందు వెలుగొందు బింబరూపుని యందు ఐక్యచింతనము చేసి మానస నిర్మితమైన పూజాద్రవ్యములతో ఐక్యచింతన రూపమైన పూజా ద్రవ్యములతో జీవాంతర్యామిని పూజా సాంకేత ద్రవ్యములచే పూజించుచుండుము. అతి సూక్ష్మమైన జీవుని యందు అంతర్యామియై బింబరూపుడై వ్యాప్తుడైన జీవాకారుడైన పరమాత్ముని, స్థూల హృదయమునందున్న బింబ రూపుని యందు ఐక్యమును చింతించుచు సర్వేంద్రియములందున్న భగవద్రూపములతో ఐక్యచింతనము చేసి సర్వమును భగవంతుని క్రియలని జ్ఞాననేత్రములతో చూచుచు దీనుడవై సంతోషము నొందుము.

మూ. ప్రతిమ శాలిగ్రామ గోభ్యా
గత నలిధి శ్రీ తుళసి పిప్పల
యతి వనస్థ వటు యజ మాన స్వపరజన।
పృథివి జల శిఖి పవన తారా

పథ నవగ్రహ యోగ కరణ భ
తిథి సితాసిత పక్ష సంక్ర[illegible]ణా వనదధిష్ఠాన॥ 3

తే॥ ప్రతిమలందు సాలగ్రామ తతిని గోవు
లతిథి యభ్యాగతి తులసి యతి వనస్థ
పిప్పల గృహస్థ వటువుల పృథ్వి స్వపర
జనుల జల శిఖి పవన నక్షత్ర మార్గ.

క॥ వర యజమాన నవగ్రహ
కరణ భ యోగ ద్విపక్ష కంబులుఁ దిథులున్
మఱియున్ సంక్రమణంబులు
హరికి నధిష్ఠానములుగ నలరుచునుండున్.

తా॥ ప్రతిమలు, సాలగ్రామములు, గోవులు, అతిథి అభ్యాగతులు, తులసి, యతులు, వనసంచారులైన ఋషులు, అశ్వత్థ వృక్షము, గృహస్థులు, బ్రహ్మచారులు, భూమి, స్వజనులు పరజనులు, జలము, అగ్ని, గాలి, ఆకాశము, యజమానుడు, నవగ్రహములు, కరణములు యోగములు గ్రహ మండలము, శుక్ల కృష్ణ పక్షములు, తిథులు, సంక్రమణకాలములు ఇవియన్నియు శ్రీ లక్ష్మీపతియైన పరమాత్మని విభూతి రూపములకు అధిష్ఠానములని తెలియవలయును.

ఈ 28 అధిష్ఠానముల వివరణము:

| సంఖ్య | విభూతల పేర్లు | అధిష్ఠానములు |
|---|---|---|
| 1. | నిత విభూతి | నిత్యముక్తయైన రమాదేవి యందు |
| 2. | సాధారణవిభూతి | మిశ్రమజ్ఞానులైన నిత్యసంసారుల యందు |
| 3. | విశేషవిభూతి | నవగ్రహదేవతలందు, అశ్విన్యాది నక్షత్రముల యందు, బ్రహ్మాది ఋజువులు, రుద్రాది దేవ గంధర్వుల వఱకు గల దేవతల యందు, |
| 4. | సజాతివిభూతి | సక్రమమైన జ్ఞానముతో కూడిన దేవగంధర్వుల నారంభించి తృణాంతమైన ముక్తి యోగ్యుల వఱకు, అభ్యాగత, అతిథి యతి, వనస్థ - గృహస్థ, వటు, ప్రభు, స్వజన, పరజనము లందు. |
| 5. | నైజవిభూతి | ఆయా జీవుల స్వరూపము లందు. |

పథ నవగ్రహ యోగ కరణ భ
తిథి సితాసిత పక్ష సంక్రమణ పనదధిష్ఠాన॥ 3

తే॥ ప్రతిమలందు సాలగ్రామ తతిని గోవు
లతిథి యభ్యాగతి తులసి యతి వనస్థ
పిప్పల గృహస్థ వటువుల పృథ్వి స్వపర
జనుల జల శిఖి పవన నక్షత్ర మార్గ.

క॥ పర యజమాన నవగ్రహ
కరణ భ యోగ ద్విపక్ష కంబులుఁ దిథులున్
మఱియున్ సంక్రమణంబులు
హరికి నధిష్ఠానములుగ నలరుచునుండున్.

తా॥ ప్రతిమలు, సాలగ్రామములు, గోవులు, అతిథి అభ్యాగతులు, తులసి, యతులు, వనసంచారులైన ఋషులు, అశ్వత్థ వృక్షము, గృహస్థులు, బ్రహ్మచారులు, భూమి, స్వజనులు పరజనులు, జలము, అగ్ని, గాలి, ఆకాశము, యజమానుడు, నవగ్రహములు, కరణములు యోగములు గ్రహ మండలము, శుక్ల కృష్ణ పక్షములు, తిథులు, సంక్రమణకాలములు ఇవియన్నియు శ్రీ లక్ష్మీపతియైన పరమాత్ముని విభూతి రూపములకు అధిష్ఠానములని తెలియవలయును.

ఈ 28 అధిష్ఠానముల వివరణము:

| సంఖ్య | విభూతల పేర్లు | అధిష్ఠానములు |
|---|---|---|
| 1. | నీత విభూతి | నిత్యముక్తయైన రమాదేవి యందు |
| 2. | సాధారణవిభూతి | మిశ్రమజ్ఞానులైన నిత్యసంసారుల యందు |
| 3. | విశేషవిభూతి | నవగ్రహదేవతలందు, అశ్విన్యాది నక్షత్రముల యందు, బ్రహ్మాది ఋజువులు, రుద్రాది దేవ గంధర్వుల వఱకు గల దేవతల యందు, |
| 4. | సజాతివిభూతి | సక్రమమైన జ్ఞానముతో కూడిన దేవగంధర్వుల నారంభించి తృణాంతమైన ముక్తి యోగ్యుల వఱకు, అభ్యాగత, అతిథి యతి, వనస్థ - గృహస్థ, వటు, ప్రభు, స్వజన, పరజనము లందు. |
| 5. | నైజవిభూతి | ఆయా జీవుల స్వరూపము లందు. |

| సంఖ్య | విభూతుల పేర్లు | అధిష్ఠానములు |
|---|---|---|
| 6. | అహిత విభూతి | ప్రతిమ-గోవు, శ్రీతులసి, అశ్వత్థ వృక్షములయందు. |
| 7. | సహజవిభూతి | సాలగ్రామము, పృథ్వి, జలము, అగ్ని, వాయువు - తారా పథము, యోగము, కరణము, తిథి, పౌర్ణమి - అమావాస్య, దశమి-ద్వాదశి-సంక్రమణముల యందు |
| 8. | విజాతివిభూతి | తమోయోగ్యులందు. |
| 9. | ఖండ విభూతి | అర్జునాదుల యందు. |
| 10. | అఖండ విభూతి | బ్రహ్మాది ఋజువుల యందు |

మూ. కాదకాంచనదొళగె శోభిప
ఆదితేయాస్యన తెరది లకు
మీధవను ప్రతిదినది శాలిగ్రామదొళగిప్ప।
ఐదు సావిర మేలె మూవ
త్త్రైదధిక ఐనూరు రూపది
భూధరగళభిమాని దివిజరొళిప్ప ననవరత॥ 4

మంజరీద్విపద

కాచిన బంగారు కాంతులన్ మీఱు
నగ్ని చందంబున నయ్యచ్యుతుండు
విమల సాలగ్రామ వితతుల యందు
నొక్కొక్కదానిలో నుజ్జ్వలుడగుచు
నైదువేలకుఁ బైన నైదునూర్లికను
ముప్పది యైదగు ముఖ్యరూపముల
దేవతావళి యందు దీ పించు మఱియు

తా॥ మూడవ విభూతి విశేష విభూతి. దీనికి సంబంధించిన వారు ఋజువుల కంటెను వేరైన రుద్రాది దేవతలు. అఖండ విభూతి శబ్దముతో బ్రహ్మాది ఋజువులు గ్రాహ్యము. వీరు అఖండ విభూతికి సంబంధించిన వారు. ఈ రెండింటిచే దేవతా సమూహములన్నియు వచ్చినట్లయినది. ఏడవది సహజ విభూతి. సాల గ్రామ మందు సహజ విభూతి. ఇందువలన 1. సాలగ్రామము.

2.క్షేత్ర భూమి. 3. తీర్థములు. 4. అగ్ని. 5. వాయువు. 6. తారా పథము. 7. యోగము. 8. కరణము. 9. ఏకాదశి తిథి 10. పౌర్ణమి. 11. అమావాస్య. 12. ద్వాదశి. 13. సంక్రమణము. ఇవి యన్నియు వచ్చినట్లయినది. మొత్తము పైన ఈ పద్యముచే మూడు విధములైన విభూతులు వాని అధిష్ఠానముల యందు అవిచ్ఛిన్నముగా సదా పరమాత్మని విభూతి రూపములుండునని తెలియువలయును.

మూ. శ్రీరమణ ప్రతిమగ ళొళగె హది
మూరధిక వాగిప్ప మేలై
నూరు రూపవ ధరిసి ఇప్పను అహితాచలది।
దారు మథనవ గైవ పావక
తోరువంతె ప్రతీక సురదొళు
తోరుతిప్పను తత్తదాకారదలి నోళ్పరిగె॥ 5

చ॥ ప్రతిమల యందు నూర్లయిదు పైఁబదు మూఁడగు నట్టి రూపముల్
సతతము దాల్చి యచ్యుతుఁడు సంతసమున్ వెలుగొందువాఁడగున్
క్షితి పయినాహితాఖ్యయగు శిష్ట విభూతిని దారు వందున
ద్భుతమగుచున్న యగ్ని గతి భూరి ప్రతీకల దేవతా వలిన్.

తా॥ శ్రీమన్నారాయణుడు స్వర్ణాది దశవిధములైన ప్రతిమల యందు అయిదు నూట పదుమూడు రూపములను ధరించి యుండును. (ప్ర-3 తి-1 మ-5) 513. ఏ ప్రతిమల యందనగా? అచలమైన ప్రతిమల యందు అహిత విభూతి రూపముతో నున్నాడు. ఆ అహిత విభూతి ఆరవ సంఖ్యా విభూతి దీని కూడ చేరినది.

వివరణము

1. గోవు : ప్రసవానంతరము (వత్సము గల గోవు)

2. శ్రీతులసి : ఉత్పత్తి తరువాత మూడు నెలలపై బడినది.

3. అశ్వత్థ వృక్షము : వివాహమైనది.

4. ప్రతిమ : ప్రతిష్ఠ అయినది. కాష్ఠము నందు మథనము చే అగ్ని కనపడునట్లు ప్రతిమ యందు పరమాత్ముడు అడగి యున్నాడు.

మూ. కరణనియామకను తానుప
కరణ దొళ నై పత్తెరడు సా
విరద హదినాల్కధిక శతరూపంగళనె ధరిసి॥
ఇరు తిహను తద్రూప నామగ
ళరితు పూజిసుతిహర పూజెయ
నిరత కై గొంబను తృషార్థను జలప కొంబంతె॥ 6

చ॥ కరణ నియామకుండయిన కంజదళాక్షుడు నింద్రి యావలిన్
నిరతము వెల్గురూపముల నెమ్మిగ నేఁబదిరెండు వేలపైఁ
బరగెడు నూరునుంబది యు నాలుగు లెక్క ధరించి తత్క్రియం
బరసిన వారిపూజఁగొను నంబువుఁగ్రోలు తృషార్థు కైవడిన్.

తా॥ జ్ఞానేంద్రియములారు. ఏవన చక్షురాదులు అయిదు. మనస్సు 1. మొత్తము ఆరు ఉపకరణములు. పాణి పాదాది పంచకర్మేంద్రియములు అయిదు. మొత్తము పదునొకండు. జ్ఞానేంద్రియములకు కర్మేంద్రియములు సహకారలగుటచే ఉపకరణములని పిలువ బడినవి. ఆ సహకారిత్వ మెట్లనగా:

| I | | |
|---|---|---|
| 1. సహకారవృత్తి<br>2. ప్రాణ వాయువు<br>3. అనిరుద్ధ రూపివర<br>4. ఘ్రాణేంద్రియము<br>5. గంధతన్మాత్రము. | గంధగ్రహణము<br>విషయలయము<br>యావత్తు అభిమాని పరము | వీనిచే సహితమైన అనిరుద్ధరూపి పరమాత్ముడు కర్మేంద్రియమైన ఉపస్థతత్త్వమందు లయమునొంది అట్లే పృథ్వీ సంకేతమైన అన్నమయకోశమందు లయమొందును. అప్పటికి గంధజ్ఞానము నాసికేంద్రియమునకు కలుగును. ఈ కారణముచే కరణశబ్దమైన జ్ఞానేంద్రియములకు, ఉపకరణములైన కర్మేంద్రియములకును వచ్చుటయైనది. ఇదే ప్రకారము జ్ఞానేంద్రియములు యావత్తును గ్రాహ్యము. |
| **II** | | |
| 1. రసనము<br>2. చిత్తము<br>3. అపాన వాయువు | రసగ్రహణము<br>విషయము<br>యావత్తు<br>అప్పటికి | వీనిచే సహితముగా గుహ్యేంద్రియ మందు లయమునొంది ప్రాణమయ సాంకేతమైన అప్ కోశమందు లయమొందును. అప్పటికి రసజ్ఞానము జిహ్వేంద్రియమునకగును. |

| | | |
|---|---|---|
| 4. జిహ్వేంద్రియము<br>5. ప్రద్యుమ్నుడు | దేవతాపరము | |
| III.<br>1. రూపము<br>2. బుద్ధి<br>3. వ్యాన<br>4. సంకర్షణుడు<br>5. చక్షురింద్రియము | రూపగ్రహణము విషయము యావత్తు అభిమాని దేవతా పరము | వీనిచే సహితముగా పాదేంద్రియ మందు లయమొంది మనోమయ కోశమైన తేజః కోశమందు వాయువులయ మొందును. అప్పటికి రూపము విషయము చక్షురింద్రియమునకు జ్ఞాతమగును. |
| IV<br>1. స్పర్శము<br>2. మనస్సు<br>3. ఉదాన వాయువు<br>4. వాసుదేవుడు<br>5. త్వగింద్రియము | స్పర్శగ్రహణము విషయము యావత్తు<br>అభిమాని దేవతాపరము | వీనిచే సహితముగా పాణింద్రియ మందు లయమొంది విజ్ఞాన మయ కోశమైన వాయు కోశమందు లయమొందును. అప్పటికి శీతోష్ణ మృదు కఠినములు త్వగింద్రియ మునకు జ్ఞాతమగును. |
| V.<br>1. శబ్దము<br>2. అంతఃకరణము<br>3. సమానవాయువు<br>4. నారాయణుడు<br>5. శ్రోత్రేంద్రియము | శబ్దగ్రహణము విషయము యావత్తు<br>అభిమానిదేవతాపరము | వీనిచే సహితముగా వాగింద్రియ మందు లయమొంది ఆనంద మయ కోశ సాంకేత మైన ఆకాశమందు లయమొందును. వాయువు అప్పటికి శబ్ద విషయము శ్రవణేంద్రియమునకు జ్ఞాత మగును. |

| సంకర్షణుడు | అహంకారము | చిత్తము | బుద్ధి | మనస్సు | అంతఃకరణము / ఆకాశము |
|---|---|---|---|---|---|
| | ప్రాణవాయువు | అపానము | వ్యానము | ఉదాన / వాయువు | సమానము |
| ప్రద్యుమ్నుడు | ఘ్రాణేంద్రియం | జిహ్వ | తేజస్సు / చక్షురింద్రియము | త్వగింద్రియము | శ్రోత్రము |
| | గంధము | అప్పు-రస / రసము | రూపము | స్పర్శము | శబ్దము |
| అనిరుద్ధుడు | పృథివి / ఉపస్థ | వాయువు | పాదము | పాణి | వాక్కు |

మూ. బింబ రూపను ఈ తెరది జడ
పొంబ సుర మొద లాద సుర రొళ
గింబుగొండిహనెందరిదు ధర్మార్థకామగళ
హంబలిసిదనుదినది విశ్వకు
టుంబి కొట్ట కణాన్న కుత్సిత
కంబళియె సౌభాగ్య వెందవ నంఘ్రిగళ భజిసు॥ 7

ఉ॥ బింబ సురూపకుండయిన వెన్నుఁడు తా జడ చేతనాళిలో
నంబుజసూతి యందు నలరారుచు నుండునటంచు ధర్మకా
మంబులఁ జిత్తమందు నభిమానము సూపక శౌరి యిచ్చు నా
కంబళమున్ గణాన్నమె సుఖంబిని శ్రీహరినిం భజింపుమా.

తా॥ స్వదేహాంతర్గతుడైన బింబ రూపి పరమాత్ముడు పూర్వోక్తమైన రూపములచే జడ ప్రతిమల యందును చేతన ప్రతిమలైన బ్రహ్మాదులే మొదలైన తత్త్వాభిమాని దేవతల యందును ఆశ్రయము చేసికొని యున్నాడని తెలిసిన వాడవై యుండుము. అనగా అధిభూత పరిదృశ్య మాన అధిష్ఠానము అధిదైవతాంతర్యామి దేవతల యందును అధ్యాత్మ తదంతర్యామియైన పరమాత్ముడని తెలిసి పరమాత్ముని స్వదేహమునందును ప్రతిమ యందును పూజచేయుచు ధర్మలోక

సంబంధమైన ప్రాకృతములైన సకామ ధర్మములను అపేక్షింపక నిష్కాముడవై యుండుము. ఎట్టి దారిద్ర్యము ప్రాప్తించినప్పటికిని అదే సౌభాగ్యమని తెలిసి హృదయాకాశమందున్న బింబరూపి పరమాత్ముని అపరోక్షమును కోరిన వాడవై ఏకాదశేంద్రియములతో అతని పాదద్వయమును సేవించు వాడవగుము..

వి॥ అముక్త దశాకాలమందు నుచ్చున్న సదృశమైన ఖండ జ్ఞానము ఛిద్ర కంబళమునకు సదృశమైన ఛిద్ర భక్తి నొసగును. అఖండ జ్ఞానమును, అఖండ భక్తిని యజాలదు. ఇట్టి జ్ఞాన భక్తులకు సౌభాగ్య సాంకేతమైన స్వరూపానంద భోగమునకు కారణమైన అతిశయమైన భాగ్యమని పరమాత్ముని భజింప వలయును.

మూ॥ ... యొళగిప్పత్తు నాలుకు
మూరెరడు సావిరదమేల్ ము
న్నూర హది నేళెనిప రూపవు శ్రీతుళసిదళది।
నూర అరవత్తొందు పుష్పది
మూరధిక దశ దీపదొళు నా
నూరు మూరు సుమూర్తి గళు గంధదొళగిరుతిహవు॥ 8

సీ॥ ఇరువదినాలుగు హరి రూపముల్లు వారి
యందున వెలుగొందు ననుదినంబు
నైదు వేల్మున్నూరు నాపయిబదునేడు
రూపాలదులసిలో రూఢి వెలయు
బుష్పంబులందునఁ బుండరీకాక్షుండు
నూటరువది యొందు సాటి నలరు
దీపంబు నందునఁ దే జరిల్లుచు నుండు
బదుమూడు రూపాల బ్రబల కాంతి

తే॥ నాల్గు నూర్లపై మూడుగా వెల్గురూప
విమల మూర్తుల గంధమున్ వెలయు నిట్టి
శౌరి సద్రూప వివరంబు జక్క నెఱిఁగి
యర్చనము సేయగాదగు నహరహంబు

తా॥ ఇన్నిరూపములు తెలియుట వలన ప్రయోజన మేమనగా? ప్రతి మాంతర్యామియైన పరమాత్మునకు పూజా ద్రవ్యముల యందున్న పరమాత్మునకు పరస్పరము ఐక్య చింతన రూపముచే పూజ చేయవలయును. ఇదియే మంచిదైన పూజ యగును. ఇట్లు అనుసంధానముతో కూడిన పూజ చేసినచో పరమాత్ముడు తన స్వాఖ్యమును స్వీకారము చేయును. ఇదే ప్రకారము నివేదన ద్రవ్యముల యందు తదంతర్యామియైన పరమాత్ముని రూపములకు ఐక్యచింతనము చేసి సమర్పించిననే గాని అను సంధానము లేక సమర్పించుట వలన ప్రయోజనము లేదు.

మూ. అష్టదళ సద్హృదయ కమలా
ధిష్ఠితను తానాగి సర్వో
త్కృష్ట మహిమను దళగళలి సంచరిసుతొళగిద్దు।
దుష్టరిగె దుర్బుద్ధి కర్మవి
శిష్టరిగె సుజ్ఞాన ధర్మ సు
పుష్టిగైసుత సంతైప నిర్దుష్ట సుఖ పూర్ణ॥ 9

ఉ॥ అష్టదళాఖ్యమైన హృదయాంబుజ పీఠి విరాజియౌ మహో
త్కృష్ట గుణుండు నిచ్చలుఁ జరించుచునుందు దళంబులందునం;
దుష్టులఁ గూర్చు దుష్కృతియు దుర్మతియున్ మఱి శిష్టకోటికు
త్కృష్ట సుధర్మ జ్ఞానముల నెంతయుఁ బ్రీతి సుఖ ప్రపూర్ణుడై.

తా॥ రమా బ్రహ్మాదుల కంటె నిర్దుష్టమైన అతిశయమైన మహిమలతో కూడిన మూలేశుడను పేరు గల పరమాత్ముడు మనస్సను ఇంద్రియమునకు గోళకమైన హృదయమను గోళక మందున్న అష్ట దళమైన కమలము నందున్న కర్ణిక మూల భాగమందుండుటచే అతనికి మూలేశుడని పేరు. అతడు అంగుష్ఠాగ్రమంతటి పరిమాణము గలవాడు. అష్ట బాహువులు గలవాడు. నారాయణుడని పిలువ బడును. ఈ మూలేశుని పాదమూల మందు అనిరుద్ధ దేహముతో కూడిన జీవుడున్నాడు. ఈ విధమైన పరస్పర సంబంధముతో పరమాత్ముడు జీవుడు అవిచ్ఛిన్నులై యున్నారు. ఈ మూలేశుడు పరిపూర్ణమైన సుఖము గలవాడు. ఇతడు హృదయ కమలము నందలి దళసంచారముచే నానావిధములైన కర్మలతో కూడిన బుద్ధుల నొసగును. అనంతరము ఇంద్రియము లందున్న తత్త్వేశుల ద్వార కర్మరూపము లైన ద్వంద్వ వ్యాపారములను చేయును. స్థావరము లైన వృక్షాది జీవులకు బాహ్య జ్ఞానము లేదు.

జాగ్రదవస్థయును స్వప్నావస్థయును లేదు. అందువలన అష్ట దళము లందున్న మూలేశుని వ్యాపార మీ ప్రకారమని తెలుసుకొని ప్రతిమ యందు అనుసంధానము చేసి ఆవాహనము చేసి పూజించ వలయును.

మూ. విత్త దేహాగార దారా
పత్య మిత్రాది గళొళగె గుణ
చిత్త బుద్ధ్యా దింద్రియగళొళు జ్ఞాన కర్మదొళు।
తత్తదాహ్వాయనాగి కరిసుత
సత్య సంకల్పానుసారది
నిత్యదలి తా మాడి మాడిప నెందు స్మరిసుతిరు॥ 10

ఉ॥ విత్తశరీర సౌధములు ప్రేయసియున్ మఱి పుత్ర మిత్రులం
జిత్తము బుద్ధిమున్ను గల జీవుల యింద్రియ జ్ఞాన కర్మలం
దత్తదఖండ నామములఁ దాల్చుచు శ్రీహరి సత్యచిత్తుఁడై
యెత్తఱిఁ దానొనర్చి యొనరింపగఁ జేయును దేవకోటిచే.

తా॥ బంగారము వెండి మున్నగు లోహములచే నిర్మితమైనదియు, పంచ భూతములచే నిర్మితములైనదియు నగు స్థూలదేహమును, దేహము గృహము భార్య పుత్రీ పుత్రులు స్నేహితులు మొదలైన మూడు విధములైన చేతనుల యందును, అట్లే ఆయాచేతనుల స్థూలదేహములందున్న సత్వాది గుణత్రయమును, మనోవృత్తియైన చిత్తము, బుద్ధి, మనస్సు, అహంకారము, అంతఃకరణములను, వృత్తుల యందును గోళకము లందలి ఇంద్రియములైన జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు వీని అన్నిటి యందు ఆయా అధిష్ఠానములకు ఏయేనామములో ఆయా నామములచే అంతర్యామియై అనాదియైన కర్మాను సారముగా చేయింపదగిన కర్మ లిట్టివని సంకల్పము చేయువాడై యున్నాడు. ఇట్టి సంకల్పానుసారము ప్రతి క్షణము స్థావర జంగమాదులచే ఏయే కార్యములు కావలయునో ఆయాకర్మములను మొదట తాను చేసి తత్త్వేశుల ద్వార జీవునిచే చేయించును. బింబ క్రియ ద్వార ప్రతి బింబ క్రియ జరుగునని స్మరింప వలయును. అనాది కర్మయనునది యీశ్వర రచితమైనది కాదు. లింగ దేహోపాధి యందు కర్మము అనాదియైనది. ఈ అనాది లింగదేహము యీ శ్వరునిచే రచితమైనది కాదు. అస్పృశ్యులైన జీవరాసుల యొక్క లింగదేహము లందు బీజ భూతమై జడ కర్మలుండినవై సూక్ష్మ సృష్టి కాలమునకు అంకురమగును. ఇది గుణవైషమ్యమును చేయనగును.

ము. భావ ద్రవ్య క్రియగళెనిసువ
ఈ విధాద్వైతత్రయం గళ
భావిసుత సద్భక్తియలి సర్వత్ర మరియదలె।
తావకను తానెందు ప్రతిదిన
సేవిసువ భక్తరిగె తన్నను
ఈవ కావ కృపాళు కరివరగొలిద తెరదంతె॥

శా॥ భావ ద్రవ్య క్రియాభిధాన త్రివాధాద్వైతంబు భావింపుచు
న్నేవేళం బహుభక్తి శౌరికినిఁ దానెంతే నధీనుండుగా
భావంబందు దలంచి తన్గొలుచు నాభక్తాలి రక్షించుల
క్ష్మీవంద్యుండు గజేంద్రుఁ గాచినగతిన్మేలౌ దయా సంపదన్.

తా॥ భావ, ద్రవ్య, క్రియలని అద్వైతములు మూడు విధములు. అట్టి అద్వైత త్రయమును ఎల్లప్పుడు మనస్సులో అనుసంధానము చేయుచు భక్తితో పరమాత్మున కధీనులైన వారై ఎవరు తన్ను సేవింతురో అట్టి భక్తులను దయామయుడును లక్ష్మీపతియు నైన శ్రీహరి గజేంద్రుని రక్షించునట్లు రక్షించును.

అద్వైతత్రయ వివరణము

(1) భావాద్వైతము: మహదాది కార్యములందు, ప్రకృతి తద్గుణాఖ్య కార్యములందున్నట్టి భగవద్రూపములకు ఐక్యచింతనము చేయుటయే భావాద్వైతమనబడును.
(2) ద్రవ్యాద్వైతము: ఆత్మ జాయాదులందును అర్థకామాదు లందును విద్యమానమైన భగవద్రూపములకు పరస్పరము ఐక్య చింతనము చేయుట. ఇది భగవద ధీనమని తెలియుటయే ద్రవ్యా ద్వైతము.
(3) క్రియాద్వైతము: మనోవాక్కాయములచే చేసిన సర్వ కర్మల యందు విద్యమానమైన భగవద్రూపములకు పరస్పరము ఐక్య చింతనము చేయుటయే క్రియాద్వైతము.

(1) భావము: మహదాది తత్త్వములు దీనికి ఉపాదానకారణములైన గుణత్రయములు మూల జడ ప్రకృతి ఇవి యన్నియు భావములు.
(2) ద్రవ్యము: ఆత్మ జాయాదులు, అర్థ జడములు ఇవి యన్నియు ద్రవ్యములు.
(3) క్రియ: మనో వాక్కాయములచే పరబ్రహ్మ యందు సర్వ కర్మ సమర్పణము చేయుట. ఇది క్రియ మొత్తము మూడు విధములైనవిగా భాగవతము నందు చెప్పబడినది.

మూ. బాందళవె మొదలాదుదరొళాం
దొందరలి పూజాసుసాధన
వెందెనిసువ పదార్థ గళు బగె బగెయ నూతనగి।
సందణిసి కొండిహవు ధ్యానకె
తందినితు చింతిసి సదా గో
విందన నర్చిసి నోడు నలినలిదాడు కొండాడు. 12

ఉ॥ అంబరమే మొదల్గలుగు నైదువిధంబుల భూతరాశిలో
సంబరమొప్ప నర్చన సుసాధనలందు ననేక నూతన
త్వంబగు ద్రవ్యముల్దలఁచి దానినిఁ జింతన మాచరించిని
త్యంబు భజించి చూచి ముదమార నటింపుచుఁ బాడుఁడెంతయున్.

తా॥ ఆకాశము మొదలగు పంచభూతములలో ఒక్కొక్క దాని యందు హృదయము నందున్న వాసనాబింబము, బాహ్య మందు పూజింప దగిన అచల ప్రతిమ యొక్క ఉభయ ప్రతి మాంతర్గతమైన భగవత్పూజ చేయుటకు మంచి పూజా సాధనము లనబడు ఆయా పంచభూతములకు గుణములైన శబ్దము స్పర్శము మొదలగు పదార్థములును తన్మాత్రలును అనేక నూతనములుగా వాని వాని యందు గుంపు కూడుకొని అచ్ఛిద్రముగా నిబిడీకృతముగా నున్నవి. ఈ ప్రకారమైన అనుసంధానముతో ధ్యానమునకు తెచ్చుకొనవలయును. ఈ పూజాసాధనముల యందు తదాకారముగా పరమాత్ముదున్నాడని ఎల్లప్పుడు చింతించి వేద ప్రతి పాద్యుడైన బింబ స్వరూపుని ప్రతిమాంతర్గతమైన రూపములకును పూజా సాధనల యందున్న రూపములకును ఐక్య చింతనము చేయవలయును. ఇట్లు చేసినచో ఈ ప్రపంచమునందలి పూజా సాధన ద్రవ్యము లన్నింటిచే పూజించిన వాడగునని తెలియుము.

మూ. జలజనాభనమూర్తిమనదలి
నెల గొళిసి నిశ్చల భకుతియలి
చళి బిసిలు మళెగాళిగళ నిందిసదె నిత్యదలి।
నెలదలిహ గంధవె సుగంధవు
జలవెరస రూపవె సు దీపవు 13
ఎలరు చామర శబ్ద వాద్యగ ళర్పిసలు ఒలివ॥

## పంచపాది

చ॥ జలరుహనాభుమూర్తి మదిఁ జక్కగనిల్పి యఖండభక్తిచేఁ
జలియును నెండ వానలను సంతతపుం దెగడంగమాని యీ
యిలఁగల సౌరభంబె మహనీయ సుగంధము, సద్రసంబగున్
జలమది; జ్యోతియౌరుచియుఁ; జామరమేయగు గాలి, శబ్దమే
చెలువగు వాయిదంబులని శ్రీహరికిచ్చిన మెచ్చు శౌరియున్.

తా॥ హృదయ గోళకమందు ప్రకాశించు పద్మనాభుని ఆకారమును మానసము నందలి వాసనచే స్థిరముగా నిలిపి అన్నిటి యందును ఆయా ఆకారములతో బింబ రూపకుడున్నాడని వానిని భారతీరమణ ముఖ్య ప్రాణాంతర్యామిగా చింతించి వాని యందే మనస్సు నిలిపి నిశ్చల భక్తితో బాహ్య విషయములను మఱచి చలి ఎండ వాన గాలి మున్నగు వానిని నిందింపక అన్నిటి యందును పరమాత్ముడున్నాడని అన్నియు అతని వ్యాపారములని పూజించువాడవగుము. భూమి యందలి సువాసననే గంధ మనియు, దివ్యమైన పుష్పములనియు, జలముల నర్పించుటయే గంగాది తీర్థాభిషేకములనియు తేజస్సు నర్పించుటయే అనేకములైన మంగళ హారతులనియు గాలియేచామరములనియు, శబ్దమునే అనేక మంగళ వ్యాదములనియు అను సంధానముతో పూజల నర్పించిన పరమాత్ముడు మెచ్చి స్వీకరించును.

మూ. గోళక గళు రమారమణన ని
జాలయ గళ నుదినది సంప్ర
క్షాలనెయె సమ్మార్జనవు కరణగళె దీపగళు।
సాలు తత్తద్విషయగళ స
మ్మేళనవె పరియంక తత్సుఖ
దేళిగెయె సుప్తత్తి గాత్మ నివేదనవె వసన॥ 14

ఉ॥ గోళకముల్ రమేశ్వరునకున్ సదనంబులు దాని నిచ్చలున్
క్షాళనమాచరించుటయె సాధము నూడ్చుట. దీపజాల మా
నాలయ రూపమైన కరణావలి తద్విషయంబు సెజ్జయౌ
మేలు సుఖంబె మంచమగు మెచ్చిడు చిత్తమె వస్త్రమియ్యెడున్.

తా॥ ఈ ప్రకారముగా అధికారియైన వాడు రాత్రి తాను పడుకొనునపుడు అనుసంధానము చేయవలయును. అపుడు ఇంద్రియ గోళము నందున్న

బింబ రూపునకు నేత్రాది యింద్రియము లే మందిరములనియు, దాని నుదకముచే సంప్రక్షాళనము చేయుటయే పరమాత్ముని మందిరమును ఊడ్చి శుద్ధి చేయుట యనియు, కరణములే దీపము లనియు, ఇంద్రియజన్యములైన విషయములే శయ్యయనియు, ఇంద్రియ సౌఖ్యములే మంచమనియు భక్తితో సమర్పించు చిత్తమే వస్త్రమనియు తలంచ వలయును. పరమాత్ముడు సంతోషించి సుఖ మొసంగును.

మూ. పాపకర్మవు పాదుకె గళను
లేపనవు సత్పుణ్య శాస్త్రా
లాపనవె శ్రీ తులసి సుమనో వృత్తిగళు సుమన।
కోప ధూపవు భక్తి భూషణ
వ్యాపిసిద సద్బుద్ధి ఛత్రవు
దీపవే సుజ్ఞాన వారార్తి గళె గుణకథన॥ 15

ఉ॥ పాపములైన కర్మములు పాదుకలయ్యెడు పుణ్యకర్మముల్
లేపన ద్రవ్యముల్ హరి సులీల కథాశ్రవణంబె శ్రీదళం
బేపగు చిత్తవృత్తులవియే సుమనంబులు కోప వృత్తియే
ధూపముగున్ సుభక్తియగు దోరపు భూషలు బుద్ధి ఛత్ర మౌ
దీప ములై వెలుంగును సుధీగుణగానము లొప్పు నారతుల్.

తా॥ సర్వేంద్రియములచే చేసిన శాస్త్ర నిషిద్ధమైన పాప కర్మలు పాదరక్షలు. అట్టి పాపముల నర్పించుటయే భగవంతునకు పాదుకలిచ్చుట. శ్రీహరియే సర్వోత్తముడని శాసనము చేయదగిన పుణ్యాకరమైన మధ్వశాస్త్రము, భాగవతాది సచ్ఛాస్త్రములు ఆలాపనము చేయుటయే బింబరూపకునకు చేయదగిన తులసీ అర్చనము. పరమాత్ముని విషయకమైన తత్త్వ విచారములచేయుక్తమైన మనోవృత్తులే దివ్య పరిమళ యుక్తమైన పుష్ప సమర్పణము. కోపమననదే స్రాఘ్రాణి పరిమళముతో కూడిన ధూపమును సమర్పించుట. (అనగా సద్విషయకమైన కోపము) భక్తియే అనేక విధములైన ఆభరణముల నిచ్చుట. నిర్దుష్టమైన ధ్యానముతో గూడిన బుద్ధియే ఛత్రము. తారతమ్య పంచ భేద జ్ఞానము తేజో రూపముగుటచే నవియే దీపములు. పరమాత్ముని కల్యాణ గుణముల కథనము చేయుటయే ఆరు విధములైన హారతులగును.

మూ. మనవచన కాయక ప్రదక్షిణె
యనుదినది సర్వత్ర వ్యాపక
వనరుహేక్షణ గర్పిసుత మోదిసుతలిరు సతత॥
అనుభవకె తందుకో సకల సా
ధనగళొళగిదు ముఖ్య పామర
మనుజరిగె పేళిదరె తిళియదు బుధరి గల్లదలె॥ 16

సీ॥ ఇంద్రియ దశకంబు హృదయాంబరస్థుఁడౌ
బింబరూపుని చుట్టు వెలిసి యుండు
నీ యింద్రియములలో నిచ్చతో మనమది
సంచార మొనరించు సంతతంబు
నిట్టి సంచారమే యీశునకొనరించు
వర ప్రదక్షిణములై పరలు చుండు
సర్వత్రో వ్యాపక శౌరి కర్పించుచు
సంతోష మొందుచు స్వాంతమందు

తే॥ ననుభ వంబునకును దెచ్చు కొనుము సకల
సాధనంబులలోనిది సార్థకముగ
నేమి చెప్పిన దెలియదు పామరులకు
దెలియగలరు సమర్థులై ధీరమతులు.

తా॥ దేహమునకు సంబంధించిన వచనేంద్రియమైన వాగింద్రియము మొదలుకొని దశేంద్రియములు హృదయాకాశమందున్న బింబమూర్తికి వలయా కారముతో చుట్టుకొని యున్నది. ఈ యింద్రియములందు మనస్సు సంచారము చేయునట్టి దగును. ఇట్టి సంచారమే ప్రతి దినము పరమాత్మునకు చేయదగిన ప్రదక్షిణ నమస్కారములు. సర్వేంద్రియవ్యాపకుడైన పరమాత్మునకు ఈ విధముగా సమర్పించుచు నిత్యమును సంతోషముతో నుండుము. సమస్త సత్కార్యములందు ఇది యే ముఖ్యము. అందువలన అనుసంధానముతో కూడిన వాడుగా ముందు చెప్పబడిన విషయములనే వివరముగా మనస్సుతో బింబరూపుడైన పరమాత్ముని పూజించుచుండుము. ఈ మార్గములు విషయాసక్తులైన భగవంతుని ధ్యానము చేయని మూఢ జనులకు చెప్పినను రుచింపదు. ఎవరు దీనిని అనుసరింతురో అట్టి జ్ఞానులకు ఈ విచారమును తెలుపవలయునే కాని అన్యులకు తెలుపరాదు.

మూ. చతుర విధ పురుషార్థ పడెవర
చతురదశ లోకగళ మధ్యదొ
ళితరుపాయగ ళిల్ల నోడలు సకల శాస్త్రిదలి।
సతత విషయేంద్రియగళలి ప్రవి
తత నెనిసి రాజిసువ లకు మీ
పతిగె సర్వసమర్పణెయు మహాపూజె సదుపాయ॥ 17

వ॥ పురుష చతుష్ట యార్థముల్ఁ బొందెడు వారికి లోకమందునం
దరయుగ లేదుపాయములు నన్యము లైనవి; శాస్త్రి సంఘముం;
దురు విషయేంద్రియంబుల మహోన్నతితో విలసిల్లు శ్రీరమా
వరునకు సర్వసమర్పణము వారక చేయుట గొప్ప పూజయౌ.

తా॥ బ్రహ్మ మొదలుకొని తృణాంతము వఱకు ముక్తి యోగ్యులైన జీవులు వారి వారి యోగ్యతానుసారముగా లింగదేహము భంగమైన తరువాత సాయుజ్య సామీప్య సారూప్య సాలోక్యములను నాల్గు విధములైన ముక్తులను పొంద గలరు. ఇట్టి ముక్తిని పొందుటకు అధికారులైన పురుషులకు ప్రయోజనకరమైన సాధనమే పరిపూర్ణమైన సాధనము. ఇట్టి సాధనము లేనిదే చతుర్విధమైన ముక్తిని పొందజాలరు. సత్య లోకముతో ప్రారంభించి పాతాళ లోకము వఱకు పదునాల్గు లోకముల యందుండ దగిన ముక్తి యోగ్యులైన జీవులకు లింగదేహ భంగమును పొందుటకు వేరు మార్గము లేదు. సకల శాస్త్రిములను పరిశోధించినను ఇంతకంటె సాధనోపాయములేదు. సకలేంద్రియ విషయము లందు వ్యాప్తుడైన ఆయా పేర్లు గల పరమాత్మునకు సర్వేంద్రియ వ్యాపారములను సమర్పించుటయే మహాపూజ. దానివలన భగవదనుగ్రహమును పొందగలరు.

మూ. గోళకవె కుండాగ్ని కరణవు
మేలొదగి బహువిషయ సమిధెయు
గాళియుత్సవు కామధూమవు సన్నిధానార్చి।
మేళనవె ప్రజ్వాలె కిడిగళు
తూళిదానందగళె తత్త
త్కాల మాతుగళెల్ల మంత్రాధ్యాత్మ యజ్ఞవిదు॥ 18

సీ॥ గోళకంబేమాడ కుండాగ్ని యగుచుండుఁ
గరణము పైఁబయిఁ గలియవచ్చు
విషయంబులేవేవి వెలయునో యయ్యవి
చక్కగా వ్రేల్చెడి సమిధలరయ
నింద్రియవ్యాపార మేర్పడు కోర్కెయే
యనలంబు వెలిగించు ననిలమగును
కామమే ధూమంబుగానుండు నింద్రియ
సంసక్త విషయమే జ్వాలయగును

తే॥ మేళనంబగు ప్రజ్వాల మిణుగురులగు
నఖిల విషయ సంతోషమే యనుదినంబుఁ
దనరు సంభాషణములె మంత్రంబు లగుచు
నిదియె యధ్యాత్మ యజ్ఞమై మదినెఱుగుము.

తా॥ ఇంద్రియ గోళకమే హోమమునకు యోగ్యమైన అగ్నికుండము. గోళకము నందున్న యింద్రియములే అగ్నియగును. ఇంద్రియని యామకుడైన పరమాత్మునకు ప్రీతిగా పై పై వచ్చు విషయములే అగ్నిలో వ్రేల్వదగిన సమిధలగును. ఆయా యింద్రియములచే వ్యాపారము చేయ వలయునను కామమును పొందుట యే అగ్నిని వెలిగించుటకు విసర దగిన గాలి యగును. ఆయా యింద్రియ వ్యాపారము లందు మిక్కిలి ప్రీతితో పెట్టు మనస్సే కాష్ఠముతో వెలుగు మంట యగును. ఒక్కొక్క యింద్రియముతో గలియు మేళనమే ప్రజ్వాలయగును. ఆయా విషయముల సంతోషమే మంట నుండి వచ్చు మిణుగురులగును. ఆ విషయకమైన మాటలే మంత్రములగును. విషయానుభూతియే పూర్ణాహుతి యగును. ఇదియే అధ్యాత్మ యజ్ఞ మనబడును. అధ్యాత్ముడైన పరమాత్ముని ప్రీతికొఱకు చేయదగిన హోమమని తెలియుము.

మూ. మధువిరోధియ పట్టణకె పూ
ర్వద కవాటగళక్షి నాసిక
వదన శ్రోత్ర గళెరడు దక్షిణ ఉత్తరద్వార।
గుద ఉపస్థగ ళెరడు పశ్చిమ
కదగ ళెని పవు షట్ స రోజవె
సదన హృదయవె మంట పంగళు త్రిగుణగళెకలశ॥

19

## పంచపాది

ఉ॥ శ్రీనిధి పట్టణంబునకుఁ జెల్వగు తూర్పునద్వారమందునం
జానగు తల్పులక్షులును నాసికయున్ముఖ కర్ణయుగ్మముం
గానఁగ దక్షిణోత్తర ప్రకాశకవాటములౌ గుదంబుప
స్థానము పశ్చిమంబలరు తల్పులు షట్కమలంబె సౌధమౌ
మానస మంటపంబు వినుమా కలశంబు గుణత్రయంబగున్.

తా॥ పరమాత్మని వైకుంఠమను పట్టణమునకు ద్వారములున్న విధముగా దేహాంతర్యామియైన బింబరూపియైన భగవంతుని వర్ణనము చేయు అధికారుల యొక్క స్థూల దేహమను పట్టణమునకు రెండు నేత్రములు రెండు నాసికారంధ్రములు ముఖద్వారమైన నోరు ఈ అయిదును తూర్పుదిక్కునందలి ద్వారములు. రెండు చెవులు. దక్షిణము ఉత్తర దిక్కులందలి ద్వారములు. గుదము ఉపస్థ ఇవి రెండును పశ్చిమ ద్వారములు. మొత్తము. నాలుగు దిక్కుల యందును ద్వారములైనవి. బ్రహ్మ రంధ్రమే ఊర్ధ్వ ద్వారము దేహము నందలి సుషుమ్నా నాడిలో గుదము నారంభించి శిరస్సు అంతము వఱకు ఉండదగిన అయిదు కమలములు మొత్తము ఇరువది కమలములు ఒక దానిపై నొకటి ఆరుస్థానములు ఇవి పరమాత్మని సదనములు. హృదయమను గోళక మందలి మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అంతఃకరణము ఇవియే మంటపములు. ఈ మంటపములకు సాత్త్విక రాజస తామసములను గుణములే కలశములగును.

### వివరణము

1. చతుర్దళము లందు - అహంకార వృత్తి - గుద స్థానము
2. షడ్దళములందు - చిత్తము - నాభి
3. అష్టదళములందు - బుద్ధి - హృదయము
4. ద్విదళ మందు - మనస్సు - కంఠము
5. చతుర్దళములందు - అంతఃకరణము - భ్రూమధ్యము
6. ద్వాదశదళములందు - సర్వము మేళనము - శిరస్సు

మూ. ధాతుగళు సప్తావరణ ఉప
వీథ గళె నాడి గళు మద గళు
యూథప గళు సుషుమ్నా నాడియె రాజపంథాన॥

ఈ తనూరుహగళె వనంగళు
మాతరిశ్వను పంచ రూపది
పాతక గళెం బరిగళను సంహరిప తళవారII

20

సీII అగును ధాతువులు సప్తావరణంబులు
మఱి సుషుమ్నయె రాజమార్గమగును
తక్కిన నాడులు దనుజ విరోధికిఁ
జిల్లర మార్గాలు చెలువు మీఱ
నష్టమదంబు లుత్కృష్ట సేనానాథు
లును తనూరుహములే వనములగును
పంచరూపాత్మక ప్రాణుఁడై విలసిల్లు
పవమానుఁడీదేహ పట్టణమున

తేII కగును కావలిగాసెడు నట్టి దిట్ట
యైన తలవరి పాతకులైన యసుర
పాప నామక శత్రుల రూపు మాపు
శ్రీమనోహరు నాజ్ఞల చే సతంబు.

తాII ఈ దేహమను పట్టణమునకు సప్తధాతువులే సప్తావరణములు (సప్తప్రాకారములు) అగును. సుషుమ్నయను నాడియే రాజమార్గము. తక్కిన నాడులే ఈ రాజ మార్గమునననుసరించు చిల్లర మార్గాలు. ఇవి డెబ్బది రెండువేలు. అన్నమదము, అర్థమదము ప్రాయపుమదము, విద్యామదము, రాజ్య మదము, కులమదము, సత్కర్మమదము శీలమదము ఈ అష్టమదములు సేనానాయకులు. స్థూల సూక్ష్మములైన రోమములే పట్టణము చుట్టునున్న ఉద్యానవనములు. ఈ దేహాంతర్యామియైన జీవోత్తముడైన వాయుదేవుడే పట్టణమునకు కావలికాయు తలవరి. పాపాభిమానులైన అసురులచే వచ్చు పాపములను శత్రువులను భగవంతుని ఆజ్ఞచే వాయుదేవుడు సంహరించును.

మూ. ఇనశశాంకాదిగళె లక్ష్మీ
వనితె యరసన ద్వార పాలక
రెనిసుతిప్పరు మనద వృత్తిగళే పదాతిగళు।
అనుభవిప విషయంగళే ప

ట్టణకె బప్ప పసారగళు జీ
వను సువర్తక కప్పగళ కైకొంబ హరి తాను॥

తే.గీ. భాను చంద్రాదులే ద్వారపాలకులట
తగుమనోవృత్తులెల్ల పదాతులంట
యనుభవించెడు విషయంబు లగు సరుకులు
జీవుడే వర్తకుండట శ్రీధరుండు
కప్పములు దానుగొనునట కడుముదమున.

తా॥ సూర్య చంద్రులు మొదలైన వారు దేహమను పట్టణమునకు ద్వారపాలుకులు. ఎట్లనగా తూర్పుదిక్కు నందలి అయిదు ద్వారములకు దక్షిణ నేత్రాభిమాని సూర్యుడు వామనేత్రాభిమాని చంద్రుడు నాసిక ద్వారముల రెండింటికభిమానులైన నాసత్య దస్రులను అశ్వనీ దేవతలు. ముఖ ద్వారాభిమాని అగ్ని వీరు ద్వార పాలకులు. శ్రోత్రాభిమానులైన దిగ్దేవతలు ఉత్తర దక్షిణ ద్వారపాలకులు. గుద ద్వారాభిమాని మిత్రనామక సూర్యుడు ఉపస్థ ద్వారాభిమాని స్వాయంభువ మనువు వీరిద్దరు పశ్చిమ ద్వారపాలకులు. శిరోభిమానియైన బ్రహ్మదేవుడు ఊర్ధ్వ ద్వారపాలకుడు. మొత్తము పది ద్వారములకు ద్వారపాలకులు. మనోవృత్తులైన అష్టమదములే సేనానాయకులు. ఏకాదశ ఇంద్రియముల చే అనుభవించు అనేకమైన విషయములే పట్టణమునకు వెలుపల నుండి వచ్చు సరుకులు. జీవుడే ఆ సరుకులను బాగుగా వ్యాపారము చేయు మంచి వర్తకుడు. ఇట్టి పుణ్య పాపములను లాభనష్టములను పొందుచు జీవుడు జీవన మను వ్యాపారమును చేయుచున్నాడు. ఈ పట్టణమునకు ప్రభువైన బింబరూపుడైన పరమాత్ముడు తాను జీవునిచే కప్పములను స్వీకరించు చుండును. కప్పమనగా? జీవ భుక్తమైనది పోగా తదంతర్యామియైన తాను స్వాఖ్యరస విషయములను అనుసంధానముతో నిచ్చిన దానిని స్వీకారము చేయును.

మూ. ఉరుపరాక్రమ నరమనెగె దశ
కరణగళు కన్నడియ సాలుగ
ళరవిదూరన తద్విహారకె చిత్తమంటపవు।
మరళిబీసువ శ్వాస గళు చా
మర విలాసిని బుద్ధి దామో
దరగె సాష్టాంగ ప్రణామగళే సుశయనగళు॥ 22

ప॥ అలరదశేంద్రియంబులవి యాహరి రాజగృహంబులోపలన్
నిలిపిన నిర్పుటద్దములు నిత్యవిహారమొనర్పఁ జిత్తమే
చెలువగు మంటపంబు విలసిల్లెడు నూర్పులె చామరంబులా
లలనయుబుద్ధి శ్రీహరికి రమ్యమనఃకృత సత్ప్రణామముల్
దలఁప సదాశయానమగు తల్పములై విలసిల్లు నెంతయున్.

తా॥ బింబరూపుడైన పరమాత్మని రాజసౌధమునకు అనగా అష్ట దళకమలమను మందిరమునకు దశేంద్రియములు నిల్పుటద్దములగును. చిత్తమే అతని విహారమునకుపయుక్తమైన మంటపము. మాటిమాటికి వదలబడు నిట్టూర్పులే అతనికి చామరములు. ఇటువంటి పరమాత్మని యెదుట బుద్ధియే నర్తకిగా నర్తనము చేయు కాంత యగును. భక్తితో చేయునమస్కారములే అతడు శయనించు శయ్యలగును.

ము. మారమణనరమనెగె సుమహా
ద్వారవెనిసువ వదన కొప్పువ
తోరణ స్మశ్రుగళు కేశగళే పతాకెగళు।
ఊరి నడెవంఘ్రిగళు జంఘెగ
ళూరు మధ్యోదర శిరగళా
గారదుప్పరిగగళు కోశగళైదు కోణెగళు॥ 23

ప॥ హరివర రాడ్గృహంబునకు నాస్యమె ద్వారము తోరణంబు సుం
దరమగు మీసమే ధ్వజమునాఁజెలువొందు తనూరుహంబులే
మఱిపద జంఘలూరువులు మధ్యము కుక్షి శిరంబులాది యు
ప్పరిగలు పంచకోశములు భవ్యగృహాంతర పంచకోణముల్.

తా॥ హృదయము నందు విరాజిల్లు పరమాత్మునకు ముఖమే మహాద్వారము. మహాద్వారము నకు మీసమేతోరణము. శిరస్సు నందలి కేశములే పతాకములు. పాదములు, జంఘలు, నడుము, శిరస్సు ఇవియే ఉప్పరిగలు. పంచకోశములు చిన్న చిన్న మందిరములని సమర్పింప వలయును.

ము. ఈశరీరవె రథ పతాక సు
వాస గళె పుండ్రగళు ధ్వజ సిం
హాసనవె చిత్తవు సుబుద్ధి యే కంళ పస్మనవె।

పాశగుణ దండత్రయగళు శు
భాశుభద్వయ కర్మ చక్ర వు
పాసమర్థాశ్వగళు దశకరణంగళెనిసువువు॥ 24

చ॥ తనువె మహారథంబగు పతాకలు వస్త్రము లూర్ధ్వ పుండ్రముల్
దనర ధ్వజంబు నాసనము తాహృదియుం గలశంబు బుద్ధి స
న్మనమది పాశమౌ త్రిగుణతత్త్వము దండములౌ శుభాశుభం
బనదగు కర్మ చక్రములు నాకరణంబులె తత్తురంగముల్.

తా॥ పరమాత్మునకు ఈ స్థూల శరీరమే రథము. ఆ పరమాత్ముడే రథము నందలి యజమాని ధరింప దగిన వస్త్రములే పతాకములు. ద్వాదశ నామములే ధ్వజములు. షడ్దళకమలము నందలి చిత్తమే అతనికి సింహాసనము. తార తమ్య జ్ఞానముతో కూడిన దృఢమైన బుద్ధియే సింహాసనపు కలశము. సాత్త్వికమైన ఆలోచనముతో కూడిన మనస్సే గుఱ్ఱములను కట్టు పగ్గములు. త్రిగుణములే రథ చక్రములకు ఇరుసులు. పది యింద్రియములే గుఱ్ఱములు. పుణ్య పాప కర్మములే చక్రములు. మొత్తము అధిభూత, అధ్యాత్మ, అధిదైవములను ఈ మూడింటిని సమన్వయము చేసి అనుసంధానము చేయవలయును.

మూ. మాత రిశ్వను దేహ రథదొళు
సూత నాగిహ సర్వకాలది
శ్రీతరుణి వల్లభ రథిక నెందరిదు నిత్యదలి।
ప్రీతి యిందలి పోషిసువ వా
తాతపాది గళిందలి విరత
ఈతనువినొళు మమతె బిట్టవనవనె మహయోగి॥ 25

చ॥ తనువను నీ రథంబున సదా రథ సారథి వాయుదేవుడా
వనరుహనాభుడే రథిక వర్యుడటంచు నెఱింగి యాజ్ఞలం
గొని కరణంబులన్నదుపు కోవిదుడెవ్వడు ద్వంద్వ దూరుడై
తను మమతా వికారముల దావహియింపడొ వాడె యోగియౌ.

తా॥ సమస్త వేదముల యందును సంచారము చేయు జీవోత్తముడైన ప్రధాన వాయుదేవుడు దేహమను రథమును అశ్వముల ద్వార నడిపించు నటువంటి

రథసారథియై యున్నాడు. బింబమూర్తియైన పరమాత్ముడు మహారథుడు తెలుసుకొని ప్రతిదినము నందు ద్వంద్వము లందలి ఆశలను వదలి భ పూర్వకముగా పరమాత్ముని భజించుము ఈ దేహాభిమానమును వద జ్ఞానిని విషయ సంబంధమైన దుఃఖము లంటకుండునట్లు సంరక్షించును

మూ. భవ వెనిప వనధి యొళు కర్మ
ప్రవహదొళు సంచరిసులిహ దే
హవ సునావెయ మాడి తన్నవరిందొడ గూడి।
దివస దివసగ ళర్లి లకుమీ
ధవను క్రీడిపనెందు చింతి సె
పవనయ్య భవాబ్ధి దాటిసి పరమసుఖవీవ॥ 26

చ॥ భవ మను సాగరంబునను వావిరికర్మ ప్రవాహ మందువం
దవిలి చరించు దేహమును నావయనంగ నొనర్చి శ్రీరమా
ధవుడు స్వబంధు యుక్తుఁడయి తానురమించునటంచు నెంచినం
బవన విభుండు ఘోర భవ వారిధి దాటఁగఁజేసి కాచెదున్.

తా॥ సంసారమను సముద్రమందు కర్మలను ప్రవాహ మందు సంచారము చేయుచున్న పాంచ భౌతికమైన స్థూల దేహమును మంచి బుద్ధిచే నావగా అనుసంధానము చేసి తన వారినందరితో గూడుకొని ప్రతిదినమందు లక్ష్మీ పతియైన పరమాత్ముని అనుసంధానముతో చింతింప వలయును. అట్లు చింతించినచో వాయుదేవుని తండ్రియైన సంకర్షణుడను పేరుగల పరమాత్ముడీ సంసార సముద్రము నుండి దాటించి ఉత్తమమైన స్వరూపానంద సౌఖ్యము నొసంగును.

మూ. ఆపణాలయ గత పదార్థవు
స్త్రీపురుష రుగళింద్రియ గళలి
దీప పావక రొళిదు తిహ తైలాది ద్రవ్యగళ
ఆ పరమ గవదాన వెందు ప
దే పదే మరియదలె స్మరిసుత
భూప నందది సంచరిసు నిర్భయది సర్వత్ర॥ 27

ఉ॥ ఆపణ మందిరాంతర పదార్థములన్ సమలంకృతంబులై
స్త్రీపురుషేంద్రియంబులను శెల్వగుభూషల నగ్నికుండమున్
దీపములందు వేయఁదగు నిర్మలమౌ ఘృత తైల ద్రవ్యముల్
శ్రీపతికిన్ సమర్పణము చేసి చరింపు విభుండనన్ ధృతిన్.

తా॥ వ్యాపారము చేయదగిన అంగడి యందు అనేక విధములైన పదార్థ సమూహములు స్త్రీపురుషులు ధరింప దగిన ఆభరణ సమూహములు దీపములందు వేయదగిన నూనె నేయి మొదలైన ద్రవ్యములును అట్లే అగ్ని యున్నగువాని యందుంచదగిన పదార్థములు ఆయా ద్రవ్యము లందు అంతర్గతుడైన పరమాత్మునకు అర్పణమని మాటి మాటికి అనుసంధాన పూర్వకముగా స్మరించుచు మహా సమర్థునియట్లు అహంమమతాలు వదలి సర్వ స్థలములందును సంచరింపుము.

మూ. వారిజ భవాండవే సుమంటప
మేరుగిరి సింహాసనవు భా
గీరథియె మజ్జనవు దిగ్వస్త్రిగళు నుడిమంత్ర।
భూరుహజ ఫల పుష్ప గంధ స
మీర శశిరవి దీప భూషణ
తారకగళెందర్పిసలు కైకొండు మన్నిసువ॥ 28

సీ॥ వారిజజాండమే వరమంట పంబని
బంగారు కొండయే భవ్యమైన
సింహాస నంబని శీతలవారి యౌ
జాహ్నవీ నదియె మజ్జనమటంచు
దిక్కులన్నియుజూడ దివ్య వస్త్రములని
మాట్లాడు మాటలే మంత్రములని
పాదపజంబులు ఫల పుష్పములటంచు
గంధవహంబె సద్గంధ మనియు

తే.గీ. నినశశాంకులు దీపంబులనియు మఱియుఁ
దారకాకోటులే యలంకారము లని

తలంచి యర్పింప శ్రీహరి తాఁగ్రహించి
పోషణము సేయు సుజనుల శేషపతియు.

తా॥ బింబమూర్తియైన పరమాత్మునకు బ్రహ్మాండమే వర మందిర మనియు మేరు పర్వతమే సింహాసనమనియు గంగానదీ జలమే అభిషేక మనియు దిక్కులే దివ్య వస్త్రములనియు ఎల్లప్పుడు మాటలాడు మాటలే వేద మంత్రములనియు వృక్షముల యందలి పత్ర పుష్పములే ఫలపుష్పములనియు గాలి యే సు గంధ పరిమళమనియు సూర్యచంద్రాదులే దీపములనియు నక్షత్రములే అలంకారములనియు సమర్పించినచో శ్రీ పరమాత్ముడు స్వీకరించి సజ్జనులను ప్రీతితో రక్షించును.

పదా. భూ సురరొళిప్పబ్జభవనొళు
వాసుదేవను వాయు ఖగప స
నాశివేంద్రను వివస్వాన్నామక సూర్య!
భేశకామమరాస్య వరుణా
దీ సురరు క్షత్రియరొళిప్పరు
వాసవాగిహ సంకరుషణన నోడిమోదిపరు॥ 29

తే.గీ. వెలయు భూసురులందున జలజభవుదు
వాసుదేవుండు వెల్గు నా బ్రహ్మ యందు
వాయు ఖగపతి శంకర ఫణిప శక్ర
యిన శశాంక రమాపతి తనయ వహ్ని
వరుణ ముఖ దేవతా తతి వరలు చంద్రు
క్షత్రియుల నందు నెఱుఁగుడీ స్వాంతమునను.

క॥ ఈ దేవతా గణంబున
మోదిత సంకర్షణాఖ్య పురుషోత్తముఁడా
మోదముతో విలసిల్లుమ
హోదరమున హరినిజూచి హర్షింతురుగా.

తా॥ బ్రాహ్మణ జాతియందు బ్రహ్మ అభిమానదేవతయై యున్నాడు. ఆ బ్రహ్మయందు వాసుదేవుడంతర్యామియై యున్నాడు. వాయుదేవుడు గరుడుడు రుద్రుడు శేషుడు ఇంద్రుడు సూర్యుడు చంద్రుడు మన్మథుడు అగ్ని వరుణుడు

ము. ఇరుతిహరు నాసత్యదస్రరు
నిర్ృతియు యమధర్మ యమ కిం
కరరు మేదిని కాలమృత్యు శనైశ్చరాదిగళు।
కరసి కొంబరు శూద్రరెందన
పరత శూద్రరొళిప్ప రివరొళ
గర విదూరనిరుద్ధ నిహనెందరితు మన్నిపుదు॥ 31

ము. వీతభయ నారాయణ చతు
ష్పాతు తానెందెనిసి తత్త
జ్జాతి ధర్మ సుకర్మగళ తా మాడి మాడిసువ।
చేతనర ఒళ హొరగె ఓత
ప్రోత నాగిద్దెల్లరిగె సం
ప్రీతియలి ధర్మార్థకామాదిగళ కొడుతిహను॥ 32

సీ॥ నాసత్య దస్రులు నైఋతికభిమాని
యమకింకరులు మఱి యమవిభుండు
మేదినియును కాలమృత్యు శనైశ్చరు
లాదిగాఁ గలయట్టి యమరవరులు
శూద్రుల యందును శోభిల్లు చుందురు
నిచ్చలువారిచే నియతులగుచు
నీ దేవతల యందు నీశ్వరుండగునని
రుద్ధుఁడున్నాఁడని రూఢిమీఱఁ
జేతనావలి యందుఁ జెలఁగునో తప్రోత
రూపుఁడై వ్యాపించి శ్రీపతియును.
తే.గీ. వెలయ నచ్ఛిద్ర రూపుఁడై వీత భయుఁడు
హరియు నారాయణాఖ్యుఁడై యఖిల కర్మ
ములనొనర్చుచుఁ జేయించుఁ గుల చతుష్క
మందు నవ్వారి కొసఁగు ధర్మార్థవితతి.

తా॥ శూద్రజాతి యందు అశ్వనీ దేవతలైన నాసత్య దస్రులును నైఋతి దిక్కుక భిమానియైన నిర్ృతియు యమధర్మరాజును యమకింకరులు భూమికభిమానియైన

మేదినియు మృత్యు దేవతయు శనైశ్చరుడును మొదలైన వారు అభిమాన దేవతలై యుందురు. ఈ అభిమాన దేవతలందు దోష రహితుడైన అనిరుద్ధుడు అధిపతి యై యున్నాడు. నిర్భయుడైన సర్వోత్తముడైన నారాయణుడు ఈ నాల్గు వర్ణముల యందుండిన వాడై సమస్తమైన కర్మలను తానొనరించి వారిచే చేయించు చున్నాడు. వారికి ధర్మార్థ కామాది పురుషార్థముల నిచ్చు చున్నాడు.

విధన ధనద విధాత విగతా
వ్యధిక సమాసమవర్తి సామగ
త్రిదశగుణ సంపూజ్య త్రికకుద్ధామ శుభనామ!
మధుమథన భృగురామ ఘోటక
వదన సర్వపదార్థదొళు తుది
మొదలు తుంబి హనెందు చింతిసు బింబరూపదలి॥ 33

సీ॥ బింబ రూపుండగు వెన్నుండు సంకర్ష
ణాఖ్యుడై జగతి సంహరణ చేయు
సంసృష్ట జగతిని సంరక్షం జేసి జీ
వులకు సాధన ద్రవ్యముల నొసంగు
వాసుదేవాంశచే బ్రహ్మం దదన్యుల
నండమున వెలుపల నటుసృజించు
కారణ మాఖ్యలు గలిగెను నిధనయు
ధనద విధాతాదు లొనర హరికిం

తే.గీ. జనుమ విగత వ్యాధిక సమా సమనువర్తి
సామగ త్రిదశగణ పూజ్యశుభనామ
మధుమథన త్రికకుద్ధామ మహాత్మ తురగ
వదన భృగురామ మనుమ్మగా బహు పదార్థ.

ఆ.వె. దాను అందు నిండి యుండెన్ను వాడని
వాసుదేవుడలప నెరయు బుధులు
వారి భక్తి తోడ స్వాంతంబు లోపల
బింబరూపుండగుచు వెలయు నతని.

తా॥ మూల రూపమైన నారాయణ రూపము నుండి బయలుదేరిన సంకర్షణ రూపముతో జగత్తును సంహారము చేయును. సృష్టించిన జగత్తును పాలనము చేసి జీవులకు సాధన ద్రవ్యముల నిచ్చువాడగును. వాసుదేవాంశచే యట్లు తదన్యుల అండము వెలుపల సూక్ష్మ సృష్టి చేయును. వేదములకు బ్రహ్మ సముదై తారతమ్య పంచ భేద జ్ఞాన యుక్తులైన ప్రాణులందును, తద్విపరీతజ్ఞానులైన ప్రాణులందును, ప్రవర్తించు వాడగును. సామవేదముచే స్తుతింపబడును. బ్రహ్మాది దేవతా సమూహముచే పూజితుడగును. మూర్ధ నిధములైన శ్రేష్ఠములైన అనంతాసనము శ్వేతద్వీపము వైకుంఠములను మందిరములు గలవాడు. మధుసూదన, హయగ్రీవ, పరశురామాది నామములు గలవాడై సమస్త పదార్థముల యందు నిండిన వాడై హృదయాంతర్యామియైన బింబరూపుడై యున్నాడని తెలియ వలయును.

మూ. కన్నడియ కైవిడిదు నోడలు
తన్నిరవు సవ్యాప సవ్యది
కణ్ణిగొప్పువ తెరది అనిరుద్ధనిగె ఈ జగవు।
భిన్నభిన్నవె తోరుతిప్పుదు
జన్యవాదుదరింద ప్రతిబిం
బన్నమయగానెందరిదు పూజిసలు కైకొంబ॥ 34

సీ॥ అద్దంబు చేఁబట్టి యాకృతిఁ గాంచినఁ
దన యొక్క రూపంబు దారుమారు
కనఁబడునట్లుగా ననిరుద్ధునకు జగం
బంతయు భిన్న భిన్నాకృతులను
గనఁబడుఁ బ్రళయమౌ కాలంబునందున
శ్రీహరి యుదరంబు సేరి మరల
సృష్టి కాలము నందు నిలలోన జనియింతు
రా ప్రతిబింబములైన తతులు

ఆ.వె. మయగుడంచు వాని మది లోనెఱుంగుచుఁ
దన్ను బూజ సేయు ధన్యజనుల
పూజ లెల్ల గొనును పురుషోత్తముండును
వరదయామయుండు వరదుఁడగుచు.

తా॥ అద్దమును చేతిలో దీసుకొని చూచినచో తన రూపము తనకు ఎదురుగా సవ్యముగా ప్రతి ఫలింపక అపసవ్యముగా గనపడును. అట్లు అవిరుద్ధునకు ఈ జీవులు భిన్నాంశులై కనపడుదురు కాని పరమాత్మునట్లు కన్పింపరు. ప్రళయ కాల మందు పరమాత్ముని ఉదరమును ప్రవేశించి సృష్టికాల మందు మూల రూపముచే అవతారములు బయలు దేరినట్లు మూలరూపుడైన పరమాత్ముని జీవులు వెలుపలికి వత్తురు. అందువలన మూల రూపము నుండి బయలు దేరిన రామకృష్ణాది అవతారములు అభిన్నాంశము లనియు అదే ప్రకారము మూలరూపుని ఉదరము నుండి వచ్చిన జీవులు భిన్నాం[illegible]ని పిలువబడుదురు. బింబరూపుని (జీవునకు బింబరూపియైన) పరమా మాత్ముని మయగుడందురు. జీవాంతర్యామియై జీవాకారమట్లు ప్రాచుర్యుడై అనాది నుండి యుందు వాడగును. స్థూల శరీర మందు జీవునకెదురుగా దేహాకార వ్యాప్తి యందు దానికి ప్రతిగా జీవుని స్వరూప మందు జీవాకారమట్లు హృదయాష్టదళ కమలము యొక్క కర్ణిక పై నుండదగిన అగ్రేశ నామకుడు. అనుసంధానముచే అతనిని పూజ చేసిన వారి పూజను స్వీకారము చేయును. దర్పణమను దృష్టాంతముచే ప్రతి బింబమైన జీవునకు బింబరూపియైన పరమాత్మునకు భేదమున్నదని తెలియ వలయును.

మూ. బింబరె నిపరు స్వోత్తమరు ప్రతి
బింబరెనిపరు స్వావరరు ప్రతి
బింబ బింబగళొళగె కేవల బింబ హరి యెందు।
సంభ్రమది పాడుతలి నోడుత
లుంబుడువుది దువుదు కొడువదె
ల్లంబుజాంబిక నంఘ్రి పూజెగ ళెందు నలిదాడు॥ 35

సీ॥ బింబము లంచును బిలువగాఁ బడుదురు
స్వోత్తమదేవత లిత్తెఱగున
స్వావరులెల్లరుఁ బ్రతిబింబులంచును
బ్రతిబింబ బింబాల ప్రతతియందు
బింబమౌ శ్రీహరి వెలయు చున్నాడని
సన్నుతించి భుజించు సద్రసములు
వసనంబులన్నియు వరభూషణంబులు
దానంబొనర్చెడు ద్రవ్యములను

ఆ.వె. సర్వ వస్తు తతులు సరసిజలోచను
నంఘ్రియుగళ పూజలనుచుఁ దలఁచి
చిత్తమందుఁ బొంగి చిందులు ద్రొక్కుచు
పరమ పదము నొందు వాఁడవగుము.

తా॥ స్థూల దేహమందలి ప్రతి బింబమైన జీవునకు దేవత లందరు బింబ రూపు లనబడుదురు. వారి యందు తారతమ్యముచే దేహము లందు స్వోత్తమ స్వావర దేవతలు దేహాకారముతో నున్నారు. వారి యందు దేహము లందలి స్వోత్తమ దేవతలు స్వావర దేవతలకు బింబ రూపులన బడుదురు. స్వావర దేవతలు ప్రతిబింబులన బడుదురు. కారణమేమనగా? దేహమే బింబము. నీడ ప్రతిబింబము. మన దేహము ఆడినచో నీడయు ఆడును. ఈ రీతిగా దేహము నందలి దేవతలు జీవునిచే కర్మలు చేయించ వలసినచో బింబ రూపులైన స్వోత్తమ దేవతల క్రియల ద్వార స్వావరులైన వారు తాము క్రియలను చేయుదురు. అందువలన స్వోత్తమ దేవతలు బింబరూపులనియు స్వావర దేవతలు ప్రతి బింబములనియు పిలువ బడుదురు. ఈ విధముగా ప్రతి బింబ బింబముల యందు అసదృశమైన వాడు బింబ రూపి పరమాత్ముడు. ఇతనికి నియామకుడు వేరొకడు లేడు. ఈ అనుసంధానముతో పరమాత్ముని చూచుచు పాడుచు కొని యాడుచు సమస్త పదార్థములను బింబ ప్రతి బింబ క్రియాదులు పరమాత్ముని పాద పద్మ పూజలని సమర్పించు చుండుము. అన్నియు అతని వ్యాపారములని తెలిసి సంతోషముతో నుండుము.

మూ. నదియజల నదిగెరెవ తెరదం
దదలి భగవద్దత్త కర్మగ
ళుదధిశ యనని గర్పిసుత ప్యాపృత్త నీనాగి।
విధి నిషేధాది గళొళగా
గదలె మాడుత దర్వియందది
పదుమ నాభన సకల కర్మగళల్లి నెనెపుతిరు॥ 36

చ॥ నదిగలనీట మజ్జన మొనర్పఁగఁ దన్నది నీరె యర్ఘ్య మిం
పొదపఁగ నిచ్చురీతిఁ బురుషోత్తమదత్త సమస్తకర్మ సం
పదల నొసంగి యాతనికి భవ్య నిరాశ శుభా శుభంబుల
స్మది హరి ప్రీతిఁజేయుచును మానక దర్విధాన నుండుమా.

తా॥ జనులు నదుల యందు స్నానము సేయ వలసినచో ఆ నది యందున్న జలమునే ఆ నదికి అర్ఘ్యము నిచ్చు విధముగా భగవంతునిచే నొసగ బడిన ద్రవ్యములను దేహేంద్రియాదుల రాదగిన అనేక విధములైన కర్మములను భారతీ రమణ ముఖ్య ప్రాణాంతర్యామియైన పరమాత్మని అను సంధానము తెలిసి చింతించి ప్రళ యోదక మందు శయనించిన నారాయణ స్వరూపుడైన బింబరూపుడైన పరమాత్మునకు నదికి అర్ఘ్యమిచ్చు నట్లు హృదయ మందలి పరమాత్మునకు ద్రవ్యాంతర్యామియైన పరమాత్మునకు ఐక్యమును చింతించి భగవద్రూపములచే భగవద్రూపముల కర్పించుచు అహంమమతా రహితుడవై శాస్త్రోక్తముగా చేయదగిన విధి యనియు తద్వ్యతిరిక్తమైనది నిషేధ మనియు తెలిసి పాపకార్యములను చేయక కర్మాకర్మలు పరమాత్ముని ఆజ్ఞ వలననే నడచునని జనులచే పక్వా పక్వ పదార్థములందు తిరుగుచుండు గరిటె వలె నుండి సర్వ కర్మములను నిర్లిప్తుడవై సమర్పించుచు ఆ పరమాత్ముని కొనియాడుచుండుము.

మూ. అరియదిద్దరు ఎమ్మొళిద్దన
వరత విషయగళుంబ జ్ఞానో
త్తరది తనగర్పిసలు చిత్సుఖవిత్తు సంతైప
సరితు కాల ప్రవహగళు కం
డరయు సరి కాణదిరె పరిపువు
మరళి మజ్జన పాన కర్మ గళింద సుఖ విహవు॥ 37

చ॥ ఎఱుఁగక యున్న చిత్తమున నెల్లపుడుండి భుజించు కర్మలన్
ఎఱిగిన మీద దానిడిన నీశుడు చిత్సుఖ మిచ్చి కాచు ద
ద్వరనది పర్వకాలిక ప్రవాహము గాంచిన కానకున్న స
త్వరమున బాఱకున్నె? జలపానము స్నానము సౌఖ్యమీయదే?

తా॥ అనుసంధాన విధానమును తెలియ కుండునప్పటికిని మన హృదయము నందలి పరమాత్ముడు దేహేంద్రియము లందున్న వాడై నిరంతరము త్రుటికాలమైనను వదలక ఆయా యింద్రియ కర్మముల బింబక్రియ ద్వార చేయించి తదాకార రూపములచే భుజించు వాడగును. తనకు సంబంధమైన విషయములను తాను స్వీకరించును. ఈ అనుసంధానమును తెలిసి భగవత్ప్రీతియగునని కృష్ణార్పణమని తన కర్పించిన స్వరూప సుఖమును వ్యక్తము గావించి పునర్జన్మ లేకుండునట్లు సంరక్షించును. నదులందు ప్రవహించు

ప్రవాహ జలమును జనులు చూచినను చూడకున్నను ప్రవహించును గం
ఆ విధముగా పరమాత్ముని వ్యాపారము నిలువక నడచు చుండును. గం
యందు స్నానము చేసిన వారికి దేహము నందలి అజ్ఞానము, కర్మము
తొలగింప బడి అహం మమతాదులు అజ్ఞానము పరిహారమై సౌఖ్యము
పొందునట్లు చేయబడును.

మూ. ఏను మాడువ కర్మగళు లకు
మీనివాసని గర్పిసనుసం
ధానపూర్వకదింద సందేహిసదె దినదినది।
మాననిధి కైకొండు సుఖవి
త్తానతర సంతైప తృణజల
ధేను తానుండనవరత పాల్గెరవ తెరదంతె॥

38

ఉ॥ ఏమి యొనర్చు కర్మల రమేశునకర్పిత బుద్ధి నీయు మా
నీమది శంకలేక ప్రతినిత్యము నయ్యవి తాగ్రహించి శ్రీ
ధాముడు సౌఖ్యమిచ్చి గుణధాములఁ బ్రోచుఁ దృణాంబు భోక్తమై
నేమము మీఱఁ బాలొసఁగు నిర్మలధేనువు వోలె నిచ్చలున్.

తా॥ హృదయమను అష్టదళ కమల మందు విరాజ మానుడైన బింబ రూపి
పరమాత్మునకు బింబ క్రియ ద్వార దేహేంద్రియములచే ఏయే కర్మలు
చేయుదువో ఆయా కర్మలను అను సంధాన పూర్వకముగా పరిపూర్ణమైన
భక్తితో అంతఃకరణ పూర్వకముగా భారతీ రమణ ముఖ్య ప్రాణాంతర్యామియైన
పరమాత్మునకు గృష్ణార్పమస్తు అని సమర్పింపుము. శుభాశుభ కర్మల నర్పించుట
యందు ఎంత మాత్రము సందేహింప వలదు. బహుమానమునకు యోగ్యమైన
కర్మములను ద్రవ్యములను స్వీకరించిన వాడై తారతమ్య యుక్తులైన జ్ఞానులు
సమర్పించిన వందనాదుల కుచితమైన జ్ఞాన భక్తి ఐశ్వర్యముల నిచ్చి
భగవంతుడు సంరక్షించును. ఎట్లు ఆవు తన యజమానిచే నీయబడిన గడ్డి
నీళ్ళను తీసుకొని మంచిపాల నిచ్చునో అట్లు పరమాత్ముడు తృణ జలములకు
సదృశమైన శుభాశుభ కర్మలను స్వీకరించి క్షీర సదృశమైన దివ్య స్వరూపా
నందమును అనుభవింప జేయును.

మూ. పూర్వ దక్షిణ పశ్చిమోత్తర
పార్వతీ పతి యగ్ని వాయు సు
శార్వరీకర (చర) దిగ్వ ల యదొళు హంస నామకను ।
సర్వకాలది సర్వరొళు సుర
సార్వభౌమను స్వేచ్ఛెయలి మ
త్తోర్వరిగె గోచరిస దవ్యక్తాత్మనెందెనిసి॥ 39

సీ॥ అష్ట దళాకృతి నలరారు హృద యాబ్జ
మందుఁ దూర్పున నింద్రుఁడలరుచుండు
దక్షిణమున యమ ధర్ముండు పశ్చిమం
బున వరుణుండును దనరుచుండు
నుత్తరంబునను దానుండుఁ గుబేరుండు
నీశాన్యమున రుద్రుఁడాశశియును
నాగ్నేయ మందున నగ్నియు వెలుగొందు
నైరుతి యందున నిర్ఋతియును

తే.గీ. ననిల దేవుండు వాయువ్య మందు నలరు
హంస నామక హరి వల యంబు మధ్య
నన్యులకు గోచరింపక యలరు నెపుడు
వ్యక్తుడ వ్యక్తుడనగ సత్యాత్ముడగుచు.

తా॥ హృదయ కమలము ఎనిమిది దిక్కుల యందును వ్యాపించి యున్నది. దీని యందు తూర్పు దళము నందు ఇంద్రుడున్నాడు. ఇతని యుపాస్యమూర్తి ఉపేంద్రుడు. దక్షిణము నందు యముడున్నాడు. ఇతని యుపాస్యమూర్తి శ్రీరామ చంద్రుడు. ఉత్తర మందు కుబేరుడున్నాడు. ఇతని ఉపాస్యమూర్తి కపిలనాముడైన పరమాత్ముడు. పడమరలో వరుణుడున్నాడు. ఇతని ఉపాస్యమూర్తి మత్స్యరూపి. ఈశాన్యమందు రుద్రుడు చంద్రుడు వీరిరువురున్నారు. వీరి ఉపాస్యమూర్తులు నరసింహుడు దధివామనులు. ఆగ్నేయ మందు అగ్నియున్నాడు ఇతని ఉపాస్యమూర్తి పరశురామదేవుడు. నైరుతి యందు నిర్ఋతి యున్నాడు. ఇతని ఉపాస్యమూర్తి జనార్దనుడు. వాయువ్య మందు ప్రవహ వాయుదేవుడున్నాడు. ఇతని ఉపాస్యమూర్తి హయవదనుడు. వీరి మధ్య గోళాకారముగా తిరుగుచు హంసనామక పరమాత్ముడున్నాడు. ఈ పరమాత్మునకు

మూలేశుడనియు నామాంతరమున్నది. శ్రీహరి తన సంకల్పానుసా[ర] సంచారము చేయుచు బుద్ధులను ప్రేరేపించు చుండును. అన్యశేష[ు]
కనబడక బ్రహ్మాదులకు కూడ తెలుపక యున్నాడు.

మూ. హరి ఇడావత్సరను సంప
త్సరదొళనిరుద్ధాది రూపవ
ధరిసి బార్హస్పత్య సౌరభ చాంద్రమను ఎనిసి
ఇరుతిహ జగన్నాథ విట్ఠల
స్మరిసు పవరను సంతయిప నెం
దురు పరాక్రమ నుచిత సాధన యోగ్యతెయనరితు॥ 40

సీ॥ హరియిడా వత్సర మందు సంపత్సర
మందు బార్హస్పత్య మందు మఱియు
సౌరభ మందును చాంద్రమ మందని
రుద్ధాది పంచక రూపములను
కడుకాంతి వెల్గు జగన్నాథ విట్ఠలుఁ
డను దినంబును దన్ను మనములందు
స్మరియించు వారిని సంరక్షణము సేయు
నెల్లకాలంబును క్షుల్లక జన

తే.గీ. వైరియగువాడు ఘన భుజ బలుఁడు శుభుఁడు
సముచితంబగు సాధనల్ సలుపు నట్టి
సాధు జనముల యోగ్యతా సార మెఱిఁగి
యీ విధంబెల్ల చిత్త మం దెఱిఁగి కొనుడు

తా॥ సంవత్సరములైదు ఏవనగా? మాఘ మాసము కృష్ణ పక్ష దశమి ధనిష్ఠా [నక్షత్ర]
ప్రథమ పాదము ప్రాప్తమై ఇట్టి నక్షత్ర ప్రథమ పాద మం[దు]
సూర్యుడెప్పుడుండునో తదా రభ్యము సంవత్సరము వఱకు ఇడావత్స[ర]
మనబడును. దీనికి అని రుద్ధ పరమాత్ముడు అభిమాని. (2) మా[ఘ]
మాసము శుక్ల పక్ష పాడ్యమి ఉత్తరాయణము శతభిషాది రేవత్యా[ది]
నక్షత్రముల యందు ఏదైనను ఒక నక్షత్రము సంబంధించి చంద్ర సూర్యు[లు]
సహ ఉదయము నుండి కూడుకొని ఉండినట్టి కాం మందు [...]

నక్షత్రము లందు ఏదైన ఒక నక్షత్ర మందు సూర్యుదుండవలయును. ఇట్టి వర్షమునకు సంవత్సరమని పేరు. దీనికి ప్రద్యుమ్నుడను పరమాత్ముడు అభిమాని (3) బృహస్పతి ఏ వర్ష మందు ఏ నక్షత్ర మందుదయించునో దానికి బార్హస్పత్య వర్షమని పేరు. ఉదయమైన రాశి యందు ఒక సంవత్సరముందును. ఆ సంవత్సరమునకు ఏ నక్షత్ర మందుదయించునో ఆ నక్షత్ర నామము ఆ వర్షమునకున్నది. ఇదే బార్హస్పత్య వర్షము. దీనికి సంకర్షణ నామక పరమాత్ముడు అభిమాని యగును. (4) సూర్యుడు ఒక్కొక్క నెలలో ఒక్కొక్క రాశి యందు సంచారము చేయు మేరకు 12 రాసులకు 12 నెలలగును. అట్టి వర్షమునకు సౌరభమని పేరు. ఈ వర్షమునకు వాసుదేవ పరమాత్ముడు అభిమాని (5) అమావాస్య నుండి ఇంకొక అమావాస్య వఱకు ఒక నెల మేరకు కాదగిన వర్షమునకు చాంద్రమవర్షమని పేరు. దీనికి నారాయణుడభిమాని. అనిరుద్ధాది రూపములు ధరించి ఈ ప్రకారముగా అయిదు వర్షములందు అయిదు రూపములతో ఆయా సంవత్సరముల నామములతో పిలువ బడును. ఈ అనుసంధానముతో స్మరించు వారిని జగన్నాథ విట్ఠలుడు సంరక్షించును.

ఇది శ్రీహరికథామృతసారమునందు విభూతిసంధి

# పంచమహాయజ్ఞసంధి (ఆరవసంధి)

మూ. హరి కథామృత సార గురు గళ
కరుణ దిందా పనితు పేళువె
పరమ భగవద్భక్తరిద నాదరది కేళువదు॥

తే.గీ. హరి కథామృతసారము గురువుల దయ
మెఱయ వర్ణించు వాడను పరమ భక్త
నరులు సజ్జను లాదర భావ మొదవ
వినవలయు భక్తిమీఱగ వీనులలర.

మూ. జనని పిత భూ వారిదాంబర
వెనిప పంచాగ్ని యలి నారా
యణన త్రింశతి మూర్తిగళ వ్యాపార వ్యాప్తిగళ
నెనెదు దివసగళెంబ సమిధెగ
ళను నిరంతర హోమిసుత పా
వనకె పావననెనిప పరమన బేడు పరమ సుఖ॥ 1

సీ॥ జనని పితావనీ సలిలాంబరములను
పంచాగ్నులందున బహు ముదమునఁ
దెలిసి నారాయణు త్రింశతి మూర్తుల
వ్యాపార వ్యాప్తుల నాత్మ నెఱిఁగి
ప్రవిమల భక్తితో దివసంబులను నట్టి
సమిధల నిచ్చలు సంతసమున
హోమంబునందున నేమానవ్రేల్చుచుఁ
బావనంబులకెల్లఁ బావనుఁడగు

ఆ.వె. పరము మంగళుండు బహుదయానిధి యగు
వరదు మదినిదలచి వరము లడిగి
పూర్ణసుఖము నొందు డారయ వేణువి
నోద విట్ఠలుని వినోద మొదవ.

తా॥ భూమి యందు జన్మింప దగిన జీవి జననమునకు ముందు రాహు మండలమునకు క్రింది భాగమందున్న అంత్య పుణ్య భోగము చేయదగిన ఆకాశము నందలి నక్షత్ర మండల మందుండును. 'క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి' అను ప్రమాణానుసారముగా పుణ్యము క్షీణమైన వెంటనే అచట నుండి యమదూతలచే త్రోయ బడి మర్త్య లోకమును ప్రవేశించును. భూమి యందు పుట్టుటకు ముందు ఆ ప్రవేశ కాలమునకు మొదట అచటి నుండి ఆకాశము నందలి మేఘమండలమును ప్రవేశించును. మేఘ మండలము నుండి భూమిని ప్రవేశించును. భూమిలో వ్రీహ్యాదు లందు ప్రవిష్టుడై యుండును. తరువాత వ్రీహ్యాదుల నుండి తండ్రి ఉదరమును ప్రవేశించి రేతఃస్థానమందుండును. అచటి నుండి తండ్రి వలన తల్లి ఉదరమును ప్రవేశించును. అనంతరము తల్లి ద్వార శిశువుగా భూమిలో పుట్టును.

పుట్టిన తరువాత మరణాంతము వరకు ఆ దేహమును దానికి సంబంధించిన ఆయుస్సును దేహము నందలి పంచాగ్నులందున్న అగ్ని యందు అట్లే తూర్పు మొదలు కొని నాలుగు దిక్కుల యందును ఊర్ధ్వ దిశ యందును దిక్కు ఒకటికి ఇన్నూరు కిరణముల మేరకు అయిదు విధములుగా వ్యాపించిన వేయి కిరణములను పంచాగ్నులందు అనుసంధానముతో హోమించు చుండ వలయును. ప్రథమాగ్ని యందు నారాయణుని అదే విధముగా అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవ అను నాల్గు రూపములు యజ్ఞోపకరణములను సరించి ఒక్కొక్క అగ్నికి కాదగిన ఆరు రూపముల మేరకు మొత్తము ముప్పది భగవ ద్రూపములను చింతించ వలెను. యజ్ఞోపకరణముల ద్వార ఆయా భగవద్రూపములచే కాదగిన వ్యాపారములు ఏయే భగవద్రూపములు ఏయే ఉపకరణముల యందు వ్యాప్తియో ఆయా వ్యాప్తులను అను సంధానముతో తెలిసి స్మరించి దివ సాంత్యములను సమిధలుగా భావించి హోమించు చుండుము. స్వరూపతః పావనుడైన భగవద్భక్తుడైన జీవుని లింగ దేహమును భంగము నొందించి భగవంతుడు సంరక్షించును. ఉత్తమమైన పదమును పొందుట కొఱకు పరమాత్మ్మ ప్రార్థనము చేయుము.

వి॥ 1) మరణమును పొందిన స్థూల శరీరము.

2) మరణము పొందిన తరువాత రాదగిన ప్రేత శరీరము.

3) పది దినములు తరువాత రాదగిన ఆంతరిక దేహము.

4) ఆ తరువాత వైతరణీ తీరమందు రాదగిన యాతనాశరీరము.

5) యమలోకము నుండి నరకమును ప్రవేశించు కాలము నందు పొంద దగిన యాతనాశరీరము.

ఈ ప్రకారము దేహాలను అపటి ఆయుష్యులను అపటనే అనుసంధానముతో హోమించవలయును.

## పంచాగ్నులు

జనని - పితృ - భూమి - మేఘము - ఆకాశము వీనియందు అయిదు అగ్నులను చింతింపవలయును. అవి ఏవనగా?

1. జనని యందు ఆహవనీ యాగ్ని
2. పితృని యందు గార్హపత్యాగ్ని
3. భూమి యందు భూ యనదగు అన్నరూపమైన వ్రీహ్యాదుల యందుండు దక్షిణాగ్ని.
4. మేఘమందు సోమాగ్ని (సభ్యంచితి) యని పేరు.
5. ఆకాశ మందు నా వసతి అను అగ్ని.

పూర్వ దిక్కునందు ఇన్నూరు కిరణములు - నీలవర్ణము - ఆహవనీ యాగ్ని.

1) అనిరుద్ధుడను పరమాత్ముడు.
2) దక్షిణ దిక్కునందు ఇన్నూరు కిరణములు - పీత వర్ణము - గార్హపత్యాగ్ని.
3) పశ్చిమ దిక్కునందు ఇన్నూరు కిరణములు - స్వర్ణ వర్ణము - దక్షిణాగ్ని. సంకర్షణు డను పరమాత్ముడు.
4) ఉత్తర దిక్కునందు ఇన్నూరు కిరణములు - శుభ్రవర్ణము - సోమాగ్ని (లేక) వాసుదేవుడు సభ్యంచితి.
5) ఊర్ధ్వ దిక్కునందు ఇన్నూరు కిరణములు - రక్తవర్ణము - నావసతి అగ్ని నారాయణుడను పరమాత్ముడు.

మూ. గగన పావక సమిధె రవి ర
శ్మిగళె ధూమవు అర్చి యెనిపుదే
హగలు నక్షత్రగళె కిడిగళు చంద్రమాంగార।
మృగవరోదరనొళగె ఐదు రూ
పగళచింతిసి భక్తిరస మూ
తుగళె మంత్రవమాడి హోమిసువదు విపశ్చితరు॥ 2

వ॥ గగనమె పావకుండు రవి కాష్ఠము రశ్ములె ధూమమహా యహం
బగునది యర్చి తారకలె యౌను మిణుంగురు లా శశాంకుఁడే
తగు బహుళాగ్నిఖండములు ధన్యుడుపావని యందు పంచ రూ
పగునిఁదలంచి మంత్రములు భాషలెయుంచు నొనర్చు హోమమున్.

తా॥ నక్షత్రము లుండు ఆకాశమే హోమమునకు యోగ్యమైన అగ్ని కుండము. దీనికి ద్వాదశా దిత్యు రే అగ్ని యందు వేయదగిన కాష్ఠములు. సూర్య మండలము నుండి బయలు దేటు రశ్మురే పొగ యగును. దిన మనునదియే అగ్ని. నక్షత్రములే మిణుగురులు. చంద్రుడే అగ్ని ఖండములు. ఇటువంటి హోమాగ్ని యందు మాటలే మంత్రములు. పంచరూపాత్మకుడైన పరమాత్ముని చింతించి హోమము చేయుము.

వి॥ ప్రాణ రూపమందు - శ్రీ మన్నారాయణుడు బయలు దేరియున్నాడు.
ప్రాణ రూపమందు - నారాయణ నారాయణ
అపాన రూపమునందు - నారాయణ వాసుదేవ
వ్యాన రూపమునందు - నారాయణ సంకర్షణ
ఉదాన రూపమునందు - నారాయణ ప్రద్యుమ్న
సమాన రూపమునందు - నారాయణ అనిరుద్ధ.

మూ. పావకను పర్జన్య సమిధెయు
ప్రావహీపతి ధూమగళె మే
ఘావళిగళర్చి క్షణ ప్రభె గర్జనవె కిడియు।
భావిసువ దంగార సిడిలెం
దీ విధాగ్ని యొళద్ధి జాతన
కోవిదరు హోమి సువరను దిన పరమ భకుతియలి॥ 3

సీ॥ పంచ మహాయజ్ఞ పద్ధతినీ రీతి
హృదయంబు లోపల నెఱుఁగవలయుఁ
బర్జన్య నామక వారిద మేయగ్ని
ప్రావహిపతియగు వరసమిధలు
మేఘాళి ధూమంబు మెఱయుమంటయెయర్చి
గర్జనల్ మిణుఁగురుల్ గాఁజెలంగు
నచ్చపు మెఱపులే యగ్ని ఖండంబు లీ
విధమగునగ్నిలో వేడ్కమీఱఁ

తే.గీ. గోవిదులు జీవుఁడనువాని కుండ మందు
హోమమును జేయు వారలై యుత్సుకమున

దిన దినంబును భక్తితో పనజనయను
బ్రీతిఁగావింపుమా కడు విమలమతిని.

తా॥ పర్జన్య మను పేరు గల మేఘమే అగ్ని. ఈ అగ్ని యందు వేయదగు సమిధలు ప్రవహుడను వాయుదేవుడు. సంచరించు మేఘ పంక్తులే ధూమము. చంచలించు మెఱుపులే మండెడు మంటలు. మేఘ గర్జనలే మిణుగురులగును. ఇటువంటి మేఘ మను నగ్ని యందు నక్షత్ర మండలము నుండి పతనమైన (జనించిన) జీవుని అచటి ఆయస్సును హోమించు వారగుదురు. ప్రతి దిన మందును మిక్కిలి భక్తితో జ్ఞానులైన వారు మాటలాడు మాటలే మంత్రములని భావింతురు.

మూ. ధరణి యంబుదె అగ్ని సంవ
త్సరవె సమిధె విహాయసవె హొగె
ఇరుళురి దిశాంగారవాంతర దిగ్వలయ కిడియు।
వరుష వెంబాహుతిగళిందలి
హరియ మెచ్చిసి సకల రొళగ
ధ్వరి యనాగిరు సర్వరూపాత్మకన చింతిసుత॥ 4

చ॥ ధరణియె వహ్ని వత్సరమె తాను సమిత్తగు ధూమమౌ తదం
బరమది రాత్రిమంటయగు నాదిశయేయగు నగ్ని ఖండముల్
బఱఁగు మిణుంగురు ల్దిశలు వర్షదినాంకము లాహుతీతతుల్
హరికి నొసంగి యాజకుఁడవై చరియింపుము శౌరి చింతనన్.

తా॥ భూమి యనునదే అగ్ని. ఆ అగ్ని యందు ఏ వర్ష మందు మేఘ మండలము నుండి భూమి యందు ప్రవేశించి వ్రీహ్యాదులందుండ గలదో ఆ వర్షమను నదే అగ్ని యందు వేయదగిన కాష్ఠము. ఆకాశమే కాష్ఠము నుండి వచ్చు పొగ. రాత్రి యనునదే మండెడు మంట యగును. దీని యందు పూర్వాది నాలుగు దిక్కులు అగ్ని ఖండములు. ఆగ్నేయాది దిక్కులే మిణుగురులు. ఏ సంవత్సర మందు భూమిలో ప్రవేశించెనో అప్పటి మొదలుకొని వ్రీహ్యాది దేహము లందున్న ఒక సంవత్సర కాలము ఆయస్సును ఆ వ్రీహ్యాది దేహమును భూమి యను అగ్ని యందు ఆహుతి రూపముతో హోమించ వలయును. ఇటువంటి ఆహుతులచే బింబరూపి పరమాత్మని తన స్వాఖ్య రూపములచే మెప్పించి సమస్త ప్రాణుల యందును పరమాత్మని చింతించుచు అధ్వర్యుడవై సంచరింపుము.

వి॥ 1) అగ్ని యందు వ్యాన నామక వాయుదేవుని అతని అంతర్యామిగా సంకర్షణుడను పరమాత్ముని చింతింప వలయును.

2) వర్షమను కాష్ఠము నందు వ్యాన నామక వాయుదేవుని అతని అంతర్యామిగా సంకర్షణ నారాయణుని చింతింప వలయును.

3) రాత్రి యను మంట యందు వ్యాన నామక వాయుదేవుని అంతర్యామిగా సంకర్షణ సంకర్షణుని చింతింప వలయును.

4) దిక్కులను అగ్ని ఖండములను వ్యాన నామక ఉదాన వాయుదేవుని అంతర్యామిగా సంకర్షణ ప్రద్యుమ్నుని చింతింప వలయును.

5) దిక్కులను మిణుగురులు. దీని యందు వ్యానాఖ్య వాయుదేవుని అంతర్యామిగా సంకర్షణాఖ్య అనిరుద్ధుని చింతింప వలయును.

మూ. పురుష శిఖి వాక్సమిధె ధూమవు
కరణ వర్చియు జిహ్వా శ్రోత్రగ
ళెరడు కిడిగళు లోచన గళంగార వెనిసువదు।
నిరుత భుంజిసు వన్న యదుకుల
వరని గవ ధానగళు యందీ
పరిస మర్పణె గైయె కై కొండనుదినది పొరెవ॥ 5

క॥ పురుషుండె శిఖియు వాక్కులె
యరయఁగ సమిధాళి ధూమమగు కరణంబుల్
మఱి యర్చి జిహ్వ వీనులె
మెఱయు మిణుంగురులు నయనమే ఖండాగ్నుల్.

క॥ నిరతము భుజించు నన్నము
హరి కిడు నైవేద్యమనుచు నచ్చపు భక్తిన్
బరమా దరమున నొసగిన
బురుషోత్తముఁడది గ్రహించి ప్రోచు సుజనులన్.

తా॥ పురుషుడే అగ్ని యగును. ఇతడే తండ్రి యని అర్థము. వాగింద్రియముచే ఉచ్చరింప దగిన మాటలే సమిత్తు. ఇంద్రియములే పొగయనబడును. జిహ్వా శ్రోత్రము లోచనములు వాగింద్రియము-త్వగింద్రియము-పాణి-పాదములు ఇవి ధూమ స్థాన పస్నములు. నాలుకయే మండెడు మంట రెండు శ్రోత్రములే మిణుగురులు. రెండు లోచనములే అగ్ని ఖండములు. నిత్యమును భోజనము

చేయదగిన అన్నము ఆహుతులని శ్రీ కృష్ణ పరమాత్మునకు సమర్పణము చేయవలయును. ఈ అనుసంధానముతో అర్పించిన పరమాత్ముడు యజ్ఞమును స్వీకారము చేసి భక్తులను సంరక్షించును.

వి॥ 1) పురుషుడను అగ్ని యందు ఉదాన వాయుదేవుడు. అతని అంతర్యామి ప్రద్యుమ్నుడను పరమాత్ముడు.

2) వాగింద్రియ రూపమైన సమిత్తు నందు ప్రాణ నామక వాయుదేవుడు అతని అంతర్యామి ప్రద్యుమ్నుదును పేరుగల నారాయణుడు.

3) ధూమ స్థాన పన్నములందు ఉదాన వాయుదేవుడు. అతని అంతర్యామి ప్రద్యుమ్నుడను వాసుదేవుడు.

4) నాలుక యను మంట యందు ఉదాన వాయుదేవుడు. అతని అంతర్యామి ప్రద్యుమ్నుడను సంకర్షణుడు.

5) లోచనములను అగ్ని ఖండములు యందు ఉదానాఖ్య సమాన వాయుదేవుడు. అతని అంతర్యామి ప్రద్యుముడను అనిరుద్ధుడు.

6) రెండు చెవులను మిణుగురులందు ఉదానుడను సమాన వాయువు. అతని అంతర్యామి ప్రద్యుమ్నాఖ్య ప్రద్యుమ్నుదు.

మూ. మత్తెయోషాగ్నియొళు తిళివదు
పస్థ తత్త్వవె సమిధె కామో
త్పత్తి పరమాతుగళె ధూమవు యోని మహదర్చి।
తత్ప్రి వేశాంగార కిడిగళు
ఉత్సహ గళుత్సర్జనవు పురు
షోత్తమని గవదానవెనె కైగొండు మన్నిసువ॥ 6

క॥ మఱియును యోషాగ్నిందగ
నెఱుఁగుడుపస్థాఖ్య తత్త్వమే సమిధలు సుం
దరితోఁ గామోత్పత్తి
స్ఫురణంబులె ధూమమనఁగ శోభిలుజగతిన్.

క॥ యోనియె యర్చియనందగు
దానిఁ బ్రవేశించు శిశ్న దండ మరణాల
య్యానందాదులె మిణుగురు
లౌనాహుతులొసఁగఁగాచు నచ్యుతుఁడెప్పుడున్.

తా॥ మరల తండ్రి ఉదరము నుండి తల్లి గర్భ మందు చేరిన జీవుని మాతృశరీరమను అగ్ని యందు హోమము చేయదగిన క్రమమును తెలియవలయును. తల్లి యనునదే అగ్ని. ఉపస్థ తత్త్వమే సమిత్తు. పురుషునితో క్రీడించుటకు కామము నుత్పత్తి చేయదగిన మాటలే ధూమమగును. ఉపస్థ యందు రేతస్సు ప్రవేశించుటయే పెద్ద మంట యగును. (జ్వాలయగును) ఆ భగ మందు శిశ్న ప్రవేశమనుదే అగ్ని ఖండములు. రతిక్రీడ యందు వ్యక్తములైన ఆనందములే మిణుగురులు. పురుష శ్రేష్ఠుడైన పరమాత్మునకు అచటి దేహము అచటి ఆయుస్సును ఆహుతు లిచ్చినచో ఆ యజ్ఞమును స్వీకరించి అజ్ఞానాది దోషములను నాశనము చేసి జ్ఞానము నభివృద్ధి చేసి పరమాత్ముడు సంరక్షించును. ఈ పద్య మందు చెప్పిన క్రమముగా మాతా పితరుల యజ్ఞ కార్యమని తెలియ వలయును. ఈ విధమైన అగ్ని కాష్ఠాది సాంకేతములైన అధిష్ఠానములందు అంతర్యామియైన భగవద్రూపమునములతో భగవంతుని రూపములకు హోమ రూపముగా సమర్పింపవలయును.

వి॥ 1) తల్లి యను అగ్ని యందు సమాన వాయువు. అతని అంతర్యామి అనిరుద్ధుడు.

2) ఉపస్థతత్త్వమను సమిత్తు నందు సమాన వాయువు ప్రాణ దేవుడు. అతని అంతర్యామి అనిరుద్ధ నారాయణుడు.

3) మాటలను ధూమము నందు సమాన వాయువు. అతని అంతర్యామి అనిరుద్ధ వాసుదేవుడు.

4) రేతస్సు ప్రవేశ మను మంట యందు సమాన వ్యాన వాయువు. అతని అంతర్యామి అనిరుద్ధ సంకర్షణుడు.

5) శిశ్న ప్రవేశమను అగ్ని ఖండము లందు సమాన ఉదాన వాయువు. అతని అంతర్యామి అనిరుద్ధ ప్రద్యుమ్నుడు.

6) ఆనందమను మిణుగురులందు సమానాంశ సమాన వాయువు అతని అంతర్యామి అనిరుద్ధాంశ. అనిరుద్ధుడు.

మూ. ఐదు అగ్ని గళల్లి మరి యదలె
ఐదు రూపాత్మకన ఇప్ప
త్తైదు రూపగళనుదినది వెవెవరిగె జనుమగళో
ఐదిసను నళినాక్ష రణదొళు
మైదునన కాయ్దంతె సలహువ
బైదవగె గతియిత్త భయహర భక్తవత్సలను॥ 7

ఉ॥ ఐదగు నగ్నులందుఁ బరమాత్మ యనందగు పంచ రూపకున్
సాదర భంగి నిర్వదియు నైదగు రూపము లెల్ల వేళలన్
మోదముతోఁ దలంచు బుధముఖ్యుల జన్మలఁ బారఁద్రోలియా
హ్లాదతఁగాచుఁ బార్థునటు లహరిఁదిట్టిన చైద్యునట్లుగన్.

తా॥ మఱువక ఈ విధముగా అయిదు అగ్నులందు అయిదు రూపములతో ఒప్పునటువంటి పరమాత్ముని యిరువది యైదు రూపములను నిత్యము ధ్యానించు వారికి జన్మాదులను పొందించదు. భారత యుద్ధ మందు బావ మఱదియైన అర్జునుని కాపాడినట్లు కాపాడును. అసురావేశముతో తన్ను తిట్టిన శిశుపాలుని దోషము లెంచక రక్షించెను.

మూ. పంచనారీ తురగ దంద్రది
పంచ రూపాత్మకను తా షట్
పంచ రూపవ ధరిసి తత్తన్నామదిం కరిసి।
పంచపావక ముఖది గుణమయ
పంచ భూతాత్మక శరీరవ
పంచ విధ జీవరిగె కొట్టల్లల్లె రమిసువను॥ 8

క॥ పంచాం గనాశ్వ మట్టుల
పంచ సురూపాత్మకుండు పరమాత్ముడు షట్
పంచక రూపములం గొని
పంచాఖ్యతఁబొంది పంచ పావకములలో.

తే.గీ. పంచ భూతాత్మక శరీర భవన మందు
సంచరించుచుఁ దజ్జీవ పంచకమున
కచ్చటచ్చటనే సుఖ మందఁజేసి
తారమించును గుణనిధి శ్రీరమణుఁడు

తా॥ అయిదు స్త్రీ రూపములతో ఒక అశ్వమును చక్రాకారముగా వ్రాయుట శాస్త్రి సిద్ధము. ఈ పంచనారీ తురగ దృష్టాంతానుసారముగా పంచరూపి పరమాత్ముడు ఒకొక్క రూపమందు అనంతానంత రూపములతో ప్రచురమైన వాడైయున్నాడు. ఒక్కొక్క అగ్ని యందు అయిదు రూపముల మేరకు మొత్తము ముప్పది రూపములు ధరించి ఆయానామములచే పిలువ బడి

ఆయా అగ్నులందుండిన వాడై పంచాగ్నుల ద్వార సత్త్వ రజస్తమో గుణములచే వ్యాప్తమైన పంచ భూతాత్మకమైన పితృ మాతృ సంబంధమైన రేతో శోణితములచే పిండీ భూతమైన స్థూల శరీరమును ఋషి- పితృ- రాజ- గంధర్వ- నర సాంకేతములైన పంచ విధములైన జీవులకు ఇచ్చి ఆయా స్థానములందే తనలో తానుండి క్రీడించు చుండును.

ఈ పూర్వోక్తమైన పంచ విధ జీవుల యందు దేవతలు చేరి యున్నారు. వారి యందు ఋజుగణమును వదలి మిగిలిన దేవతలకు మాతృ గర్భము ద్వార జననాదులు మాత్రముండును. నిరంశుల వలె పంచాగ్నుల ద్వార జననము లేదు. మఱియు పంచ విధ జీవులెవరనగా? మనుష్య గంధర్వుల నారంభించి మనుష్యోత్తముల వఱకు ఒకటి. క్షత్రియ జీవులు రెండు. వైశ్య జీవులు మూడు. శూద్ర జీవులు నాల్గు. అంతకంటె వేరైన తృణాంతముగా గల జీవులు అయిదు. ఈ అయిదు విధ జీవరాసులు. వీరు పంచాగ్నుల ద్వార జనన యోగ్యులైన వారు.

మూ. విధి భవాది సమస్త జీవర
హృదయదొళగేకాత్మ నెనిసువ
పదుమ నాభను అచ్యుతాది యనంత రూపదలి।
అధిసుభూతాధ్యాత్మ వధిదై
వదొళు కరెసువ ప్రాణనాగా
భిదను దశరూపదలి దశవిధ ప్రాణరొళగిద్దు॥ 9

తే.గీ. బ్రహ్మ రుద్రాది సర్వ జీవ ప్రతతుల
కంతరాత్మకుడనగ విఖ్యాతుఁడగుచు
నఖిల రూపాల నధ్యాత్మ కాదులందుఁ
బిలువ బడు ప్రాణ నాగాఖ్యములను బొంది
వ్యాప్తుఁడా దశేంద్రియ దశ ప్రాణు లందు
వెలయు దశ రూపములు గల విష్ణుమూర్తి.

తా॥ బ్రహ్మ రుద్రాది సమస్త జీవుల హృదయములందుండు పరమాత్ముని రూపములు భిన్న భిన్నములుగా గనపడినను అభిన్నములే. అనగా ఏకాత్ముడన బడును. పద్మ నాభుడు అచ్యుతుడు అనంతుడు మున్నగు రూపము లందు అధిభూతము, అధ్యాత్మము, అధి దైవము అను రూపములతో పిలువ బడును. ఈ

పరమాత్మని అచ్యుత అనంత గోవింద రూపములు అధి భూతము మొదలగు మూడు స్థానము లందుండ దగిన దశ విధమైన ప్రాణులందు అంతర్యామియై యుండి పంచ ప్రాణుల చేతను పంచనాగాది నామముల చేతను పిలువ బడునని ప్రాణాం తర్యామియైన భగవంతుని చింతించ వలెను.

vii జీవుల యందు నాల్గు విధములైన గణ సమూహము లున్నవి.

1. బ్రహ్మ మొదలుకొని శతస్థ దేవతల వఱకు దేవ శబ్దముచే పిలువ బడువారు. 2. శతస్థుల అనంతరము పుష్కరుని వఱకు కర్మజ దేవతలు. 3. పుష్కరుని అనంతరము ఆజానజులు దేవ గంధర్వుల వఱకు. 4. అనంతరము విరంశ జీవులు (మనుష్య గంధర్వుల నారంభించి తృణాంతము వఱకు)

1. అధిసుభూత మనగా? ఉత్తమ సాధనకు యోగ్యమైన జీవునకు అధి అనగా అధిష్ఠాన భూతమైన పంచ భూత మయమైన స్థూల శరీరము.
2. అధి భూతము: స్థూల శరీరము. దీని సజాతి దృష్టాంతము. స్వరూప దేహము అధి భూతమే.
3. అధ్యాత్మ మనగా మనస్సు. ఇందులో జడమైన మనస్సు చిన్మ నస్సు అని రెండు భేదములు తెలియ వలయును.
4. అధి దైవమనగా: దశేంద్రియములు (స్వరూపము-బాహ్యము రెండును తెలియ వలెను.)

మూ. ఈ రెరడు సావిరద ఇప్ప
త్తారధిక మున్నూరు రూపగ
ళీరెరడు స్థానదలి చింతిపు దను దినది బుధరు।
నూర ఇప్ప త్తేళధిక మూ
రారు సావిర రూప దిం దశ
మారుత రొళిద్దవరవర పెసరింద కరెసువను॥ 10

తే.గీ. ఆ విధంబెల్ల వ్యాఖ్యాన మాచరింతు
నాల్గు స్థానంబు లందున నాల్గు వేలు
మూడు నూర్లిర్వదారగు ముఖ్య రూప
ములను జింతింప వలయును బుధులు మఱియు.

తే.గీ. పదియునెన్మిది వేలపైఁ బఱగు నూట
యిర్వదేడగు రూపాల శర్వమతుఁడు

ప్రాణ దశకంబునందుండి వారివారి
పేళ్ళ చేతను నిచ్చలుఁ బిఱుపఁబడును.

తా॥ ముందు చెప్ప బడిన అధి భూత - అధి దైవ - అధ్యాత్మ- హృదయుము యొక్క నాల్గు స్థానముల యందు నాలుగు వేల మున్నూట యిరువది భగవ ద్రూపములను చింతించ వలయును.

దీని వివరణము

1) 131 అధి భూతము నందున్న అచ్యుత రూపములు అక్షర సాంకేతపుచే అను రూపములు అ - 1 - చ్యు - 3 - త 1 కుడి నుండి యెడమకు లెక్క ప్రకారము 131

2) అధి దైవమునందలి భగవద్రూపములు : 3043
గో - 3 విం - 40 ద - 3 మొత్తము : 3043

3) అధ్యాత్మము నందలి భగవద్రూపములు : 1052
అ - 2 - నం - 50 - త - 1 మొత్తము : 1052

4) హృదయ స్థానమునందలి భగవద్రూపములు : 62
ఆ - 2 - త + మ = 1 + 5 = 6 62

4326 మొత్తము

5) ఒక్కొక్క అగ్ని యందు ఆరు రూపముల మేరకు పంచాగ్నులకు మొత్తము 30 ముప్పది రూపములు: 30

6) గుణ త్రయాది విశ్వ మొదలగు రూపములు3 3

7) దేహమునందలి పంచభూతాంతర్గతమైన అనిరుద్ధాది- 5

మొత్తము: 131 + 3043 + 1052 + 62 + 3 + 5 మొత్తము 4326
(నాలుగు వేల మున్నూట ఇరువది ఆరు)

ఈ ప్రకారము బ్రహ్మాంతమైన త్రివిధ జీవులందు ప్రతి యొక జీవి యందు ఉన్నవి.

## దశవిధ ముఖ్య ప్రాణులందుండు రూపముల వివరణము

| వివరము | రూపములు | వివరము | రూపములు |
|---|---|---|---|
| 1. ప్రాణము 35 | 53 | నాగ 53 | 35 |
| 2. అపానము 115 | 511 | కృకల 313 | 313 |
| 3. వ్యానము 55 | 55 | కూర్మ 17 | 71 |
| 4. ఉదానము 535 | 535 | దేవదత్త 3432 | 2343 |
| 5. సమానము 755 | 557 | ధనంజయ 45031 | 13054 |
| మొత్తము | 1711 | మొత్తము | 15816 |

అన్నియు చేరి మొత్తము 1711 + 15,816 = 17,527 భగవద్రూపములు.

### 600 రూపములకు వివరణము

| | | | |
|---|---|---|---|
| 1) పంచ భూతములు | - 5 | 1. పంచ భూత కార్యములు | - 5 |
| 2) పంచ తన్మాత్రలు | - 5 | 2. తన్మాత్రకార్యములు | - 5 |
| 3) దశేంద్రియములు | - 10 | 3. దశేంద్రియ కార్యములు | - 10 |
| 4) దశేంద్రియములను అనుసరించిన వృత్తులు | - 10 | 4. దశమనోవృత్తులకు అనుసరించిన కార్యములు | - 10 |
| మొత్తము | 30 | మొత్తము | 30 |

రెండును చేరి మొత్తము 60 (30 + 30)

ఈ ప్రకారము ఒక్కొక్క ప్రాణ శరీర మందుండునవై యున్నవి. ఈ రీతిగా దశ ప్రాణ శరీరము అందు లెక్కించినచో 60 x 10 = 600 (ఆరునూర్లగును) పైన వివరించిన ఆరు నూరు రూపములు ఏవనగా? దీనికి ప్రమాణము-

'తదుక్తం భాగవతే తృతీయ స్కందే దశమోధ్యాయే'
ప్రాణోపాన స్తథా వ్యాన స్తథోదాన సమానకా।
నాగః కూర్మోథ కృకలో దేవదత్తో ధనంజయః॥

ఈ విధముగా దశ ప్రాణము లందలి ఇంద్రియస్థరూపములు - 600.
ఈ ప్రకారము కాదగిన రూపములు మొత్తము 18127 ఎట్లన?

| | | |
|---|---|---|
| 1. పూర్వోక్తమైన ప్రాణాది రూపములు | - | 1711 |
| 2. పూర్వోక్తమైన నాగాది రూపములు | - | 15816 |
| 3. పూర్వోక్తమైన పంచ భూత కార్యాది దశ ప్రాణ గత రూపములు | - | 600 |
| మొత్తము | - | 18127 |

## 600 రూపముల వివరణము

పైన పేర్కొనిన క్రమముగా ఒక్కొక్క ఇంద్రియ గోళకము నందు ఆరారు భగవద్రూపములను చింతించ [illegible]యును. అవి ఏవనగా? 1. గోళక మందు అగ్ని ఒకటి. 2. అగ్ని యందు వేయదగిన కాష్టము ఒకటి. 3. అగ్నిచే బయలు దేరు పొగ ఒకటి. 4. తరువాత ఉత్పత్తి యగు జ్వాల ఒకటి. 5. ఈ జ్వాలచే బయలు దేరు మిణుగురులు ఒకటి. 6. కాష్ఠము కాలిన తరువాత ఏర్పడు అగ్ని ఖండములు ఒకటి. ఈ ప్రకారముగా ఆరు భగవద్రూపములు దశేంద్రియములందు చేరి మొత్తము అరువది యైనది. ఇవి అన్నియు ఒక వాయుదేవుని యందు అంతర్గత మని తెలియ వలయును. ఇట్లు పంచ వాయువులందు ఆరునూర్లు భగవద్రూపములని తెలియ వలయును. దశ ప్రాణుల యందు వర్ణ సాంకేతమైన భగవద్రూపములు 17527. ఇంతకు ముందు వివరించిన దశప్రాణము లందలి అనుసంధానమునకు యోగ్యమైన రూపములు 600 అవి పైన వివరింప బడినది. ఇవి రెండును చేరినచో 17527 + 600 = 18127 రూపములగును.

| వృత్తులు | ప్రాణానామములు | అంతర్భూత వృత్తులు |
|---|---|---|
| 1. మనస్సు | ప్రాణము | సంకల్ప వికల్పములు-మనస్సు వృత్తి. |
| 2. బుద్ధి | అపానము | నిశ్చయవృత్తి - బుద్ధి సంబంధము. |
| 3. చిత్తము | వ్యానము | స్మరణ వృత్తి- చిత్తము సంబంధమైనది. |
| 4. అహంకారము | ఉదానము | విషయవృత్తి -అహంకార సంబంధమైనది. |
| 5. అంతఃకరణము | సమానము | భోగవృత్తి-అంతఃకరణ సంబంధమైనది. |

భూతములందు 10. ఇంద్రియములందు 10. మనోవృత్తులందు 10. మొత్తము 30 అయినది.

1. పంచభూత - పంచతన్మాత్రలు 10. ఈ ఒక్కొదాని యందు సంస్పృష్టములు 10 మేరకు - 100
2. ఇంద్రియములు 10 ఈ ఒక్కొక్క దానియందు సంస్పృష్టములు 10 మేరకు - 100
3. మనోవృత్తులు 5 తత్కార్యములు 5 మొత్తము 10. ఒక్కొక్క దాని యందు 10 మేరకు - 100

మొత్తము 300

## మిగిలిన 300కి వివరణము

1. పంచభూతము లందు ఒక్కొక్క దాని యందు
   ప్రాణాది రూపములు 10 మేరకు 5 x 10 = 50
2. పంచ తన్మాత్ర లందు నాగాది రూపములు
   ఒక్కొక్క దాని యందు 10 మేరకు 5 x 10 = 50
3. పంచ జ్ఞానేంద్రియము లందు ప్రాణాది రూపములు
   ఒక్కొక్క దాని యందు 10 మేరకు 5 x 10 = 50
4. పంచ కర్మేంద్రియములందు నాగాది రూపములందు
   ఒక్కొక్క దాని యందు 10 మేరకు 5 x 10 = 50
5. మనోవృత్తులందు అయిదు ప్రాణాది రూపములు
   ఒక్కొక్క దాని యందు 10 మేరకు 5 x 10 = 50
6. మనోవృత్తి కార్యములందు నాగాది రూపములు
   ఒక్కొక్క దాని యందు 10 ప్రకారము 5 x 10 = 50

మొత్తము 300

300 + 300 = 600 అయినది.

600 రూపములందు 300 అనిరుద్ధాది రూపములు 300 కృద్ధోల్కాది రూపములు. అనిరుద్ధాదుల పత్నులు - కృద్ధోల్కాది పత్నులు భగవద్రూపముల పత్నులు వీరి పేర్లను వివరించు చున్నారు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మాయా | వాసుదేవ | దుర్గ | కృద్ధోల్క |
| 2 | జయా | సంకర్షణ | అంభ్రణి | మహోల్క |
| 3 | కృతీ | ప్రద్యుమ్న | లక్ష్మి | వీరోల్క |
| 4 | శాంతీ | అనిరుద్ధ | దక్షిణ | ద్యుల్క |
| 5 | లక్ష్మీ | నారాయణ | జయంతి | సహస్రోల్క |

మూ. చిత్త విసుపదు ఎంటధిక ఇ
పృత్తు సావిర నాల్కు శతదై
పత్తమూరు సుమూర్తిగళు ఇహవల్లి పరియంత॥

హత్తు నాలకు రూప గళ నెర
పుత్త రవనీపరి తిళిదు పురు
షోత్తమన సర్వత్ర పూజెయ మాడు కొండాడు॥ 11

సీ॥ వినుఁడిర్వదెన్మిది వేలపైనన్నూట
యేఁబది మూడుగా నెసఁగు సంఖ్య
యచ్యుతు రూపంబు లవి సృజ్యులైనట్టి
జీవుల దేహాలఁ జెలఁగు చుండు
దేవతా ఋషి పితృ భూవర జల చర
స్థావర క్రిమి పక్షి సముదయంబుఁ
బశుపుల మనుజులం బఱగు నవ్వానిలో
స్వేద జాండజములు పృథ్విజములు

తే.గీ. మఱి జరా యుజలను నాఖ్యఁ బఱగునట్టి
ప్రాణులందున నీ రీతి నాత్మ నెఱిఁగి
పురుషముఖ్యుని. సర్వత్ర పూజఁజేసి
భక్తిమీఱఁగఁ గొనియాడ వలయు సతము.

తా॥ (28, 453) ఇరువది యెనిమిది వేల నన్నూట యేబది మూడు రూపములతో మన దేహము లందు భగవంతుడు ప్రాణాంతర్యామియై యున్నాడు. అటువంటి పురుషోత్తమునిరూపములను చక్కగా జింతించి సర్వత్ర పూజించు చుందుము.

దాని వివరణము

| | | | | | |
|---|---|---|---|---|---|
| పృథివి | విథుపృ | 423 | వి4 | థి2 | పృ3 |
| అప్పు | ప్పుఅ | 21 | ప్పు2 | అ1 | |
| తేజ | జతే | 31 | జ3 | తే1 | |
| ఆకాశ | శకాఅ | 511 | శ5 | కా1 ఆ1 | |
| వాయు | యువా | 14 | యు1 | వా 4 | |
| | మొత్తము 1000 | | | | |

(పృథివ్యాది పంచభూతస్థ అక్షరవాచ్య రూపములు.)

పంచతన్మాత్రలు

| | | | |
|---|---|---|---|
| శబ్ద | బ్దశ | 65 | బ్ద6 శ5 |
| స్పర్శ | శరిస్ప | 528 | శ5 రి2 స్ప8 |
| రూప | పరూ | 12 | ప1 రూ2 |
| రస | సర | 72 | స7 ర2 |
| గంధ | ధంగ | 403 | ధం40 గ3 |
| | మొత్తము | 1040 | |
| మనస్సు | స్సుమన | 755 | స్సు7 మ5 న5 |
| త్వకు | కుత్వ | 15 | కు1 త్వ5 |
| చక్షు | క్షుచ | 102 | క్షు10 చ2 |
| శ్రోత్ర | త్రశో | 37 | త్ర3 శ్రో7 |
| జింహ్వ | హ్వాంజి | 1203 | హ్వాం120 జి3 |
| ఘ్రాణ | ణఘ్రా | 56 | ణ5 ఘ్రా6 |
| | మొత్తము | 2168 | |
| వాక్కు | క్కువా | 24 | కు2 వా4 |
| పాణి | ణిపా | 51 | ణి5 పా1 |
| పాద | దపా | 31 | ద3 పా1 |
| పాయు | యుపా | 11 | యు1 పా1 |
| ఉపస్థ | స్థపు | 814 | స్థ8 ప1 ఉ? |

| | | |
|---|---|---|
| మనోగత రూపములు అధ్యాత్మ | - | 755 |
| అధిదైవ (దశేంద్రియ రూపములు) | - | 2349 |
| మొత్తము | | 3099 |
| అధిభూత పంచభూత పంచ తన్మాత్రము లందలి రూపములు | - | 2080 |
| | | 5179 |

అయిదువేల నూటడెబ్బై తొమ్మిది అనగా 6000 కు 821 తక్కువైనది.

ఈ 821 రూపములు ఏవనగా? విధి భవాది సమస్త జీవుల హృదయాకాశ మందు ఏకాత్ముడని 9 వ పద్య మందు ప్రయోగించి యున్నారు. ఆత్మ రూపి పరమాత్ముడు హృదయాకాశమందు అని ఉండుట వలన హృదయమొకటి ఆకాశమొకటి. ఈ ఆకాశమున దహరాకాశము ఇది వేరు.

హృది - దిహృ - 310 - ది300 హృ 10
ఆకాశ - శకాఅ - 511 - శ5 - కా1 - ఆ1

మొత్తము 821

5139 + 821 = 6000 మొత్తము రూపములు.

28453 ముందు చెప్పిన సంఖ్య ననుసరించి కాదగిన వర్ణవాచ్య రూపములు పర్యంత మనగా సృజ్యులై యుండ దగిన మొత్తము జీవుల అంతము. ఎట్లనగా? పరి అనగా పర్యంతము. అనగా సృష్టి అంతము వఱకు. జీవులకు అంతమేదనగా? పదునాలుగు పది యొకటి నాలుగు ఒకటి. పదియు జీవుల సంఖ్యయే. నాలుగు జీవుల సంఖ్యయే 10కి వివరము:

1. దైవ. 2. ఋషి. 3. పితృ. 4. జనప. 5. జలచర. 6. స్థావర. 7. క్రిమి. 8. పక్షి. 9. పశువులు. 10. మనుష్యులు మొత్తము 10.

నాల్గుకు వివరము :

1. స్వేదజము. 2. పృథ్విజము 3. అండజము. 4. జరాయుజము. పైన ఉదహరించిన 14 విధముల జీవుల యందు 28453 రూపములను ధ్యానించుచు పురుషోత్తముని తెలుసుకొని పూజించుచు కొనియాడము. మఱియు 14 రూపములను ధ్యానించుచు పురుషోత్తముని తెలుసుకొని పూజించుచు కొని యాడుము. మఱియు 14 రూపములనగా? దశేంద్రియములు 10. దశమారుతులు - నాలుగు అనగా శతస్థుల పర్యంతము దేవతలు. దేవతలు - కర్మజులు - ఆజానజులు - నిరంశులు. మొత్తము 4. అధిభూత - అధిదైవ - అధ్యాత్మ - హృదయము ఇవి 4. ఈ పదునాలుగింటి యందుండ దగిన పరమాత్ముని రూపములను చింతించి కొని యాడ వలెను.

మూ. ఈరెరడుశత ద్వ్యష్టధిక హది
నారుసావిర రూప సర్వశ
రిరదొళు శబ్దాదిగళ ధిష్ఠాన దొళగిప్ప

ప్పూరుతను నాగాది రూపది
ప్పూరనే గుణమాని శ్రీ దు
ర్గారమణ విద్యా కుమోహవ కొడువ కరణక్కె॥ 12

తే.గీ. పదియునార్వేలు నన్నూటిపైన మఱియు
బదియునారు రూపంబుల బవనుడుండు
రూఢినాగాది రూపుడై రుద్రరూపి
హరియు బ్రాణ పంచకమున నలరు చుండి
మోహమొసగు నింద్రియముల వ్యూహమునకు.

తా॥ ముందు చెప్పబడిన శబ్దాదుల అధిష్ఠానములందుండ దగిన అ విద్యల యందు శ్రీ వాయు దేవుడే నాగాది రూపములను ధరించి యున్నాడు. రుద్ర రూపి పరమాత్ముడు కృద్ధోల్కాది రూపములతో నాగాది పంచ ప్రాణుల యొక్క రూపముల యందుండి సమస్త జీవుల దేహము లందరి యింద్రియములందుండిన వాడై ఆయా యింద్రియములకు కుత్సితమైన మోహము నిచ్చునని తెలియ వలయును.

నాగాది పంచ రూపముల వివరణము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 35 | శబ్ద | తమము | నాగ 53 | 1 | తమము | అజ్ఞాన కార్యము | - కృద్ధోల్క |
| 313 | స్పర్శ | మోహము | కృకల 313 | 2 | మోహము | భ్రాంతి కార్యము | - మహోల్క |
| 71 | రూప | మహా మోహము | కూర్మ 17 | 3 | మహా మోహము | మహా భ్రాంతి | - వీరోల్క |
| 2343 | రస | తామిస్ర | దేవదత్త | 4 | తామిస్ర | మహాక్రోధ | - ద్యుల్క |
| 13054 | గంధ | అంధ తామిస్ర | ధనంజయ 45031 | 5 | అంధ తామిస్ర | మహాక్రోధ | - సహస్రోల్క |
| 158165 | | | | 5 | | మొత్తము | 10 |

కృద్ధోల్కాది పది భగవద్రూపములు (అయిదు రూపములే పది రూపములతో నున్నది) దీని యందు ప్రాచుర్యముచే ఒక్కొక్క దాని యందు సంస్పృష్టములై అవిద్య అయిదింటి యందు తత్కార్యము లైదింటి యందు ఒక్కొక్క దాని యందు అయిదు అయిదు ప్రకారములుగా నున్నటిదై యున్నవి. ఈ రీతిగా

లెక్కించినచో 5X10=50 (ఏబదియగును) అవిద్యా తత్కార్య సహితము 50 ప్రకారముగా వ్యాప్తమై యున్నది. ఈ విధముగా నున్నదానిని లెక్కించినచో 550 - 11 ఏబదులు 550 అగును. మొత్తము ఆరునూరు కృద్ధోల్కాది 5 రూపములే ఆరునూరు రూపములచే నున్నట్టిదై యున్నది. (15816 + 600 = 16416) మొత్తము 16416.

మూ. ఐద విద్యగళొళగె ఇహ నా
గాదిగళ ధిష్ఠానదలి లకు
మీధవను కృద్ధోల్క మొదలాదైదు రూపగళ
తాధరిసి సజ్జనర విద్యవ
భేదిసువ తామసరి గజ్ఞా
నాదిగళ కొట్టపరవర సాధనవ మాడిసువ॥ 13

సీ॥ ఉన్నాడు హరియు కృద్ధోల్కాది రూపంబు
లైదు చందముల నాగాదులైన
వర యధి ష్ఠానముల్ ధరియించి యైదవి
ద్యలలోన వెలుఁగుచు నహరహంబు
సజ్జను లందున సంహార మొనరించు
నాయవిద్యను మఱి యసురజనుల
యత్యంత దుఃఖద మైన యజ్ఞానాదు
లొసఁగుచు వారిక యోగ్యమైన

తే.గీ. సాధనంబులు సేయించి సంతసమున
శర్వవంద్యుఁడనింద్యుఁడు సర్వసాక్షి
శంఖ చక్ర గదాపద్మ సహితకరుఁడు
మోహనాంగుడు భక్త సమ్మోహనుండు.

తా॥ పూర్వోక్తమైన తామసము మోహము మొదలగు అయిదు అవిద్యల యందుండ దగిన నాగాది పంచప్రాణముల అంతర్యామియై లక్ష్మీపతియైన నారాయణుడు కృద్ధోల్కాది పంచరూపములను తాను ధరించి సజ్జనులకు మధ్య మధ్య అజ్ఞానము నిచ్చుచు జ్ఞానమునభివృద్ధి చేయును. తమోయోగ్యులకు అజ్ఞానాదులను పూర్ణముగా నిచ్చి వారివారి సాధనలను తత్త్వేశుల ద్వార చేయించు చుండును.

ము. గోపు గళొళుద్గీథనిహ ప్ర
స్తావ హింకా రెరడు రూపద
లావి యజగళొళిహను ప్రతిహారాహ్వ హయగళొళు।
జీవన ప్రద నిధన మనుజరొ
ళీ విధ దొళిహ పంచసామప
జావ జావకే నెనెవరిగె ఐదిసను జనుమగళ॥ 14

సీ॥ ఉద్గీథ నామకు డుండు గోవుల యందుఁ
ప్రస్తావనాముండు వత్సములను
మేషంబు లందున మెలగును హింకార
నామకుండగు చుండు నందసుతుడు
నశ్వంబులం బ్రతిహార నామకుఁడుండు
నిధన నామకుడయి కుధర ధరుడు
మనుజుల యందునఁ దనరారుచుండు నీ
విధమున నైదగు పేళ్ళచేత

ఆ.వె. నైదు జాములకును నధిపతి తానయి
పంచసామ రూపి - వాసుదేవు
డలరు నతని దలచునా సాధుజనులకు
జన్మరహిత మోక్ష సౌఖ్యమొసగు.

తా॥ అయిదు జాములకును అధిపతి యైన పరమాత్ముడు గోవుల యందు ఉద్గీథ యను నామము చేతను, దూడల యందు ప్రస్తావ నామము చేతను మేకల యందు హింకార నామము చేతను గుఱ్ఱముల యందు ప్రతిహార నామము చేతను మనుష్యుల యందు నిధన నామము చేతను పంచసామ రూపియైన వాసుదేవుడున్నాడు. ఆ పరమాత్ముని ధ్యానించు వారికి జన్మరాహిత్యపు శాశ్వతమైన సౌఖ్యమును ప్రసాదించును.

యామములను కాలాభిమానియైన భగవంతుని రూపముల వివరణము

ఒక్క పగటికి అయిదు యామములు. ఒక యామమునకు ఆరు ఘడియలు. మొత్తము 30 ఘడియలు.

ప్రథమ యామము - ఉద్గీథ నామకుడు - అనిరుద్ధుడు - 6 ఘడి.
ద్వితీయ యామము - ప్రస్తావ నామకుడు - ప్రద్యుమ్నుడు - 6 ఘడి.
తృతీయ యామము - హింకార నామకుడు - సంకర్షణుడు - 6 ఘడి.
చతుర్థ యామము - ప్రతిహార నామకుడు - వాసు దేవుడు - 6 ఘడి.
పంచమ యామము - నిధన నామకుడు - నారాయణుడు - 6 ఘడి.

౭॥ ఏడవ కాలమునకు అధిపతి ఉప ద్రవ శబ్ద వాచ్యుడైన నరసింహుడు. అరణ్యములందలి అన్ని మృగాదులకు ఆశ్రయుడు.

మూ. యుగ చతుష్ట యగళలి తాని
ద్యుగ ప్రవర్తక ధర్మ కర్మగ
ళిగె ప్రవర్తక వాసుదేవా దీ రెరడు రూప।
తెగదు కొండు యుగాది కృతు తా
యుగ ప్రవర్తక నెనిసి ధర్మ
ప్రఘటకను తానాగి భకుతంగీవ సంపదవ॥ 15

తే.గీ. నాల్గు యుగముల లోనుండి నళినధవుడు
యుగ ప్రవర్త ధర్మ కర్మగుడు నగుచు
వాసుదేవాది నాల్గురూపముల దాల్చి
తగ యుగాది కృత్ యుగ ప్రవర్తకుడు నగుచు
ధర్మ మొనరింప గాజేసి తనర గాచు.

తా॥ కృత యుగము మొదలగు నాలుగు యుగము లందు పరమాత్ముడుండినవాడై ఆయా యుగము లందు జీవులాచరింప దగిన స్నానము సంధ్యా వందనము యజ్ఞము దానము ఇటువంటి కర్మలకు యుగానుసారముగా ఆయాప్రాణులకు తత్త్వేశుల ద్వార ప్రేరేపించి ఆచరింప జేయు దగిన వాడు. వాసు దేవాది నాల్గు రూపములను తెలుసుకొని నాల్గు యుగములకు ఆదియైన కృత యుగము ననుసరించిన ధర్మములకు ప్రవర్తకుడనబడి ధర్మమును బాగుగా ప్రాణులకు ఘటనము చేయు వాడై తన యిచ్ఛ చేతనే ప్రవర్తించు వాడై ధర్మమునకు దుర్భిక్షమైన కలియుగ మందు భక్తులచే అల్ప సాధనము చేయించి అటువంటి సాధకునకు జ్ఞాన భక్త్యాది సంపదలను యజ్ఞయాగాదులు చేసినచో ఏ ఫలము రావలయునో అటువంటి ఫల రూపమైన ఐశ్వర్యమును అనుగ్రహించు వాడై యున్నాడు.

| యుగములు | పరమాత్ముని రూపములు | ధర్మము | కర్మము | పాపము | పుణ్యము | అధర్మము |
|---|---|---|---|---|---|---|
| కృతయుగం | వాసుదేవ | నారాయణ ధర్మములు | స్నానాదిక ధర్మములు | ఒక భాగము | ఒక భాగము | లేదు - |
| త్రేతాయుగం | సంకర్షణ | దానాది ధర్మములు | స్నానాదిక ధర్మములు | పది భాగములు | ముప్పది భాగములు | - |
| ద్వాపర | ప్రద్యుమ్న | దానాది ధర్మములు | స్నానాదిక ధర్మములు | ఇరువది భాగములు | ఇరువది భాగములు | - - |
| కలియుగము | అనిరుద్ధ | దానాది ధర్మములు | స్నానాదిక ధర్మములు | ముప్పదిఆరు భాగములు | ఒక భాగము | - |

వి. సంపత్తు అనగా జ్ఞానము భక్తి వైరాగ్యము ముక్తి. ముక్తియోగ్యులకు సంపత్తు భేద జ్ఞానము. తమోయోగ్యులకు సంపత్తు అభేద జ్ఞానము. దానిని అనుసరించి కృతయుగ మందు ధర్మ కర్మములు. ముక్తి యోగ్యుల సంపత్తు అధికము. తమో యోగ్యుల సంపత్తు స్వల్పము. త్రేతాయుగము నందు ముక్తి యోగ్యుల సంపత్తే అధికము. తమోయోగ్యుల సంపత్తు స్వల్పము. అయినను కృత యుగము కంటె ముక్తియోగ్యుల సంపత్తు తక్కువ. తమోయోగ్యులకు సంపత్తు అధికమేయగును. ద్వాపర యుగము నందు ఉభయుల సంపత్తు సమానము. కలియుగము నందు దైత్యుల సంపత్తే అధికము. ముక్తి యోగ్యుల సంపత్తు స్వల్పము.

మూ. తలె యొళిహ నారాయణను గం
టలెడె ఒడలొళు వాసు దేవను
బల దలిహ ప్రద్యుమ్న ఎడభాగదొళగనిరుద్ధ।
కెళగి నంగది సంకరుషణన
తిళిదు ఈ పరి సకల దేహగ
ళొళగె పంచాత్మకన రూపవ నోదు కొండాడు॥ 16

కII నారాయణుండు శిరమునఁ
దారంజిలు వాసు దేవ తన్నాముడు కం

తారంభ కటిస్థల మున
వారక ప్రద్యుమ్నుడు కుడి భాగము నందున్.

తే.గీ. ఎడమ భాగంబునందున నెప్పుడుండు
ధీరుడనిరుద్ధుడచటికి దిగువ చోట
వెలయు సంకర్షణుండిది తెలిసి దేహ
మందు బంచాత్మ రూపంబు నభినుతింపు

తా॥ సర్వ ప్రాణుల యందు సర్వ వ్యాపారములు నడుప దగిన ఈ అయిదు రూపములే అనంతానంత రూపములు. ఈ రూపములతో వ్యక్తమై, అనంతానంత నామములతో వ్యాపారములు నడచును. యుగ ప్రవర్తకుడైన నారాయణాది పంచ రూపములు నారాయణుని వ్యతిరిక్తమైన నాల్గు రూపములు. నాల్గు యుగ ధర్మములు ప్రాచుర్యాప్రాచుర్యముతో ప్రతి దిన మందును ప్రాణుం ద్వార చేయించునని తెలియ వలయును.

మూ. తను విశిష్టది ఇప్ప నారా
యణను కటి పాదాంత సంకరు
షణను శిరజఘనాంతవాగిహ వాసు దేవాఖ్య।
అనిమిషేశ నిరుద్ధ ప్రద్యు
మ్నను ఎడది బల భాగ దల్లి చిం
తనెయ మాళ్పరిగుంటె మైలిగె విధినిషేధగళు॥ 17

సీ॥ అంగుష్ఠమున నుండి యాశిర పర్యంత
ముందు నారాయణుడు త్వకమున
గటియు బాదాంతంబు గలదు సంకర్షణుం
డాశిర జఘనాంత మంత వఱకు
బాదంబులను వీడి పై భాగమునకును
వాసుదే వాఖ్యుడు వరలు చుండు
నని మిషేశ్వరుడగు ననిరుద్ధ రూపి తా
నెడమ భాగంబున నదరు చుండు

తే.గీ. గుడియు భాగంబునందున గుణ నిధాను
డైన ప్రద్యుమ్నుడీతి నాత్మలోన
జింతనము సేయు వారిని చెంద గలదె?
యశుచి విధి నిషేధాదులు విశద మిదియు.

తా॥ స్థూల దేహపు అంగుష్ఠము నారంభించి శిరస్సు వఱకు నారాయణ రూపి పరమాత్ముడు వ్యాప్తుడై యున్నాడు. నడుమును ఆరంభించి పాదాంతము వఱకు సంకర్షణ రూపి పరమాత్ముడున్నాడు. శిరస్సు మొదలుకొని మోకాలు క్రింది వఱకు పాదము వదలి పై భాగము వఱకు వాసుదేవుడను పరమాత్ముడున్నాడు. అనిరుద్ధ రూపి పరమాత్ముడు ఎడమ భాగ మందున్నాడు. కుడి భాగ మందు ప్రద్యుమ్నరూపి పరమాత్ముడున్నాడు. ఈ విధమైన భగవద్రూపములను అనుసంధానముతో బింబ ప్రతిబింబ క్రియా చింతనము చేయు వారికి మలినము - నిషేధములును లేవు. ఎల్లప్పుడు శుచియై యుందురు.

మూ. పదమనాభను పాణి యొళగిహ
వదనదలి హృషీకేశ నాసిక
సదనదలి శ్రీధరను జింహ్వా దొళిప్ప వామనను।
మృదుళ త్వగ్దేశది త్రివిక్రమ
మధు విరోధియు లోచనది క
ర్ణదలి ఇప్పను విష్ణునా మక శ్రవణ నెందెనిసి॥ 18

ఉ॥ వారిజ నాభుడుండు కర పద్మము నందు హృషీక నాథుడున్
వారక మోము నందు మఱి వామనుడుండును జిహ్వా యందు శ్రీ
ధారుడు నాసయందు మృదు త్వక్కున నుండు ద్రివిక్రముండు దై
త్యారి మదుఘ్నుడక్షులను నాగతి వెన్నుడు వీనులందగున్.

తా॥ చేతుల యందు పద్మ నాభుడున్నాడు. నోటి యందు హృషీకేశుడు ముక్కు రంధ్రము లందు శ్రీధరుడు నాలుక యందు వామనుడు చర్మము నందు త్రివిక్రముడు నేత్రము లందు మధుసూదనుడు చెవులందు విష్ణు రూపి పరమాత్ముడు తత్తన్నామములచే పిలువ బడుచున్నాడు. ఈ ప్రకారము ఇంద్రియము లందు ఇంద్రియాకారములతో నుండి ఇంద్రియనామములతో కార్యములను చేయుచున్నాడు. పద్మనాభాది రూపములతో నియామకుడై

యున్నాడు. అని అను సంధానమును చేయ వలయును. ఇంద్రియాకార రూపములు పవిత్రము చేయు రూపములనియు పద్మనాభాది రూపములు తత్త్వ నియామక రూపములనియు ముఖ్యముగా తెలుసుకొనవలయును.

సూ. మన దొళ గోవింద మాధవ
ధనపసఖ తత్త్వ దలి నారా
యణ మహత్తత్త్వ దలి అవ్యక్తదొళు కేశవను।
ఇనితురూపవ దేహ దొళు చిం
తనెయ గైవ మహాత్మ రిళి యొళు
మనుజ రవ రల్ల మరరే సరి హరికృపాబలది॥ 19

క. మనమున గోవిందుండును
ధన పసఖుని తత్త్వ మందుఁ దగ మాధవుదున్
దనరు మహత్తత్త్వంబున
ననువుగ నారాయణుండు నాకేశవుదున్

తే.గీ. వెలయు నవ్యక్త తత్త్వమున్ విమల మతిని
దేహ మందున నీరీతి దెలియ వలయు
వనజ లోచను జింతింపు మనము నందు
నంబు జాక్షుని దయ వారలమరులెకద!

తా॥ మనస్తత్త్వమందు గోవిందుడు అహంకారతత్త్వ మందు మాధవుడు మహత్తత్త్వమందు నారాయణుడు అవ్యక్తతత్త్వ మందు కేశవుడును ఉన్నాడు. పూర్వము చెప్పబడిన భగవద్రూపములను తన దేహ మందును అన్యుల దేహ మందును వ్యాపారములను అనుసంధానము చేయు వాడే కేవలము జ్ఞాని యగును. వీరు భూమిలో మానవ శరీరము తో సాధనము కొఱకు అవతరించిన దేవతలే యనుట నిశ్చయము. దేవత్వమును పొందు మనుష్యులు వీరని తెలియవలయును.

సూ. నెల దొళిప్పను కృష్ణ రూపది
జలదొళిప్పను హరి యెనిసి శిఖి
ఒళగె ఇప్పను పరశురామను పేంద్ర నెందెనిసి

ఎలరొళిప్ప జనార్దనను బాం
దళ దొళచ్యుత గంధ నర హరి
పాళె వధోక్షజ రసగళొళు రస రూప తానాగి||

20

క. ఇలలోన గృష్ణ రూపుడు
జల మందున హరియు శిఖిని జమదగ్ని సుతుం
డలరారు నుపేంద్రుండన
జ్వలనసఖు జనార్దనుండు సతతము వెలయున్.

ఆ.వె. అచ్యుతుండు వెలయు నాకాశ మందున
నృహరి గంధ మందు నిలిచి యుండు
రహిన ధోక్షజుండు రసముల లోరస
రూపి యగుచు సకల వ్యాపకుడయి.

తా|| దేహ మందలి పృథ్వీ తత్త్వ మందు కృష్ణ రూపి పరమాత్ముడు జలతత్త్వమందు హరియు వరుణాం తర్యామియై యున్నాడు. అగ్ని తత్త్వ మందు ఉపేంద్రుడు అను పరశురాముడున్నాడు. వాయు తత్త్వమందు జనార్దనరూపి యున్నాడు. ఆకాశ తత్త్వ మందు అచ్యుత రూపి పరమాత్ముడున్నాడు. పృథ్వీ తత్త్వమందు నరసింహుడున్నాడు. రసములందు అధోక్షజుడు రసాకారముతో నున్నాడు. ఈ అఖండ రూపముతో ఇంద్రియములందుండు పంచ భూతములను పవిత్రమును, ఖండ రూపముతో ఇంద్రియముల నియమనమును చేయునని అనుస సంధానము చేయవలయును.

మూ. రూప పురుషోత్తమను స్పర్శ
ప్రాపకను అనిరుద్ధ శబ్దది
వ్యాపిసిహ ప్రద్యుమ్నుపస్థది వాసుదేవనిహా|
తాపొళెప పాయుస్థ నాగిహ జ
యా పతియు సం కరుషణను సు
స్థాపకను అహపాద దొళు దామోదరను పొళెవ||

21

మూ. చతురవింశతి తత్త్వ దొళు శ్రీ
పతియు అనిరుద్ధాది రూపది
వితత నాగిద్దఖిళ జీవర సంహనన దొళగె॥
ప్రతతియందది స్తుతిసుతిర్ప తత్
పిత్రు గళిగె తర్పక నెనిసి కొం
డతుళ మహిమను షణ్ణవతి నామదలి నెలసిహను॥ 22

సీ॥ పురుషోత్తముండును బరగు రూపంబున
నినిరుద్ధుడే స్పర్శ యందు వెలయు
వ్యాపించు శబ్దమున్ బ్రద్యుమ్న రూపుండు
వాసు దేవాఖ్యుండు పస్థ నుండు
పాయు వందున జయా పతియు సంకర్షణ
రూపుఁడు నిచ్చలున్ స్థాపకుఁడయి
పాదమందునను దామోదరుండుండు నీ
గతిఁజ తుర్వింశతిఁ గలుగు తత్త్వ

తే.గీ. ములను శ్రీపతి యనిరుద్ధ ముఖ్య రూపి
వ్యాపకుండయి ప్రాణి కాయంబు లందు
బ్రతతి యట్టుల దిరుగుచు బితరులకును
దర్పకుడు షణ్ణవతి యన దగ వసించు (21, 22)

తా॥ రూపము నందు పురుషోత్తముడు స్పర్శ యందు అనిరుద్ధుడు శబ్ద మందు ప్రద్యుమ్నుడు ఉపస్థతత్త్వ మందు వాసు దేవుడు పాయు తత్త్వమందు సంకర్షణుడు పాద మందు దామోదరుడును ఈ ప్రకారముగా నున్నారు. ఇరువది నాలుగు తత్త్వములందు పరమాత్ముడు అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవ అను నాల్గు రూపములచే సమస్త జీవుల దేహము లందు సంచారము చేయుచు పిత్రు పితా మహాది పిత్రులను తృప్తి పొందించు వాడగును. ఈ పరమాత్ముడు (షణ్ణవతి) తొంబదియారు రూపములతో 24 తత్త్వములందు అనిరుద్ధాది నాల్గు రూపముల మేరకు 24 X 4=షణ్ణవతి శ్రాద్ధములకు ముఖ్యకారణుడై యున్నాడు.

మూ. చతురవింశతి తత్త్వ దొళగుత
త్పతి గళెనిసువ బ్రహ్మముఖ దే
వతిగళొళు హన్నొందు నూరైవత్తెరడు రూప।
వితత నాగి ద్దెల్ల జీవర
జతన మాడువ గోసుగ జగ
త్పతిగె ఏనాదరు ప్రయోజన విల్ల వదరింద॥ 23

తే.గీ. ఇర్వదియు నాల్గు తత్త్వాల కీశులైన
బ్రహ్మముఖ దేవతలయందుఁ బదు నొకందు
నూరు లేబది రెండగు సార రూప
ములను విలసిల్లి జీవుల ముదము మీఱఁ
గాచు హరికిని ఫలితంబు గలదె చూడ?

తా॥ జీవుల స్థూల దేహము నందలి తత్త్వములు ఇరువది నాలుగు. ఈ తత్త్వములందు సంసృష్టతత్త్వములు 24 మేరకు కాదగిన తత్త్వములు 576 (24 x 24) అయిదు నూట డెబ్బదియారు. భగవద్రూపములన్నియే. ఆయా తత్త్వములకు అభిమానులన దగిన బ్రహ్మదేవుడే మొదలైన 24 తత్త్వాభిమాన దేవతల స్థూల దేహము లందు ఒక్కొక్క తత్త్వ మందు సంసృష్టతత్త్వములు 24 మేరకు కాదగిన 576 జీవ స్థూల దేహములందలి భగవద్రూపములు 576. ఒక్క దేవతా శరీర మందలి భగవద్రూపములు 1152. ఈ రీతి దేవతా మానుష జీవుల యందు 576 భగవద్రూపముల మేరకు తెలియ వలయును. ఒక్కొక్క దేవత యందు 576 మేరకు 24 దేవతలయందు అగు భగవద్రూపములు (576 x 24=13824 అగును) ఇట్లుండు పరమాత్మునకు జీవుల సంరక్షణము చేయుటచే ఏ మాత్రమును ప్రయోజనమున్నదా?

మూ. ఇందిరాధవ శక్తి మొదలా
దొంద ధిక దశ రూప దిందలి
పొంది హను సకలేంద్రి యగళలి పురుషనామకను।
సుందర ప్రద పూర్ణ జ్ఞానా
నందమయ చిద్దేహ దొళు తా
పంద రక్షణ వగలదలె పరమాప్తనాగిప్ప॥ 24

ఉ॥ సారస లోచనాథపుడు శక్తి మొదల్ బదునొండు రూపుడై
వారక యింద్రి యావలిని భాసిలు స త్పురుషాఖ్యుడౌచు శృం
గార సుఖ ప్రపూర్ణ గుణ జ్ఞాన మయుండు శరీరమున్ మదిం
దోరముగా నిరంతరము దోచును దాఁ బరమాప్తుకైవడిన్.

తా॥ లక్ష్మీపతియైన పరమాత్ముడు శక్తియనియు ప్రతిష్ఠాయనియు మొదలుగా గల పదునొకండు రూపములచే ఆశ్రయము చేసుకొని యున్నాడు. సమస్తమైన ప్రాణుల పదునొకండు యింద్రియము లందు పూర్వము చెప్పబడిన నామరూపములచే మొత్తము 12 రూపములచే జీవుల యొక్క స్థూల దేహము లందున్న యింద్రియములందుండువాడై యున్నాడు. త్రివిధ జీవులకు యోగ్యతానుసారముగా జ్ఞానమును వ్యక్తము చేసి యిచ్చును. జీవుని స్వరూప దేహ మందు బ్రహ్మ వాయువులకు ప్రవేశము లేదు.

వి. 1. మనస్సునందు - శక్తియను పరమాత్ముడు.
2. కర్ణమందు - సంవిత్ అను పరమాత్ముడు.
3. నేత్రములందు - ప్రతిష్ఠానామక పరమాత్ముడు.
4. చర్మము నందు - స్ఫూర్తినామక పరమాత్ముడు.
5. జిహ్వాయందు - ప్రకృతి నామక పరమాత్ముడు.
6. నాసిక యందు - కళానామక పరమాత్ముడు.
7. వసన మందు - విద్యా నామక పరమాత్ముడు.
8. పాణి యందు - మతినామక పరమాత్ముడు.
9. పాదములందు - నియతి నామక పరమాత్ముడు.
10. పాయువందు - మాయానామక పరమాత్ముడు.
11. ఉపస్థ యందు - కాల నామక పరమాత్ముడు.
12. దేహాకారమందు - పురుషనామక పరమాత్ముడు.

మూ. ఆరధిక దశ రూప దిందలి
తోరు తిప్పను విశ్వలింగ శ
రీర దొళు తైజసను ప్రాజ్ఞను తుర్యనామకను।
మూర యిదు రూపగళ ధరిసుత
లీర యిదు కరణ దొళు మాత్రది
ఖేర శిఖి జల భూమి యెనిసహ నాత్మనామదలి॥ 25

సీ॥ హరియు షోడశ కళా స్ఫురితుడై వెలుగొందు
సకల లింగశరీర సముద యమున
తుర్య నామకుదు నిస్తుల శక్తి ననిరుద్ధు
డాదిగా బంచ రూపాత్ముడగుచు
విశ్వరూపంబున వెలయు సాత్త్వికమున
దగురజో గుణమునఁ దైజసుడన
ప్రాజ్ఞ రూపంబున బరగు తామ సమున
జననాది కార్యముల్ సల్పు చుండు

ఆ.వె. నష్ట రూపములను నాతడు ధరియించి
యింద్రియములఁ బదిట నెసగు మఱియు
బంచ భూతములను బంచ తన్మాత్రల
నాత్మ నాముడగుచు ననుదినంబు.

తా॥ అనిరుద్ధాది అయిదు రూపములు ధరించిన తుర్యనామము గల పరమాత్ముడు అనాది లింగ శరీరమందు విశ్వరూపముతో సత్త్వ గుణ మందు తైజస రూపముతో రజో గుణ మందు ప్రాజ్ఞ రూపముతో తమో గుణమందును వెలయుచు జనన మరణ పాలనాదులను ప్రాణులకు చూపించు చుండును. త్రిగుణాత్మకమైన లింగ శరీర మందుండి చూపించును. (విశ్వ రూపి జననమును తైజస రూపి పాలనమును ప్రాజ్ఞరూపి సంహారమును) వారి వారి కార్యములు విశ్వాది మూడు రూపముల కార్యములను అని అర్థము. తుర్య నామకుడైన వాసుదేవుడు అనిరుద్ధాది అయిదు రూపముల దాల్చి అయిదు రూపములతో రజో గత దశ ఇంద్రియము లందు ఆ వాసుదై యున్నాడు. తమః పరిచ్ఛేద తన్మాత్రములందు ఆకాశ మందు వాయువు నందు అగ్ని యందు ఉదక మందు భూమి యందు తమోగత పంచ భూతములందు వాసుదేవుడే అని రుద్ధాది రూపములతో అంశ విశేషములతో నున్నాడు. లింగ శరీర మందు అఖండమైన తదాకారములో తుర్య నామకుడున్నాడు. లింగ శరీరము అంత్య మగుటచే దాని యందు అఖండాకార రూపము తుర్య నామకునిది. మొత్తము అయిదు శరీరము లందున్నాడు. ఎనిమిది రూపము లేవనగా?

1. అనిరుద్ధ. 2. ప్రద్యుమ్న. 3. సంకర్షణ. 4. వాసుదేవ. 5. ఆత్మ. 6. అంతరాత్మ. 7. పరమాత్మ. 8. జ్ఞానాత్మ.

## షోడశ కళా వివరణము

1) ప్రథమా వరణము జీవునిపై సత్వా వరణము. దీనికి విశ్వరూపి పరమాత్ముడు. దీని యందుండ దగిన విచా...ము.

1. అవ్యక్త తత్త్వము - జ్ఞానాత్మ
2. మహత్తత్త్వము - పరమాత్మ
3. అహంకారతత్త్వము - అంతరాత్మ
4. మనస్సు - ఆత్మ రూపి పరమాత్మ

2) సత్త్వావరణమునకు పైన ద్వితీయా వరణము రజోఆవరణ మందు తైజస రూపి పరమాత్ముడుండదగిన విచారము. ఐదు రూపములచే పది ...రణములందు (దశేంద్రియము లందు) అయిదు రూపములు అనిరుద్ధాదులు.

1. శ్రోత్రేంద్రియము - అనిరుద్ధ - వాగింద్రియము
2. నేత్రేంద్రియము - ప్రద్యుమ్న - పాణీంద్రియము
3. త్వగింద్రియము - సంకర్షణ - పాదేంద్రియము.
4. జిహ్వేంద్రియము - వాసుదేవ - పాయ్వింద్రియము
5. నాసికేంద్రియము - నారాయణ - ఉపస్థేంద్రియము.

ఈ అయిదు రూపముల దశేంద్రియములందున్నవి.

3) రజో ఆవరణము. పైన తృతీయావరణము తమో ఆవరణము దీనికి ప్రాజ్ఞరూపి పరమాత్ముడు. దీని విచారము పంచ భూతములు- పంచతన్మాత్రలు- దీని వివరణము.

1. పృథ్వి - అనిరుద్ధ - గంధము
2. అప్పు - ప్రద్యుమ్న - రసము
3. తేజస్సు - సంకర్షణ - రూపము
4. వాయువు - వాసుదేవ - స్పర్శము
5. ఆకాశము - నారాయణ - శబ్దము

ఈ అయిదు రూపములు పంచ భూతములు - పంచ తన్మాత్ర లందున్నవి. ఈ తృతీయ పరిచ్ఛేద మందు అనాది రూపమైన అవిద్యా కామకర్మలు జన్మమునకు కారణమైనవిగా నున్నవి. మొత్తము త్రిగుణముల విచారమైనది.

### లింగ శరీరము షోడశ కళాత్మక మనుటకు వివరణము

1. ప్రథమ పరి చ్ఛేదమైన సత్వ పరి చ్ఛేదము నందున్న మనస్సు.
10. ద్వితీయ పరి చ్ఛేదమైన రజః పరి చ్ఛేదము నందున్న మనస్సు.
5. తృతీయ. పరి చ్ఛేదమైన తమః పరి చ్ఛేదము నందలి ఇంద్రియములు.
16. మొత్తము పదునారు కళలని తెలియ వలయును.

ము॥ మన హౌళహంకారదలి చిం
తనెయ మాళ్పుదు అంతరాత్మన
ఘనసు తత్త్వది పరమన వ్యక్తదలి జ్ఞానాత్మ!
ఇనితు పంచాశ ద్వరణ వే
ద్యన అజాద్యైపత్తు మూర్తిగ
ళను సదా సర్వత్ర దేహగ ళల్లి పూజిపుదు॥

సీ॥ ఆత్మ రూపంబున నలరు లింగమున న
హంకార తత్త్వమం దంతరాత్మ
ఘన మహత్తత్త్వముం దనరారు పరమాత్మ
యవ్యక్తమందు జ్ఞానాత్మ యనగ
నీ గతి లింగమం దెసఁగు నిర్వదినాల్గు
తత్త్వాల నెన్మిది తగుకళలను
వెలయు నేబది వర్ణ వేద్యుని మఱియు న
జాది యేఁబది మూర్తు లవ్విధమున

ఆ.వె. దేహ మందు జక్కఁ దెలిసి యెల్లప్పుడు
పూజ సేయదగును బుధులు ధరణి
నట్టి వారి పూజ హరియు గ్రహించి తా
సకల సౌఖ్యములను సంఘ టించు

తా॥ మనస్సు నందు ఆత్మరూపుడు, అహంకార తత్త్వ మందు అంతరాత్ముడు మహత్తత్త్వ మందు పరమాత్ముడు అవ్యక్తమందు జ్ఞానాత్ముడు అని యీ ప్రకారముగా లింగ దేహ మందలి చతుర్వింశతి తత్త్వ మందు 8 రూపములను అనుసంధానము చేయవలయును. ఏబది అక్షరముల చే తెలియ దగిన పరమాత్ముడు "అం అజా యనమః" ఆరంభించి "క్షం శ్రీలక్ష్మీ నరసింహాయనమః' అను ఏబది భగవద్రూపములను నిరంతరము పరాచ స్వరూప దేహము నారంభించి స్థూల దేహము వఱకు గల దేహములందు అనగా స్వరూప దేహము అవ్యక్త సాంకేతము మహత్తత్త్వము అనిరుద్ధ దేహము అహంకారము అనాది లింగ శరీరము వైషయిక శరీరము స్థూల శరీరము మొదలగు దేహము లందు ఏ బది రూపములను చింతించి పూజించ వలయును. మఱియు ఈ ఏబది రూపములకు స్థానము లేవనగా

మాతృకా మంత్ర మందు స్థానములను చెప్పి యున్నారు. అందువలన ఆయా స్థానము లందు పూజించ వలయును. చరాచరములకు నామములు అక్షరములచే యుక్తమై యున్నవి. ఆయా అక్షరముల చే ఏయే భగవద్రూపములు స్థాంకేతములగు నో ఆయా భగవద్రూపములు స్థావర జంగములందు అనుసంధానము చేసుకొని పూజించ వలయును. లింగ దేహము వఱకు అనిరుద్ధ శరీరము వఱకు జీవాకారమైన స్థూల దేహము తద్భిన్న కర్మ వశముచే నానా దేహములు వచ్చు చుండును. దీని విచారమును ప్రకాశ సంహిత యందు విస్తారముగా నున్నది. 25 వ పద్యము మొదలుకొని లింగ శరీరపు విచారము. రెండింటి యందు వాయుదేవుని ప్రసక్తి లేదు. 24 వ పద్య మందు జీవుని స్వరూప విచారము బ్రహ్మాది దేవతల ఆవాస స్థానము ఇతర సంధులందు చెప్పుదురు.

మూ. చతుర వింశతితత్త్వదొళు త
త్పతిగళె నిసువ బ్రహ్మముఖ దే
వతిగళొళు హది మూరు సావిరదెంటు నూరధికా
చతుర వింశతి రూప దిందలి
వితతనాగి ద్దెల్లరొళు ప్రా
కృత పురుషనందదలి పంచాత్మకను రమిసువను॥ 27

చ॥ ఇరువది నాల్గు తత్త్వముల కెల్ల సదా పతులైన యట్టి పం
కరుహ భవాది దివ్యులఁ బ్రకాశితుడై పదుమూడు వేలపైఁ
బరగ శతంబు లెన్మిదిగ భాసిలు నిర్వదినాల్గు రూపముల్
వరలఁగఁ బ్రాకృతాకృతుని భంగి రమించును వాసుదేవుడున్.

తా॥ అనాది లింగ శరీరముపై సృష్టి ప్రారంభ మందు లింగో పాదనముచే సృష్టమై లింగ దేహము మీద ప్రథమా వరణమైన (వైషయికము అనగా వైషయిక శరీరము వఱకు ఉండ దగిన శరీరము లందు ఏర్పడిన ఇరువది నాలుగు తత్త్వము లందు) ఆయా తత్త్వములకు అభిమానులన బడు బ్రహ్మ వాయు సరస్వతి భారతి. ఈ నలువురు అభిమాను లగుదురు. రుద్రాది నామములతో నున్నారు. అనిరుద్ధ దేహము మొదలుకొని స్థూల దేహము వఱకు ఆయా దేహము లందలి చతుర్వింశతి తత్త్వము లందు బ్రహ్మ దేవుడే మొదలైన దేవత లందరు ఆయా తత్త్వములకు అభిమానులై యున్నారు. దీని విచారము విస్తారముగా ప్రకాశ సంహిత యందున్నది.

ఇటువంటి శబ్దాది తత్త్వ దేవత లందు పదుమూడు వేల ఎనిమిది నూర ఇరువది నాల్గు (13824) రూపము లందున్నాడని చెప్పబడినది. ఆ రూపము లేవనగా? దాని వివరణము. 25 మఱియు 26 పద్యము లందు చెప్పిన భగవద్రూపములును దీని వివరణమును క్రిందనీయబడును. లింగ దేహ మందలి చతుర్వింశతి తత్త్వాంతర్యామి భగవద్రూపములు వివరింప బడును.

1 లక్ష్మి అభిమన్యమానమైన అవ్యక్త తత్త్వ మందు జ్ఞానాత్మ.
10 దశేంద్రియము లందు అని రుద్ధాది రూపములు పది.
5 తన్మాత్రలు వీని యందు అని రుద్ధాది రూపములు అయిదు
1 ఆత్మ రూపము మనస్సు నందు.
1 అంతరాత్మ రూపము అహంకార తత్త్వ మందు
1 పరమాత్మ మహత్తత్త్వ మందు
5 పంచ భూతములు వాని యందు అనిరుద్ధాది రూపములు అయిదు
24 మొత్తము తత్త్వములు.

| సంఖ్య | తత్త్వముల పేర్లు | తత్త్వాభిమాన దేవతల పేర్లు | భగవద్రూపములు | భగవద్రూపముల పత్నుల పేర్లు |
|---|---|---|---|---|
| 1. | అవ్యక్తతత్త్వము | కేశవ-లక్ష్మి | కేశవ | శ్రీ |
| 2. | మహత్తత్త్వము | బ్రహ్మ-నారాయణులు | నారాయణుడు | లక్ష్మి |
| 3. | అహంకారతత్త్వము | రుద్రాదులు | మాధవుడు | కమల |
| 4. | మనస్తత్త్వము | ఇంద్రుడు-కాముడు-గరుడాదులు | గోవింద | పద్మ |
| 5. | కర్ణములు | చంద్రుడు | విష్ణువు | పద్మ |
| 6. | నేత్రములు | సూర్యుడు | మధుసూదనుడు | కమల |
| 7. | త్వక్కు | అహంకారిక ప్రాణుడు | త్రివిక్రముడు | రమ |
| 8. | జిహ్వ | వరుణుడు | వామనుడు | వృషాకపి |
| 9. | నాసిక | అశ్వనీదేవతలు | శ్రీధరుడు | ప్రకృతి |
| 10. | వదనము | వహ్ని | హృషీకేశుడు | బుద్ధి |
| 11. | పాణి | దక్షుడు | పద్మనాభుడు | యజ్ఞ |

| | | | | |
|---|---|---|---|---|
| 12. | పాదము | జయంతుడు | దామోదరుడు | ఇందిర |
| 13. | పాయువు | మిత్ర | సంకర్షణుడు | హిరణ్యా |
| 14. | ఉపస్థ | మనువు | వాసు దేవుడు | హరిణే |
| 15. | శబ్దము | ప్రాణుడు | ప్రద్యుమ్నుడు | సత్య |
| 16. | స్పర్శము | అపానము | అనిరుద్ధుడు | నిత్య |
| 17. | రూపము | వ్యానము | పురుషోత్తముడు | ఆనందిని |
| 18. | రసము | ఉదానము | అధోక్షజుడు | అసౌజ్ఞ |
| 19. | గంధము | సమానము | నరహరి | సుఖ |
| 20. | ఆకాశము | గణేశుడు | అచ్యుతుడు | సుగంధి |
| 21. | వాయువు | ప్రవహవాయువు | జనార్దనుడు | సుందరి |
| 22. | తేజస్సు | పావకుడు | ఉపేంద్రుడు<br>పరశురాముడు | విద్య |
| 23. | అప్పు | వరణుడు | హరి | సుశీల |
| 24. | పృథ్వి | ధరా - శని | శ్రీకృష్ణుడు | సులక్షణ |

మూ. కేశవాది సుమూర్తి ద్వాదశ
మాస పుండ్ర గళల్లి వేద
వ్యాస అని రుద్ధాది రూప గళారు ఋతుగళలి।
వాస 'వాగిహ వెందు త్రింశతి
వాసరది సత్కర్మ ధర్మ ని
రాశ యిందలి మాడు కరుణవ బేడు కొండాడు॥ 28

సీ॥ ద్వాదశ మాసాల ద్వాదశ పుండ్రాలఁ
బంకజ నాభుండు బరగు కేశ
వాదిగా నిర్వదియూపయి నాలుగు
రూప మూర్తులతోడ రూఢి వెలయు
వసియించు మఱియును వ్యాస రూపంబున
ననిరుద్ధ మూర్తుల నాఱు ఋతువు
లందుమోదంబున నలరారు ముప్పది
వాసరంబులను నివాసి తుఁడగు

ఆ.వె. నంచుఁదలఁచి సతతమాత్మలో నెఱుగుచు
సత్య ధర్మములను సన్మనమున
నాచరించి భక్తి నాహరి సత్కృప
గోరుచుండు మతఁడు కోర్కెలొసఁగు.

వా॥ ద్వాదశ మాసములందు, దేహ మందు ధరింప దగిన పంౘ్రెండు ఊర్ధ్వ పుండ్రము లందు పైన చెప్పిన ప్రకారముగా భగ వన్మూర్తులను అనుసంధానము చేయవలయును. ఏయే స్థానము లందనగా లలాట మందు కేశవుడు ఉదరమందు నారాయణుడు హృదయ మందు మాధవుడు కంఠము నందు గోవిందుడు ఉదరము కుడి భాగ మందు విష్ణుడు దక్షిణ బాహు మూల మందు మధుసూదనుడు కర్ణ మూల మందు త్రివిక్రముడు వామకుక్షి యందు వామనుడు పృష్ఠ మందు పద్మ నాభుడు కంఠము వెనుక దామోదరుడు వసంతాది ఋతువు లందు వేదవ్యాసుడు గ్రీష్మ ఋతువు నందు అనిరుద్ధుడు వర్ష ఋతువు నందు ప్రద్యుమ్నుడు శరదృతువు నందు సంకర్షణుడు హేమంత ఋతువు నందు వాసుదేవుడు శిశిర ఋతువు నందు నారాయణుడు అభిమానులు. వేదవ్యాస అనిరుద్ధాది రూపములు అయిదు మొత్తము ఆరు రూపములు. ముప్పది దినము లందు ప్రతి దినము నందు నిష్కాముకుడై సత్యము దాన ధర్మాదులు చేయు వాడవై శ్రీ పరమాత్ముని మహిమలను సదా కొనియాడు చుందుము.

పూ. లోష్ట కాంచన లోహ శైలజ
కాష్ఠ మొదలా దఖిళ జడ పర
మేష్ఠి మొదలాదెల్ల చేతన రొళగె అనుదినవు।
చేష్ట గళ మాడి సుత తిళి సదె
శ్రేష్టనా గిద్దెల్లరిగె స
ర్వేష్ట దాయక సంతయిసువదు సర్వ జీవరను॥ 29

ఉ॥ లోష్టము కాంచనాదులను లోహము లందున శైల జంబులం
గాష్ఠము మున్నుగా గల యఖండ జడంబుల బ్రహ్మయందును
త్సృష్ట యశుండు జీవతతి నెల్లెడ జేష్ట లొనర్ప జేయు చుం
బ్రేష్టకుడై యభీష్టముల వేడ్క నొసంగుచు గాచు నెల్లరన్.

వా॥ కంచు బంగారు ఇనుము పర్వతజన్యశిల కలప మొదలగు సమస్త జడముల యందు సమాన భావముతో నిష్కాముకుడై యుండ వలయును. ఈ

ప్రకారము ఉండ దగిన వారి దేహము నందలి తత్వాభిమాన దేవతలైన బ్రహ్మాది సమస్త దేవతల యందును పరిపూర్ణుడై యుండి ప్రతి దిన మందును వ్యాపారములను చేయించుచు తన మహిమను ఆ అధికారులకు సంపూర్ణముగా తెలుపక యోగ్యతానుసారము తెలిపి ఆయా జీవుల స్వరూప యోగ్యతానుసారము ఇష్టమైన వాడై తన భక్తులందరికి లింగ భంగానంతరము ఇష్టముల నొసగు వాడగును. సంరక్షించును.

మూ. వాసుదేవనిరుద్ధ రూపది
పుం శరీరద ళొహను సర్వద
స్త్రీ శరీర దొళిహను సంకరుషణను ప్రద్యుమ్న।
ద్వాసుపర్ణ శ్రుతి వినుత స
ర్వ సునిలయ నారాయణన సదు
పాస నెయ గైవవరు జీవన్ముక్త రెనిసువరు॥ 30

తే.గీ. వాసు దేవానిరుద్ధ రూపముల మఱియు
నొనరు సంకర్షణాఖ్య ప్రద్యుమ్న నామ
మలర పురుషాంగనలను విశ్వార్చితుండు
ద్వా సుపర్ణ శ్రుతి ప్రతిపాద్యు హరినిఁ
గొలుచు వారు జీవన్ముక్తిఁ గొందురవని

తా॥ వాసుదేవ అని రుద్ధ రూపములతో పురుష శరీరము లందున్నాడు. సంకర్షణ ప్రద్యుమ్న రూపములతో స్త్రీ శరీరము లందున్నాడు. సర్వకాలము లందు ఈ విధముగా స్వరూప బాహ్యము లందు పరమాత్ముడున్నాడు. రెండు పక్షులని చెప్ప దగిన వేద మంత్రముచే స్తుత్యుడైన వాడు. దేహమను వృక్ష మందు జీవమను పక్షి ఒకటి కర్మఫలమును అనుభవించునది. తన స్వాఖ్య ఫల భోగమును చేయు రెండవ పక్షి యన దగిన వాడు పరమాత్ముడు. జీవాత్మ పరమాత్ములను వీరికి పరస్పర భేదమున్నది. ద్వాసుపర్ణ శ్రుతి ఈ భేదమును చెప్పునట్టిది. స్వామి భృత్య న్యాయముతో ఉపాసన చేయదగిన భక్తులు జీవన్ముక్తులనబడుదురు.

మూ. తన్న నంతానంతరూప హి
రణ్యా గర్భాది గళొళగె కా
రుణ్యాసాగర హరహి అవరవరఖిళ వ్యాపార।

బన్న బడదలె మాడి మాడిసి
ధన్య రెనిసి సమస్త దివిజర
పుణ్యకర్మవ స్వీకరిసి ఫలవిత్తు పాలిసువ॥ 31

శా॥ స్వీయంబైన యనంత రూపముల లక్ష్మీ భర్త బ్రహ్మాదులన్
న్యాయంబొప్పగ నింపి తత్తదఖిల వ్యాపారము ల్వారిలో
జేయంజేయుచు దానొనర్చి సుకృతుల్ స్వీకారముంజేసి సు
శ్రేయంబైన ఫలంబు వారికొసగున్ చేతోను మోదంబునన్.

తా॥ కరుణా సముద్రుడైన నారాయణుదు తన అనంతానంతములైన రూపములను బ్రహ్మాది దేవత లందు వ్యాపింప జేసి ఆయా దేవతల సమస్తమైన కర్మములను ఆయాసము లేకయే బింబ క్రియ ద్వార తాను చేసి తత్త్వాభిమాన దేవతల ద్వార దేహధారియైన జీవునిచే చేయించి వారిని పుణ్య వంతులనిపించును. బ్రహ్మాదిగా దేవ గంధర్వులంతమైన సమస్త దేవతల స్వామి భృత్య న్యాయముతో తన ప్రేరణచే చేయబడు పుణ్య కర్మలను మరల తన ప్రేరణచే వారి ద్వార స్వీకారము చేసిన వాడై వారికి తన సందర్శన రూపమైన ఫలము ఇచ్చి సంరక్షణము చేయును.

మూ. సాగర దొళిహ నదియ జలభే
దాగస దొళిప్పబ్ద బల్లవు
కాగి గుబ్బిగళరి యబల్లదె నదియ జల స్థితియ।
భోగివర పరియంక శయననొ
ళీ గుణత్రయబద్ధ జగవిహ
దాగమజ్ఞరు తిళివ రజ్ఞానిగళిగళ పడదు॥ 32

చ॥ జలనిధి యందు జేరఁ గల సర్వ తరంగిణి వారి భేద ముం
జలద మెఱుంగుగా బలి భుజంబులు గువ్వలు దామెఱుంగునే?
జలరుహ నాభునం ద్రిగుణసంయుత బద్ధ జగంబెఱుంగఁ బ్రా
జ్ఞులకగుగాక యజ్ఞులకు జొప్పడునే? తెలియంగ నిద్ధరన్

తా॥ సముద్ర మందు కలిసి యున్న నదీ జల భేదమును ఆకాశ మందు సంచారము చేయు మేఘములు తెలియగలవు కాని కాకులు గువ్వలు తెలియ గలవా? అట్లు సముద్రమునకు సమానమైన పరమాత్మని యందు

సమస్త ప్రపంచమున్నప్పటికని గుణత్రయాత్మక మైన లింగ దేహముచే బద్ధుడై యున్న జీవి తెలియగలడా? జీవ పరమాత్ములకు భేద జ్ఞాన శాస్త్రము నెఱిగిన జ్ఞానులు తెలియ గల వారగుదురు. భేద జ్ఞాన రహితులైన తమోయోగ్యులకు తెలియజాలదు.

మూ. కరణగుణ భూతగళొళగె త
ద్వరరెనిప బ్రహ్మాది దివిజరా
ఛరితు రూప చతుష్టయగళనుదినది సర్వత్ర।
స్మరిసుతను మోదిసుత హిగ్గుత
పరవశది పాడువపరిగె త
న్నిరవ తోరిసి భవవిముక్తర మాడి పోషిసువ॥ 33

తే.గీ. కరణ గుణ భూతముల యందు వర విభులగు
పద్మ గర్భాది దివిజుల వాసు దేవు
రూపముల నాల్గు నెఱిగి నిరూఢ మతిని
సంస్మరించెడు వారికి స్వాంతముసను
దర్శనం బిడి మోక్షంబు దప్ప కిడును.

తా॥ నారాయణుని రూపములైన వాసుదేవ - సంకర్షణ - ప్రద్యుమ్న - అనిరుద్ధ - అను నాల్గు రూపములను ప్రతిదినము సర్వాధిష్ఠానముల యందును శాస్త్రోక్త ప్రకారముగా స్మరించుచు పరమాత్మునే అనుసరించి అన్య విషయముల ననుసరింపక సంతోషముతో పొంగుచు మనస్సును పరమాత్మ నందు వశము చేసి దేహమును మఱచి కొనియాడు వారికి దేహ మందు తానుందు స్థానమును చూపించి, తన దర్శనము ఇచ్చి సంసార దుఃఖ రహితులుగా చేసి వైకుంఠ లోక మందుంచి సంరక్షించును. బ్రహ్మాది చతుర్వింశతి తత్త్వాభిమాన దేవత లందు అనుదినమును రూప చతుష్టయమును స్మరించు వారి కని అర్థము.

మూ. మూలరూపను మనదొళిహ, శ్రవ
ణాల యొళగిహ మత్స్య, కూర్మను
కోలరూపను త్వగ్రసన దొళగిప్ప నరసింహ।

బాల వటు వామనను నాసిక
నాథ దొళు వదన దలి భార్గవ
వాలి భంజన హస్తదొళు పాదదలి శ్రీ కృష్ణ॥ 34

సీ॥ నారాయణుండు మనంబున నుండును
శ్రవణాలయముల మత్స్య ప్రభుండు
చర్మంబునందునఁ గూర్మావతారుండు
రసనంబునందు వరాహ రూపి
నాసికాద్వారాల నర సింహుడున్నాడు
బాల వటుండగు వామనుండు
వదనంబులోనుండు; భార్గవ రాముండు
హస్తంబులందుదా నలరు చుండు;

ఆ.వె. వాలి భంజనుండు భానుకులేశుడౌ
జానకీ విభుండు సంత తంబు
బాద యుగళ మందు; బరగు శ్రీకృష్ణుండు
తెలియ వలయుఁ నేత్రముల నటంచు

తా॥ మనస్సులో నారాయణుడు, చెవుల రంధ్రము లందు మత్స్య రూపుడు, చర్మము నందు కూర్మరూపుడు, నాలుక యందు వరాహ రూపుడు, నాసికాద్వారము లందు నరసింహుడు, వదనములో వామనుడు, హస్తములందు పరశురాముడు, పాదము లందు శ్రీరాముడు, నేత్రము లందు శ్రీకృష్ణుడు ఉన్నాడని తెలియ వలయును.

మూ. జినవిమోహక బుద్ధ పాయుగ
దనుజ మర్దన కల్కి మేఢ్రదది
ఇనితు దశ రూప గళ దశ కరణంగళలి తిళిదు।
అనుభవిప విషయగళ కృష్ణా
ర్పణ వెనలు కైకొంబ వృజనా
ర్దన వర జగన్నాథ విట్ఠల విశ్వవ్యాపకను॥ 35

ఆ.వె. లక్ష్మమోహి బుద్ధుడలరు పాయువునందు
దనరు ముందు మేఢమునను గల్కి
వెలయు చుందురిట్లు వివిధ రూపంబుల
దెలియ వలయు బుధులు దిన దినమున

తే.గీ. జైను లందు త్పన్నుడైన వారి నేత్రములకు బాలకుడని మోహమ్ము నొందించు బుద్ధ రూపి పరమాత్ముడు పాయువు తత్త్వమందున్నాడు. మేఢమందు కల్కి రూపి యున్నాడు. మత్స్యాది రూపములు పది. ఈ రూపములను మనస్సులోనున్న యొక రూపములో చేరి మొత్తమ్ము పదునొకందు రూపములను అయా యింద్రియములందు తెలుసుకొని ఆయారూపముల ద్వార కృష్ణార్పణ మని అర్పించి నచో విశ్వవ్యాపకుడైన జగన్నాథుడైన వేణు వినోద విట్ఠలుడు స్వీకరించి సంరక్షించును.

దశావతారములు - రమా రూపములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | మత్స్య | - వేదా | 6. | భార్గవ | - హరిణి |
| 2. | కూర్మ | - వేదావతి | 7. | రామ | - సీత. |
| 3. | వరహా | - ధాత్రి | 8. | కృష్ణ | - రుక్మిణి |
| 4. | నృసింహా | - మహాలక్ష్మి | 9. | బుద్ధ | - దేవకి |
| 5. | వామన | - సుఖా | 10. | కల్కి | - ప్రభా |

ఇది శ్రీహరికథామృతసారమందు పంచమహాయజ్ఞసంధి.

## పంచతన్మాత్రసంధి (ఏడవ సంధి)

అ, ఆ, ఆరంభముగా అం అః వరకు అచ్చులు 16

| | | |
|---|---|---|
| కఖగఘఙ | 5 వర్ణములు | |
| చఛజఝఞ | 5 వర్ణములు | |
| టఠడఢణ | 5 వర్ణములు | 25 వర్ణములు |
| తథదధన | 5 వర్ణములు | |
| పఫబభమ | 5 వర్ణములు | |

య ర ల వ శ ష స హ ళ క్ష (త్ర జ్ఞ) 10 వర్ణములు

మొత్తము 51

### పంచతన్మాత్రలవివరణము

1) పృథ్వి యందుండునవి అయిదు: గంధము - ఘ్రాణము - పాయువు - ప్రాణ వాయువు - అహంకారము.
2) అప్పు నందుండునవి అయిదు: రసము - జిహ్వ - అపాన వాయువు - చిత్తము - గుదేంద్రియము.
3) తేజస్సు నందుండునవి అయిదు: రూపము - చక్షువు - వ్యానవాయువు - బుద్ధి - పాదేంద్రియము
4) వాయువు నందుండునవి: స్పర్శము - పాణి - ఉదాన వాయువు - మనస్సు - త్వగింద్రియము.
5) ఆకాశ మందుండునవి: శబ్దము - వాగింద్రియము - సమాన వాయువు శ్రోత్రేంద్రియము - అంతఃకరణము.

### స్థూల దేహమునకు కారణములైన దేహముల వివరణము

స్వరూప దేహము ఒకట వది.

రెండవది లింగదేహము. ఇది త్రిగుణ సంబంధమైనది. మూడు పరిచ్ఛేదములు గలది.

3. మూడవది వైషయిక శరీరము. దీనినే అణు లింగ శరీర మనియు అందురు. ఇది సకల ప్రాణులకు మోక్షాధికారులకు ఒకే విధముగా నుండును.
4. మహత్తత్త్వ శరీరము. ఇది అణు లింగదేహము మీద నుండును.
5. అహంకారతత్త్వ శరీరము. ఇది అనిరుద్ధ శరీర మందు అంతర్వ్యాప్తమైనది. అనిరుద్ధ శరీరము అహంకార శరీరముపై అయి నట్టిదైనది.
6. స్థూల శరీరము: ఇది శుక్ల శోణితమయమైనది. మొత్తము స్వరూప దేహముతో ఆరు శరీరములైనవి. అన్ని శరీరములందును 24 తత్త్వములున్నవి.

ఉప చయాపచయములు స్థూల శరీరమునకు గాని మిగిలిన శరీరములకు లేదు. అనాది లింగ శరీర మందు ప్రవేశము గలవారు రమా మధుసూదనులే. బ్రహ్మాదులకు ప్రవేశము లేదు. అణు లింగ దేహ మందు బ్రహ్మ వాయ్వాదుల ప్రవేశమున్నది. రుద్రాదులకు ప్రవేశము లేదు. ముఖ్యాభిమాని రమ. అముఖ్యాభిమానులు బ్రహ్మ వాయ్వాదులు. మహత్తత్వ శరీర మందు బ్రహ్మ వాయ్వాదులు ముఖ్యాభిమానులు. వీరికి నివాసములు. అనిరుద్ధ శరీర మందు గరుడాది దేవత లందరికిని ప్రవేశమున్నది. దైత్యులకు ప్రవేశము గలదు. పిశాచాదులకు లేదు. స్థూల దేహ మందు అందరు దేవతలు- దైత్యులు- పిశాచాదులు ప్రవేశము గలవారు.

మూ. ప్రణవ ప్రతిపాద్య త్రినామది
తనువినొళు త్రిస్థాన గనిరు
ధ్దను త్రిపంచక ఏకవింశతి చతుర వింశతిగ।
ఎనిసి ఎప్ప త్తెరడు సావిర
వినితు నాడిగ ళొళు నియామిసు
తిన గభస్తిగ లోక దొళు సర్వత్ర బెళగువను॥ 2

సీ॥ ప్రణవాక్షర ప్రతి పాద్యుఁడా యనిరుద్ధుఁ
డును ద్రినామంబుల దనరి దేహ
మందు ద్రిస్థానగుడై త్రిపంచక యేక
వింశతియును జతుర్వింశతిగను
దా వెలుగొందుచు వే విధముల డెబ్బ
దియు రెండువేలుగాఁ దెలియునాడి
మండ లంబున వెల్గు మహనీయ కాంతితో
శ్రీరమారమణుండు చెలువుమీఱ

తే.గీ. వతఁడు నియమించువాఁడునైయహరహంబు
నినగ భస్తిగ లోక మందెల్ల యెడల
నిలిచి వెలుగొందు నాకీర్తి నెమ్మనమునఁ
దలఁచి పూజలు సేయఁగా వలయు బుధులు.

తా|| ఓంకార ప్రతి పాద్య రూపుడైన అనిరుద్ధుడు విశ్వ తైజస ప్రాజ్ఞ అను మూడు రూపముల చేతను (అనిరుద్ధ-ప్రద్యుమ్న- సంకర్షణ రూపముల చేతను) దేహ మందు నేత్రము కంఠము హృదయము ఈ అవస్థాత్రయము మూడు స్థానము లందు అనిరుద్ధుడను పరమాత్ముడు మూడు పేర్లతో కూడిన వాడై మూడు రూపములతో నున్నాడు. మఱియు స్థానాంతర మందు అయిదు రూపములతోను ఇరువది యొక్క రూపములతోను ఇరువది నాల్గు రూపముల తోను ఉండు వాడన బడును. డెబ్బది రెండువేల నాడుల యందున్న వాడై జీవుల యింద్రియము లందుండి ఇంద్రియ కార్యములను నియమించు చున్నాడు. అట్లుండి నప్పటికిని అతనికి దేనితోను సంబంధము లేదు. సూర్యుడు తన కాంతులతో గూడి అంధకార మందు ప్రవేశించినప్పటికిని అంధకారముచే బాధితుడు కాక తన ప్రకాశము చేతనే లోక మందు సర్వత్ర సంచారము చేయును. పరమాత్ముడైనను సూర్యు నందేమి కాంతి సంపన్నమైన కిరణములందేమి ఉండిన వాడై సూర్యున కటువంటి సామర్థ్యము నిచ్చిన వాడై లోకమున సర్వ ప్రాణుల యందు వారి వారి యోగ్య కర్మలను సూర్యుని వలె నియమించుచు సంచరించును. తత్సంబంధము ఇతనికి లేపనము లేదని తెలియవలయును.

మూ. జీవలింగ నిరుద్ధ స్థూలక
ళేవరగళలి విశ్వతురగ
గ్రీవ మూలేశాచ్యుత త్రయహంస మూర్తిగళ
ఈవిధ చతుః స్థానదలి శాం
తీవరన ఈరెరడు రూపది
భావిసువదే కోన వింశతి మూర్తి సర్వత్ర|| 3

సీ|| దీపించు జీవస్వ రూప దేహంబున
విశ్వ నామకుఁడగు విశ్వరూపి
యలరారు లింగదేహమునందు శ్రీహయ
గ్రీవనామకుఁడగు శ్రీవిభుండు
ననిరుద్ధ దేహమందునఁ జెలువొందును
మూలేశనామ రమాలయుండు
శోభిల్లు చుండును స్థూలదేహంబున
హంసనామక పరమాత్ముఁడతఁడు

ప్ర.గీ. నాల్గు దేహంబులందున నాశరహిత
వైనది స్వరూపదేహంబు హరిసదంశ
తెలుఁగవలయుఁ బందొమ్మిదిపరగుసంఖ్యఁ
గలుగు ననిరుద్ధురూపాలఁ గరణములను

తా॥ జీవుని స్వరూప దేహమందు విశ్వరూపియు, అనాదియైన లింగదేహమందు హయగ్రీవ రూపియు, అని రుద్ధ శరీర మందు మూలేశ రూపియు, స్థూల శరీర మందు హంస రూపియును ప్రకాశింతురు. ఈ నాల్గు దేహము లందు జీవుని స్వరూపదేహము నాశరహితమైనది. తక్కిన మూడు దేహములు నాశమును పొందునవి. విశ్వాది నాల్గు మూర్తులను పైన పేర్కొనిన విధముగా జీవుని లింగ దేహాది నాలుగు స్థానములందు తెలియ వలయును. అనిరుద్ధుని నాలుగు రూపములను అనిరుద్ధుని అంశలని తెలియవలయును. ఈ అనిరుద్ధుని పందొమ్మిది రూపములు మునుపు చెప్ప బడిన నాల్గు దేహములందున్న ఇంద్రియాదుల యందు సర్వ ప్రాణుల యందును ఉన్నవని ఎఱుగ వలయును. మఱియు ఈ అనిరుద్ధుడే పందొమ్మిది రూపములతో నాల్గు దేహము లందున్న ఇంద్రియాది 19 స్థానములందు ఆవాసితుడై యున్నాడు. 19 స్థానములు 19 భగవద్రూపముల యొక్క వివరణము.

| | | |
|---|---|---|
| ఇంద్రియములు | - | 10 |
| తన్మాత్రాసహిత పంచ భూతములు | - | 5 |
| మనస్సు | - | 1 |
| మహత్తత్త్వము | - | 1 |
| అహంకారతత్త్వము | - | 1 |
| అవ్యక్తతత్త్వము | - | 1 |
| మొత్తము | - | 19 |

ఏక వింశతియనగా 21

| | | |
|---|---|---|
| ఇంద్రియములు | - | 10 |
| తన్మాత్రాసహిత పంచ భూతములు | - | 10 |
| మనస్సు | - | 1 |
| మొత్తము | - | 21 |

చని యందు కేశవాది చతుర్వింశతి మూర్తులలో 19 మూర్తులు అంతర్గతములైయున్నవి. పంచభూతము లందు తన్మాత్రలను చేర్చి ఒక చోట తన్మాత్రలను వదలి ఒక చోట ఎందుకు చెప్ప వలసి వచ్చినదనగా?

చతుర్వింశతిత్త్వమునకు వివరణము

| | | |
|---|---|---|
| పూర్వోక్తము | - | 21 |
| మనస్సు | - | 1 |
| అహంకారతత్త్వము | - | 1 |
| అవ్యక్తతత్త్వము | - | 1 |
| మొత్తము | | 24 |

మూ. కలుషవిల్లద దర్పణది ప్రతి
ఫలిసి సర్వ పదార్థగళు కం
గొళిసువందది బింబజడ చేతనగళొళగిద్దు।
పొళెవ బహురూపదలి సజ్జన
రొళగె మనదర్పణది తా ని
శ్చల నిరామయ నిర్వికార నిరాశ్రయానంత॥ 4

చ॥ కలుషము లేని యద్దపు ముఖంబు పయిం బ్రతిబింబితంబులై
యలరెడు సర్వవస్తు తతు లట్లుగ బింబ సురూపకుండు తా
నలరు జడంబు చేతనములందున సజ్జన మానసాఖ్య ని
ర్మలమగు దర్పణంబున నిరామయ నిశ్చల నిర్వికారుడై

తా॥ అద్దము నందు అన్ని వస్తువులు ప్రతి ఫలించును. రసము లేని అద్దము నందు వస్తువులు ప్రతి ఫలింపదు. రసముతో కూడిన అద్దము నందు ప్రతి ఫలించిన సమస్త పదార్థములును కన్నులతో చూచునట్లు కామక్రోధాది కలుషము లేని జ్ఞానుల యందున్న జ్ఞాన భక్తి వైరాగ్యముల తోడి మనస్సన అద్దము నందు బింబరూపి పరమాత్ముడు తన దేహమందేమి అన్యములైన జడములు చేతన జీవుల యందుండి అనేక రూపములలో వెలుగు వాడగును. అందువలన అనంత మహిమో పేతుడైన పరమాత్ముడు అధికారియైన తాను అచంచలమైన భక్తిచే అహంమమతా రహితుడై జిహ్వా గుహ్యాదులకు అధీనుడు కాక పరమాత్ముని ధ్యానము చేయు వారికి మనస్సను దర్పణము నందు ప్రకాశించును.

వి. జీవులు సాంశులనియు నిరంశులని రెండు విధములు.

సాంశుల విచారము:

సాంశులకు రెండు విధములైన అద్దము లందు వస్తువులు కనపడు విధముగా రెండు విధములుగా భగవద్రూపములు ప్రకాశించు చుండును. నిరంశ జీవులకు రస యుక్తమైన అద్దము నందు పదార్థములు కనపడునట్లు కనపడును. సాంశులకు తమ దేహ స్వరూపములును అన్య రూపములును కనపడును. యోగ్యతానుసారము నిరంశ జీవులకు తమ దేహ స్వరూపములు మాత్రము కనపడును. అన్యగత రూపములు కనపడ జాలవు. సాంశులకు నిరంశులకు ఒకటే దృష్టాంతము. ఈ ప్రకారము బింబ రూపి జడ జీవుల యందుండి వారి వారి యోగ్యతానుసారముగా అనేక రూపములతో వారి వారి మనోదర్పణమును ఉపాధి ద్వార వెలుగ వాడగును. మిథ్యా జ్ఞానుల యందు పరమాత్ముడుండి నప్పటికిని వెలుగడు. ఏలయనగా వారు పరమాత్మని చూచినచో మోక్ష స్థానమును పొందుదురు. అందువలన మోక్షము పొందకూడదుకాన వెలుగడు. అనంతుడెట్లనగా? 'అం' సమ్యక్ (ప్రాణులకు 'అంత' లింగ శరీరమును పోగొట్టువాడు (భంగము చేయువాడని అర్థము)

మూ. ఈ శరీర చతుష్టయ గళొళు
కోశ ధాతుగ భారతీప ప్రా
ణేశ నిప్పత్తొందు సావిరదారు నూరెనిప।
శ్వాస రూపక హంస భాస్కర
భేశ రొళగిద్ద పరకై విడి
దీ సరోజ భవాండ దొళు సర్వత్ర తుంబిహను॥ 5

## గీతమాలిక

ఈ శరీరంబులందునఁగోశ ధాతు
యుక్తమగు స్థూలదేహాన నుండు ననిలుఁ
డిర్వదొక్క వేలారు నూర్లెసఁగు శ్వాస
రూప హంసమంత్ర జపంబు రూఢి నినశ
శాంకులందుండి చేయుచుఁ బంకజాత
సంభవాండములోనుండి సతతమువెలయు

తా॥ జీవలింగ అనిరుద్ధ స్థూల శరీరములకు అనగా సప్తధాతువులతో కూడిన శరీరము అన్న మయాది కోశములు వీనితో కూడిన స్థూల దేహము నందు భారతీ రమణుడైన జీవోత్తముడైన వాయుదేవుడు ఇరువది యొక్క వేల ఆరు నూర్ల శ్వాస రూపమైన హంస మంత్రమును అనగా 'సర్వస్య దుఃఖ హంతృ త్వాత్ హంసః' అను హంస మంత్రమును జపము చేయుదురు. ఆ విధమెట్లనగా? సూర్యుడు ఇడా నాడి నుండి రాదగిన శ్వాసమున కభిమాని. చంద్రుడు పింగళా నాడి నుండి రాదగిన శ్వాసమునకభిమాని. ఈ సూర్య చంద్రుల యందుండిన వాడై వాయు దేవుడు వాయ్వంతర్యామి యైన హంస రూపి పరమాత్ముడు ఈ విధముగా నుండి వర్తమానకాల మందుండ దగిన బ్రహ్మాండ మందున్న సర్వ ప్రాణుల స్థూల దేహము లందు వెలయు అష్టదళ కమల మందున్న మూలేశుని పాదమూల మందుండి శ్వాసముల చేయుచు చరాచరము లందు వ్యాప్తుడై యున్నాడు.

వి. అన్నమయాది కోశములు అయిదు 1. అన్నమయము. 2. ప్రాణమయము. 3. మనోమయము. 4. విజ్ఞానము. 5. ఆనందమయము.
సప్తధాతువులు: త్వక్కు - చర్మము - మాంసము - మేధస్సు - మజ్జ - రుధిరము - అస్తులు. వీనితో కూడిన స్థూలశరీరము. వీని కంటెను ఇతరము మూడు. మొత్తము నాలుగు దేహములు. ఈ నాలుగు దేహములందును వాయు దేవుడున్నట్లు తోచును. ఏలయనగా? పై నాల్గు దేహము లందు కోశధాతువులతో కూడిన దేహ మందు శ్వాస రూపమైన హంస మంత్రమును జపించును. స్వరూప దేహమందును కోశధాతువులున్నవి. అట్లుండగా స్వరూప దేహమును ఏల గ్రహించ లేదనగా? సూర్య చంద్రాదుల ద్వార శ్వాసకార్యము చేయించు నని చెప్పుటచే కూడదు. ఆ క్రియ స్థూలమైన నాసికా ద్వారముల నుండి జరుగుట వలన. ఈ శ్వాస క్రియారూపముగు హంస మంత్ర జపమును వాయుదేవుడు స్థూలదేహము నందు మాత్రమే చేయును గాని అన్యదేహము లందు కాదని తెలియవలయును.

మూ. శిరగళైదై దెరడు బాహుగ
ళెరడు పాదగ ళొందు మధ్యో
దరది శోభిపవాఙ్మనోమయ నెనిపనిత్యదలి।
కరణధాతుగళల్లి ఎప్ప
త్తెరడు సావిర నాడి గళలి
ప్పర విదూరను భారత ప్రతి పాద్యనెందెనిసి॥ 6

చ॥ శిరములు నైదునుం బదియు చేతులు రెండగు పాదపద్మముల్
హరియును కంఠమధ్యముల యందలరారెడు కుక్షిత్రోడ సుం
దరమగు వాఙ్మనోమయుఁడు నా నిరతంబును సప్తధాతులం
గరణము లందు నాడుల బ్రకాశితుఁడై పెనుపొందు శ్రీరమా
వరుఁడఘకోటి దూరుఁడగు భారత సుప్రతి పాద్యుఁడెంతయున్.

తా॥ భారతముతో కూడిన అయిదు వేదములు అయిదు శిరములు. దశోప నిషత్తులు దశబాహువులు. పదునెనిమిది పురాణములన్నియు ఒక పాదము. పదునెనిమిది ఉప పురాణము లింకొక పాదము. భారతాది అర్థములన్నియు చేరి ఒక ఉదరము. ఈ విధముగా వాఙ్మనోమ యుడైన పరమాత్ముడు ఇటువంటి ఇంద్రియములు నాడుల యందు సప్తధాతువు లందు ప్రకాశించుచు అధిష్ఠానములందు అంతర్యామియై వేదశాస్త్రముల అర్థములను మనస్సు ద్వార వాక్యములతో ఉచ్చరించుచు సంవాదము చేయును. అనగా మనోవాక్యము లందు సంచారము చేయును.

మూ. ఈరెరడు దోహోర్మి భూతగ
శారధిక దశ ఋగ్వినుత ల
క్ష్మీరమణ విష్ణ్వాఖ్యరూపది చతుష్షష్ఠి కళా।
ధారకను తానాగి బ్రహ్మపు
రారి ముఖ్యరొళిద్దు సతత వి
హారమాళ్పను చతుష్పాదాహ్వయది లోకదొళు॥ 7

తే.గీ. దేహములు నాల్గు నూర్ములుఁ దెలియనారు
కళలు బదునారు లెక్కగాఁగల్గు సంఖ్య
ధరఁ జతుష్షష్ఠి సత్కళా ధారకుఁడయి
ఋజ్నుతుండగు శ్రీవిష్ణు డీవిధమున

క॥ సరసిజ సంభవ శ్రీకం
ధరులేమొదలైన సురలఁ దనరెడు వాఁడై
చరియించు జగతినిఁజతు
శ్చరణాహ్వయుడనగ బరగి సతతంబిటులన్.

వా॥ ఈ స్థూల దేహము నాల్గు విధములైనది. 1. స్వేదజము - 2. ఉద్భిజ్జము 3. అండజము - జరాయుజము. లనబడును. జననము మరణము క్షుత్తు తృష శోకము దుఃఖములను షడూర్ములతో కూడినది యీలింగదేహము. ఈ నాల్గు స్థూల శరీరము ఒక్కొక్కటి పదునారు కళలతో కూడినది. పదునారు కళ లేవనగా ఇంద్రియములు పదియు పంచభూతములు అయిదును మనస్సు ఒకటితో కూడి మొత్తము పదునారు కళ లగును. ఈ ప్రకారము నాల్గు స్థూల శరీరములకు కాదగిన కళలు 16 x 4 = 64 అరువది నాలుగు. పదునారు పురుష సూక్త మందలి బుక్కులచే పొగడ దగిన పదునారు భగవద్రూపములు 64 రూపములతో ఆధారకుండై విష్ణురూపముతో తానే బ్రహ్మ రుద్రాది 24 తత్త్వాభిమాన దేవత లందుండి నిరంతరము కర్మవ్యాపారములతో సంచారము చేయును. మఱియు స్వేదజము ఉద్భిజ్జము అండజము జరా యుజము లను నాల్గు పాదములందాయా నామములతో పిలువబడుచున్నాడు.

వి. ఊర్మి యనుటకు అర్థాంతరము:

1. శుక్లముతో నుండునది.2. గర్భమందు జనించునది. 3. నానా అవయవ రూపములగునది. 4. పెరుగునది. 5. వార్ధక్య మందు తగ్గునది. 6. నష్టమగునది. మఱియు ఖేచరము (ఆకాశ మందు సంచరించునది) భూచరము (భూమి మీద సంచరించునది) వారి చరము (నీటి యందు సంచరించునది) నిశాచరము (రాత్రి యందు సంచరించునది) అని నాల్గు విధములు.

వేదములు నాల్గు. ఆయుర్వేదము ధనుర్వేదము గంధర్వ వేదము - జ్యోతిష కల్పముల తోడి ఆరు శాస్త్రములు చేరి పదునాల్గు విద్యలను పరమాత్ముని పరముగా అర్థము చేసినచో పరవిద్య యనియు రెండును చేరి 16 పదునారు విద్యలైనవి. బ్రహ్మ రుద్రాది దేవతలు మనుష్యులు పితృలు పశు పక్షులు అను నాల్గు జాతులకు యోగ్యతానుసారమైన జ్ఞానములు పదునారు. అనగా? 16 x 4 = 64 'చతుష్షష్ఠిర్జాతయః' అను విష్ణు రహస్యము రీతిగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాల్గు జాతుల నుండి పుట్టిన జాతులును పదునారగును.

## చతుష్షష్ఠి కళలు

1. అక్షర లక్షణము 2. లిఖితము 3. గణితము 4. వైశేషికము 5. సారము 6. గాణ పత్యము 7. వేదము 8.వేదాంతము 9. ప్రాతిశాఖ్యము 10. ప్రాభట్టము 11. ప్రాభాకరము 12. న్యాయము 13. వ్యాకరణము 14. ఛందస్సు 15. అలంకారము 16. నటనము 17. నాటకము

18. ఇతిహాసము 19. ఆగమము 20. పురాణము 21. స్త్రీలక్షణము 22. పురుషలక్షణము 23. సాముద్రిక లక్షణము 24. శకున శాస్త్రము 25. శిల్పశాస్త్రము 26. కామశాస్త్రము 27. సంవత్సరము 28. ప్రళయకాలము 29. మాయావాదము 30. సారవాదము. 31. వివాదము 32. గంధ వాదము 33. రస వాదము 34. ధాతువాదము 35. సౌగతము 36. గారుడము 37. చిత్ర కర్మము. 38. వైద్యవాదము 39. వాస్తుశాస్త్రము 40. శ్రౌతము 41. స్మార్తము 42. ఆచారము 43. వ్యవహారము 44. పరవాదము 45. పరకాయ ప్రవేశము 46. అశ్వారోహణము 47. గజారోహణము 48. సంధి విగ్రహము 49. చర్మ శాస్త్రము 50. స్వర్ణ పరీక్ష 51. రత్న పరీక్ష 52. జ్యోతిషము 53. ఇంద్రజాలము 54. మహేంద్ర జాలము 55. అగ్ని స్తంభనము 56. జల స్తంభనము 57. ఖడ్గ స్తంభనము 58. వాయుస్తంభనము 59. బాలాశనము 60. దూరదృష్టి 61. దూరశ్రవణము 62. ఇంగితజ్ఞము 63. భావబోధము 64. పరిహాసము.

మూ. తృణ మొదలు బ్రహ్మాంత జీవర
తను చతుష్ట యగళలి నారా
యణన సావిర దైదు నూరిప్పత్తు మేలారు।
గణనె మాళ్పుదు బుధరు రూపవ
ఘృణిః సూర్యాదిత్య నామగ
ళనుదినది జపిసువరి గీవారోగ్య సంపదవ॥ 8

ఆ.వె. తృణము మున్నుగా విరించి పర్యంతము
తను చతుష్టయమునఁ దనరు వేలు
నైదు నూటయిర్వదారు నారాయణు
రూపములను బుధులు రూఢిమెఱయ

క॥ గణియింపఁగ వెలయు సుమా!
ఘృణి సూర్యాదిత్య నామ రీతుల నటులన్
దిన దినమును జపియించెడు
జనులకు నారోగ్య భాగ్య సంపద లొసగున్

తా॥ తృణము మొదలుకొని నాల్గు విధములైన జీవులైన బ్రహ్మాదిశతస్థ ముఖ్య తత్త్వాభిమాన దేవతలు, అముఖ్య తాత్త్వికులైన కర్మజులు, ఆజానజులు,

విరించులైన మనుష్య గంధర్వులు మొదలుకొని తృణాంతమైన వారి స్థూల శరీరము లందు మూలరూపుడైన నారాయణుని రూపములు అయిదువేల నూట యిరువదియారు అని తెలియవలయును. జ్ఞానులైన వారు ఈ నారాయణుని రూపములను, స్థానత్రయ మందు అనగా సూర్య మండలము నందలి ఘృణి శబ్ద వాచ్యుడైన నారాయణుడు, సూర్య కిరణము లందున్న సూర్య శబ్ద వాచ్యుడైన నారాయణుడు ఘృణి, సూర్య, ఆదిత్య యని జపించు వారికి జ్ఞాన రూపమైన వైరాగ్య భాగ్యములను భక్తి యను సంపదను ప్రతి దినము క్రమముగా అభివృద్ధి చేసి యిచ్చు వాడగును.

మూ. ఐదునూరెప్పత్తు నాలకు
ఆధిభౌతికదల్లి తిళిపుదు
ఐదెరడు శత ఏక వింశతి రూపవధ్యాత్మ।
భేద గళి న్నూర మూవ
త్తాద మేలొందధిక మూర్తిగ
ళాదరదలధి దైవదొళు చింతిపుదు భూసురరు॥ 9

సీ॥ అయిదు నూర్లును డెబ్బదా మీఁద నాలుగు
నాధి భౌతికమందు నలరుచుండు
దశశ తంబులపైనఁ దగ నిర్వదొక్కటి
యధ్యాత్మ మందున నలరు చుండు
నిన్నూ టికిని మీఁద నెసఁగు ముప్పదియొండు
నధిదైవమందున నలరుచుండు
భేదంబులీ మూడు విధముల మదినెంచి
యాదిత్యునందున్న యంబుజాక్షు

ఆ.వె. రూపముల నెఱింగి యా పరమాత్ముని
క్షితిని చింతనంబు సేయ వలయు
భూమిసురులు; వారిఁ బ్రోచును శ్రీరమా
వల్లభుండు నిచ్చలుల్లమలర.

తా॥ సూర్యుని యొక్కొక్కరశ్మి యందు 574 రూపములు చొప్పున 1000 రశ్మల యందు 5,74,000 అయిదు లక్షల డెబ్బది నాలు

రూపములున్నవని జ్ఞానులైన వారు అనుసంధానము చేయవలయును. అర్క అను అక్షర వాచ్యరూపములు అ-1 ర -2 క -1 121. అధి దైవమందు అక్షర సాంకేత రూపములు 231. ఆ1 - ది - 3 త్య2.
(574 + 121 + 231 = 926)

మూ. సురుచి శార్వరికరనెనిసి సం
కరుషణ ప్రద్యుమ్న శశి భా
స్కరరొళగె అరవత్తధిక మున్నూరు రూపదలి।
కరెసికొంబను అహస్సంవ
త్సరనెనిసి విశిష్టనామద
లరితవ గారోగ్య భాగ్యవనీ వానందమయ॥ 10

సీ॥ శోభిల్లు రవి యందు సురుచి యనంగను
సంకర్షణాఖ్యుడు సంతసమున
సరసిజ వైరిలో శార్వరీకరుఁడనఁ
బ్రద్యుమ్ననాముండు బరగుచుండు
మున్నూట యరువది ముఖ్య రూపంబుల
హరి యహస్సంవత్స రాఖ్యుఁడగుచుఁ
బిలువంగఁ బడుచుండు బ్రీతితోనీరీతి
శిష్ట నామంబులం జెందఁ గలిగి

ఆ.వె. యట్టి చందములను నాత్మలోఁ జక్కఁగా
నెఱిఁగి చింతచేయు పరమజనుల
కనుదినం బొసంగు నానందమయుఁడు నా
రోగ్యకలితమైన భాగ్యములను.

తా॥ సూర్యుని యందు సురుచి యను వాడై సంకర్షణ రూపి పరమాత్ముడు, చంద్రుని యందు శార్వరీ కరుడనబడు వాడై ప్రద్యుమ్నరూపి పరమాత్ముడు రాత్రింబవళ్ళ కభిమానులైన వారి యందు 360 రూపములతో అనగా 720 రూపములతో సంవత్సర శబ్ద వాచ్యుడై పిలువ బడుచున్నాడు. ఈ రీతిగా పరమాత్ముని తెలిసిన వారికి ఆనందమయుడను భగవంతుడు ఆరోగ్య భాగ్యముల నొసంగి స్వరూపా నందము నిచ్చును.

మూ. ఏకపంచాశద్వరణ గత
మాకళ త్రను సర్వ రొళగ
వ్యాకృతాకాశాంత వ్యాపిసి నిగమతతి గళను।
వ్యాకరణ భారత ముఖాద్య
నేక శాస్త్రి పురాణ భాష్యా
నీకగళ కల్పిసి మనోవాఙ్మయ వెనిసి కొంబ॥ 11

సీ॥ ఏకపంచాశత శ్రీకరవర్ణంబు
అందుండు హరియు జీవాలి యందు
నవ్యాకృతాకాశ మంతయున్ వ్యాపించి
నిత్యంబులైనట్టి నిగమములను
వ్యాకరణంబును భారతమాదిగాఁ
గల యట్టి సచ్ఛాస్త్రిములు బురాణ
సార స్వతములకు సరియైన భాష్య స
మూహముల్ గల్పించి ముదముమీఱఁ

తా.వె. బిలువ బడుచు నుండ గలడు సంతతమనో
వాఙ్మ యుండనంగ బహుళ గతుల
నట్టి యచ్యుతాంఘ్రి గట్టిగఁ జింతింప
వలయు భూమిసురులు ప్రబల మతిని.

తా॥ ఏఁబది యొక్క అక్షరములలోనుండు పరమాత్ముడు ఆయా వర్ణాకారవాచ్యుడై అజాది తత్త్వ దేవతలందును సమస్త జీవుల యందును లక్ష్మీ సమేతుడై వ్యాపించి అజాది అక్షరములతో యుక్తమైన అపౌరుషేయమైన వేదములందు అధిష్ఠానమును కల్పించు కొని యున్నాడు. పురాణములను వ్యాకరణాది శాస్త్రిములను భాష్య సమూహములను కల్పించిన వాడై మనోమయుడు వాఙ్మయుడని పిలువ బడు చున్నాడు.

మూ. భారభృన్నామకన సావిర
దారనూరి ప్పత్తునాలకు
మూరుతి గళు చరా చరది సర్వత్ర తుంబి హవు।

ఆరునాలకు జడ గళలి హది
నారు చేతనగళలి చింతిసే
తోరికొంబను తన్నరూపవసకల ఠావినలి॥

12

తే.గీ. భారభృన్నామకుని పదునారు మూర్ల
నిర్వదియు నాల్గు మూర్తుల నీ చరాచ
రముల సర్వత్ర వ్యాపించి ప్రకటి తమగు
నారు నాలుగు జడముల యందు మఱియు.

ఆ.వె. పదియునారు కళల బహుళ చేతనములఁ
జింతనంబు సేయ శ్రీవిభుండు
సకల తావులందు సందర్శనంబిడు
తనదు దివ్యరూపు ధన్యులకును.

తా॥ చరా చరముల భారమును కూర్మ రూపముతో అండము వెలుపలను లోపల నుండి మోచుకొని యుండు వాడగుట వలన పరమాత్ముడు భార భృత్తని పిలువ బడును. ఇటువంటి పరమాత్మని అక్షర సంకేత రూపములు వెయ్యిన్ని ఆరు మూర్ల యిరువది నాలుగు. (కుడి నుండి యెడమకు) లెక్కింప వలయును. భా 4-ర 2-భృ-6 త1 = 1624. ఈ అక్షర సంకేతమైన భగవద్రూపములను ఇరువది నాలుగు జడ భూతములైన 24 తత్త్వము లందు పదునారు కళ లందనుటచే 24 తత్త్వములు పదునారింటి యందు అంతర్భూతములు. ఎట్లనగా? పంచభూతములు (దీనియందు పంచ తన్మాత్రలు అంతర్భూతములు) దశేంద్రియములు మనస్సు (దీనియందు అహంకార తత్త్వము, మహతత్త్వము, అవ్యక్తతత్త్వము ఈ మూడును అంతర్భూతములు) ఈ ప్రకారము షోడశ కళలయందు చతుర్వింశతి తత్త్వములంతర్భూతములు. ఈ విధముగా చతుర్వింశతి తత్త్వములు రెండు విధములైనవి. ఒకటి చతుర్వింశతి తత్త్వముల గోళకములు, ఇంకొకటి చతుర్వింశతి తత్త్వములు. తత్త్వముల గోళకములను నవి స్థూల దేహమునకు సంబంధించినవి. దేహముతో కూడ నాశమగునవి. అనిరుద్ధ శరీరము అనాది లింగ శరీరోపాదానముచే నయినది. ఈ శరీరము స్థూల శరీరముతో నాశనము పొందునది కాదు. ఈ శరీర సంబంధమైన చతుర్వింశతి తత్త్వములు స్థూలదేము నందున్న చతుర్వింశతి గోళకములందు వ్యాపించి యున్నది. ఈ ఉభయ విధములైన చతుర్వింశతి తత్త్వములందు ఆయా స్థూలదేహము

లందున్న వాని యందు ప్రకాశతః వ్యాప్తమైన జీవుని చతుర్వింశతి తత్త్వములు చరా చర ప్రపంచ మందు ఉత్పన్నమైన అణు స్థూల పదార్థముల యందు ఒక్కొక్క దానియందు భారత్యున్నామకుడైన వాని భగవద్రూపములు 1624 నిండియున్నవి. ఈ విధమైన రూపములందు తన బింబ రూపమని వక్ష్య చింతనము చేసి అనుసంధానముతో చింతింపవలయును. అట్లు చింతించినచో పరమాత్ముడు తన రూపమును సర్వ ప్రదేశముల యందు చింతించిన పుణ్యము చే మనసునకు ప్రత్యక్షమగును.

మూ. మినుని మేలిన మణియ పోల్‌రా
జిసువ బ్రహ్మాదిగళ మనదలి
బిసజ జాండా ధారకను ఆధేయ నెందెనిసి।
ద్విశత నాల్వత్తెరడు రూపది
శశి యొళిప్పను శరీరదొళగె శో
భిసువ నాల్వత్తెరడధిక శతరూపదలి బిడదె॥ 13

చ॥ మిసిమిపసిండిపై వెలయు మేలిమిరత్నము వోలె రాజిలం
బొసఁగెడు; బ్రహ్మముఖ్యగల ముఖ్యసురాలి మనంబులందు నం
బిసరుహలోచనుండు కడు పెంపెసలారఁగ రెండునూర్లపై
నెసఁగగ నాలుగుంబదుల నెక్కువ రెండగునట్టి మూర్తులన్

క॥ శశియందు వెలుఁగుచుండును
విశదముగా సస్యములను వెలయుశతముపై
దశకములు మూడు మఱిద్వా
దశమధికంబైన సంఖ్యఁదగు రూపములన్!

తా॥ బంగారపు ఉంగురములపై మండదగిన రత్నము వలె బ్రహ్మాది దేవతల మనస్సు లందును బ్రహ్మాండము నందును బ్రహ్మాండ మందలి జీవుల యందును ఆధార ఆధే యుడై వాసము చేయుచున్నాడు. ఆధార ఆధేయ భగవద్రూపములు అక్షర సంకేతముచే మున్నూట యెనుబది నాలుగు (ఆ 2 - ధా4 - ర2 = 242) (ఆ2 - ధే4 - య1 = 142) 242 + 142 = 384 ఈ ప్రకారముగా ఇన్ని రూపములతో అణురేణుతృణ కాష్ఠము లందు అన్నింటి యందునున్నాడు. ప్రతి అధిష్ఠాన మందు అంతర్యామి రూప మొకటి. బాహ్య రూపమొకటి. ఈ రెండును ఆధార ఆధేయ

రూపములని తెలియ వలయును. చంద్రుని యందు 242 రూపముల చేతను సస్యాదులందు ఆధార భూతుడైన వాడు చంద్రుడగుటచే ఆ చంద్రుని యందు ఆధార రూపములు 242 సస్యము లందు 142 అగును. ఈ విధముగా ప్రళయ కాలము వఱకు వదలక ప్రకాశించు వాడగును.

వి. మిసి మిప సింది. పైని మణి వలె అనుటచే బంగారముతో నిర్మితమైన ఉంగురము పైన మణి అనగా ఉంగురము మూడింటిచే కూడి యున్నది. ఉంగుర మొకటి, ఉంగురపు గూడు ఒకటి, ఆ గూటి పై నుండు మణి ఒకటి. గూడు క్రింద నున్న ఉంగురము గూటి కాధారమనియు, గూటిపై నుండు రత్నము గూటి కాధేయమనియు, పిలువ బడును. ఇదే విధముగా బ్రహ్మాదుల స్థూల దేహములే ఒక ఉంగురము. మనస్సునదే ఉంగురము పై నున్న గూడు. అంతర్యామి పరమాత్ముడే ఉంగుర మందలి రత్నము. అందు వలన పరమాత్ముడు ఆధార ఆధేయ రూపములతో నున్నాడు.

బ్రహ్మాండము వెలుపల బ్రహ్మాండమును మోచుకొని యున్న కూర్మ రూపము ఉంగురము. బ్రహ్మాండమే ఉంగురపు గూడు. బ్రహ్మాండము లోపల నున్న కూర్మ రూపము ఆధేయ రూపమైన రత్నము. ఈ విధముగా బ్రహ్మాండమును ఆధార ఆధేయ రూపములతో ధరించి యున్నాడు.

మూ. ఎరడుసావిర దెంటు రూపవ
నరితు సర్వ పదార్థ దలి సిరి
వరన పూజెయ మాడు వరగళ బేడు కొండాడు।
బరిదె జల దలి ముణుగి బిసి లొళు
బెరళ నెణి సిద రేను సద్గురు
హిరయరను సరిసదె మర్మవనరి యదిహ నరను॥ 14

ఆ.వె. ఇటుల రెండు వేల నెనిమిది రూపాల
నరసి సకల మగు పదార్థములను
శౌరి పూజ చేసి సద్వరంబుల వేడు
మతని మహిమలఁ గొనియాడు మెప్పుడు.

క॥ ఆవిధముగాక జలముల
నేవేళమునింగి యెండనిలఁ గూర్చొనుచుం

దా వ్రేళ్ళలెక్కఁ బెట్టిన
జోసమ్ము ఫలంబదేమి? శుభము గలుగునే?

తా॥ 12వ పద్యము నందు చెప్పిన భగవద్రూపములు 1624 13 వ పద్యము నందు చెప్పిన భగవద్రూపములు 384 మొత్తము 2008 (ఆధార రూపములు 242 ఆధేయ రూపములు 142) ఈ ప్రకారముగా చరాచరమైన సర్వపదార్థముల యందు గల శ్రీలక్ష్మీనారాయణుని రూపములను అనుసంధానము చేసి సర్వత్ర నీ బింబ రూపకుని ఐక్య చింతనము చేసి పరస్పరము భగవద్రూపములకు అభేదమని అనుసంధానము చేసి భగవద్రూపములతో భగవద్రూపములకు ఐక్య చింతన రూపమైన పూజను చేయుము. జ్ఞాన భక్తి వైరాగ్యములను పరములను వేడుము. పరమాత్ముని కొనియాడుము. కాకులు కప్పల వలె నీటి యందు మునిగి వ్రేళ్ళను లెక్కించుచు జపము చేయుట వలన రాదగిన ఫల మేమనగా? శుద్ధమైన ఫలము రాజాలదు. జీవోత్తముడైన వాయుదేవుని పాదావలంబులైన సద్గురువులను అనుసంధాన మర్మము తెలిసి వారినాశ్రయించి వారిని సేవించి వారి అనుగ్రహమును సంపాదించి ఉపదేశముగు వఱకు ఉండక పోవుటచే ఆధ్యాత్మ మర్మములను తెలియని వాడగును. అందువలన గురువుల సేవ చేసి ఆధ్యాత్మ మర్మములను తెలియవలయును.

మూ. మత్తెచిద్దేహదొ ఒళగె ఎం
భత్తుసావిరదేళు నూరి
ప్పత్తఐదు నృసింహరూపద లిద్దుజీవరిగె।
నిత్యదలి హగలిరళు బప్పప
మృత్యువిగె తా మృత్యు వెనిసువ
భృత్యవత్సల భయవినాశన భాగ్యసంపన్న॥ 15

మహాస్రగ్ధర

మఱియుం జిద్దేహమందా మధుమథనుఁడు
సన్మాన్యుఁడొచుండు దానా
నరసింహాఖ్య ప్రసంఖ్యన్ నలువగు కళలన్
నారసింహాభిదుండై
వరదుండై జీవకోటిం బగలును నిశలం
బాగుగాఁగాఁచి మృత్యుం

ద్వరలో దూరంబొనర్చున్ పరసుజనులకుం
భక్తవాత్సల్య మొప్పన్.

తా॥ సూక్ష్మ దేహపు విచారము పూర్వ మందు చెప్పినదియే కాక జీవుని స్వరూప దేహమందు 80725 నరసింహ రూపములతో నుండి భక్తులను సంరక్షించును. అక్షర సంకేతముతో కాదగిన రూపములు (న5 - ర2 - సిం 7 హ80. ఎడమ నుండి కుడికి లెక్క 80725 అగును) జీవులకు నిత్యమును రాత్రింబవళ్ళు వారిలో నుండిన వాడై పూర్వ జన్మ మందు చేసిన పాపములను అనుసరించి రాదగిన మృత్యువు కాస్పదము కాని ఆయుస్సుందు కాలమునకు ప్రాప్తము కాదగిన మృతి సదృశమైన శవము యొక్క చిహ్నము లొసగ దగిన రోగాది ఉప ద్రవములును పారద్రోలును. ఇటువంటి అప మృత్యువునకు జీవాంతర్యామి యైన నరసింహ రూపి యైన పరమాత్ముడు తాను ఆరోగ్యాది ఉప ద్రవములను నాశనము చేయును. ఈ అనుసంధానమును తెలుసుకొని తన యందు గల భక్తితో తన్ను ప్రార్థింప గల భృత్యుల యందు వాత్సల్యము గలవాడై భక్తవత్సలుడు అప మృత్యు భయమును పోగొట్టి అజ్ఞానమును తొలగించి జ్ఞాన భక్తి వైరాగ్యములను సౌభాగ్యము చే సంపన్నుల గావించి దారిద్ర్యాది పాపములను నాశనము గావించి సంరక్షించును.

మూ. జ్వరనొళిప్పత్తేళు హరనొళ
గిరువనిప్పత్తెంటు రూపది
ఎరడుసావిరదెంటు నూరిప్పత్త రేళినిప।
జ్వరహరాహ్వయ నారసింహన
స్మరణెమాత్రది దురితరాశిగ
ళిరదె పోపవు తరణిబింబవకండ హిమనంతె॥ 16

క॥ జ్వరునందిరువది యేడున్
హరునం దిర్వదియు నెన్మిదగు రూపములన్
జ్వరహరులిద్దరి సంఖ్యం
బరగు జ్వరాహ్వయుఁడు నృహరి భావమునందున్.

క॥ స్మరియించిన మాత్రంబున
దురితసమూహంబుల నెల్లఁదూలించునుగాఁ

దరణిం గనిన హిమంబది
కరగెడు చందమున నృహరి కరుణాదృష్టిన్.

వా॥ సకల వ్యాధులకు రాజైనది జ్వరము. ఆ జ్వరమున కధిమాన దేవత యందు నరసింహుడు యిరువదియేడు రూపముల తోను, హర శబ్ద వాచ్యుడైన అభిమాన దేవత యందు యిరువది యెనిమిది రూపముల తోను ఉన్నాడు. 'విలయుం యాంతి పాపాని హిమవద్భాస్కరో దయే' అని యుండుటచే నరసింహ దేవుని స్మరించుటచే సర్వ పాపములు సంహార మగును. మహా రోగాది ఉపద్రవంబులు పరిహార మగునని తెలియ వలయును. జ్వరము నందు విష్ణు జ్వరమనియు, శివ జ్వర మనియు రెండు విధములు. దీని వివరణము: శ్రీ హరి వంశ మందును భాగవతము దశమ స్కంధము నందును ఉన్నది.

జ్వర = జ్వ7 - ర - 2 = 27
హర = హ8 - ర - 2 = 28

మూ. మాస పరియంతరవు బిడదె నృ
కేసరి య శుభ నామ మంత్ర జి
తాసన దలేకాగ్ర చిత్తది నిష్కపటదింద।
బేసరదె జపి సలు వృజిన గళ
నాశగైసి మనోరథగళ ప
రేశ పూర్తియ మాడికొడువను కడెగె పరగతియ॥ 17

తే.గీ. మాస పర్యంతమును మది మానలేక
నృహరి శుభనామ మంత్రంబు నిష్ఠతోజి
తాసనంబున నేకాగ్రమైన భక్తిఁ
దగఁ జపించిన యఘములందరుగఁ జేసి
జనులకిష్టంబులొసఁగి మోక్షంబుగూర్చు.

వా॥ మాసము పూర్తిగా వదలక నరసింహరూపి పరమాత్మని హృదయాకాశము నందు నిలుపుకొని ఆ రూపమును ధ్యానించుము శుభమైన 'శ్రీనృసింహాయనమః' అనియు 'ఉగ్రం వీరం మహా విష్ణుం జ్వలంతం విశ్వతో ముఖం ।నృసింహం భీషణం భద్రం మృత్యోర్మృత్యుం నమా మ్యహం' అను మంత్రమును ప్రాణాయామ పూర్వకముగా న్యాస ధ్యాన శ్లోకముతో అచంచలమైన మనస్సుతో

కృష్ణాజినముపై కూర్చుని నిష్కపటముగా జపించిన సత్సాధనమునకు ప్రతిబంధకమైన విషయములను దూరముగా తొలగించి జ్ఞాన భక్తి వైరాగ్యములను ఐశ్వర్యములను యోగ్యతానుసారముగా నృసింహుడు ఇహ లోకమందొసగి ఉత్తమమైన మహరాది లోక సౌఖ్యముల నొసగి బ్రహ్మ దేవునితో కూడ మోక్షము నొసగును. మఱియు ఇహమందు అపరోక్షము నొసగును.

మూ. చతుర్మూర్త్యాత్మక హరియు త్రిం
శతిస్వరూపది బ్రహ్మనొళు మా
రుతనొళిప్పత్తేళు రూపదొళిప్ప ప్రద్యుమ్న।
సుతరొళిప్పత్తైదు హదినెం
టతుళ రూపగళరితు వత్సర
శతగళలి పూజిసుతలిరు చతురాత్మకన పదవ॥ 18

తే.గీ. క్షితిఁ జతుర్మూర్తి యచ్యుతుఁడతఁడు బ్రహ్మ
యందు ముప్పదిరూపాల ననిలునందు
నెనఁగు ప్రద్యుమ్నుఁడిర్వదినేడు రూప
ములను గరుడ నాగేంద్ర శంభులను మఱియు

క॥ ఇరువది యైదగు రూపాల్
బరగఁగ సంకర్షణుండు పదునెన్మిదిగా
నరయంగ వాసుదేవా
ఖ్య రహించును హరిపదముల నర్చింపుమిలన్.

తా॥ నాలుగు రూపములతో ప్రచురుడైన పరమాత్ముడు అనిరుద్ధాది రూపములతో బ్రహ్మ యందు ముప్పది రూపముల తోను ప్రధాన వాయుదేవుని యందు ప్రద్యుమ్నరూపి పరమాత్ముడు యిరువది యేదు రూపముల తోను గరుడ శేష రుద్రు లందు ముువ్వురి యందును యిరువది యైదు రూపములతో సంకర్షణ రూపియై యున్నాడు. పదునెనిమిది రూపములతో రుద్రు నందు వాసుదేవుడున్నాడు. మొత్తము నూరు రూపములతో ఆయుర్మానము నూరు సంవత్సరము లందు ఒక్కొక్క సంవత్సరము ఒక రూపము ప్రకారము అసదృశమైన అనిరుద్ధాది నాల్గు రూపములను ఆయుర్మానము సర్వాధిష్ఠానముల యందును అనుసంధానముతో తెలిసి పూజించు చుండుము.

ఏ. రుద్ర దేవుని యందు నూరు రూపము లెట్లనగా:

30 అనిరుద్ధ రూపములు - ప్రథమమైన 30 సంవత్సరములకు బ్రహ్మాంతర్గతము.

27 ప్రద్యుమ్న రూపములు - ద్వితీయమైన 27 సంవత్సరములకు వాయ్వాం తర్గతము.

25 సంకర్షణ రూపములు - తృతీయమైన 25 సంవత్సరములకు గరుడ శేషాంతర్గతము.

18 వాసుదేవ రూపములు - చతుర్థమైన 18 సంవత్సరములకు రుద్రాంతర్గతము.

100 మొత్తము నూరు రూపములు నూరు సంవత్సరములు.

మూ. నూరు వరుషకె దివస మూవ
త్తారు సావిర విహవు నాడిశ
రీరదొళగిని తిహవు స్త్రీపుం భేదదలి హరియ।
ఈరధిక ఎప్పత్తు సావిర
మూరుతిగళనె నెనెదు సర్వా
ధారకన సర్వత్ర పూజిసు పూర్ణనెందరిదు॥ 19

ఉ॥ నూరగు వత్సరంబుల గనుం గొన ముప్పది యారువేల్దినా
లారయ గామినీ పురుషమై తనువున్ ద్విగుణీ కృతంబుగా
దోరములైన నాడులవి తోచును మూర్తుల నట్టి సంఖ్య నా
ధారకు బూర్ణుడం చెఱిగి తప్పక పూజలొనర్పు మెల్లెడన్.

తా॥ ఆయుర్మానము నూరు సంవత్సరములకు 36 వేల దినములు. ఈ స్థూల శరీరమందు స్త్రీ పురుష భేదములతో మొత్తము 360 + 360 = 72 వేల నాడులున్నవి. ఈ నాడుల యందు గల డెబ్బది రెండువేల భగవద్రూపములను సర్వదా చింతింప వలయును. సర్వజీవుల యందును దేహాధారకుడైన పరమాత్ముని నాడుల యంసు అంతర్గతుడైన పరమాత్ముని నాడుల యందు అంతర్గతుడైన పరమాత్ముని ఆయు రంతర్గతుడైన పరమాత్ముని ఐక్య చింతనము చేసి గుణ పరిపూర్ణుడైన భగవంతుని పూజింపుము. ఆయువను నది సూర్యుని గతిననుసరించి నాడుల ద్వార క్షీణమగుచు వచ్చుచుందును.

మూ. కాలకర్మ గుణ స్వభావగ
ళాల యను తానాగి లకుమీ
లోల తత్తద్రూప నామది కరెసు తొళ గిద్దు।
లీలె యిందలి సర్వ జీవర
పాలి సువ సంహరిసి సృష్టిప
మూలకారణ ప్రకృతి గుణ కార్యగళ మనెమాడి॥ 20

తే.గీ. కాల కర్మ గుణ స్వభావాలయుడయి
శ్రీరమాపతి తత్త ద్విశేషరూప
నాము ముల బిల్వ బడుచు నంతరము నందు
లీలతో సర్వజీవుల పాలనంబు.

తే.గీ. సృష్టి సంహారకార్యముల్ జేసి మూల
ప్రకృతి గుణకార్యములఁ దీర్చి ప్రబలశక్తి
నతని మహిమంబుఁ దలపోయుఁ డాత్మయందు
సుజనులైనట్టి విబుధులు శుద్ధమతిని.

తా॥ మహా ప్రళయానంతరపు సృష్టి కాలము త్రిగుణాత్మకమైన జీవులకు బంధ రూపముతో నుండ దగిన అనాది లింగ శరీరము దీని తృతీయ పరిచ్ఛేదమైన తమః పరిచ్ఛేదము నందలి అనాది కర్మము. ఈ లింగ దేహమందున్న జీవుని అనాదియైన స్వరూపము స్వభావ మట్లు జీవముల ధరించు విషయము నందు ఆలయ భూతుడైన వాడై ప్రళయ కాలము నందు సర్వ జీవులను ఉదరము నందు ధరించి ప్రళ యోదకము నందు శయనించి లక్ష్మీ లోలుడై యుండును. అపుడు బ్రహ్మాదు లెవరును ఉండరు. ఆయా రూప నామములతో తానే పిలువ బడుచు తన యుదరము నందలి జీవుల యొక్క స్వరూప దేహ మందు స్వరూప భావ మందు లింగ దేహ మందు లింగ దేహము నందలి అనాది కర్మము నందు ఈ మూడింటి యందు ఆయా రూపములతో పిలువ బడు చుండును. ఈ మూడింటి యందు ప్రళయాంతమై సృష్టి కాలము ప్రారంభ మగు చుండగా తన లీలచే లింగము నందలి రజో గుణముచే గుణ వైషమ్యమును పొందించి క్రమముగా అనిరుద్ధ శరీరము వఱకు సూక్ష్మ సృష్టి చేసిన తరువాత స్థూల శరీరములకు ఉపాదాన కారణమైన బ్రహ్మాండ సృష్టికి మూల భూతమైన గుణత్రయాత్మకమైన లింగోపాదానమునకు అన్యమైన గుణత్రయాత్మక

మూల జడ ప్రకృతి నుండి కార్య రూపమైన స్థూల దేహముల సూక్ష్మ సృష్టి యందు అండము వెలుపల లింగోపాదానముచే అనిరుద్ధ శరీరమును పొందిన ప్రాణులను ఆ దేహముతో ఆవాసులై యుండుటకు ఆలయము చేసి దాని యందు జీవులను ప్రవేశింప జేసి అండము లోపల స్థూల శరీరములతో సర్వ జీవులను సృష్టించును. ఈ సృష్టించిన జీవులను సంరక్షించును, సంహరించును. మోక్షము నొసగు వాడగును.

మూ. తిలజవర్తిగళనుసరిసి ప్ర
జ్వలిసి దీపగళాలయద క
త్తలెయ భంగిసి తద్గతార్థవ తోరు పందదలి।
జలరు హేక్షణ తన్నపర మన
దొళగె భక్తి జ్ఞాన కర్మకె
ఒలిదు హొళెపుత తోరువను గుణ రూప క్రియ గళను॥ 21

ఉ॥ తైలమునందు వర్తియు సదా మునుగంబడి ప్రజ్వలించి తా
నాల యమందుఁ జీకటుల నాదటఁబాపి పదార్థ రాసులన్
మేలుగఁజూపునట్లు మది నిస్వెలు గొందుచుఁ బంకజాక్షుఁడున్
జాల సుభక్తికర్మముల సంతసుఁడై తగఁజూపు సత్క్రియల్.

తా॥ దీపము లందు వత్తులు నూనెలో మునిగి ఆ నూనె నాశ్రయించుకొని వెలుగుచు నింటి యందలి చీకటి నెట్లు పారద్రోలుచు పదార్థముల నెట్లు కనపడునట్లు చేయునో అట్లు పరమాత్ముడు దేహములను ఆలయము లందున్న మనస్సు నందు ప్రకాశించు భక్తి యను తైల మందు వైరాగ్య మను వత్తి నుంచి జ్ఞానమను దీపమును వెలిగించి అజ్ఞానాంధకారమును పార ద్రోలి బింబ రూపుడైన పరమాత్ముడు వారి భక్తికి మెచ్చిన వాడై తన భక్తుల యొక్క హృదయాకాశ మందు ప్రకాశించుచు వారి వారి యోగ్యతానుసారముగా గుణములను రూపమును క్రియలను చూపించు వాడగును.

మూ. ఆవ దేహవకొడలి హరిమ
త్తావ లోకదలిడలి తా మ
త్తావ దేశ దొళిడలి ఆవావ స్థితిగళు బరలి।

ఈ విధది జడచేతనదొళు ప
రావరేశన రూపగుణగళ
భావిసుత సుజ్ఞాన భకుతియ బేడుకొండాడు॥ 22

శా॥ ఏ దేహంబు నొసంగుగాక హరితా నేలోక మందుంచుగా
కే దేశంబునఁ బెట్టు గాక మఱితామే యేస్థితుల్వచ్చుఁగా
కేదోచందము నిట్లు జీవజడులం దేవేళలోవెల్గు ల
క్ష్మీదేవీశుని రూప సద్గుణములం జింతించి వర్ణింపుమా.

తా॥ బింబ రూపుడైన పరమాత్ముడు భూమి యందు ఏ దేహము నిచ్చినను మరల మరణమును పొందించి యేలోకమున నుంచినను సుఖ దుఃఖాత్మకమైన ఏ అవస్థల నొసగినను పరమాత్ముని మఱువక స్థావరము లందు స్థావర జంగను జీవుల యందు జీవోత్తముడైన వాయుదేవునకు రమాదేవికిని ఈశ్వరుడైన పరమాత్ముని రూప గుణములను జ్ఞానాను సంధానముతో తెలియు వాడవగుము. జ్ఞాన భక్తి వైరాగ్యములనే వేడుకొనుము. ఐహిక సుఖములను వేడుకొన వలదు.

మూ. ఒందరొళ గొందొందు బెరదిహ
ఇందిరేశన రూపగళ మన
బంద తెరదలి చింతిసిద కనుమాన వినితిల్ల!
సింధు రాజనొ ళంబరాలయ
బంధి సలు ప్రతి తంతుగళొళుద
బిందు వ్యాపిసిదంతె ఇరుతిప్పను చరాచరది॥ 23

ఉ॥ ఒక్కొకదానిలోఁ గలిసి యుండెడు శ్రీహరి దివ్యరూపముల్
జక్కఁగనాత్మలో నెఱిఁగి శౌరిభజింపుము శంకలేదుగా
నక్కట వార్ధిలోన వసనాలయమున్నిలఁ బెట్టఁ దంతులం
దెక్కిన నీటిబిందులన నీశ్వరుఁడుండుఁ జరాచరంబులన్.

తా॥ ఖండ ఖండములు గానుండ దగినవి అనేకములైన అధిష్ఠానములు. వాని యందొక యధి ష్ఠానము నందు ఒక భగవద్రూపము మేరకు అనేక అధిష్ఠానము లందు అనేక రూపములతో నుండు భగవద్రూపములను చింతించు వాడవగుము. దేవతలకు వ్యాప్త దర్శనము వ్యాప్తోపాసనము

రెండు గలదు. ప్రతీ కాలంబసులకు వ్యాప్తి దర్శనము లేదు.

దృష్టాంతము: సముద్రమును వస్త్రిముచే బంధింప వలయునని నీటిని మూట గట్టినచో దారముల యందా నీటి బిందువులు వ్యాపించి యుండునట్లు అఖండ రూపుడైన పరమాత్ముడు ఖండ రూపుడై చరాచరములన్నిటి యందు వ్యాపించి యున్నాడు. అనగా? బింబ రూప మొకటి. ప్రతి బింబ రూప మొకటి. ఇటువంటి రూపములను మనసుకు వచ్చినంత వఱకు ధ్యానింపుము.

మూ. ఒందురూపదొ ళొందవయవదొ
ళొందు రోమదళొందు దేశది
పొంది ఇప్పబుజాండ నంతానంత కోటిగళు।
హిందె మార్కండేయ కాణనె
ఒందు రూపది సృష్టి ప్రళయవ
ఇందిరేశనొళేన దచ్చరి అప్రమేయ సదా॥ 24

ఆ.వె. ఒక్కరూపమందు నొక యవ యవమందు
నొక్క రోమమందు నొక్కదేశ
మందునలరుచున్న యబ్జజాండంబుల
నంతకోటి సంఖ్యలవియు దోచు.

క॥ మును మార్కండే యుండును
గనలేదే యొక్క మూర్తి ఘన ప్రళయమునన్
వనరుహ లోచనునందే
మన నచ్చెరువగును దీన నచ్యుతుండు గదా!

తా॥ పరమాత్ముని యందు అనంతా నంత బ్రహ్మాండము లున్నవి. ఒక అవయవము నందు ఒక రోమము నందు గల విస్తారపు ప్రదేశ మందు అనేకములైన బ్రహ్మాండము లడగి యున్నవి. దీనికి దృష్టాంత మేమనగా పూర్వము మార్కండేయ మహర్షి సృష్టింప బడియున్నట్టిదగు స్థితమైన బ్రహ్మాండ ముందు కాలము నందే ప్రళయమును కూడ చూచిన వాడై యున్నాడు కదా! ఆ ప్రళయోదకము నందు తాను కూడ సంచరించుచు వట పత్ర శాయియైన నారాయణుని జూచి నాసికా ద్వారము నుండి పరమాత్ముని శ్వాసము వలన ఆకర్షింప బడిన వాడై పరమాత్ముని యుదరమును

ప్రవేశించి అచటి స్థితిని చూచి మరల నాసికా మార్గము నుండి వెలుపలికి వచ్చి ప్రళయమును చూచిన తరువాత ఆ వట పత్ర శాయి చేనైన సృష్టిని చూచు వాడై యున్నాడు. ఆ కారణముచే పరమాత్మని ఒక్కొక్క రోమ మందు అనంతానంత బ్రహ్మాండములున్నవి. . ఇట్లుండుటలో ఆశ్చర్యమేమి?

మూ. ఒంద నంతా నంత రూపగ
ళొందు రూప దొళిహవు లోకదా
ళొందె రూపది సృష్టి స్థితి మొదలాద వ్యాపార।
ఒందె కాలది మాడి తిళిసదె
సందణిసి కొండిప్ప జగ దొళు
నంద నందన రణ దొళింద్రా త్మజగె తోరిసనె॥ 25

చ॥ హరి యొక రూప మయ్యది యనంత సురూపములం ధరించు న
చ్చెరువగు నొక్క రూపమున సృష్టి యొనర్చు స్థితిం ఘటించు వి
త్తెఱగున నట్టి కార్యముల దెల్లము గా దెలియం గనీక తా
నరునకు జూప లేదె? యదు నందనుడద్భుత విశ్వరూపమున్.

తా॥ పరమాత్మని యొక్క రూపము అనంతా నంతములైన రూపములలో కూడి యున్నది. అనంతానంత బ్రహ్మాండములును, ఒక్కొక్క బ్రహ్మాండ మందు వైకుంఠము నారంభించి అంధంతమస్సు అంతమగు పదునారు లోకములు వాని ననుసరించిన బ్రహ్మాదిగా తృణాంతమైన వివిధ జీవరాసులు అనంతానంత జడములు ఉన్నవి. సృష్టి స్థితి లయములు ఆయా బ్రహ్మాండములలో అందందు గల రూపములచే జరుగు చుండును. దీనికి దృష్టాంత మేమనగా శ్రీకృష్ణుడు భారత యుద్ధ రంగ మందు అర్జునునకు విశ్వ రూపమును చూపించెను గదా.

మూ. శ్రీ రమేశన మూర్తిగళు నవ
నారి కుంజరదంతె ఏకా
కార తోర్పువు అవయవాహ్వాయ అవయవ గళల్లి।
బేరె బేరే కంగొళిసువ శ
రీర దొళు నానా ప్రకార వి
కార శూన్య విరాట నెనిసువ పదుమజాండదొళు॥ 26

తే.గీ. శ్రీ రమాపతి మూర్తులు చెలువు మీఱ
నవియు నవనారి కుంజరమట్టు లేక
నైన యాకారమునఁ దోచు నవయువాహ్వ
యాసయముల వేర్వేర నలరుసట్టి.

క॥ కాయములందున నానా
న్యాయముల వికారశూన్యమైన విరాట్టా
నీ యంబుజ జాండంబున
ధీయుతులై దానినెల్లఁ దెలియఁగ వశమే?

తా॥ నారాయణుని అనంతానంతములైన రూపములు నవ నారీ కుంజరమట్లు (తొమ్మిది స్త్రీల రూపాకారముగా ఒకే యేనుగు శరీర మందు యేనుగు వలె తోచు నట్టిదై యుండును.) అనగా అనంతా నంతములైన రూపములచే ఒక్కొక్క రూపము కూడి యున్నది. పరమాత్ముడు తన శరీర మందు నానావిధములైన స్వాఖ్య రూపములతో నుండు వాడై యున్నాడు. ఇట్లుండినను వికారము లేనివాడు. ఇట్ల నంతానంత రూపములతో నుండిన వాడై ప్రతి బ్రహ్మాండ మందును విరాడ్రూపుడని పిలువ బడును.

మూ: వారిజ భవాండదొళగులకుమీ
నారసింహన రూపగుణగళు
వారిధి యొళగిహ తెరగ ళందది సందణిసి ఇహవు।
కారణాంశావేశ వ్యాప్తవ
కార్య కార్యా వ్యాప్త వ్యక్తవు
ఆరు నాల్కు విభూతి యంతర్యామి రూపగళు॥ 27

ఉ॥ వారిజ సంభవాండమున వైభవమొప్పగ నారసింహు శృం
గారసురూప సద్గుణమఖండ పయోనిధి వీచికావళుల్
దోరముగా వెలుంగునటు తోచుచు నుండును గారణాదిగా
నారును నర్విభూతుల జడాంతర సంస్థితమైన రూపముల్.

తా॥ ప్రతి బ్రహ్మాండ మందును లక్ష్మీ నరసింహుని రూప గుణములు సముద్ర మందలి అలల వలె నిండి యున్నవి. సృష్టి స్థితి లయములకు కారణమైన కర్మ మందు ఒక రూపమును సర్వ జీవుల స్వరూపము లందు ఒక

రూపమును అర్జునాదుల యందు ఆవేశ విశేషముచే నుండ దగిన రూపము దేహేంద్రి యములందలి అసుర నిగ్రహమునకు దేహేంద్రియాదుల యందు వ్యాప్తమై యున్న ఒక రూపము రామకృష్ణాది అవతార రూపములైన ఒక రూపము సర్వేంద్రి యముల కార్యరూపము ముక్తి యోగ్యుల మనసు లందున్న అవ్యక్తరూపము జడము లందు అంతర్యామి రూపము ఈ విధముగా పది నామములచే ఆయా అధిష్ఠానములందు దశ రూపములతో నొప్పు చున్నవి.

మూ. మణి గళొళగిహ సూత్ర దందది
ప్రణవ పాద్యను చేతనాచే
తన జగత్తినొళను దినదొళాడువను సుఖపూర్ణ।
దణువికెయు ఇవగిల్ల బహుకా
రుణిక నంతానంత జీవర
గణదొళేకాంశ రూపది నింతునే మిసువ॥ 28

మ॥ మణులందుండెడు సూత్రమట్లు శ్రుతి సన్మాన్యుండు తాచేత నం బును నారీతి నచేతనంపు జగతిన్ మోదంబుఁ గ్రీడించు నా తని కాయాసము లేదు పూర్ణసుఖ విస్తారుం డనంతంబులై తనరుం జీవుల నంశరూపమున నంతర్యామి నేమించెడున్.

తా॥ మణుల యందుండెడు దారము వలె ఓంకార ప్రతి పాద్యుడైన బింబ రూపుడైన పరమాత్ముడు చరా చరములచే కూడిన జగత్తు నందు ప్రతి జీవుల యందును వ్యాపించిన వాడై సంచరించు చున్నాడు. అతని కాయాసము లేదు. పరిపూర్ణ సుఖ స్వరూపుడు. అంశ రూపములతో సమస్త జీవులను నియమించు వాడగును.

మూ. జీవ జీవర భేద జడ జడ
జీవ జడ జడ జీవరిందలి
శ్రీపరను అత్యంత భిన్న విలక్షణను లక్ష్మి।
మూవరిందలి పదుమ జాండది
తా విలక్షణ శెనిసు తిప్పళు
సాప ధిక సమ శూన్య శెందరి తీర్వను భజిసు॥ 29

ఆ.వె. జీవ జీవమునకు జీవ జడమునకు
జడ జడంబునకును జడమును జీవ
కోటి నుండి హరికిఁగుదురును భేదంబు
బహు విలక్షణుండు మహిమ మీఱ.

ఆ.వె. అస్వతంత్రమైన యామ్యాదిలక్ష్మియు
ముక్తులను మఱియు నముక్త అస్పృజా
రైనవారికంటె నతివిలక్షణ యగు
హరికి నధిక సమయు ననుట తగదు॥

తా॥ జీవ జీవము నకు భేదము జడ జడమునకు పరస్పరము భేదము గలదు. చేతన జీవులకు జడ జీవులకును భేదము గలదు. జడ జీవులకు పరమాత్మునకును భేదము గలదు. ఈ ప్రకారముగా జీవుల కంటెను జడముల కంటెను అత్యంత విలక్షణుడైన వాడు పరమాత్ముడు. అస్వతంత్రురాలైన లక్ష్మీదేవి బ్రహ్మాండము నందు అస్పృజ్యులైన తదన్యులైన ముక్తులు మఱియు అముక్తులు అస్పృజ్యులైన త్రివిధ జీవుల కంటెను విలక్షణ మైనది. పరమాత్ముని విషయమందు అనగా పరమాత్ముని కంటె తక్కువ మైనది. బ్రహ్మాదులకు ఈశ్వరి మైనది. ఇటువంటి తార తమ్యమును తెలుసుకొని పరమాత్ముని భజింపుము.

మూ. ఆదితేయరు తిళియదిహ గుణ
వేద మానిగ శెందినిప వా
ణ్యాదిగళు బల్లర పరరియద గుణగణం గళను।
వేధ బల్లను బొమ్మ నరి యద
గాధ గుణ గళ లకుమి బల్లళు
శ్రీద రొబ్బనుపాస్య సద్గుణ పూర్ణ హరి యెందు॥ 30

సీ॥ ఆదితేయ వరేణ్యులైన రుద్రాదులు
దెలియని హరిగుణా వళులనెల్ల
వేదాభి మానులై వెలయు వాణ్యాదులు
దెలియ సమర్థులై వెలయుచుందు
రంత కంటెనుమించి యావిరించియుఁదాను

నెఱుఁగ సమర్థుఁడై పరగు చుండు
నటువంటి బ్రహ్మయు నర యలేని యగాధ
మైన శ్రీహరిసద్గుణాలిఁ దెలియ

ఆ.వె. నాది లక్ష్మి కడు సమర్థురాలగు చుండు
నంత మెఱుఁగఁజాల దామెకూడ;
హరి యుపాస్యమూర్తి యతఁడె సర్వోత్తముఁ
డఖిల గుణ విశాలుఁడగుచు నుండు.

తా॥ రుద్రాది దేవతలు తెలియజాలని శ్రీహరి గుణ గణములను సరస్వతి భారతి మొదలైన వారు తెలియు వారై యున్నారు. ఆ సరస్వతి మున్నగు వారు తెలియని గుణ గణములను బ్రహ్మ తెలియ గలదు. బ్రహ్మదేవుడు కూడ తెలియ జాలని అపరిమితమైన గుణ గణములను లక్ష్మీదేవి తెలియుటకు సమర్థురాలగుటచే పరమాత్మని గుణగణములను వారి వారి యోగ్యతాను సారముగా తెలిసికొను వారైయున్నారు. పరమాత్మడు సద్గుణ పరిపూర్ణుడగుటచే అతడు నిర్దోషి యన బడును. పరమాత్మడే సర్వోత్తముడై రమా బ్రహ్మాదులందరికి ఉపాస్యుడై యున్నాడు. అందువలన లక్ష్మిపతి తారతమ్య పంచ భేదములతో సర్వోత్తముడని పొగడ బడుచున్నాడు. ఈ గుణోపాసనముచే జీవుల తార తమ్యము చెప్పబడినది.

మూ. ఇంత నంతానంత గుణగళ
ప్రాంత గాణదె మహాలకుమి భగ
వంత గాభరణా యుధాంబర వాలయగళాగి॥
స్వాంత దలి నెలె గొళిసి పరమ దు
రంత మహి మన దౌత్య కర్మ ని
రంతరది మాడుతలి తదధీనత్వ వైదిహళు॥ 31

ఉ. ఈ లలినాయనంత మహనీయ గుణంబుల పారమెయ్యగాఁ
జాలగ లేక లచ్చియును శౌరికి నాభరణా యుధాంబరా
జాలము తానయై హృదయ సంస్థితయై వెలుగొంది దౌత్య క
ర్మాలి సదా యొనర్చుచు నిరంతర మొప్పును తానధీనయై.

తా॥ నారాయణమూర్తి యొక్క అపరిచ్ఛిన్నమైన గుణ గణములను పారము గానక బ్రహ్మాదుల కంటె విలక్షణురాలైన రమాదేవి తన రమాఖ్యమైన శ్రీ భాగ మందు నిలిపి తన హృదయమును అష్ట దళ కమల మందు నిలుపు కొన్నదై తన పతియైన నారాయణుని ఉపాసించుచున్నది. అవియోగమైన రూప మొకటి. పతి త్వేన బాహ్యము నందలి రూప మొకటి. ఇట్లు అనేక రూపములతో అనేక రత్నా భరణములు గదాధి ఆయుధములు దివ్య వస్త్రములు మందిరములు ఛత్ర చామరాది ఉపచార రూపములైన పదార్థము లన్నియు తానయై పరమాత్ముని దూత కర్మలను సర్వదా తానే చేయుచు శ్రీ హరికి అధీనురాలై యున్నది.

మూ. ప్రళయ జలధి యొళుళ్ళ నావెయు
హొాలబుగాణదె సుత్తు వందది
జలరు హేక్షణ నమల గుణ రూప గళ చింతిసుత।
నెలెయ కాణదె మహాలకుమి చం
చల పనైదిహ ళల్ప జీవరి
గళపడుపదే నిపన మహిమెగ శ్రీ జగత్రయది॥ 32

చ॥ ప్రళయ పయోధి వీచికల భాసిలు నావయుఁ దీరముంగనం
గలుగక చుట్టు చుందునటు కంజ దళాక్షు గుణాలి రూపముల్
దెలియగ లేక యంతమును దెల్లముగా సర సీరుహాస్య చం
చలమతిఁ బొందు చుందునట శక్యమె? జీవులెఱుంగ లేశమున్.

తా॥ మహా ప్రళ యోదక మందుండ దగిన నావ తీరమును జేర లేక చుట్టు చుందునట్లు పరమాత్ముని నిర్దోషము లైన గుణ రూపములను ప్రళయోదక మందు మనస్సను నావతో చంచలాత్ముకురాలై సంచరించుచు పారముగానక దిగ్భ్రాంతి పొందు చుందును. ఇట్లుండగా బ్రహ్మాదిగా తృణాంతమైన అస్వతంత్రులైన అల్ప జ్ఞానులైన జీవులకు శ్రీహరి గుణములు తెలియుటకు సాధ్యమగునా?

మూ. శ్రీనికేతన సాత్త్వ తాం పతి
జ్ఞాన గమ్య గయాసురార్దన
మౌని కుల సన్మాన్య మానద మాతుళధ్వంసి।

దీన జన మందార మధు రిపు
ప్రాణద జగన్నాథ విట్ఠల
తానె గతియెందనుది నంబిదవరను పొరెవ॥ 33

వ॥ పరముడు శ్రీనికేతనుండు సాత్త్వికనాథుఁడు జ్ఞాన గమ్యుఁడున్
మఱియు గయాసురాంతకుఁడు మౌని కులస్తవనీయుఁ డెంతయున్
వరదుడు దీన వత్సలుడు వాడెకుమాతుల వైరి మాన దుం
దరయుఁగఁ బ్రాణదుండనిన నట్టిరుఁ గాచును విట్ఠలుండొగిన్.

తా॥ శ్రీనికేతనుడు సజ్జనులకు స్వామియు దివ్య జ్ఞానముతో ప్రత్యక్ష మగువాడు గయనామకుడైన దైత్యుని సంహరించిన వాడు ముని జనులచే సర్వోత్తముడని స్తుతింప బడు వాడు వైకుంఠ లోకము నిచ్చువాడు దుర్మార్గుడైన మేనమామను చంపిన వాడు దీన జన మందారుడు మధు నామకుడైన రాక్షసుని చంపిన వాడు జీవులకు స్వరూపానంద సుఖము నిచ్చువాడును జగన్నాథుడైన విట్ఠలుడని పరమాత్ముని ఎవరు స్తుతింతురో అటువంటి వారిని రక్షించును.

వి. పరమాత్ముని పాద పద్మములను చేర దగిన వారికి మూడు విధములైన జ్ఞానములు కావలయుననియు లేకున్నచో భగవంతుని సందర్శనము కాజాలదు. అవి ఏవనగా 1. ఆప్త జ్ఞానము 2. మిత్ర జ్ఞానము 3.ద్వేష జ్ఞానము పరమాత్ముని యందు ఆప్త జ్ఞానముండ వలయును. మిత్ర జ్ఞానమనగా? ఉదాసీన జ్ఞానము. లాభ నష్టముల యందు ఉదాసీన ముండవలయును. ప్రక్పందన వనితాది విషయము లందు ద్వేష జ్ఞానముండ వలయును. ఇవి లేకున్నచో మోక్షము లభింపదు. ఇవి త్రిగుణముల యొక్క కార్యములు. సత్త్వ గుణ జ్ఞానము ఆప్త జ్ఞానము. రజో గుణ జ్ఞానము ఉదాసీన జ్ఞానము. తమోగుణ జ్ఞానము ద్వేష జ్ఞానము.

ఇది శ్రీహరికథామృతసారము నందు పంచతన్మాత్రసంధి.

# మాతృకాసంధి (ఎనిమిదవసంధి)

ము. హరికథామృత సార గురుగళ
కరుణదిందాపనితు పేళువె
పరమభగవద్భక్తరిదనా దరది కేళువదు॥

తే.గీ. హరి కథామృత సారము గురువుల దయ
మెఱయ వర్ణించు వాడను బరమ భక్త
వరులు సజ్జను లాదర భావ మొదవ
విన వలయు భక్తి మీఱగ వీనులలర.

ము. పాద మాని జయంత నొళగె సు
మేధ నామకనిప్ప దక్షిణ
పాదదుంగుట దల్లి పవనను భారభృద్రూప।
కాదు కొండిహ టంకి తరమొద
లాద నామది సంధి గళలీ
రైదు రూపదలిద్దు సంతత నడెదు నడెసుతలి॥ 1

సీ॥ పాదాభి మానియై పరగు జయంతుని
యందు సుమేధాఖ్యుఁడైన హరియు
వసి యించు దక్షిణ పద ముంగుటంబునఁ
బవనుఁడా తనియందు భారభృత్తు
నామకుండగు హరి తామెలంగుచు నుండు
సంధుల యందును జక్కగాను
టంకియుఁ దరయును రళకయుం ధరియనఁ
దారణాత్మయు థప దండి ధన్వి

ఆ.వె. మఱియు నవ్యయనఁగఁ బరగు నీ దశ రూప
ములను వెలసి సతము జలజ పతియుఁ
దాను నడచి శక్తిఁ బ్రాణి కోట్లన్నింటి
నడచునట్లు సేయుఁ బుడమియందు.

తా॥ రెండు పాదములకు అభిమానియైన జయంతుని యందు భారతీ రమణ ముఖ్య ప్రాణాంతర్గతుడైన వాడై సుమేధ నామకుడైన పరమాత్ముడున్నాడు. కుడికాలు ఎడమకాళ్ళు చొటన వ్రేళ్ళ యందు భార భృన్నామకుడై యు నామకుడైన పరమాత్ముడున్నాడు. మఱియు టంకి రథాక్ష దరక్ష ణాత్మయను ఈ నామ సంకేతములతో గల అయిదు పేర్లతో తర దండి ధన్వి నమ్య అను ఈ అయిదు పేర్లు మొత్తము పది నామములతో పరమాత్ముడున్నాడు. రెండు పాదములకు కీలు సంధులు పది. అ యేవనగా 5 కుడికాలు సంధులు 1. తొడకీలు 2. మోకాలి కీళ్ళు 3. గుల్ఫపు కీళ్ళు 4. వ్రేళ్ళ యందుండు కీళ్ళు 5. అడుగు భాగపు సంధు కీళ్ళు ఇదే విధముగా ఎడమ కాలి యందలి కీళ్ళు 5 మొత్తము 10 (పది) ఈ సంధుల యందు పూర్వోక్తమైన రూపములతో అచటనే సర్వదా కాచుకొని యున్నాడు. ఈ ప్రకారము ఆ రూపములు ఆ నామములతో ఆయాస్థలముల యందున్న వాడై తాను నడచి జీవులను నడిపించుచు ఛాయా పురుషుని దృష్టాంతము రీతిగా బింబ క్రియ ద్వార ప్రతి బింబ క్రియచే తాను నడచి దేవతల ద్వార జీవుని ద్వార కాళ్ళచే గమనా గమనములు చేయించును.

మూ. కపిల చార్వాంగాది రూపది
పపుగళొళు హస్త గళ సంధియొ
ళపరిమిత కర్మగళ మాడిసుత లిప్ప దినదినది।
కృపణవత్సల పార్శ్వదొళు పర
సుఫలి యెనిసుప గుద ఉపస్థది
విపుల బలిభగ మనవెనిసి తుంది యొళగిరు తిహను॥ 2

సీసమాలిక

సీ॥ దక్షిణ హస్తమున్ దక్షిణ భుజసంధిఁ
గపిలరూపమ్మునఁ గడువెలుంగు
కుడిచేతి మోకాలు కుడికాలి యందున
ఖపతి రూపంబునఁగడు వెలుంగు
మఱి కుడిచేతిలోఁ మణికట్టు సంధిలో
గరుడ రూపంబున గడువెలుంగు
కుడి యరచేతిలోఁ గుడిచేతి సంధిలో

ఘుర్మ రూపంబున గడు వెలుంగు
కుడిచేతి వ్రేళ్ళనెప్పుడు జసారాఖ్యుండు
నెడమచేతి భుజంబు నెసఁగుచుండు
చార్వాంగ రూపుండు సరవి ఛందోగమ్యుఁ
డెడమ చేమోకాలి నడరుచుండు
నాచేతి మణి కట్టు నాజనార్ద నుడుండు
నర చేతిలో ఝూటి తారి యుండు
ఞీయ రూపు డుండు నెడమ చేతి వ్రేళ్ళను
పార్శ్వంబులందున పరసు ఫలియు

తే.గీ. బరగు గుద మందు బలియు నుపస్థ యందు
భగ యనందగు రూపుండు పరలుదుంది
యందు మనమను రూపుడీ చందముననను
కర్మములను జేయించును ఘనుడు హరియు.

తా॥ (1) 1. క - కపిల - కుడిచేయి - భుజము నందలి కీలు.
2. ఖ - ఖపతి - కుడిచేయి - మోచేతి కీలు.
3. గ- గరుడ - కుడిచేయి - మణి కట్టు కీలు.
4. ఘ - ఘుర్మ - కుడి అర చేతి కీలు.
5. జ - జసార - కుడి చేతి వ్రేళ్ళ కీలు.

(2) 1. చ - చార్వాంగ - ఎడమ చేతి భుజపు కీలు.
2. ఛ - ఛందో గమ్య - ఎడమ మోచేతి కీలు.
3. జ - జనార్దన - ఎడమ చేతి మణి కట్టు కీలు.
4. ఝ - ఝూటితారి - ఏడమ అర చేతి కీలు.
5. ఞ - ఞీమ - ఎడమ చేతి వ్రేళ్ళకీలు.

ఈ ప్రకారముగా కపిలాది రూపము నారంభము చేసి పది రూపములతోను కంఠము నారంభించి కటి వఱకు గల మధ్య ప్రదేశ మందు రెండు వైపుల యందు పర సుఫలి యనునట్టిదియు గుద మందు బలి ఉపస్థ యందు భగ తుంది యందు మనస్సాంకేతమైన పరమాత్ముడు ఉన్నాడు. ఇట్లు సర్వదేహము లందు సంధుల యందున్న వాడై ప్రతిదినము అనేకమైన వ్యాపారములను చేయు చున్నాడు.

మూ. ఐదు మేలొందధిక దళవు
ళ్ళైదు పద్మవు నాభి మూలది
ఐదు మూర్తి గళిహవు అనిరుద్ధాది నామదలి।
ఐది సుత గర్భవను జీవర
నాది కర్మ ప్రకృతి గుణగళ
హాది తప్పలి గొడదె వ్యాపారగళ మాడుతిహ॥

3

ఆ.వె. నాభి మూల మందునం జెలు వొందును
షడ్డళాంబుజములెసంగు నైదు
నందు మూర్తులమరు నని రుద్ధుఁడాదిగా
నాఖ్యలైన యట్టి హరియు సతము.

క॥ జీవుల యనాది కర్మల
చే వెలయఁగ గర్భములను జేర్చుచు సృష్టి
ప్రావీణ్యంబులఁ జూపుచుఁ
దావేడుక మీఱుచుండుఁ దగురూపములన్.

తా॥ ప్రాణుల యొక్క ప్రకృతి సాంకేతమైన అనాది లింగ దేహము యొక్క సాత్వికాది గుణముల ననుసరించి యుండ దగిన లింగ దేహపు తృతీయ పరి చ్ఛేదము నందలి అనాది కర్మము ననుసరించి వచ్చిన ఆగామి సంచి కర్మములు వీనిననుసరించి వచ్చునవి జన్మములు. పూర్వజన్మము ననుసరిం యేజన్మము రావలయునో ఆ మార్గము తప్పకుండునట్లు పితృ గర్భ ద్వార మాతృ గర్భమైన మాంస గతమైన ఆరు దళముల తోడి కమ గర్భమును రేతస్సు ద్వార ప్రవేశము గావించి తరువాత ఆ రేతస్సు మాతృ శోణితమును సంబంధము చేయించి శుక్ల శోణిత సమ్మేళనము అవయవ సహితమైన దేహ నిర్మాణ రూపమైన వ్యాపారములను ఆ దళకమలము లైదింటి యందును నాల్గు దళకమలము లైదింటి యందు సంభవించిన అనిరుద్ధాది రూపములతో చేయుచు నున్నాడు.

మూ. నాభియలి షట్కోణ మండల
దీ భవిష్యత్ బ్రహ్మ నొళు ము
క్తాభ శ్రీ ప్రద్యుమ్న నిప్పను విబుధ గణ సేవ్య।

శోభిసుత కౌస్తు ..పె మొదలా
దా భరణ వాయుధగ ళింద మ
హా భయంకర పాపపురుషన శోషిసుత నిత్య॥ 4

మ॥ జన నాభీ స్థల మందు నన్వెలయు నా షట్కోణ సన్మండలిన్
ఘనుడా భావి విరించి యందలరు ముక్తశ్రీలఁ బ్రద్యుమ్నుఁడున్
దను సేవించు సురాలి గూడి రుచిమత్కల్యాణ భూషాలితోఁ
దనువందుంగల పాపపూరుషు సదా తాశోషిలం జేయుచున్.

తా॥ నాభి లోపల పూర్వోక్తమైన షడ్దళములతో కూడిన అయిదు కమలముల అధో భాగమందు ఆరు మూలలతో కూడిన వాయు మండలములు ఆరున్నవి. దాని యందు అయిదు వాయు రూపములు అయిదు ప్రద్యుమ్న రూపములున్నవి. ఈ ప్రకారముగా గల ఆ అయిదింటి యందు సుషుమ్నా నాడి యందున్న ఆరు దళ కమలములకు అధోభాగ మందుండు వాయు మండలము నందు వాయు దేవుని అంతర్యామి యైన వాడై ముత్యపు కాంతితో కూడిన షడ్గుణైశ్వర్య సంపన్నుడైన ప్రద్యుమ్నుడు దేవతాగణములచే సేవింప బడు వాడై కౌస్తుభాది ఆభరణములతో నలం కృతుడైన వాడై మహా భయంకర రూపుడైన కలి పురుషుని ప్రతి దిన మందును వాయు మండల మందున్న వాయువుచే శోషింప జేయుచు ప్రద్యుమ్నుడు ప్రకాశించు చున్నాడు.

వి. పాప పురుషుని రూప మెట్టిదనగా బ్రహ్మ హత్యయే శిరస్సు. స్వర్ణ స్తేయమే భుజ ద్వయము. సురాపానమే హృదయము. గురు పత్నీ గమనమేకటి ప్రదేశము. ఇటువంటి పాపుల సహ వాసమే పాద ద్వయము. ఖడ్గ చర్మమే ఆయుధ విశేషములు. ఇటువంటి పాప పురుషుడు పాపులందరి కంటె మిక్కిలి నీచమైన వాడు.

మూ. ద్వాదశార్కర మండలవు మ
ధ్యోదరదొళు సుషుమ్నదొళగిహ
దైదు రూపాత్మకను అరవత్తధిక మున్నూరు।
ఈ దివారాత్రిగళ మానిగ
ళాద దివిజర సంతయిసుత ని
షాదరూపక దైత్యరను సంహిరప నిత్యదలి॥ 5

శ్రీనరుని గుక్షిమధ్యమున ద్వాదశభానుల మండలంబుల్గా
నను సుషుమ్న యందుఁ గలఁడందునఁ బంచ సురూప కుండళం
బున నిశ సంఖ్య లాత్రిశతమున్మఱి యర్వది కొప్ప మాన్యతా
ఘనసురలన్ నిశాచరులఁ గాచును ద్రుంచును సర్వకాలమున్.

తా॥ వాభికి పైన హృదయమునకు క్రింది భాగము నందు పంచ భేదములతో కూడిన సుషుమ్న యను నాడి యందు ద్వాద శార్కుల మండలము (పంద్రెండు మూలలు గలది) ఉన్నది. అనగా పంద్రెండు మంది సూర్యుల యొక్క ఆవాస స్థానమగు మండలము. వాని యందు ఒక్కొక్క దాని యందు ఒక్కొక్కటి చొప్పున అయిదు మండలములున్నవి. అనిరుద్ధాది అయిదు రూపములతో ప్రచురుడైన పరమాత్ముడు అయిదు రూపములతో నున్నాడు. మఱియు నొక్కొక్క ద్వాద శార్క మండల మందు డెబ్బది రెండు రూపముల మేరకు అయిదింటి యందు మొత్తము 360 రూపములతో మన్నాడు. సూర్యుని కిరణములు 1000 (వేయి) ఒక్కొక్క దాని యందు 200 ఇన్నూరు కిరణముల మేరకు అయిదింటి యందును వేయి కిరణములున్నవి. సంవత్సరమునకగు దినములు 360. ఈ ప్రకారముగా నుండ దగిన రాత్రింబవళ్ళు 360 + 360 = 720. ఈ సూర్య మండలము పైన చంద్ర మండలమున్నది. అందువలన సూర్య మండల మట్లే చంద్ర మండలములు అయిదింటి యందు ఒక్కొక్క దాని యందు 72 రాత్రుల మేరకు 360. దీని యందు అనిరుద్ధాది రూపములయిదు. ఈ రాత్రింబవళ్ళకు అభిమానులైన దైత్యులను కిరాత రూపముతో ప్రతి దినము సంహారము చేయుచు అదే విధముగా దేవతలను రక్షించును. నూరు సంవత్సరములకు మొత్తము దినములు 36,000. ముప్పది ఆరువేలు. పగలు రాత్రితో చేరి 72 వేలగును. ఇందరు దేవతలు రాక్షసులు రాత్రింబవళ్ళకు అభిమానులు. పగళ్ళకు పురుష దేవతలు రాత్రులకు స్త్రీ దేవతలు అభిమానులు.

మూ. హృదయ దొళగిహ దష్టదళ కమ
లదరొళగె ప్రాదేశ నా మక
నుదిత భాస్కర నంతె తోర్పను బింబ నెందెనిసి।
పదుమ చక్ర సుశంఖ సుగదాం
గద కటక మకుటాంగు ళీయక
పదక కౌస్తుభ హార గ్రైవేయాది భూషితను॥

6

ప॥ హృదయంబందున నుండు నష్టదళమై యెంతేని పంకేరుహం
బది శోభిల్లును దానియందలరు నా ప్రాదేశనాముండు తా
నుదితాంభోరుహ మిత్రువోలె దరిశంఖోత్తంస ముంబద్మమున్
గదయుం గౌస్తుభ హారభూషిత లసత్కాయుండు బింబాఖ్యుఁడై.

తా॥ ద్వాదశార్క మండలమునకు పైన హృదయ ప్రదేశమందు సంబంధించి యున్న పంచ ప్రభేదముతో నున్న సుషుమ్నానాడి పంచకమందు ఒక్కొక్క దానియందు ఒక్కొక్క అష్టదళమున్నది. ఈ అయిదింటి యందు ఒక్కొక్క దానియందు ఒక్కొక్క ప్రాదేశ నామకుడైన ఉదయ సూర్య కాంతులతో గూడిన వాడై అపరోక్షులకు తన రూపమును చూపించు వాడగును. బింబ రూపుడను పేరుతో పిలువ బడు వాడై ప్రత్యక్షుడగును. శంఖ చక్ర గదా పద్మ ధారియై అంగద కటక మకుటాంగులీయక కౌస్తుభహార పదక విరాజితుండై ప్రాదేశ నాముడైన బింబ రూపుడని పిలువబడు చున్నాడు.

వి. ప్రాదేశుడను భగవంతుడుండు స్థాన మేదనగా? ప్రతి కమల మందును కమల కర్ణికా మూలము నందుండును. అ కర్ణికకు పై భాగమున అగ్రేశుడును అగ్రేశునకు పై భాగమున ప్రాదేశు డుండును. పరమాత్ముడు సోపానములట్లున్నాడు. ఆ మూలేశుడు అంగుష్ఠాగ్రమైన పరిమాణము గలవాడు. అగ్రేశుడు, అంగుష్ఠ పరిమాణము గలవాడు. ప్రాదేశ నామకుడు ప్రాదేశ మంతటి పరిమాణము గలవాడు. ఈ ప్రకారముగా భగవంతుని మూర్తులున్నవి. అష్టదళ కమల మందలి మూలేశుడు మొదలగు మూడు రూపములు బింబ రూపములే. మూలేశుడు అష్ట భుజాడు. జాగ్రదవస్థ నిచ్చు వాడు. అగ్రేశుడు జీవాకారుడు. స్వప్నా వస్థ నిచ్చువాడు. ప్రాదేశుడు చుతుర్భుజాడు. నిద్రావస్థ నిచ్చువాడు. ఇట్లు త్రివిధ కార్యములు త్రివిధ రూపముల చేసగును. మొదట స్థూల దేహ మందు ప్రాదేశుని అపరోక్షమగును. అందువలన ప్రాదేశుని మాత్రము పేర్కొనుటకు కారణమైనది.

మూ. ద్విదళపద్మవు శోభిపుదు కం
ఠదలి ముఖ్యప్రాణ తన్నయ
సుదతి యిందొడ గూడి హంసోపాసనెయ మాళ్పు
ఉదక పన్నాదిగళిగవకా
శదను తానాగిద్దు దానా
భిదను శబ్దవనుడిదు నుడిసువ సర్వజీవరొళు॥ 7

ఆ. శ్రీవనమాయమాం బరియు వెళ్లను కంఠము నందు దానిలో
మనసినగూడి ప్రాణపతి శుద్ధతరంబగు హంసమంత్రమున్
మునను జపించి యున్నజలముం, గొన కారణుడౌను శబ్దము
ల్గదలుమ వారికే పఠముం బల్కంగ జేయును సర్వజీవులన్.

తా॥ రెండు రేఖలచే కూడిన కమలము కంఠ ప్రదేశమునకు మధ్య యందున్నది. ఇదియును అయిదు కమలములతో కూడినది. ఈ అయిదు కమలముల యందును సర్వోత్తముడైన వాయుదేవుడు తన పత్నియైన భారతీ దేవితో కూడిన వాడై అయిదు రూపములతో నున్న వాడై హంసో పాసనము చేయును. పానము చేసిన ఉదకమును భోజనము చేసిన అన్నమును ఉదరము ప్రవేశించుటకు అవకాశము నిచ్చు వాడగును. ఉదరము నుండి వెలుపలికి రాదగిన శబ్దమునకు కూడ అవకాశ మిచ్చు వాడగును. వాగింద్రియము ద్వార సర్వ శబ్దములను పలికించు పరమాత్ముని తరువాత రెండవ సర్వజ్ఞుడైన వాడు వాయుదేవుడు. అందువలన తాను శబ్ద క్రియను నడిపించును. ఈ వాయుదేవుడు కంఠ స్థాన మందుండి 'ఉదాన' అని పిలువ బడును. ఈ ఉదాన వాయుదేవుడే సర్వప్రాణులు ధరించు స్థూల దేహముల యొక్క కంఠ స్థానమందున్నాడు. ఈ సర్వ శబ్దములును వాయుదేవుని ద్వార నడచును.

మూ. నాసికది నాసత్య దస్రరు
శ్వాస మాని ప్రాణ భారతి
హంస ధన్వంత్రిగళు ఇల్లిప్పరవ రొళగె।
భేశ భాస్కర రక్షి యుగళొళ
ధీశ రెని పరు అవరొళగెల
క్షేశ దధివామనరు నియామిసుత లిరుతిహరు॥

క॥ నాసత్య దస్రులి ద్వరు
నాసిక వివరంబు లందు నలరంగలరా
శ్వాసాభిమాని యనిలుడు
రాపతి భారతియు బొల్చ్రి తచ్చిత్తములన్.

తే.గీ. హంస ధన్వంత్రి రూపాల హరియు వారి
యందు వెలయును నేత్రంబు లందు శశియు

భాస్కరుడు తత్త్వ దేవతల్ వారి ప్రభువు
వాసు దేవుండు శ్రీదధి వామనుండు.

తా॥ కుడి యెడమ ముక్కు రంధ్రముల నుండి రాదగిన రెండు విధములైన శ్వాసములకు అభిమానులైన వారు నాసత్య దస్రులను అశ్వనీ దేవతలు. రెండు కన్నులకు అభిమానులు సూర్య చంద్రులు. వారి యందు ప్రాణ దేవుడును భారతీ దేవియు వారి అంతర్యాములైన హంస ధన్వంత్రి అను పేరు గల పరమాత్ముడు. ఈ అభిమాన దేవతల యందు వాయుదేవుని యందు హంస యను దేవుడును భారతీ దే యందు ధన్వంత్రియును ఉందురు. శ్వాసాభిమానులని చెప్పబడిన సూర్య చంద్రాదులు నేత్రాభిమానులు. ఆ సూర్యుని రమా పతియైన నారాయణుడును శ్రీదధి వామన మూర్తియు వారికి నియామకులై యున్నారు.

మూ. స్తంభ రూపద లిప్ప దక్షిణ
అంబకది ప్రద్యుమ్న గుణరూ
పాంభృణియు తానాగి ఇప్పళు వత్సరూప దలి।
పొంబసుర పద యోగ్య పవనత్రి
యంబకాది సమస్త దివిజక
దంబసేవితనాగి సర్వపదార్థగళ తోర్ప॥ 9

ఉ॥ కంబము వోలె వెల్గుకుడి కంటను శ్రీహరిదానిఁ గట్టు ప
గ్గంబన లచ్చితానలరుగాఁ బవమానుఁడు వత్సరూపియై
సంబరమొప్ప నీశముఖ సర్వసుపర్వ సుసేవ్య మానుడై
యింబుఘటించు రీతిఁ గనుపింపఁగఁ జేయు రమేశుఁ డెల్లయున్

తా॥ ప్రద్యుమ్న రూపుడైన పరమాత్ముడు కుడి కంటి యందు కంటి యందలి గ్రుడ్డులో గనపడు నల్లని చుక్క యందు స్తంభము రూపముతో నున్నాడు. దానికి అంభ్రణీరూపయైన లక్ష్మీదేవి సాక్షాత్తు తానే పగ్గముగా నున్నది. ఇటువంటి స్తంభా ధీనముగా లక్ష్మి యున్నది. భావి బ్రహ్మయైన వాయుదేవుడు రజ్జువుతో గట్టబడి యున్నాడు. ఇట్లు వాయుదేవుడు వత్స రూపియై యున్నాడు. రుద్రాది సమస్త దేవతా సమూహముచే సేవింప బడు వాడై వాయ్వంతర్యామియైన ప్రద్యుమ్నుడు సర్వ పదార్థములను కండ్లకు కనుపింప జేయుచున్నాడు. ఎడమ కంటి యందు భారతీ మొదలైన స్త్రీ దేవతలునువారి అంతర్గతుడైన అనిరుద్ధుడని తెలియ వలయును.

ము. నేత్ర గళలి వసిష్ఠ విశ్వా
మిత్ర భారద్వాజ గౌతమ
నత్రియా జమదగ్ని నామగళింద కరెసుతలి।
పత్రతాపక శక్ర సూర్య ధ
రిత్రి పర్జన్యాది సురరు జ
గత్త్రియేశన భజిపరను దిన పరమభకుతి యలి॥ 10

ము. జ్యోతియొళగిప్పను కపిల పురు
హూతముఖ దిక్పతి గళింద స
మేతనాగిహ దక్షిణాక్షియ ముఖదొళిహ విశ్వ।
శ్వేతవర్ణ చతుర్భుజను సం
ప్రీతియిందలి స్థూల విషయవ
చేతనరిగుందుణిప జాగ్రతెయిత్తు నృగజాస్య॥ 11

సీ॥ నేత్రంబు లందున నిలయులై యుందురు
శిష్ట వశిష్ఠకౌశికము నులును
ఘన భరద్వాజాత్రి గౌతమ జమదగ్ని
నామంబులందున నలువు మీఱు
నట్టి యమ్మునులు మహాదేవ దేవేంద్ర
రవి ధరాదేవి పర్జన్యులాది
యౌసురలందరు నాజగ దీశుని
భజియింత్రు నిచ్చలు బరమభక్తి

తే.గీ. జ్యోతి యందునఁ గపిల విఖ్యాతుఁడు హరి
శక్ర దిక్పాల సహితుఁడై సంతతంబు
దక్షిణాక్షిని. వెలుగొందు ధవళవర్ణుఁ
డా చతుర్భుజుఁడైన విశ్వాఖ్య విభుఁడు

ఆ.వె. ప్రీతి తోడ స్థూల విషయముల్ భుజియించి
చేతనుల కొసంగు చిత్తమలర
జాగ్రదాదు లొసఁగుఁ జక్కఁగా నృగజాస్య
రూపకుండు భక్తి ప్రాపకుండు.

తా॥ స్థూల దేహము లందలి రెండు నేత్రముల యందు వసిష్ఠ విశ్వామిత్ర భరద్వాజ నామాంకితులును గౌతమ అత్రి జమదగ్ని ఈ నామాంకితులును పత్రతాపక నామధేయుడగు రుద్ర దేవుడును ఇంద్రుడు సూర్యుడు భూదేవి పర్జన్యుడు మొదలైన దేవతలు నేత్రము లందలి నానా విధములైన దేవతలు నేత్రము లందలి నానావిధ రేఖోప రేఖల యందు ఉన్న వారై ఈ నామములతో పిలువబడుచు సర్వ స్వామియైన పరమాత్ముని అత్యంత భక్తితో ప్రతి దినము సేవించు వారై యున్నారు. ఎడమ కంటి యందు వారి వారి భార్యలు పూర్వోక్త ప్రకారముగా నున్నారు. కుడి భాగ మందుండ దగిన కంటి గ్రుడ్డు లోపల సన్నని నల్ల చుక్కలో నున్న తేజస్సు నందు కపిల నామక పరమాత్ముడు వెలుగు వాడై యున్నాడు. ఇంద్ర అగ్ని యమ నిర్పతి వరుణ వాయువు కుబేర రుద్ర ఈ ఎనిమిది దిక్పతులతో కూడిన వాడై ఆయా దిక్కుల యందు ఆయా దిక్పతులతో మధ్య గతుడై కపిల నామకుడు వెలుగు చున్నాడు. ఇంకను కుడి భాగము నందలి నేత్రము నందు నాసికకు సంబంధించి యున్న నేత్ర మున కాది భాగమైన ముఖ స్థానము నందు విశ్వరూపి పరమాత్ముడు శ్వేత వర్ణుడైన చతుర్భుజుడైన నృగజాస్యుడని పిలువ బడుచున్నాడు. ఈ రెండు నేత్రముల యందును మొత్తము పందొమ్మిది రూపములతో విశ్వాత్మకుడైన భగవంతుడు సర్వ ప్రాణులకు జాగ్రత్త నొసగి ఆజాగ్ర దవస్థ యందు స్థూల దేహముచే భోగింప దగిన ప్రాకృత విషయములను మిక్కిలి ప్రీతితో అనుభవింప చేయు వాడగును.

మూ. నెలసిహరు దిగ్దేవతగళి
క్కెలది కర్ణగళలి తీర్థం
గళిగె మానిగళాద సురనది ముఖ్య నిర్జరరు।
బలద కివియలి ఇరుతిహరు బాం
బొళయ జనక త్రివిక్రమను ని
ర్మలినరను మాడువను ఈపరి చింతిసువ జనర॥ 12

ఉ॥ వీనుల యందు దిక్పతులు వెల్గుచు నుందురు దక్షిణ శ్రుతిన్
మానిత తీర్థ మానులగు నాకనదీముఖ నిర్జరాలి యెం
తేని వసింతు రాసురల కిష్టదుఁడైన త్రివిక్రముండు త
న్మాని దలంచు సజ్జనుల నొప్పుగ నిర్మలినం బొనర్చెడున్.

తా॥ ఈ స్థూల దేహ మందున్న రెండు చెవుల యందు తూర్పు మొదలగు అష్ట దిక్కులకు అభిమానులైన ఇంద్రుడు మొదలుగా ఈశాన్యాది ఎనిమిది మంది దేవతలు ఆవాసులై యున్నారు. మఱియు కుడి చెవి యందు తీర్థములకు అభి మానులైన గంగాది తీర్థములకు తీర్థాభి మాని దేవతలు కుడి చెవి యందున్నారు. ఈ తీర్థాభి మానుల అంతర్యామి యైన వాడై తన అంగుష్ఠము నందు పుట్టిన గంగానదికి జనకుడైన త్రివిక్రమ దేవుడు ప్రకాశించు చున్నాడు. ఈ విధముగా అనుసంధానము చేసి కుడి చెవి తాకిన జనులను త్రివిక్రమ దేవుడు నిర్దోషులుగా శుచి వంతులుగా చేయగలడు.

మూ. చిత్త జేంద్రరు మన దొళిప్పరు
కృత్తి వాసను అహంకారది
చిత్త చేతన మానిగళు విహగేంద్ర ఫణిపరొళు।
నిత్యదలి నెలె గొండు హత్తాం
బత్తు మొగ తైజసను స్వప్నా
వస్థె యైదిసి జీవరను ప్రవివిక్త భుకువెనిప॥ 13

తే.గీ. మదన దేవేంద్రులిర్వురు మదివసింత్రు
హరుఁడహంకారమందున నలరు చిత్త
చేతన సుమానులైన పక్షి ప్రభుండు
ఫణివరేణ్యుఁడు వీరిలోఁ బ్రబలుచుండు.

క॥ పందొమ్మిది మొగములతో
సుందరుడగు తైజసుండు శుభదుడు స్వప్నం
బొందించి జీవులకుఁ దా
నొందుం బ్రవివిక్తభుకు సముజ్జ్వలి తాఖ్యన్

తా॥ మనో వృత్తులైదు. వీని యందు మన్మథుడు ఇంద్రుడు వీరిద్దరున్నారు. అహంకార వృత్తి యందు రుద్రుడభిమాని. చిత్త సాంకేతమైన వృత్తికి గరుడుడును బుద్ధికి శేషుడును ఈ విధముగా అయిదు మంది అభిమానులు. ఈ అభిమాన దేవతల యందు విశ్వనామక పరమాత్ముని వలె పందొమ్మిది ముఖములు గల తైజసుడను పరమాత్ముడు స్త్రీల యందు స్త్రీ రూపము తోను పురుషుల యందు పురుష రూపముతోను యెప్పుడు ఆశ్రయుడై వాడై విశ్వనామకుని అధీన మందు జాగ్రద వస్థతో నుండ దగిన స్థూ

దేహము నందున్న జీవుని ప్రకాశము విశ్వనామకుని ద్వార తైజసుని అధీనమును పొందిన తరువాత ఈ తైజసుడు మనో వృత్తుల కభిమానులైన దేవతల ద్వార స్వప్నా వస్థను బొందించి యేయే దేహముల యందు స్వప్న ప్రదుడై యున్నాడో ఆయా జీవులను మఱియు మనో వృత్తులకు అభిమానులైన దేవతలను అట్లే తన వశమందుండు ఇతర తత్త్వాధి మాని దేవతలను జీవులను స్వప్న మందు ప్రకర్షచే వేర్వేరుగా నుండ దగిన స్వప్న పదార్థములను స్వప్నాంత మందు భుజించును. అనగా ఉదర మందు ధరించు వాడగును. (స్వప్న మందలి జడ పదార్థములు మనో పాదానముచే నిర్మితమైన అనిర్మితమైన ఘట పటాదులను ఘట మనియు పటమును పటమనియు తెలియునటు వంటి జ్ఞానము జాగ్రత్కాలపు వాసనాజ్ఞానము. స్వప్నము నందలి ఘట పటాదుల నాశన మొందించి ఉపాదానమైన మనస్సు నందులయమును పొందించును. తన వశ మందున్న దేహము నందలి జీవుల యొక్క ప్రకాశము తాత్త్విక దేవతల భోజన రూపముతో తన ఉదర మందు లయమును పొందించును.)

ఈ ప్రకారముతో ప్రవివిక్తభుకువను నామాంతరముతో తైజసుడన బడును. లింగ దేహము నందలి అణు స్వరూపియైన జీవుని కాదు అని అర్థము.

మూ. జ్ఞానమయ తైజసను హృదయ
స్థానవైదిసి ప్రాజ్ఞనెంబభి
ధానదిం కరెసుత్త చిత్సుఖ వ్యక్తియనె కొడుత॥
ఆనతేష్ట ప్రదను అనుసం
ధానవీయదె సుప్తియైదిసి
తానెపునరపి స్వప్న జాగ్రతియీవ చేతనకె॥ 14

ఉ॥ జ్ఞానమయుండు తైజసుఁడు స్వాంతము నందునఁ బ్రాజ్ఞనాముడై
తానటు పిల్వఁగాఁ బడుచుఁ దద్దయుఁ జిత్సుఖ వృత్తి నిచ్చుచున్
ఆనత సౌఖ్య దుండు సుఖ మందలి జ్ఞాన మొసంగ లేక ని
ద్రాణత స్వప్న జాగ్రతల రక్తి నొసంగుఁను చేతనాలికిన్!

తా॥ సర్వప్రాణులకు స్వప్నకాల మందు బాహ్యేంద్రి యజ్ఞానముచే శూన్యమైన మనోజ్ఞానమే ప్రచురముగా నుండును. ఇటువంటి జ్ఞానముతో కూడిన జీవుని యొక్క వ్యాప్తిని దేవతలను మ్రింగిన వాడై ఉదరము నందుంచు కొని

రజోగుణమందలి తైజసుడను వాడు హృదయ స్థానమందలి తమో గుణాంతర్గతుడైన ప్రాజ్ఞుడను వాని వశ ముందుండునట్లు చేయును. అప్పు డాను ప్రాజ్ఞుడను వానియందు ఏకీభవించును. తరువాత జ్ఞాన భక్తి వైరాగ్యములతో వందనము చేయదగిన భక్తులకు ఇష్టుడను నామమును బొందిన వాడు ప్రాజ్ఞుడను పరమాత్ముడు. జీవుని స్వరూప సుఖమునకు సమానమైన సుఖమును పొందించును. ఆ నిద్రాకాల మందు నిద్రా సుఖ మిటువంటిది అనుసంధానము చేయదగిన జ్ఞానము నొసగక ఈ నిద్రను బొందించి సుషుప్తి పొందిన జీవులకు మరల మరల తైజస మూర్తి యైన పరమాత్మను ప్రాజ్ఞుడను వాని వదలి జీవుని వ్యాప్తిని గ్రహించి కంఠస్థానమును చేర్చి స్వప్నకార్యములను నడిపించును. తైజసుని కూడ చేరి యున్న విశ్వనాముడు జీవుని వ్యాప్తిని గ్రహించి దక్షిణ నేత్ర ముఖస్థానమునకు వచ్చి జీవుని వ్యాప్తిని స్థూల దేహము నందలి ఇంద్రియముల యందు చేర్చు వాడగును. జాగ్ర దవస్థను ఇచ్చువాడగును.

మూ. నాలిగెయొళిహ వరుణ మత్స్యను
నాలిగెయొళు ఉపేంద్రరింద్రను
తాలు పర్జన్యాఖ్య సూర్యను అర్ధగర్భ నిహ।
ఆలెయొళు వామనసుభామన
ఫాలదొళు శివకేశవను సుక
పోలదొళగె రతీశకామను అల్లెప్రద్యుమ్న॥ 15

చ॥ వరుణుఁడు నాల్కయందలర వానిమనంబున మత్స్యరూపియున్
జిలుతగునాల్క యింద్రుడు వసించును పేంద్రుడు నుండు తాలువం
దరయఁగ తోయదాభిధుఁడ హర్పతి రాజిలు నర్ధగర్భుఁడన్
హంయును వాక్కవాటమున యందు సుభామనుఁడుండు వానిలోన్

క॥ వామనుఁడుండును ఫాలము
లోమెలగు శివుందు వానిలోఁ గేశవుఁడున్
ఆమేయుఁ గపోలముల రతి
స్వామియుఁ దానుండు నచటఁ బ్రద్యుమ్నుండున్.

తా॥ నోటియందలి నాలుకయందు వరుణదేవుదున్నాడు. ఈ వరుణుని అంతర్యామియైమత్స్య రూపి పరమాత్ముడున్నాడు. చివునాలుక యందు

ఇంద్రుడున్నాడు. వీని అంతర్గతుడై ఉపేంద్రుడున్నాడు. దవడలకు చేరిన కీళ్ళ యందు పర్జన్యుడను సూర్యుడున్నాడు. ఇతని యందు అర్థ గర్భుడను పరమాత్ముడున్నాడు. వాక్ ద్వార మందు సుభా మనుడను వామనుడున్నాడు. ఫాల స్థలము నందు రుద్రుడున్నాడు. అతని అంతర్యామియై కేశవుడున్నాడు. రెండు దవడల యందును మన్మథుడున్నాడు. ఇతని అంతర్యామియై ప్రద్యుమ్నుడున్నాడు. భోజనాదులు మాటలు వీరి సహాయముచే వారి అంతర్యామి యైన పరమాత్ముని యొక్క సహాయముచే జరుగ గలదు.

మూ. రోమగళలి వసంత త్రికకు
ద్ధామ ముఖదొళ గగ్ని భార్గవ
తామరసభవ వాసుదేవరు మస్తకదొళిహరు।
ఈమనదొళిహ విష్ణు శిఖదొళు
మామహేశ్వర నారసింహ
స్వామి తన్ననుదినది నెనెవరపమృత్యు పరిహరిప॥ 16

సీ॥ రోమంబు నందున రూఢి వసంతుఁడు
తనరు వ్యానింద్రియా ధాముఁడలరు
నగ్ని ముఖంబున నతనిలో భార్గవుఁ
డలరు శిరంబున నబ్జభవుఁడు
వానిలో వెల్గొందు వాసుదేవుండుతా
నీమదిలో నహంకృతి సమాఖ్య
ప్రాణుండునా ప్రాణు నందు విష్ణుండును
సిగయందు వెలుఁగు నా శివుఁడు శివుని

ఆ.వె. యందు నారసింహుఁ డనుదినంబు వసించు
భక్తిమీఱఁ దలఁచు భక్తజనుల
నరసికాచు వారి యపమృత్యువును ద్రుంచి
శ్రీరమాధవుండు చిత్తమలర

తా॥ దేహము నందరి రోమముల యందు వృష భస్కంధమువలె శ్రేష్ఠమైన శ్వేత ద్వీపాదులే ఆలయముగా గల త్రిక కుద్ధాముడను భగవంతుడున్నాడు. రెండు పెదవులకు మధ్యగల ముఖస్థానమందు అగ్ని దేవుఁడున్నాడు. ఇతని

అంతర్యామి యై పరుశు రాముదున్నాడు. శిరస్సు నందు బ్రహ్మ దేవుదున్నాడు. బ్రహ్మ యందు అంతర్యామియై వాసుదేవుదున్నాడు. ఈ దేహమందు అహంకారిక ప్రాణుదున్నాడు. ఇతని అంతర్యామియై విష్ణువున్నాడు. శిరస్సులోని వెంద్రుకల యందు పార్వతీ పతియైన రుద్రుదున్నాడు. ఇతని అంతర్యామియై నరసింహుదున్నాడు. ఈ ప్రకారముగా తన దేహము నందును తాను పూజ చేయు ప్రతిమ యందును ఆయా స్థలముల యందుండు పరమాత్మని అనుసంధానము సేయ వలయును. ఈ నరసింహుదు ప్రతి దినము తన్ను స్మరించు భక్తుల యొక్క అప మృత్యువును తొలగించును.

మూ. మౌళి యొళిహ వాసుదేవను
ఏళధికనవ జాతిరూపవ
తాళి ముఖదొళు నయన శ్రవణాద్యవయవ గళల్లి
ఆళరసు తానాగి సతత సు
లీలెగైయుత లిప్ప సుఖమయ
కేళికేళిసి నోడి నోడిసి నుడిదు నుడిసువను॥ 17

ఆ.వె. శిరమునందు వెల్గు శ్రీవాసుదేవుందు
తొంబదేడు కళలతోఁ జెలంగి
యాస్య నయన శ్రవణ మాద్యవయవముల
కధిపుఁ డగుచు భృత్యుఁ డగుచుఁ దాను.

క॥ నిరతము క్రీడించుచు సుఖ
భరితుఁడు విని వినఁగఁజేయుఁ బలుకుఁ బలుకఁగా
మఱికని కనిపిం పంగా
వరదుఁడు రక్షించుఁ బ్రాణి వర్గములనొగిన్.

తా॥ శిరస్సునందుండ దగిన వాసు దేవుదు తొంబది యేదు రూపములలో వెలుగొందును. ఇవి అంశరూపములు. అజాది యేబది యొక్క రూపములు మాతృకాన్యాసము రీతిగా దేహము నందున్నది. చతుర్వింశతి తత్వాభిమాన దేవతల యందు కేశవాది ఇరువది నాల్గు రూపములు, శక్త్యాది ఇంద్రియముల యందలి భగవద్రూపములు పంద్రెండు, మత్స్యాది దశ రూపములు చేరి మొత్తము తొంబది యేడగును. వాని వాని కార్యములు వేర్వేరు. ఏ రూపము అంశములో దానిని వెనుక చెప్ప లేదు. వానిని చెప్పుట కొఱకు

మరల నిచట యీవిధముగా చెప్పుచున్నారు. ఆ తొంబది యేదు రూపములు అంశ విశేషముచే ధరించి అజాది రూపములు శిరము ముఖాదిగా మాతృకాన్యాసము రీతిగా చెప్పబడిన అవయవస్థానము లందు నయనము శ్రవణము మొదలగు ఇంద్రియము లందు పూర్వోక్త ప్రకారముగా మత్స్యాది రూపములతో నున్నాడు. హృదయాకాశము నందు బింబ రూపుడై పిలువ బడు వాడైనను ఇంద్రియముల యందు కార్యము సేయ దగిన భృత్యుడును తానే యగుచు ఎల్లప్పుడు వెలుగొందు చున్నాడు. అనగా బింబరూపముచే ప్రభువని పిలువ బడిన భృత్య రూపముతో ఇంద్రియములందున్న రూపములకు ఆజ్ఞ చేయుచో బింబ క్రియలు ప్రతిబింబ క్రియలు రెండును తానే చేయుచో భృత్య రూపముతో తానై వెలుగొందు వాడై యున్నాడు. ఆనంద పరిపూర్ణుడైన పరమాత్ముడు విన దగిన శబ్దముల యందు తన స్వాఖ్య శబ్దముల తన స్వాఖ్య శ్రవణేంద్రియములచే విని జడ శబ్దమును జడ కర్ణము ద్వార జీవ గతమైన తత్త్వాభిమాన దేవతల ద్వార వినిపించి చూచి చూపించి పలికి పలికించి ఈ విధముగా బింబ ప్రతి బింబ క్రియలను చేయుచున్నాడు.

ము. ఎరడధిక వెప్పత్తెనిప సా
విరద నాడిగె ముఖ్యవేకో
త్తరశతగళల్లి హవు నూరాఒందు మూర్తిగళు।
అరితు దేహది కలశ నామక
హరిగె కళెగళివెందు నైరం
తరది పూజిసుతిహరు పరమాదరది భూసురరు॥ 18

తే.గీ. డెబ్బదియు రెండువేల నాడీ సమూహ
మందు ముఖ్యమౌనూ టొక్కటన్ని కళల
నందు నూటొక్క మూర్తులనలరు నటుల
వెలుగు దేహాన శ్రీహరి కలశరూపి
నెఱిగి యర్చింత్రు విప్రులు పరమభక్తి

తా॥ స్థూల దేహ మందలి డెబ్బది రెండు వేల నాడులకు ముఖ్యముగా ప్రధాన నాడులైన నూటొక్క నాడుల యందు నూటొక్క మూర్తులున్నవి. ఈ నూటొక్క రూపము లేవనగా దేవుని పూజకు ఉపయోగముగా నుండదగిన కలశ మందుగల మూర్తులు నూట ఒకటి. దేహమందలి నూటఒక్కనాడుల

యుండు ఒక్కొక్క రూపము మేరకు ఆ రూపములను తెలియవలయును. హృదయము నందలి సుషుమ్నానాడికి మధ్యలో నుండు అష్టదళ కమలములో స్థూల దేహము నందున్న బింబ మూర్తి భిన్న భిన్నములైన భాగ విశేషములను ఆనాడులు ఆ వాస యోగ్యమైన ముఖ్యమైన అధిష్ఠానగుని అర్థము. (శ్రీ హరికి కళలని అనగా నూటొక్కనాడులు బింబ రూపునకు ఆ వాసమునకు యోగ్యమైన ముఖ్యాధిష్ఠానములని అర్థము.) ఈ ప్రకారము కథా విశేషములను తెలిసి ఎల్లప్పుడు బ్రహ్మజ్ఞానులు మిక్కిలి భక్తి విశేషముచే పూజించు చుందురు. భగవంతుని పూజా కలశ మందు ఆవాహన చేయదగిన రూపముల వివరణము.

వి. 1. 51 అక్షర వాచ్యమైన అజాది ఏబది యొక్క భగవద్రూపములు.
2. 24 కేశవాది చతుర్వింశతి భగవన్మూర్తులు.
3. 4 ఆత్మాది నాలుగురూపములు (ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ, జ్ఞానాత్మ.)
4. 4 వాసు దేవాది నాలుగురూపములు (వాసుదేవ-సంకర్షణ- ప్రద్యుమ్న- నారాయణ)
5. 4 విశ్వాది రూపములునాల్గు (విశ్వ - తైజస - ప్రాజ్ఞ - తుర్య)
6. 10 దశావతార భగవద్రూపములు
7. 1 వేదవ్యాసుడు
8. 1 దత్తాత్రేయుడు
9. 1 శింశుమారమూర్తి
10. 1 మూల రూపలక్ష్మీ నారాయణుడు

101 మొత్తము నూట ఒక్క భగవన్మూర్తులు.

మూ. ఇదకె కారణవెని సువుపు ఎర
డధిక దశనాడిగళ ఒళగె సుర
నదియు మొదలాదఖిల తీర్థగళిహవు కరణదరి।
పదుమనాభను కేశవాది
ద్వాదశరూప దలిప్ప నల్లతి
మృదుళవాద సుషుమ్నదొళ గేకాత్మ నెనిసువను॥ 19

శా॥ ఏ తన్నాడులకెల్ల ముఖ్యమగుచున్నింపారు పంద్రెంటిటం
బ్రీతిం జాహ్నవి మున్నుగాc గల నదుల్ శ్రీతీర్థముల్వెల్గు వి

ఖ్యాతం బౌ కరణంబు నందలరు పద్మాక్షుండు తాఁ గేశవుం
డై తన్మధ్య సుషుమ్న యందుఁ బరమాత్మాఖ్యం గృపాపూర్ణుఁడై.

తా॥ ఈ నూటొక్క నాడులకు కారణమైన నాడులు పండ్రెండు. ఈ పండ్రెండు నాడుల యందు గంగాది నదులారంభించి సమస్త తీర్థములు ప్రవహించు చున్నవి. ద్వాదశ నాడులు ఇంద్రియములందున్నవి. అదే విధముగా నదులును ఉన్నవి. అచట కేశవాది భగవద్రూపములు దామోదర రూపము వరకు పండ్రెండు రూపములతో నున్నాడు. అచట ద్వాదశ నాడుల లోపల ఆత్మయను పేరు గల పరమాత్మడు అత్యంత మృదువైన సుషుమ్నానాడి యందు ప్రకాశించు పరమాత్మడు ముఖ్యముగా నిలువబడుచున్నాడు.

| నెం. | నాడుల పేర్లు | నదుల పేర్లు | భగవద్రూపములు | ఇంద్రియములు |
|---|---|---|---|---|
| 1. | ఇడా | మందాకిని | మాధవ | వామనాసాపుటము. |
| 2. | పింగళ | యమున | హరి-కృష్ణ | దక్షిణనాసాపుటము. |
| 3. | మధ్యనాడి | గోమతి | నారాయణ-గోవింద | బ్రహ్మరంధ్రము |
| 4. | శంఖినీ | తపతి | జానకీరామ | లింగము |
| 5. | గాంధారి | కావేరి | కపిలదేవ | దక్షిణ కర్ణము |
| 6. | హస్తినీ | సింధూ | నారాయణ | వామకర్ణము |
| 7. | లంబుసీ | తామ్రపర్ణి | అనంత | దక్షిణ నేత్రము |
| 8. | సరస్వతీ | గండకీ | నారాయణ | జిహ్వ |
| 9. | నందా | కృష్ణవేణి | కృష్ణ | లింగ మూలము |
| 10. | కుహూ | సోమనందిని | దధి వామన | గుదము |
| 11. | పూర్ణా | పయస్విని | వరాహ | వామచక్షువు |
| 12. | వారుణి | గోదావరి | హరి | శిరస్సుపై భాగము. |

మ॥ అప్పనము ప్రతిపాద్య శ్రీప్ర
ద్యుమ్నదేవను దేహదౌశగె ను
షుమ్నదిడా పింగళది విశ్వాది రూపదలి
నిర్మలాత్మను వాణివాయు చ
తుర్ముఖరొళిద్ద ఖిళ జీవర
కర్మగుణవను నరిసి నడెవను విశ్వవ్యాపకను॥ 20

చతురామ్నాయ విశేష
ప్రతి పాద్యుండైన యట్టి ప్రద్యుమ్నుండా
తత దేహమున సుషుమ్నా
ది తదీయ సునాదులందుఁదేజోమయుఁడై

తే.గీ. నిర్మలాత్ముడు హరియు వాణియును వాయు
పంబుజోద్భవుడాది జీవాలి యందు
నలరి కర్మ గుణాదుల ననుసరించి
నడపు విశ్వ వ్యాపకుడయి నడచుచుండి.

తా॥ వేద ప్రతి పాద్యుడును క్రీడాది గుణ విశిష్టుడునైన ప్రద్యుమ్నుడు ఈ స్థూ దేహము నందు ప్రకాశించు చున్న సుషుమ్నా నాడి యందు చతుర్ము బ్రహ్మ దేవుడు. అతని అంతర్యామియైన విశ్వరూపి పరమాత్ముడు సత్వ గు ప్రచురుడు. ఇడా నాడి యందు వాయు దేవుడు. ఇతని అంతర్యా రజోగుణ ప్రచురుడైన తైజసుడు. పింగళానాడియందు సరస్వతీ దే అంతర్యామియైనవాడు తమోగుణ ప్రచురుడైన ప్రాజ్ఞుడను పరమాత్ము ఈ విశ్వాది రూపములతో నిర్దోషమైన శరీరము గల ఆత్మ రూపియై బింబ రూపి పరమాత్ముడు దేవతలకు అంతర్యామియై యుండి సమస్తమై త్రివిధ జీవుల స్వరూప స్వభావ గుణములను అనుసరించిన బాహ్య గుణమును ఈ రెండును అనాది కర్మము ననుసరించి ఆగామి సంచి కర్మల ననుసరించిన జన్మము నందును రాదగిన జన్మము నందును నాడు యందలి విశ్వాది రూపములతో సత్వాది గుణముల కర్మమును ఇంద్రియము లందుండి ప్రేరేపించుచు ఆయా కర్మలకు తగినట్లు బింబ రూపియై దేవుడు నడిపించు చుందును.

మూ. అబ్దయన ఋతు మాస పక్షను
శబ్దదిందలి కరిసుతలి నీ
లాబ్దవర్ణనిరుద్ధ మొదలాదైదు రూపదలి।
హబ్బిహను సర్వత్రదలి కరు
ణాబ్ధి నాల్వత్తైదు రూపది
లభ్యనాగువనీ పరియ ధేనిసువ భకుతరిగె॥

21

శ్రీ అబ్దాయనాది సకల సు
శబ్దంబులఁ బిలువఁబడుచు శారదవర నీ
లాబ్ద సువర్ణుఁడు సత్కరు
ణాబ్ధి నలువదైదు రూపులందుంగాంచున్.

మ॥ అనిరుద్ధాదిగఁ బంచరూపకుఁడునై యబ్దాయ నాదిందగున్
ఘనశబ్దంబుల నెన్నగాఁబడుచు లోకవ్యాప్తుఁడై నీలమే
ఘ నిభుండైన సరోజలోచనుఁడు సత్కారుణ్యరూపుండు ద
ర్శన మిచ్చుందగ నాల్గుపైనయిదు పూర్ణంబైన రూపంబులన్. 4

వా॥ కాలాం తర్గతుడైన భగవంతుని నలువది యైదు భగవద్రూపములను బింబరూపుని యందు ఎల్లప్పుడు మఱువక ఐక్య చింతనము సేయుచు బింబో పాసనము సేయ దగిన భక్తులకు ఆ దేవుడు లభ్యమగు వాడగును. దీని వలన ఆయువు సార్థక మగును. అందువలన ఈ క్రమమును చక్కగా తెలియ వలయును.

వివరణము:

1. అబ్దము దీని కని రుద్ధుడు
2. అయనము - ఉత్తరాయణము - దక్షిణాయణము వీనికి ప్రద్యుమ్న రూపములు.
3. ఋతువు - రెండు నెలల కొక ఋతువు. దీనికి సంకర్షణ రూపములు.
4. మాసము - పంద్రెండు మాసములు. దీనికి వాసుదేవ రూపములు.
5. పక్షము - ఇరువదినాలుగు ఒకసంవత్సరమునకు దీనికి నారాయణ రూపములు

45 మొత్తము.

మూ. ఐదు రూపాత్మకను ఇప్ప
త్తైదు రూపదలిప్ప మత్తది
నైదు తిథి యిప్పత్తు నాలకరింద పెచ్చిసలు।
ఐదుపదు అరపత్తధిక ఆ
రైదు దివసాహ్వయదొళగె మన
తోయిదపగె తాపత్రయద మహదోష. వెల్లిహవు॥ 22

ఉ॥ ఐదగు రూపము ల్వేలయు నాహరి యిర్వది యైదు రూపులన్
మోదము నన్వెలుంగు మఱి ముప్పదులుం బదిపైన యర్వదా

మేదురమౌ దినాహ్వాయుని మేల్మి మనంబున నెంచ వారల్నే
మేదినిలోఁ ద్రితాపములు మించిదహింపఁగఁ జేయఁ గల్గునే?

తా॥ అనిరుద్ధాది అయిదు రూపములు ఒక్కొక్క రూపమునకు రూపము
అయిదు. మొత్తము ఆరు. ప్రతి రూపమునకు ఈ ప్రకారము ఒక్కొక్క
దానికి అయిదు రూపములు మేరకు లెక్కించినచో ఇరువది యైదు
మొత్తము ముప్పది. ప్రతి తిథి యందును ఒక్కొక్క రూపము మేర
ముప్పది దినములకు ముప్పది రూపములతో నున్నాడు. ఈ రెండు
పక్షములకు నారాయణ రూపమని చెప్పి యుండుటచే ఆ నారాయణ
రూపమే పక్ష సంఖ్యను ఇరువది నాల్గుచే గుణింపగా ఒక సంవత్సరమున
ఇరువది నాల్గు పక్షము లగును. శాస్త్రి మర్యాద ననుసరించి దశమున
పదియనియు, నూరనియు, సహస్రమనియు పూర్ణమనియు ఈ ప్రకారము
నుండును. అందువలన రెండు పక్షములకగు దినములను ముప్పదిని మున్నూరు
తెలిసి దానికి అరువది అధికముగా గ్రహించి మొత్తము మున్నూట అరువది
దినములు సంవత్సరమున కగును. పక్షమునకు నారాయణుడనుటచే ఆ
నారాయణుని ప్రతి తిథి యందును ఒక్కొక్క రూపము మేరకు 360
రూపములను తెలియ వలయును. మొత్తముపై ప్రతి మాస మందు
ముప్పది తిథులకు రూపమొకటి. అట్లే నారాయణ రూపము ఒకటి. ఈ
ఉభయ రూపములను తెలియ వలయును. ఈ దిన సంకేతుడైన కాలాం
తర్గతుడైన పరమాత్ముడను ఉదకము నందు మనస్సును బాగుగా నిలిపిన
వారికి దారిద్ర్య దోషము రోగాది ఉప ద్రవము మనోరోగము ఈ తాపత్రయము
పూర్వ జన్మ మందు చేసిన మహా దోషముల లేపమగు నదియు కాకుండ
అట్టి అధికారికి సుఖా పేక్ష లేకుండును గాన దారిద్ర్య దుఃఖము లేదు.
నిస్సంగుడై యుండు వాడగుట వలన మనోవ్యాకులమును లేదు. పాపముచే
రోగ ప్రాప్తి నిచ్చు. కర్మములను భగవ దర్పితము చేయును. అందు వలన
పాప లేపము లేని వాడగును.

మూ. దివసయామ ముహూర్త ఘటికా
ద్యవయవగళొళగిద్దు గంగా
ప్రవాహదందది కాలనామక ప్రవహిసుతలిప్ప।
ఇవనగుణరూప క్రియంగళ
నివహదొళు ముళుగ్యాడుతలి భా
ర్గవి సదానందాత్మ ళాగిహ ళెల్లకాలదలి॥

23

మూ. వేద తతిగళమాని లక్ష్మీధ
రాధరన గుణరూపక్రియగళ
ఆది మధ్యాంతవను కాణదె మనది యోచిసుత॥
ఆదపెనె ఈ తనిగె పత్ని కృ
పోదధియు స్వీకరిసిదను లో
కాధిపను భిక్షుకన మనెయౌతణవ కొంబంతె॥ 24

సీ॥ దివస యామ ముహూర్త లవ ఘటి కాద్యవ
యవములలోనుండి హరియుగంగ
వారి ప్రవాహము తీరున గాల నా
మకుడయి ప్రవహించు సకలమందు
నీతని గుణరూప కాత్రియాదుల
నివహంబులందు మునింగి తేలి
యాడుచు భార్గవి యను దినంబును సదా
నందాత్మయై యుండు సుందరాంగి

తే.గీ. వేదమాని ధరాదుర్గ విమల సుగుణ
రూప సత్క్రి యలందు ని రూఢ బుద్ధి
నాది మధ్యాంతములఁ దెలియంగ లేక
తలఁచు నాసతిఁ బత్నిగాఁ దాగ్రహించె.

తా॥ రాత్రింబవళ్ళు చేరినది ఒక దినము. ఈ దినమునకు యామములు ఎనిమిది. రెండు గడియల కాక ముహూర్తము. దినమున కరువది ఘడియలు. అరువది విఘడి యలొక ఘడియ. ఆది శబ్దము చేత క్షణములు నిమిషములు గ్రాహ్యములు. యామాది కాలము లందు పరమాత్ముడు ఆయా కాలనామకుడై కాలాంతర్గతుడై కాలాకారములో నుండి గంగానది యందు నీరు ప్రవహించునట్లు ప్రవహించు చుండును. ఈ కాల నామకుడైన పరమాత్మని లక్ష్మీదేవి గుణముల యందు అసమురాలైన కారణముచే దేశ కాలాతీతుడైన పరమాత్మని గుణములను రూపములను క్రియలనన్నిటిని అపరిచ్ఛిన్నములు అంతము లేని వని భావించుచు ఆభావనలో మునిగి నదై అంతము తెలియక మనో యింద్రియములచే సంచారము చేయుచు సదా నందాత్మరాలై అవియోగినియై అసమురాలై పరమాత్మని వలె అనంతా నంత కాలమునకు తానొక్కటియై పరమాత్మని అధీనురాలై యుండును.

గుణ పూర్ణుడైన నారాయణునకు పత్నియైన అనంత వేద సమూహమునకు అభిమానియైన వరాహరూపుడైన పరమాత్మని గుణాకార క్రియలను మనస్సు నందా లోచించుచు పరమాత్మునకు నేను పత్ని యగు దునా యని యోచించు చుండును. ఏలయనగా పరమాత్ముడు తన స్త్రీ రూపము చేతను తన పురుష రూపము చేతను స్వరమణుడై పరిపూర్ణమైన ఆనందముతో నుండు వాడగును. ఇట్టి పరమాత్మునకు పత్ని యగుటకు తనకు యోగ్యత చాలక యున్నను ఆ భగవంతుడు లక్ష్మీదేవిని పత్నిగా నెట్లు స్వీకరించి నాడనగా అతడు కృపా సముద్రుడు. లోకేశ్వరుడైన వాడు కేవలము బీద వాడైన భిక్షుకుని యింటి యందు భోజనమును స్వీకరించినట్లు లక్ష్మీదేవి యందు మహానుగ్రహమును చేసి పత్నిగా స్వీకరించెను. లక్ష్మీదేవి వలన పరమాత్మునకు కావలసిన దేమియులేదు. అతని స్వరమణ రూపమును చూచినపుడంతయు ఇదే ప్రకారముగా ఆలోచించును.

మూ. కోవిదరు చిత్తైసువదు శ్రీ
దేవియొళగిహ నిఖిలగుణ తృణ
జీవరలి కల్పిసి యుకుతియలి మత్తుక్రమదింద।
దేవదేవకి యిప్పళెందరి
దా విరించన జనని యీతన
ఆవకాలద లరియళంతవ నరరపాడేను॥ 26

మ॥ వినుడీ కోవిదు లార శ్రీరమణిలో వెల్గొందు నుత్కృష్టమౌ
గొనముల్ శ్రీహరి సద్గుణంబులకు దక్కుంగాని తత్సాటి యే
వనజాతాసను మాతయై వెలయు నీ పద్మాక్షి లెక్కింపగా
వనజా తాక్షుని చాలదన్న నరులున్ పర్ణింపగా శక్యులే?

తా॥ జ్ఞానులైన వారు యుక్తితో ఒప్పదగిన దృష్టాంతమును మనసుకు తెచ్చుకొన వలయును. లక్ష్మీదేవి యందుండ దగిన అన్ని గుణములు పరమాత్ముని గుణములు ఈ రెండిటికి తారతమ్యమును దృష్టాంతముతో చూచినచో అంత్య జీవులైన తృణ జీవులందు ఉండదగిన గుణములకు ఎంత తారతమ్యమున్నదో అంతటి తారతమ్యము లక్ష్మీనారాయణులకున్నది. ఇదియును జౌప చారికమే. రమాదేవికి తృణజీవి యెట్లో అట్లు పరమాత్మునితో నగును. బ్రహ్మదేవుని కంటె లక్ష్మీదేవి ఎంతో ఉత్తమోత్తమురాలు. ఈమె కంటె నారయణుడెంతో ఉత్తమోత్తముడు. ఈ ప్రకారము గుణ తార తమ్యమును

తెలియ వలయును. తన పతియైన పరమాత్ముని గుణ రూప క్రియలను లక్ష్మీదేవి తెలియుట లేదు. అని అపౌరుషేయములైన వేదములు ఘోషించుచున్నవి. ఇట్లుండ మనుష్యుల కెట్లు శక్యము?

షూ. క్షీరదధి నవనీత ఘృతదొళు
సౌరభ రసాహ్వాయనెనిసి శాం
తీరమణ జ్ఞాన క్రియేచ్ఛా శక్తి యెందెంబ।
రంరెరడు నామదలి కరిసువ
భారతీవాగ్దేవి వాయు స
రోరుహాసనరల్లి నెలసిహరెల్ల కాలదలి॥ 26

తే.గీ. క్షీరదధి నవనీత సుఘృతములందు
సౌరభ రసాహ్వయుండన శాంతిపతియు
జ్ఞాన సత్క్రియేచ్ఛాశక్తు లౌనసంగ
పేళ్ళ నాల్గింటిచేతను బిలువఁబడును.

క॥ ఆయాస్థానంబులతో
వాయుసతియు వాణి వాయు వనజాసనులున్
శ్రేయంబున వసియింతురు
న్యాయంబిది తెలియవలయు నచ్ఛపుబుద్ధిన్.

తా॥ సర్వశక్తిగల పరమాత్ముడు జీవుని స్వరూప యోగ్యతల ననుసరించి ప్రత్యక్షుడగును. శాంతీ రమణుడైన అనిరుద్ధుడు వాసనా రూపమైన జ్ఞానులు స్వీకారము సేయ దగిన సర్వ శ్రేష్ఠమైన రస మగుటచే రస నామముతో రస మనబడి జీవుల జ్ఞాన క్రియేచ్ఛాశక్తులను నాలుగు నామముల యందు తదంత ర్యామియైన వాడై పిలువ బడుచున్నాడు. భారతీ దేవి జ్ఞాన మందును సరస్వతీ దేవి ఇచ్ఛ యందును వాయుదేవుడు క్రియ యందును బ్రహ్మదేవుడు శక్తి యందును ఈ నాల్గింటి యందును లింగ దేహము భంగ మగునంత వఱకును సర్వకాల మందును ఆవాసులై యుందురు. ప్రత్యక్షమైన క్షీరాదు లందు క్రమాలంకారముతో నీ దేవతలు నల్వురు వీరి అంతర్యామియైన అని రుద్ధాది నాల్గు రూపములతో రస రూపముల యందు రసమై భగవంతుడున్నాడు. ఘృతమును భుజించి సుఖమును పొందినట్లు ప్రత్యక్షుడైన పరమాత్ముని సర్వదా ఉపాసము చేయుచుండును.

వివరణము:-

1. క్షీరము - క్షీరమునకు సదృశమైనది - క్షీరమునుండి వచ్చినది దధి జ్ఞానము.
2. దధి - దధికి సదృశమైనది - దధినుండి వచ్చినది నవనీతము క్రియ.
3. నవనీతము - నవనీతమునకు సదృశమైనది - నవనీతము నుండి వచ్చినది ఘృతము - ఇచ్ఛ.
4. ఘృతము - ఘృతమునకు సదృశమైనది - ఘృతము నుండి వచ్చునది భోజన సుఖము - శక్తి.

క్షీరమనునది గోస్తనముల నుండి పిదుక వలయును. మొత్తము ఈ అయిదింటికి వివరణము. క్షీర మందుండ దగినది ఘృతము. దానికి పైన ఏవియు లేదు.

ఆ ఘృతమును భుజించినచో సుఖము కలుగును.

ఆ ఘృతమును భుజించినచో సుఖము కలుగును జ్ఞానము ఈ ప్రకారముగా

1. గోస్తనముల నుండి క్షీరమును పిదుక వలయును జ్ఞానము ఈ ప్రకారముగా పిదుకుట యనునది. గురువుల సేవించి వారి ముఖము నుండి జ్ఞానోప దేశ మను పాలను పిదికి తీసుకొనుట.
2. ఆ క్షీరమును కాచి చేమురు పెట్టినచో దధి యగును. ఇది యే క్రియ. జ్ఞానమను పాలను మనన రూపముతో కాచి పరమాత్ముని గుణ విచార మను దధిచే చేమురు పెట్టిన జ్ఞానమను పాలను ధారుఢ్యము చేయుటయే దృఢమైన జ్ఞానము. ఇది మానస క్రియ.
3. దధిని మథనము చేసినచో వెన్నయగును. ఇచ్ఛ దధి సదృశమైన దృఢ జ్ఞానమగు మథన మనగా వాసనా ప్రతీకను హృదయ మందు నిలిపి ఇచ్ఛ వచ్చినట్లు ఉపాసనారూపమైన మథనము చేసినచో దధి యందు నవనీతమును పొందినట్లు దృఢ జ్ఞాన మను దధిచే నవనీత సదృశమైన వాసనా రూపమైన ప్రత్యక్షమగును. ఇది మానస రూపమైన ఇచ్ఛ.
4. వెన్నను కరిగించినచో నేయి లభించును శక్తి వెన్నను కరిగించుటకు సమానమైన వాసనా ప్రతీకను ఉపాసనము చేయుచు వచ్చినచో ఆ ప్రతీక అదృశ్యమై ఘృత సదృశమైన పరమాత్ముడు ప్రత్యక్ష మగును.

మూ. వసుగళెంటు నవప్రజేశరు
శ్వసనగణదైవత్తు ఏకా
దశదివాకర రినితు రుద్రరు అశ్వినిగళెరడు।
దశవిహీనశతాఖ్య ఈసుమ
నసరొళగె చతురాత్మ నీయా
మిసువ బ్రహ్మసమీర ఖగ ఫణీపేంద్ర రొళగిద్దు॥ 27

తే.గీ. వసువులెన్మిదిమంది నవప్రజేశు
లేబదైన మరుత్తులు నేకమధిక
మైనదశ సూర్యరుద్రులు నశ్వినులును
దొంబదగు తత్త్వదేవత ల్దోరముగను.

క॥ ఈ తత్త్వదేవతలలో
ఖ్యాతిం జతుర్మాత్మకుండు హరినియమించుం
బ్రీతి న్వెలుగొందుచుఁ గం
జాతాసన వాయుగరుడ సర్వాధిపులన్.

తా॥ అగ్ని మొదలుగా గల అష్ట వసువులు దక్షాదినవ ప్రజా పతులు ఉరు క్రమ నామక సూర్యుడు సాక్షాత్పరమాత్మని వదలి వివస్వాది సూర్యులు పదునొకండు మంది అట్లే ఏకాదశ రుద్రులు ఏబది మంది మరుత్తులు అశ్వినీ దేవతలు వీరందరు తొంబది మంది యగుదురు. వీరు తత్త్వాభిమానులని ప్రసిద్ధులు. బ్రహ్మ దేవుడు మొదటి కక్ష లోనివాడు. ఈ తొంబది మంది తత్త్వాభిమానులందు అంత్య కక్షలోని వారు. వారి కంటె అన్యులు కర్మజ దేవతలు. ఆజానాజులు అని పిలువ బడుదురు. పక్షి శ్రేష్ఠుడైన గరుడ దేవుడు సర్ప శ్రేష్ఠుడైన శేష దేవుడు ఆ గరుడ శేషాదుల యందు బ్రహ్మ వాయువులు నియామకులై యుండి ఈ స్థూల దేహమందు ఈ తత్త్వ దేవతల యందు తదన్యులైన దేవ గంధర్వుల వఱకు గల దేవతల యందును జ్ఞాన ఇచ్ఛ క్రియా శక్తుల యందును అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ వాసు దేవ ఈ నాల్గు రూపములతో కూడిన వాడై పరమాత్ముడు జ్ఞాన ఇచ్ఛాదులను ప్రేరణ చేయు వాడై యున్నాడు.

మూ. తోరు తిప్పను చక్రదలి హిం
కారనామక శంఖదలి ప్రతి
హార గదెయలి నిధన పద్మదలిప్ప ప్రస్తావ
కారుణిక నుద్గీథ నామది
మారమణ నైరూపగళ శం
ఖారి మొదలాదా యుధగళొళు స్మరిసి ధరిసుతిరు॥ 28

హింకార నామకుండగు
క॥ ౦కజ పతి చక్రమందు ప్రతి హోరుండౌ
నంకిలి శంఖమునందునఁ
బంకజమున నొప్పుమందు ప్రస్తావుండై.

క॥ గదయందు నిధననాముఁడు
సదయుందుద్గీథనామ సార్థకుఁడౌ భ
ద్రదమైన యాయుధంబులు
మదిలోస్మరి యించి డాల్పుమా పంచకమున్.

తా॥ చక్రము నందు హింకార నామకుదును, శంఖము నందు ప్రతి హోరనామకుదును పద్మము నందు ప్రస్తావనామకుదును. గద యందు నిధన నామకుదను పరమాత్ముదు సృష్ట్యాదులకు మూల కారణుడైన నారాయణుదున్నాదు. నారాయణ ముద్ర యందు ఉద్గీథ నామముతో నున్నాదు. లక్ష్మీపతి యైన నారాయణుని అంశరూపములే ఇవి. హింకారాది ఈ అయిదు రూపములను తెలిసి శంఖ చక్రాది పంచ ముద్రలు శ్రీ పరమాత్ముని ఆయుధములు. ఆ ఆ యుధములలో పరమాత్ముని రూపములను స్మరించి ద్వాదశ నామములను ఈ ముద్రలను ధరింపుము.

మూ. తనువెరథ వాగాభిమానియె
గుణవెనిసువళు శ్రోత్రదలిరో
హిణి శశాంకరు పాశపాణిగ ళశ్వవెందెనిసి।
ఇనను సంజ్ఞాదేవియరు ఇహ
రనల లోచన సూతవెనిసువ
ప్రణవపాద్య ప్రాణనామక రథికవెనిసువను॥ 29

శా॥ కాయంబే రథ మా సరస్వతి యు బగ్గం బౌను శ్రోత్రాక్షులన్
శ్రేయో దేవత లైన రోహిణి శశుల్ శ్రీ సూర్య సంజ్ఞా సతీ
తోయం బశ్వము లా లగాము శివుడౌ తోరంబుగా ప్రాణుడే
ధీయుక్తుండగు సూతుఁడౌ రథికుఁడై దీపించు లక్ష్మీశుఁడున్.

తా॥ ఈ స్థూల దేహమే పరమాత్మునకు రథము. దీనిక భిమాని బ్రహ్మ దేవుడు సరస్వతియే గుఱ్ఱములకు గట్టి దగిన పగ్గములు. చెవుల కభిమానులైన చంద్రుడు అతని పత్ని రోహిణి దేవియు నేత్రాభి మానులైన సూర్యుడు సంజ్ఞాదేవి వీరు నల్వురు గుఱ్ఱము లనబడుదురు. గుఱ్ఱములచే ఎట్లు రథము సంచారము చేయునో అట్లు శ్రవణ నేత్రాభిమానులు వినుట దర్శించుట అను క్రియల ద్వార దేహ మందు సంచరించునట్లు సేయుదురు. చేతులక భిమాని యైన దక్షుడు పాశమై గుఱ్ఱములను బంధించు పగ్గమై యున్నాడు. మనోభిమాని యైన రుద్రదేవుడు ఈ గుఱ్ఱములకు వాటిలో బంధించు లగాముగా నున్నాడు. శ్రీ వాయుదేవుడు గుఱ్ఱములను నడిపించు సూతుడని పిలువ బడును. ఓంకార ప్రతి పాద్యుడైన బింబ రూపియైన పరమాత్ముడు దేహ మను రథము నందు అంతర్యామియై ప్రభువని పిలువ బడును.

మూ. అమిత మహిమ నపారగుణగళ
సమిత వర్ణాత్మక శ్రుతిస్మృతి
గమిసపవె తదభిమానిగ ళెందెనిసికొంబ।
కమలసంభవ భవసురేంద్రా
ద్యమర రనుదిన తిళియలరి యురు
స్వమహిమెగ ళాద్యంత మధ్యగ ళరివ సర్వజ్ఞ॥ 30

చ॥ అమితగుణాఢ్యుఁడౌ హరి యనంత గుణంబుల సన్నుతింపగా
నమరునె? వేదశాస్త్రముల నట్టిశ్రుతి స్మృతి మాన్యులైన యా
కమల భవా భవాద్యమర కాంతలకైన నశక్యమౌను శ్రీ
రమణుఁడెఱుంగుఁ దన్మహిమ రమ్యత పారము ముట్టునట్లుగన్.

తా॥ అపార మహిమలు గల పరమాత్ముని అనంత గుణము లను అకారాది ఏబది యొక్క అక్షరములచే ప్రచురమైన అపౌరుషేయమైన వేదములు పౌరుషేయములైన భారతాది పురాణములు చక్కగా తెలుసుకొన జాలవు. ఈ శ్రుతి స్మృతులకు అభిమానులన దగిన బ్రహ్మ రుద్ర ఇంద్రాదులైన వారందరు పరమాత్ముని మహిమలను తెలియ జాలరు. అటువంటి జ్ఞానము రమాబ్రహ్మాదులకే లేదు. తమ తమ యోగ్యతానుసారముగా పరమాత్ముని గుణములను తెలిసి కొనుచున్నారు. పరమాత్ముడు ప్రతి నిత్యము రమా బ్రహ్మాదిగా తృణాంతమైన త్రివిధ జీవుల ఒకే కాలమందు వారి వారి స్వరూప బాహ్య గుణములను

సర్వజ్ఞుడగుటచే తెలిసి యున్నాడు. ఈ రమాబ్రహ్మాదుల ఉత్పత్తి స్థితి లయములు సర్వమును తెలిసికొని యున్నాడు.

మూ. విత్త దేహాగార దారా
పత్య మిత్రాదిగ ళొళగె హరి
ప్రత్యగాత్మను ఎందెనిసి నెలసిప్పనెందరిదు।
నిత్య దలి సంతృప్తి బడి సుత
ఉత్త మాధమ మధ్యమర కృత
కృత్యనాగున్మత్త నాగదె భృత్య నానెందు॥ 31

క॥ ధన దేహాగారంబుల
వని తాపత్యాది మిత్ర వర్గంబుల శౌ
రెని ప్రత్యగాత్మ కుండని
మనమున యోచించి పడయుమా సంతృప్తిన్.

క॥ ఇత్తెఱగునఁ దృప్తుఁడవై
యుత్తమ మధ్యములు నీచులున్మత్తులలో
నుత్తమ కృత కృత్యుఁడవై
మత్తుఁడు గాకుండు మా సుమా భృత్యుఁడవై.

తా॥ ద్రవ్యము తన దేహము తన యిల్లు భార్యా బిడ్డలు స్నేహితులు ఇంకనుని తరులు వీరి యందు వారి వారికి బింబ రూపుడైన పరమాత్ముడు తదాకారముతో ప్రత్యేకమైన తన స్వరూప దేహముతో తదాత్మకుడై ఉన్నాడని పిలువ బడుచున్నాదు. ఈ విషయమును తెలిసిన వాడై ప్రతి దినము ద్రవ్యాదుల రక్షణము గృహమునలంకారము చేయుట దారా పుత్ర స్వజన పర జనులను సంరక్షణము సేయుట వృక్షాదుల సంరక్షణము సేయుట శుద్ధ జడములైన వస్తువులను పరిశుద్ధము సేయుట మొదలగున వన్నియు పరమాత్మని సేవయని తెలిసి తన కంటె జ్ఞానముచే శ్రేష్ఠులైన వారి యందును సమానుల యందును నీచులైన వారి యందును తారతమ్యానుసారముగా నడచుకొని వారియందు హరి ప్రత్యగాత్ముడై ఉన్నాడని తెలుసుకొని అట్టి వారిని బాగుగా అన్న వస్త్రిముల నొసగి పరమాత్ముడు తృప్తి యగు గాక అనుచు వారిని తృప్తి పొందించువు. ధన్యుడ వగుము.

నాకేమియు తక్కువ లేదని అహంకారమును మదమును పొందక యోగ్యుడైన వాడై పరమాత్మునకు భృత్యుడ వగుము.

మూ. దేవదేవేశన సుమూర్తి క
ళేవరగ కొళగనవరత సం
భావిసుత పూజిసుత నోడుత సుఖిసుతిరు బిడదె।
శ్రీవర జగన్నాథ విట్ఠలను
తావొలిదు కారుణ్యదలి . భవ
నోవ పరిహరిసువను ప్రవితత పతితపావనను॥ 32

శా॥ దేవోత్తంసుని దివ్యమూర్తుల మహోత్తేజంబున న్నిచ్చలుం
భావంబందుఁ దలంచి యర్చనల సంభావించుమా వీడకా
శ్రీవక్షుండగు గోపికావరుదు తాఁ జెల్వొందుచుంజీవులం
బోవంద్రోచు భవాగ్నితాపమును సంపూర్ణానురాగంబునన్.

తా॥ రుద్రాదిగా తృణాంత జీవుల వఱకు దేవుడైన ముఖ్య ప్రాణ దేవునకు స్వామియైన పరమాత్ముని అన్నివిధములైన జీవుల యొక్క స్థూల అని రుద్ధ లింగ స్వరూపములనబడు దేహముల యందు ఈ విధముగా ఆ వాసితుడై యున్నాడని నిరంతరమును అనుసంధానముతో చక్కగా భావించుచు వాసనా రూపమైన ఉపాస్య మూర్తిని హృదయాకాశమందు నిలిపి తదంతర్యామియైన పరమాత్ముడున్నాడని తెలిసి పూజా ద్రవ్యములందున్న పరమాత్మునకు ప్రతిమల యందున్న పరమాత్మునకు ఐక్య చింతనముతో పూజ చేయుచు వాసనా ప్రతీకను చూచుచు ఆ ఉపాసనమును వదలక జ్ఞాన భక్తి వైరాగ్యములతో సుఖ వంతుడవై యుండుము. ఇట్లుండినచో శ్రీజగన్నాథ విట్ఠలుదు ప్రతి మాంతర్యామియైన తాను ప్రత్యక్షమైన వాడై మిక్కిలి కరుణతో సంసార మందు రాదగిన అనేక విధములైన దుఃఖములను జననాదులకు కారణమైన లింగ దేహమును రాకుండునట్లు చేసి సుఖము లిచ్చు చుందును. తన స్థాన మందుంచు కొని సుఖము నిచ్చు వాడగును. స్వరూపముతో ముక్తి యోగ్యుడైన జీవుని కర్మముల ననుసరించి పాప కార్యములచే పతితుడైన వానిని పవిత్రుని గావించి మోక్షము నిచ్చువాడగును.

ఇది శ్రీహరికథామృతసారమందు మాతృకాసంధి.

# [illegible]త్తానుదాత్తసంధి (తొమ్మిదవ సంధి)

[illegible] కథామృత సార గురుగళ
[illegible] చిందాపనితు పేళువె
[illegible] భగవద్భక్తరిద నాదరది కేళువదు॥

[illegible] కథా మృత సారము గురువుల దయ
[illegible] వర్ణింతు వాడను బరము భక్త
[illegible] సజ్జను లాదర భావ మొదవ
[illegible] వెలయు భక్తి మీఱగ వీనులలర.

[illegible] వంచాశ ద్వరణ సు
స్వర వుదాత్తా నుదాత్త ప్రచయ
స్వరిత సంధి విసర్గ బిందు గళొళగె తద్వాచ్య।
[illegible] తత్తన్నాను రూపగ
[illegible] [illegible]పాసన గైవరిళెయొళు
[illegible] నరి నర రల్ల అవరాడు వుదె వేదార్థ॥ 1

సీ॥ [illegible] మాత్మ నుతి యించు వర్ణంబు లేబది
సుస్వర యుక్తమై శోభ వెలయు
దా॥ నుదాత్తయు ననుదాత్త యుం ప్రచయంబు
స్వరితయు సంధి విసర్గములును
బిందువు లందున వెన్నుండు తద్వాచ్యు
డై యుండు తత్త న్నమహాభిదలను
తన్నామ రూపంబు లన్నియు జక్కగా
నరసి యుపాసన మాచరించు

ఆ.వె. వట్టి సుజనులవని యందు యోచించిన
[illegible] కాని వారు నరులగుదురె?
వార లా డునట్టి భాషణల్ వేదార్థ
[illegible] గాని భాషల గునె?

[illegible] [illegible] పూర్ణుడైన నారాయణుని నామములే అ, క, మొదలైన [illegible]
[illegible] అనగా ఆయా వర్ణ సాంకేతములచే 'అ' అనగా అజనామము[illegible]

'క' అనగా కపిల నామకుడగును. ఈ రీతిగా అక్షరములన్నియు పరమాత్మని నామములే. ఈ వర్ణములే అనంతమైన వేదములు. అన్నియు పౌరుషేయములు స్వరములు. ఈ వర్ణములు ఉదాత్తాది స్వరములతో కూడి యున్నవి. ఈ స్వరము లన్నియు ఉదాత్తాది స్వరముల యందే అంతర్భూతములు. పౌరుషేయములు అపౌరుషేయములు ప్రాకృతాది భాషలు దాని ననుసరించిన స్వరములు అకారాది వర్ణముల యందు ఉదాత్తాది స్వరముల యందు అంతర్భూతములు. ఉత్తమమైనవి అనుత్తమమైన వని రెండు విధములు. ఎట్లనగా వర్ణ విపర్యాసముతో వర్ణ సమూహములు చేరి దుష్టమైన తిట్లగును. అదే ప్రకారమే స్తోత్రములును అగును. అదే విధముగా ఉదాత్తాది స్వరములు ఏయే స్థానము లందు నీచోచ్చములుగా ఉచ్చరింప వలయునో ఆ విధముగా ఉచ్చరించినచో సుస్వర ములగును. దానికి వ్యతిరిక్తముగా ఉచ్చ స్వర స్థాన మందు నీచస్వరమును నీచస్వర స్థాన మందు ఉచ్చ స్వరమును ఉచ్చరించినచో అదియే అప స్వరమగును. ఈ రీతిగా సుస్వరము అపస్వరము ఉదాత్తాది స్వరముల యందు అనేక విధములై అంతర్భూతములై యున్నవి. స్వరము లెన్ని విధము లనగా! అక్షరములు ఏబదికి పైన ఎట్లు లేవో స్వరములును అదే విధముగా నున్నవి. దాని నామ లక్షణములు వివరణము ముందు చెప్పబడును.

సప్త స్వరముల యందు ఏబది అక్షరములలో ఆయా స్వర వాచ్యుడై తదంతర్గతుడై యుండదగిన పరమాత్మని వాని వాని యందలి ఆయా స్వరాక్షర నామములే అంతర్గతుడైన పరమాత్మని నామములనియు ఆయా స్వరాక్షర రూపములే అంతర్గతుడైన పరమాత్మని ఆకారములనియు తెలిసిన వాడై ప్రతి మాటలను పెట్టుకొని తద్గతమైన పరమాత్మని అనుసంధానము చేసి ఉపాసన చేసినట్లుగా ఎవరు పాసన చేయుదురో అట్టివారు భూమి యందు దేవతలగుదురు. తమ సాధన కొఱకు అవతరించిన వారగుదురు. వారు మానవులు కారు. వారి మాటలే వేదార్థములు. అనుసంధానముతో మాటలాడుట వలన వారి మాటలన్నియు వేదార్థములే.

వి. స్వరముల వివరణము :-

1. ఉదాత్త స్వరము: ఉచ్చస్వరమనగా మిక్కిలి హెచ్చయిన ఉన్నత స్వరము. 2. అనుదాత్త స్వరము: దాని కంటెను కొంచెము తక్కువైన ఉచ్చస్వరము 3. ప్రచయము: ఉచ్చ నీచములు లేని సమానమైన స్వరము. 4. స్వరితము: ఒక అక్షరము దానిననుసరించిన బిందువు సహితమైన అక్షరము. 5. సంధి: అక్షరముల సంధి కాలమందు ఉచ్చరింప దగిన స్వరము. 6. విసర్గము: రెండు బిందువులతో కూడిన వర్ణము యొక్క ఉచ్చారణ స్వరము. 7. బిందువు

అర్ధాక్షర ఉచ్చారణము మఱియు యెడమ భాగ మందు సున్నతో కూడిన ఉచ్చార స్వరము. ఈ రీతిగా తెలుసుకొని భగవంతుని ఉపాసనము చేయు వారే దేవతలని తెలిపి యున్నారు.

మూ. ఈశనరి విజ్ఞాన భగవ
ద్దాసరలి సద్భక్తి విషయ ని
రాశె మిథ్యావాదియలి ప్రద్వేష నిత్యదలి।
ఈ సమస్తప్రాణి గళలి ర
మేశనిహనెందరిదు అవరభి
లాషెగళ పూరయిసువుదె మహయజ్ఞ హరిపూజె॥ 2

మ॥ పరవిజ్ఞానము విష్ణునందు భగవత్పాదాబ్జ సద్దాసులం
భరితంబైన సుభక్తి లోకవిషయ వ్యాపార నైరాశ్యము
ష్కర దుర్వాదుల ద్వేషభావము సమస్తప్రాణి సంఘంబునన్
హరిరాజిల్లు నటుంచెఱుంగుటె మహా యజ్ఞంబదే పూజయౌ

తా॥ ప్రాకృత విషయము లందు భోగేచ్ఛ లేని వాడై త్యాగముతో రహితమైన సత్కర్మ యుక్తుడై నిస్సంగుడై విరక్తుడై భగవద్ద్వేషియైన మాయా వాది యందు అతని శాస్త్రమందు బాగుగా అంత రంగ ద్వేష పూర్వకముగా నుండు వాడై పరమాత్ముని దాసులైన బ్రహ్మాది దేవతల యందు యితరులైన భగవద్భక్తులందు తార తమ్యానుసారముగా నిష్కపటమైన భక్తితో పరమాత్ముని యందును విశేషమైన జ్ఞానము పొంది యుండ వలయును. ప్రతి దినము ఈ సమస్తమైన ప్రాణుల యందు నారాయణుడున్నాడని తెలిసిన వాడై ఉపచారములతో అల్ప పూజ అల్ప సేవల చేతనే సంతోషపడునట్లు చేయుటయే పరమాత్ముని మహా యజ్ఞ మఱియు పూజ యనియు పిలువ బడును. అచల ప్రతిమల కంటె బ్రహ్మాది చల ప్రతిమలే శ్రేష్ఠమని భావింప వలయును.

మూ. త్రిదశ ఏకాత్మక నెనిసి భూ
ఉదక శిఖియొళు హత్తుకరణది
అధిపరెనిసువ ప్రాణముఖ్యాదిత్యరొళు నెలెసి।
విదితనాగిద్ద నవరత నిర
వధికమహిమను సకలవిషయవ
నిధననాపుక సంకరుషణాహ్వయను స్వీకరిప॥ 3

వ॥ ఇరువదినాల్గు తత్త్వములకెల్ల మహాధిపులైన వారలై
పరగెడు ప్రాణదేవుడును భాను ముఖాదులలోన వ్యాప్తుడై
పరమహిమోజ్వ లుండగుచు భాసిలుగా నిధనాఖ్యశౌరితో
నరయుచు స్వీకరించును దదంతర భోగ్యములైన సౌఖ్యముల్

తా॥ ఇరువది నాల్గు తత్త్వము లందు తదాకార తద్రూప తన్నామములతో ప్రచురుడనబడి కర్తృ భోక్తృ శరీరము లందున్నాడు. ముఖ్య ప్రాణుదును నేత్రాభిమాని సూర్యుడే మొదలైన తత్త్వాభిమానుల యందు వారి వారి యాకారములతో అంతర్యామియై యుండి జగత్సంహార కర్తృవైన సంకర్షణుడను పరమాత్ముడు భోగ యోగ్యము లైన ప్రాకృతములైన సర్వ విషయములను స్వాఖ్య విషయములను దేహమందున్న చతుర్వింశతి తత్త్వభిమాన దేవతాంతర్యామియై తనరూపములచే తాను స్వీకరించువాడగును.

మూ. దహిక దైశిక కాలికత్రయ
గహన కర్మగళుంటు ఇదరొళు
విహిత కర్మగళరితు నిష్కామకను నీనాగి।
బృహతినామక భారతీశన
మహితరూపవ నెనెదు మనదలి
అహరహర్భగవంతగర్పిసు పరమభకుతియలి॥ 4

తే.గీ. దైహి దైశిక కాలిక త్రయగహనపు
కర్మలెయ్యవి కలవందు మర్మమెఱిగి
విహిత కర్మల నిష్కామ విధినొనర్చి
బృహతినామక ప్రాణేశు మహితమైన

క॥ రూపంబు దలఁచి మదిలోఁ
బ్రాపకుఁడై యున్నయట్టి భగవంతునకున్
ఓపికతో నర్పింపు ర
మా పతికహ రహము భక్తి మానకధరలో

తా॥ దేహ సంబంధమైనదియు దేశ కాల సంబంధమైనది యునైన కర్మలగు తీర్థ యాత్రాదులను నమస్కార ప్రదక్షిణ జపాదులను మఱియు చాతుర్మాస్యాది వ్రతములను భీష్మ పంచకము విష్ణు పంచకము గ్రహణాది పర్వ కాలములను

షణ్ణవతి శ్రాద్ధాదులను ఇటువంటి కాల కృత కర్మములున్నవి. ఈ కర్మము[illegible] సాధ్యమైనంత వఱకు తెలుసుకొని ఫలా పేక్ష లేక చేయుచు ఆ కర్మ[illegible] యందు బృహతీ నామకుడును భారతీ పతియు నైన ముఖ్య ప్రాణ దేవు[illegible] చింతించి అతని అంతర్యామియైన పరమాత్ముని ఆకార రూపము[illegible] హృదయ మందలి బింబ రూపి పరమాత్ముని ధ్యానించుచు [illegible] అత్యంత భక్తితో చేయు కర్మలను అతని కర్పించు వాడవగుము.

ము. మూరు విధ కర్మగళొళగె కం
సారి భార్గవ హయవదన సం
ప్రేరకను తానాగి నవరూపగళనె ధరిసి
సూరి మానవ దానవరొళు వి
కారశూన్యను మాడి మాడిసి
సారభోక్తను స్వీకరిసి కాదులిప్ప జీవరిగె॥ ౭

ప॥ త్రివిధములైన కర్మముల దేవకీపుత్రుఁడు భార్గవుండు వ
శ్వ వదనుఁడుండు ప్రేరకుఁడు సంతతము న్నవరూపధారుఁడై
ప్రవిబుధ మర్త్య దానవుల భాసిలఁదానొనరించి వారిచేఁ
దవిలి యొనర్పఁజేసికొని తప్పక యిచ్చును సారభోక్తఁడై

తా॥ దైహిక దైశిక కాలిక అను మూడు విధములైన కర్మల యందు శ్రీ కృష్ణు[illegible] హయగ్రీవుడు పరశురాముడు అను మూడు రూపములతో కర్మ ప్రే[illegible] మందున్నవాడై తొమ్మిది రూపములను ధరించి ఆయా జీవుల యం[illegible] బాగుగా ప్రేరేపించు వాడై యుండును. జీవుల యందు ప్రేరక[illegible] పరమాత్ముడే కాని ఇతరులైన బ్రహ్మాదులకు ప్రేరకత్వము లేదు. [illegible] ప్రకారము పరమాత్ముడు ప్రేరణ చేయుచు దేవతలు నిత్య సం[illegible] దైత్యులు ఈ త్రివిధ జీవుల యందు కర్మలను చేయించును. అన్యా[illegible] వికార సహితులైన శరీరము గల వారికి కర్మము నుండి [illegible] పొందించి వారిచే కర్మములను చేయించి సార భూతమైన స్వా[illegible] తాను స్వీకరించును. ఆయా జీవులకు తగిన సౌఖ్యము [illegible] విధమైన అను సంధానముతో కర్మలను పరమాత్మునకు సమర్పించి[illegible] నిర్లిప్తుడైన వాడై సుఖించును.

మూ. అనళ పక్వప గైసిదన్నప
అనళదొళు హోమిసువ తెరదం
తనిమిషేశను మాడి మాడిసదఖిళ కర్మగళ
మనవచన కాయదలి తిళిదను
దినది కొడు శంకిసద వృజినా
ర్దన సదా కైకొండు సంతయిసువను తన్నవర॥ 6

ప॥ అనలమునందుఁ బాకమగు నన్నము నాయనలంబునందు భ
క్తిని హుతమాచరించునటు దేవవరేణ్యుఁడొనర్చి నట్టివై
తనరెడు కర్మలందెలిసి తత్పరమాత్మ కొసంగ శంకలే
కను నఘనాశకుండు మఱి కైకొనిఁబ్రోచును సజ్జనావళిన్

తా॥ అగ్ని దేవుడు పక్వము చేసిన అన్నమును మరల అదే అగ్నియందు ఆహుతి రూపములతో నిచ్చు వారగుదురు. ఆ విధముగా దేవతా స్వామియైన పరమాత్ముడు బింబ క్రియ ద్వార తాను చేసి జీవుల నుండి తత్తేశుల ద్వార చేయించిన గుణత్రయము ననుసరించిన సమస్తమైన ద్వంద్వ కర్మలను మనస్సు మఱియు మాటల నుండి దేహము నుండి చేసిన పుణ్యములను ఆయా కర్మళ యందున్న పరమాత్మనకు అనుసంధానమును తెలిసి పాపముల నర్పించు విషయము నందు సందేహింపక దృఢ మనస్కుడై నిత్యమును హృదయాంతర్యామియైన బింబ రూపి పరమాత్మనకు అర్పణము సేయుము. అనగా కర్మము నందున్న దేవునకు దేహము నందున్న దేవునకు ఐక్య చింతన రూపములో అర్పించు వాడవగుము. పరమాత్ముడు స్వీకరించి తన భక్తులను సంరక్షించును. వైశ్వ దేవము చేయని అన్నము ప్రాణ దేవునకు పరమాత్మునకు నైవేద్యము చేసినప్పటికిని ఆ అన్నమును స్వీకరించుట నిషేధమని గరుడ పురాణము నందు చెప్పబడినది. ఏకాదశి యందు అన్న భోజనము వైశ్వ దేవము లేని అన్న భోజనము రెండును సమాన మేయగును.

మూ. కుదురె బాలదకొనెయకూదలు
తుది విభాగవమాడి శతవిధ
వదరళొందను నూరుభాగవ మాడలెంతిహుదొ।
విధిభవాది సమస్త దివిజర
మొదలుమాడి తృణాంత జీవరొ
ళధిక న్యూనతెయిల్లవెందిగు జీవ పరమాణు॥ 7

తే.గీ. తురగ వాలాంతరోమంబు తుదినినూరు
భాగములఁజేసి యందొక భాగము మఱి
నూరు భాగము లొనరింప న్యూనమైన
యదియె జీవ ప్రమాణంబు నఖిలు రందు.

ఆ.వె. అజ భవాది సకల సుజనులు మున్నుగాఁ
గల తృణాంత జీవముల వఱకును
దెలియ హెచ్చు తక్కువలులేవు పరమాణు
వనుచు నెఱుగు జీవునంతరంబు.

తా॥ గుఱ్ఱము తోక యందు ఒక వెంట్రుకను తీసుకొని ఆ వెంట్రుక కొనను నూరు భాగములుగా ఖండించి ఆ నూరు భాగములం దొక్క భాగమును మరల నూరుభాగములు చేసిన ఒక భాగము ఎంత ప్రమాణమగునో ఆ ప్రమాణమే బ్రహ్మరుద్రాది సాంశ జీవుల యొక్కయు మనుష్య గంధర్వాది తృణాంత నిరంశ జీవుల యొక్కయు జీవ పరిమాణమగును. జీవ స్వరూపము పరమాణువైనది. హెచ్చు తక్కువలు లేదు. దీని కంటెను పరమాణు స్వరూపమైనది లక్ష్మీదేవి జీవ స్వరూపము. వీరి అందరికంటె అపరిచ్ఛిన్నమైన పరమాణు స్వరూపుడు పరమాత్ముడు.

మూ. జీవనంగుష్ఠాగ్ర మూరుతి
జీవనంగుట మాత్ర మూరుతి
జీవన ప్రాదేశ జీవాకార మూర్తిగళు।
ఏవమాది అనంతరూపది
యావదవయ వగళొళు వ్యాపిసి
కావ కరుణాళుగళ దేవను ఈ జగత్రయది॥ 8

క॥ జీవుని యంగుష్ఠాగ్రము
జీవుని యంగుష్ఠమంత చెలఁగెడు మఱియుం
జీవుని ప్రాదేశంబై
జీవాకారపు సుమూర్తిచే వెలుగొందున్.

క॥ ఏవం విధరూపంబుల
యావదవ యవములలోన వ్యాపించియు ల

క్ష్మీ వల్లభుండు కాచు ద
యావంతుల నీజగత్రయంబును ప్రీతిన్

తా॥ జీవుడు మిక్కిలి అణు స్వరూపుడు. అతని చేతి యందలి బొటన వ్రేలి అగ్ర భాగపు పరిమితమైన పరమాత్ముని రూప మొకటి జీవుని యందుండును. జీవుని చేతి యందలి ఆద్యంత అంగుష్ఠ పరిమాణ స్వరూపమైన మూర్తి యొకటి జీవుని ప్రాదేశ మూర్తి యొకటి. ప్రాదేశ మనగా అంగుష్ఠము తర్జనీ వ్రేళ్ళు రెండును దూరము చేసినచో కాదగిన ప్రమాణము గలది ఒకటి. పాదము మొదలుకొని శిరస్సు వఱకు అఖండ రూపము ఇంకొకటి. ఈ ప్రకారముగా భగవంతుని రూపములు అనంతములుగా రోమనఖ అంగుళులన్నియు జీవుని చిదానంద శరీరమునకు అవయవ సాంకేతములు. ఇట్టి అవయములన్నిటి యందును పరమాత్ముడు ఆయా ఆకారములతో వ్యాప్తుడై జీవుని సంరక్షించు చున్నాడు. స్థూల దేహాంతర్యామి స్థూలదేహము నుండి వెలుపలికి వెళ్ళినచో ఆ దేహము నాశనమగును. అట్లుగాక జీవాంతర్యామి యైన పరమాత్ముడు జీవుని వదలి వియోగమును కల్గింపక నాశ రహితునిగా రక్షించు చుండును.

మూ. బింబ జీవాంగుష్ఠ మాత్రది
ఇంబు గొండిహ సర్వ రొళు సూ
క్ష్మాంబరది హృత్కమల మధ్యనివాసి యెందెనిసి।
ఎంబరీతగె కోవిదరు వి
శ్వంభరాత్మక ప్రాజ్ఞభక్తకు
టుంబి సంతైసువను ఈపరి బల్ల భకుతరను॥ 9

ఉ॥ బింబ సురూపకుండయిన వెన్నుఁడు జీవునియుంగుటంపు మా
త్రంబగు రూపి యౌచు సతతంబు వెలుంగు హృదంతరాళ ప
ద్మంబున మధ్యవాసిగ బుధప్రవరుల్ వినుతింత్రు ప్రాజ్ఞవి
శ్వంభర విశ్వగేహయను సంజ్ఞల శ్రీహరికాచు భక్తులన్

తా॥ బింబరూపి పరమాత్ముడు జీవుని అంగుష్ఠ పరిమాణ రూపముతో జీవాకారుడై సర్వ ప్రాణుల యందును ఆకాశ మందును రెండు విధములుగా నున్నాడు. సూక్ష్మాకార మనునది జీవుని స్వరూప దేహ మందలి ఆకారము. స్థూలాకాశ మనునది పాంచ భౌతిక స్థూల దేహము నందలి ఆకాశము. ఈ రెండింటి

యందును అంగుష్ఠ మాత్రమైన జీవాకారమగు బింబ రూపి యున్నాడు, స్థూల దేహ మందు స్థూలాంగుష్ఠ పరిమితుడును అయి యున్నాడు. అష్టదళ కమలము నందు మధ్య నివాసియై పరమాత్ముడున్నాడు. ఇతడు అగ్రేశుడను పేరు గలవాడు. ఈ అగ్రేశుడు కాక విశ్వంభరాత్మకమైన రూప మొకటి యున్నది. సమస్త జీవుల భారమును వహించు వాడై దేహముల యందు సంచారము సేయుచు వారి వారి యోగ్యతానుసారము సాధనము చేయించు వాడే మూలేశుడు. మఱియు తన పాదమూల మందు విశ్వ శబ్ద సాంకేతులైన జీవుల యందు చేరిన వాయుదేవుడు పాద మూల మందు జీవుని యీ ప్రకారముగా ధరించి యుండుట వలన విశ్వం భరుడైన వాడు మూలేశుడనబడును. ప్రాదేశనామునకు ప్రాజ్ఞ యను సంకేతమున్నది. సంరక్షణము చేయుట యందు కుటుంబ స్థానాపన్నుడైన భక్త సమూహమే సంసారముగా గలవాడు. కుటుంబ మట్లు సుఖమును పొందగలవాడు.

మూ. పురుషనామక సర్వజీవరొ
ళిరువ దేహాకార రూపది
కరణని యామక హృషీకప నింద్రియంగళలి।
తురియ నామక విశ్వహ
న్నెరడు బెరళుళి దుత్తమాంగది
ఎరడధిక ఎప్పత్తు సావిర నాడి యొళగిప్ప॥ 10

మ॥ పురుషాఖ్యుండు వసించు జీవతతిలో మోదాన దేహాకృతిం
గరణప్రేరకుఁడై హృషీకపతియుం గాన్పించుఁదా నింద్రియ
స్ఫురితుండై మఱి తుర్య నామకుఁడు సంశోభిల్లు విశ్వాఖ్యుఁడా
శిరముం దక్షిణ నేత్రమంత వఱకున్ శ్రీశుండు నాడీతతిన్

తా॥ పురుషుడను పేరు గల రూపమొకటి జీవుని యందున్నది. సమస్త జీవుల యందును పరమాత్ముడు ఒక్కొక్క రూపముతో నున్నాడు. జీవుని అంగుష్ఠము వారంభించి శిరస్సు వఱకు అన్ని అవయవములందును దేహాకార రూపముతో నుండ గలడు. ఇదే అతనికి ఆవాస స్థానము. ఇట్టి రూపమునకు పురుష రూపమని పేరు. అధిష్ఠానము ననుసరించి వచ్చినది. జీవుని దేహాకారము నుండి పురుష రూపి పరమాత్ముడు జీవుల స్వరూప దేహ మందున్నాడు. ఇంద్రియములను నియమించుటచే హృషీ కేశుడనియు పేరు. ఇంద్రియాధి మానియైన తుర్యనామక వాసుదేవుడు శిరస్సు నారంభించి లెక్కించినచో

కుడికంటి వలకు పంద్రెండు అంగుళములగును. అందువలన దక్షిణాక్షి ముఖ మందు విశ్వరూపుడున్నాడని తెలియ వలయును. ఈ విశ్వరూపుడే జీవుని స్వరూప దేహ మందలి డెబ్బది రెండు వేల రూపములతో నున్నాడు. ఈ ప్రకారము జీవుని స్వరూప దేహమందు దేహాకారుడై ఇంద్రియములకు నియామకుడై ఇంద్రియాభిమాని యై నాడుల యందు అంతర్యామి యై యున్నాడు. పరమాత్ముని కంటె ఇతరులైన బ్రహ్మ వాయువులకు అచట ప్రవేశమునునది లేదు.

మూ. వ్యాపకను తానాగి జీవ స్వ
రూపదేహద ఒళహొరగె ని
ర్లేపనాగిహ జీవకృత కర్మగళ నాచరిసి।
శ్రీపయోజభ వేరరింద ప్ర
దీపవర్ణ స్వమూర్తి మధ్యగ
తా పొళెవ విశ్వాదిరూపది సేవెకైకొళుత॥ 11

ఉ॥ జీవస్వరూప దేహమునఁ జేరుచులో వెలినుండు వ్యాప్తుఁడై
శ్రీవరుఁడు న్విలేపనము సెందక జీవులొనర్చు కర్మలం
దా వెలయంగఁజేసి రమ తామరసోద్భవ వాయులందునన్
సేవల స్వీకరించుచును జెల్వువహించును విశ్వరూపుఁడై

తా॥ పరమాత్ముడు జీవులయందు స్వరూప దేహములో లోపలను వెలుపలను వ్యాప్తుడై యున్నాడు. ఎట్లనగా సమస్త తత్వాభిమాన దేవతల నాను రూపములతో జీవుని సచ్చిదాత్మకమైన అణు స్వరూప మందును స్థూల శరీరమందును ఉండు వాడగును. ఇట్లుండిన వాడై రమా బ్రహ్మ వాయువు లందు సేవలను స్వీకరించు వాడై వెలుంగుచు విశ్వ రూపుడై యున్నాడు.

మూ. గరుడ శేష భవాది నామవ
ధరిసి పవన స్వరూప దేహది
కరణ నియామకను తానాగిప్ప హరియంతె।
సరసి జాసన వాణి భారతి
భరత నిందొడ గూడి లింగది
ఇరుతిహరు మిక్కాది తేయరిగిల్ల వాస్థాన॥ 12

చ॥ గరుడ మహాఫణీశ విషకంధర నామములం ధరించి శ్రీ
హరి పవనస్వరూప తనువందు వెలుంగు నియామకుండునై
హరివలె వారిజాసన తదంగన భారతి వాయుమూర్తులు
న్నరయ వసింత్రు లింగమున నన్యులకయ్యెడ లేదు • వాసమున్

తా॥ గరుడ శేష రుద్రాది నామముల ధరించి పరమాత్ముడు వాయు దేవుని స్వరూప దేహ మందు మఱియు వాయుదేవుని స్థూల దేహము నందును ఇంద్రియ నియామకుడై యున్నాడు. అట్లు గరుడ శేష రుద్రాది నామములతో బ్రహ్మ వాణి భారతి భరతులతో గూడి లింగ దేహ మందు వీరందరు నున్నారు. సర్వ ప్రాణుల అణు లింగ శరీర మందును ఉన్నారు. వీరి కంటె అన్యులైన గరుడాదులకు ఇచట ప్రవేశము లేదు. వాయుదేవునకు జీవాంతర్యామి ప్రవేశములేదనియే సిద్ధము. అనాది లింగ దేహమునందు లక్ష్మీదేవి చతుర్వింశతి నామములతో నియామకురాలు. ఈ అనాది లింగ దేహము నందును బ్రహ్మ వాణి వాయు భారతులకు ప్రవేశములేదు. ఈ అనాది లింగ దేహమునుండి జనించిన అణులింగ మందు ఈ నలుగురికిని ప్రవేశమున్నది. కాని ఈ నలుగురి కంటె ఇతరులైన వారికి అణులింగ మందు ప్రవేశములేదు.

1. జీవుని యందు పరమాత్ముడు. 2. అనాది లింగ దేహమందు లక్ష్మీదేవి. 3. అణు లింగ మందు బ్రహ్మ వాయువులు ఈ రీతిగా తారతమ్యానుసారము వ్యాప్తి యని తెలియవలయును.

మూ. జీవనకె తుషదంతె లింగవు
సావకాశది పొంది సుత్తలు
ప్రావరణ రూపదలి ఇప్పుదు భగవదిచ్ఛెయలి।
కేవల జడప్రకృతి యిదకధి
దేవతెయు మహలకుమి యెనిపళు
ఆ విరజెయ స్నానపరియంతరది హత్తిహుదు॥ 13

చ॥ చెలువుగ బీజ బాహ్యమునఁ జేరిన యాతుషయట్లు జీవుల
న్నలరగ జుట్టు ప్రావరణమై కనుపించును లింగ దేహమా
వనరుహనాభు నిచ్ఛయిది ప్రాకృత సృష్టియె దీని కమ్మహా
జలజయె దేవియౌ విరజ స్నానమునంతకు హత్తి యుండెడున్

టీ॥ బియ్యమునకు పైన పొట్టు ఏవిధముగా ఆవరించుకొని యుండునో ఆ విధముగా బ్రహ్మ మొదలుకొని తృణాంతము వఱకు గల త్రివిధ జీవరాసులను బీజములకు అనాది లింగ శరీరమును ఆవరకము ఆవరించు కొని యుండును. ఇది కవచము వలె నుండును. ఈ కాల మందు జీవులకు జాగ్రత కాని కర్మ వ్యాపారము గాని లేదు. లింగము యొక్క తృతీయ పరిచ్ఛేదము నందు శక్తి ననుసరించి ప్రవాహ యోగ్యతచే నుండును. అనాది లింగ దేహము జడ ప్రకృత్యాత్మకమైనది. ఇది ఈశ్వరునిచే రచితమైనది కాదు. కేవలము పరమాత్ముని యిచ్ఛానుసారముండును. పూర్వపు దృష్టాంతానుసారముగా లింగ దేహ మందు స్వేదోదకమును ఉత్పత్తి చేసి దాని నుండి లింగ దేహమును తడిపి తద్వార జీవునకు లింగ దేహ నిరవకాశముచే సంబంధము చేసి జాగ్రత్త నొసగి లింగ దేహము నందలి గుణ త్రయము లచే వైషమ్యమును పొందించి జీవ వ్యాప్తిని లింగ దేహ గతమైన అనాది కర్మ మందు ప్రవేశము చేయించి దాని నుండి బీజ మంకురించునట్లు కర్మాంకురమును గలిగించు నను దృష్టాంతము రీతిగా దృష్టాంతము. భగవంతుడు తన యిచ్ఛానుసారము చేయును. ఈ అనాది లింగ శరీరమునకు అభిమాని దేవత అక్షర రూపియైన లక్ష్మీదేవి. దీనికి మాత్రము రమాదేవిని చెప్పుట వలన బ్రహ్మదేవుడు వాయు దేవుడు సరస్వతి భారతి వీరు ఇచట నుండరు. విరజా నదీ స్నానము వఱకు అంటుకొని యుండును. స్నానాంతరము వీడిపోవును.

షూ. ఆరధిక దశకళె గళుళ్ళ శ
రీరవనిరుద్ధగళ మధ్యది
సేరి ఇప్పుదు జీవ పరమాచ్ఛాదికద్వయవు।
బారదందది దాన పరనతి
దూరగైసుత శ్రీజనార్దన
మూరుగుణదొళగిప్ప నెందిగు త్రివృతు వెందెనిసి॥ 14

సీ॥ పదునారు కళ లచే పరలు శరీర మి
య్యది యని రుద్ధ దేహమున మధ్యఁ
జేరి యున్నది చూడ జీవ పరాచ్ఛాది
కద్వయంబిది యు నఖండముగను
ననిరుద్ధ దేహ దూరాసుర కోటుల

నా మహత్త త్వాణ్వనాది లింగ
నామ శరీరంబు లై మెలంగెడు వాని
దరి జేర నీయక తరుమ గొట్టి

తే.గీ. శ్రీజనార్దన దేవుండు జీవు నంటి
వచ్చు త్రిగుణంబు లందున వదల కుండ
మూడు గతుల దదా కృతి తోడ వెలయు
త్రివృతువను సమాఖ్యను బొంది తేజ మలర.

తా॥ పదునారు కళ లచే కూడినదై 1. లింగదేహము, 2. అణు లింగదేహము 3. మహత్తత్వ శరీరము, 4. అనిరుద్ధ శరరము లొప్పుచున్నవి. లింగ శరీరము అణు లింగ శరీరము దీని నుండి మహత్తత్వాత్మక శరీరము దీని నుండి అహంకారాత్మకమైన అనిరుద్ధ శరీరము ఉత్పత్తి యగును. ఈ శరీరములన్నియు షోడశాత్మక కళాత్మకమే. దానియందు అనిరుద్ధాది శరీరముల మధ్య యందు జీవాచ్ఛాదికమును పరమాచ్ఛాదికమును ఇవి రెండును చేరియున్నవి. అనిరుద్ధ శరీర మందలి దైత్యులను మహత్తత్వ శరీరము అణు లింగ శరీరము అనాది లింగ శరీరములందు రానీయక దూరము చేసి జనార్దనుడను పరమాత్ముడు జీవుని పై మూడు విధములుగా హత్తుకొని యుండు అనాది లింగ సాంకేతమైన సాత్త్వికాది మూడు గుణముల యందు మూడు రూపములతో తదాకారముగా నుండి త్రివృత్తను నామముతో పిలువ బడు వాడై లింగదేహము భంగమగు వఱకు ఈ మధ్య కాల మందెప్పుడును వదలక యుండు వాడగును.

వి. లింగ దేహ మనునది ఏడు ఆవరణములతో గూడి యున్నది. 1. మొదట జీవుని పై యూశ్వరేచ్ఛ, 2. జీవాచ్ఛాదికము, 3. పరమాచ్ఛాదికము, 4. లింగ దేహము (ఈ లింగ దేహ మందు తృతీయ పరిచ్ఛేదమైన దాని యందు), 5. అవిద్య, 6. కామము, 7. కర్మము. మొత్తము ఏడు విధములైన ఆవరణములు అనాది యైనవి. వీని అంశములే పరంపరా స్థూల దేహము లందు పరిణమించుచుండును. అట్లు అణు లింగము, మహత్తత్త్వము, అహంకారాఖ్యము అనిరుద్ధములను ఈ శరీరముల మధ్య యందు చేరి యుండును.

మూ. రుద్ర మెఖ్గదలాద మదరిగె అని
రుద్ధ దేహవె మనెయెనిసువుదు
ఇద్దు కెలసవ మాడరల్లిందిత్త స్థూలదలి।
క్రుద్ధఖిళ దివిజరు పరస్పర
స్పర్థియిందలి ద్వంద్వ కర్మ స
మృద్ధి గళనాచరి సువరు ప్రాణేశనాజ్ఞెయలి ॥15

తే.గీ. రుద్రుండును మొన్నుగాcగల భద్ర. సురుల
కగును మందిరమనిరుద్ధ మనెడు దేహ;
మందు వసియించి. కార్యంబు లాచరింప
రచటి నుండియు. స్థూలదేహమును చేరి

తే.గీ. క్రుద్ధ దైత్యులు దేవతల్ గూడియుచట
తవిలి యన్యోన్య స్పర్థచేc బవనునాజ్ఞ
ద్వంద్వరూపంబు లైనట్టి పాపపుణ్య
కర్మముల నాచరింపcగc గడcగు చుంద్రు

తా॥ అనిరుద్ధ దేహము నాశ్రయించి యుండు దైత్యులు ఒక్కొక్క అంశ చే స్థూల దేహమందుండియు, అనిరుద్ధ దేహమందలి వాయుదేవుడు పరమాత్మునితో గూడి స్థూల దేహ మందు ఒక అంశతో నుండియు క్రియాదులను దేవతల ద్వార తాము తాము తారతమ్యానుసారముగా చేసి జీవుని వలన చేయింతురు. మఱియు దేవతలందు దైత్యులు దైత్యులందు దేవతలును ఉండి వారు వారు ప్రాణదేవుని ఆజ్ఞచే పాప పుణ్యములను చేయింతురు. దైత్యులు జీవుని వలన పాప కార్యములు చేయింపవలసినచో తదం తర్గత దేవతల ప్రేరణ చేతనే చేయింతురు. వారు స్వతంత్రముగా చేయరు. దేవతలు దైత్యులందు సోహం ఉపాసనాది కర్మముల దైత్యుల ద్వార వాయుదేవుని ఆజ్ఞచే తాము చేసి దైత్యుల వలన చేయించి తద్వార జీవుని వలన చేయింతురు.

వి. త్వగాది సప్త ధాతువులతో కూడిన స్థూల శరీరము అన్న మయాది కోశములచే యుక్తమైనది. ఇది యే దేహము. దీనికి అనిరుద్ధ దేహమని పేరు. ఇది అయిదవ శరీరము. 1. జీవుని స్వరూప దేహ మందు అనిరుద్ధుడను పరమాత్ముదుండును. 2. అనాది లింగ శరీర మందు నారాయణుదుండును. 3. అణు లింగ శరీర మందు వాసు దేవుదుండును.

4. మహత్తత్త్వ శరీర మందును వాసుదేవుడుండును. 5. అహంకార తత్త్వ శరీర మందు ప్రద్యుమ్నుడుండును. 6. అనిరుద్ధ శరీర మందు అవి ఈ ఆరు శరీరములు ఒక దానికొకటి కంచుకములై ముద్దుడుండును. యుండును.

మూ. మహి యొళగె సుక్షేత్ర తీర్థది
తుహిన వరుష వసంతకాలది
దైహిక దైశిక కాలికత్రయ ధర్మ కర్మ గళా
ద్రుహిణ మొదలాదమరరెల్లరు
వహిసి గుణగళ ననుసరిసి స
న్నిహి తరాగి ద్దెల్లరొళు మాడువరు వ్యాపార॥ 16

మ॥ ధర సుక్షేత్రములందుఁ దీర్థములలోఁ దత్త్వేశులైనట్టి యా
సరసీజా సనుఁడాదిగాఁ గల సురల్ సర్వేశునాజ్ఞం దగన్
శిరముం దాల్చి త్రయీ సుకల్యము లొగిం జేయింత్రు జీవత్రయిం
బరగన్ మంచు (హైమ) వసంత కాలములలో వర్షర్తు కాలంబులోన్.

తా॥ ఈ భరత ఖండమందు శాస్త్రములందు చెప్పిన ధర్మముల ననుసరించి దేహ సంబంధులు అట్లే 'బాంధవా విష్ణు భక్తాశ్చ' అను నట్టి భగవత్సంబంధులు వీరి విషయకమైనట్టి దేశాంతరమునకు సంబంధించిన బదరీ శ్రీరంగాది క్షేత్రము లేమి గంగాది తీర్థము లేమి ఆయా తీర్థ క్షేత్రములకు వెళ్ళిన కాల మందు అచ్చటచ్చట చేయదగిన తద్విషయకమైన కాలిక సాంకేతమైన హిమ వత్కాలము వర్షకాలము వసంతకాలము మొదలైన స్నాన సంధ్యా వందన పితృకార్యాదులు దేవతార్చనము భగవద్భక్తుల బంధువుల పూజాది త్రివిధ కర్మములు స్థూల దేహ గతమైన బ్రహ్మాది తత్త్వాభిమాన దేవతలందరు చేరిన వారై దేహమందలి బింబ రూపకుని ఆజ్ఞను శిరసావహించి గుణ గణములను అనుసరించి అట్టి జ్ఞానాను సంధానమే ప్రేరేపించి త్రివిధ జీవుల యందు దేహేంద్రియముల యందు సన్నిధానముతో గూడి యుండి చేయుదురు. కర్మ రూపమైన పనులను చేయింతురు. జీవుడైన వాడు తత్త్వేశుల ద్వార స్థూల దేహమునుండి చేయువాడగును. ఈ రీతిగా త్రివిధ కర్మ మందు అనుసంధాన ముండవలయును.

మూ. కేశ సాసిరవిద విభాగద
గైసలదనితహా సుషుమ్నవు
ఆ శిరాంతది వ్యాపిసిహుదీ దేహమధ్యదలి।
ఆసుషుమ్నకె వజ్రకార్యప్ర
కాశివి వైద్యుతి గళిహవు ప్ర
దేశదలి పశ్చిమకె ఉత్తర పూర్వ దక్షిణకె॥ 17

మ॥ ఒక కేశంబును వేయి భాగములుగా నొప్పన్విభాగింప సూ
క్ష్మకమౌ నాపరి మాణమైనది సుషుమ్నంబొప్పు నానాడి శీ
ర్షక పర్యంతము దేహమధ్యమున వజ్రంబున్ బ్రకాశించుఁ బూ
ర్వకమై కార్య ప్రకాశి వైద్యుతులు నా భాసిల్లు నన్యాశలన్

తా॥ శిరమందలి ఒక వెంట్రుకను తీసుకొని దానిని వేయి భాగములుగా చీల్చినచో ఒక భాగ మెంత సూక్ష్మముగా నుండునో అంత సూక్ష్మమైనది సుషుమ్నయను నాడి. ఈ నాడి మూలాధారము నారభించి శిరస్సు వఱకు వ్యాపించి బ్రహ్మరంధ్రమును చేరి స్థూల దేహమునకు మధ్యయందున్నది. ఆ సుషుమ్నా నాడికి పశ్చిమ భాగ మందు వజ్రికానాడి ఉత్తర భాగమున ఆర్యా నాముక నాడి పూర్వ భాగ మందు ప్రకాశినీ నాడి దక్షిణ భాగ మందు వైద్యుతి నాడి ఈనాలు ఉన్నవి. మధ్య యందు సుషుమ్నా నాడి ఈ అయిదు నాడులు మూలాధారము మొదలుకొని బ్రహ్మ రంధ్రము వఱకు వ్యాపించి యున్నది. 'సుషుమ్నా పంచ ప్రభేదినీ' అనుట వలన సుషుమ్నా అయిదు విధములుగా నున్నది.

మూ. ఆ నళినభవ నాడియొళగె త్రి
కోణ చక్రవు ఇప్పుదల్లి కృ
శాను మండల మధ్యగను సంకరుషణాహ్వయను।
హీన పాపాత్మక పురుషన ద
హన గైసుత దినదినది వి
జ్ఞాన మయ శ్రీవాసుదేవన ఐదిసువ కరుణిః॥ 18

సీ॥ ఆ పంకజాతాస నాఖ్యమై చెలువొందు
నాడి దేశంబున నవ్యకాంతిఁ

బ్రహ్మట త్రికోణ చక్రంబొందు దానిలో
వెలుగొందు వహ్ని మండలము దాని
మధ్య గుండ గుచును మహిత సంకర్షణ
నామకుండలరు ననంత గుణుడు
హీన పాపాత్మకుడైన దుష్పురుషుని
దహనం బొనర్చుచు నహరహంబు

తే.గీ. మలిన దేహంబు సంశుద్ధిఁ గలుగఁ జేయు
శిరము నందలరారెడు వరుణ మండ
లాత్త వరుణాంత రంగుఁడై వాసుదేవు
కరుణ సత్సుధావృష్టినిఁ గలుగఁజేయు

తా॥ ఆ బ్రహ్మ సంబంధమైన సుషుమ్నా నాడి యందు అష్టదళ కమలమునకు క్రింది భాగము నందు త్రికోణాకారమైన యొక చక్రమున్నది. ఆ చక్ర మందు అగ్ని మండలమున్నది. ఆ అగ్ని మండలము మధ్యలో సంకర్షణుడను పేరు గల పరమాత్ముడు మిక్కిలి నీచమైన పాపముతో కూడిన శరీరము గల కలి పురుషుని దహనము సేయుచుండును. అనంతరము ప్రతి దినము నందును దహనముచే స్మశాన సమానమైన దేహమును మిక్కిలి కరుణామయుడగు వాసుదేవుడు శిరస్సు నందలి వరుణ మండల మందుండు వాడై అచటి నుండి అమృతవృష్టిని కురిపించి మలిన దేహమును పవిత్రము చేయును. పాప పురుషుని దహనకాలమందు హృదయ మందున్న బింబరూపుని శిరస్సు నందున్న వాసుదేవుని కూడ చేర్చి ఆ వాసుదేవుని మరల హృదయము నందు చేర్చువాడు కావలయును. దహింపబడిన పాప పురుషుడు ముహూర్తమున కొకసారి ఉత్పత్తియగును. ఆ పాప పురుషుడు యెడమ భాగమైన ఉత్తర మందున్న ఆయా నామకమైన పింగళనాడి యందుండును. పుణ్య పురుషుడు కుడి భాగమందలి వైద్యుతి నామకమైన ఇళానాడి యందుండును.

పుణ్య పురుషుడను వాడు వాయుదేవుడు. ఆ వాయు దేవుని నాభి కమలమునకు అధోభాగ మందున్న షట్కోణ మండలమునకు తెచ్చి అచట పూజాదులు చేసి అచటి నుండి హృదయము నందలి అష్టదళ కమలమునకు క్రింది భాగమున నుండు త్రికోణ మండలమునకు తెచ్చి అచట పూజాదులు చేసి దేహ మందు పుణ్య పురుషుని ఆ వాహనము చేసి కర్మలను చేయవలయును (అనగా జపాదులు చేయవలయును).

శ్లో॥ అశ్వమేధ శిరస్కంచ మహాదాన భుజద్వయం।
సోమపానహృదా యుక్తం బ్రహ్మచర్య కటిద్వయం।
తత్వంయోగ పద ద్వంద్వం సాంగోపాంగ శుభక్రియం।
సర్వ వ్రతాంగ రోమాణాం దయా దాక్షిణ్య లోచనం।
సార్థ త్రికోటి తీర్థాంగం సర్వ దేవ మయం విభుం।
సింహాసనే సమాసీనం దేవ దేవ నమస్కృతం।
సర్వాయుధైర్యుపేతంచ కుక్షౌధర్మం విచింతయేత్॥

అని యీవిధముగా పుణ్య పురుషుని ధ్యానము చేయవలయును.

మూ. మధ్య నాడి య మధ్యదలి హృ
త్పద్మ మూలది మూల పతి పద
పద్మ మూలద లిప్ప పవనన పాద మూలదలి ।
పొంది కొండిహ జీవ లింగ ని
రుద్ధ దేహ విశిష్టనాగి క
పర్ది మొదలా దమర రెల్లరు కాదు కొండిహరు ॥19.

ఆ.వె. ఆసుషుమ్న మధ్య నలరు హృత్పద్మము
దాని మూలమునను తనరు మూల
పతియు నతని పాద పద్మ మూలంబున
బవనుడుండు నతని పాదములకు.

ఆ.వె. చేరువను వసించు జీవుండు సాదిలిం
గానిరుద్ధకాయుఁ డగుచు నుండు
శ్రీశు వాయువులను సేవింప రుద్రాది
దివిజులెల్లఁ జుట్టుఁ దిరుగుచుంద్రు.

తా॥ మూలాధారము మొదలుకొని దేహ మధ్య మందు బయలు దేరి శిరస్సు నందలి బ్రహ్మ రంధ్రము వఱకు వ్యాపించి యుండునటు వంటి బ్రహ్మ నాడియైన సుషుమ్న మధ్య మందు హృదయమునకు సమానమైన స్థాన మందు అష్ట దళాకార పద్మపు కర్ణికకు మూల మందు అష్ట బాహువులతో కూడిన దళ సంచారియైన అంగుష్ఠాగ్ర పరిమాణము గల మూలేశుడను పరమాత్ముడున్నాడు. ఈ పరమాత్ముని పాద పద్మముల యొక్క అంగుష్ఠముల

మధ్య మందు అనాది లింగ శరీరము అనిరుద్ధ శరీరముల దేహములతో గూడియున్న జీవుడను వాడు ప్రకాశించు చున్నాడు. అష్ట దిక్పాలకులైన రుద్రాది దేవతలందరు ఆయా దిక్కులందు మూలేశుడను పరమాత్ముని వాయు దేవుని సేవార్థముగా గాచుకొని యున్నారు.

మూ. నాళ మధ్యదలిప్ప హృత్కి
లాలజ దొళిప్పష్ట దళది కు
లాల చక్రద తెరది చరిసువ హంసనామకను।
కాల కాలగళల్లి యణ్ణెసె
పాలకర కైసేవె కొళుత కృ
పాళు అవరభిలాషెగళ పూరైసి కొడు లిప్ప॥ 20

స్రగ్ధర

ఆ నాడీ మధ్యగంబై యలరు హృదయసాష్టాఖ్య పద్మంబు నందున్
శ్రీనాథుండెల్లవేళం బ్రియముగఁ దిరుగున్ జేరి హంసాఖ్యయొప్పన్
దానా దిక్పాలకాద్యుల్ దనకిదు సుకృతుల్ దాల్చుచున్నట్టి వాఁడై
సానందంబొప్పఁ గోర్కెల్ సదయత నిడుచున్ సౌఖ్యముల్ వారికిచ్చున్.

తా॥ సుషుమ్నా నాడి యందు ఆద్యంతము వఱకు నున్న ద్వార మధ్య భాగ మందున్నట్టి హృదయ కమల మందుండ దగిన మూలేశుని నామాంతరమైన హంస నామముతో గూడిన వాడై హృదయ కమలము యొక్క అష్ట దళముల యందు కుమ్మరి వాని చక్రము వలె తన పాద మూల మందలి ప్రాణ దేవుని తోడను ప్రాణ దేవుని పాద మూల మందలి జీవుని తోను తిరుగుచుండును. ఏ యేకాలము లందు ఏయే దళము లందు సంచారము చేయునో ఆయాకాలములందు ఆయా దళము లందున్న దిక్పాలకులచే సేవలను స్వీకరించుచు దయాళువైన హంస నామక పరమాత్ముడు ఆయా ప్రాణుల అభిలాషలను జీవుల కేర్పడ వలయునో అట్టి దళ సంచారముచే నుత్పత్తి చేసి ఆయా అభిలాషలను పూర్వ కర్మానుసారముగా దేహ మందలి తత్వాభి మానుల ద్వార పూర్ణము గావించి దుఃఖాదులను దేవాసుర గణములందు విభాగము చేసి వారికిని అట్లే దేహ మందలి జీవునకు వారి వారి యోగ్యతానుసారము నిచ్చు చుండును. బింబ రూపుడైన పరమాత్ముడు దేహ మందు వెలుగుచున్నాడు. అభిలాషలను కలిగించువాడు మూలేశుడు. వానిని అగ్రేశుడైన బింబరూపుడు పూర్ణము గావించి విభజించి యిచ్చువాడగును.

మా. వాస వానుజ రేణుకాత్మజ
దాశరథి వృజినార్దన మలజ
లాశ యాలయ హయ వదన శ్రీకపిల నరసింహా
ఈసురూపది అవరవర సం
తోష పడిసుత నిత్య సుఖ మయ
వాస వాగిహ హృత్కమలదొళు బింబ నెందినిపి॥ 21

ఆ.వె. వాస వానుజుండు వర రేణుక సుతుండు
దాశరథియు దైత్య నాశ కరుడు
నమల మత్స్యరూపి హయవదనుడు కపి
లాహ్వ యుండును వర హరి యునంగ.

తే.గీ. ఈ సురూపంబులను దాల్చి యెల్లవేళ
లందు నాదిక్పతులకు నానంద మిడుచు
నఖిల సుఖమయుఁడైన బింబాఖ్యహరియు
హృత్పయోరుహ మందున నింబుగులుకు

తా॥ తూర్పు దిక్కు నందున్న యింద్రునకు ఉపేంద్రుడు ఉపాస్య మూర్తి. ఆగ్నేయమందు అగ్ని దళమందున్న అగ్నికి పరశురాముడును, దక్షిణ దిక్కు నందున్న యమునకు దశరథ రాముడును, నైరుతి దిశ యందున్న నిరృతికి జనార్దనుడును పశ్చిమ దిశ యందున్న వరుణునకు మత్స్య రూపియు, వాయువ్యదిశ యందున్న ప్రవహ వాయువునకు హయగ్రీవుడును ఉత్తర దిశ యందున్న కుబేరునకు కపిలుడును ఉపాస్య మూర్తులగు చున్నారు. ఈశాన్య దిశ యందున్న రుద్రునకు నరసింహుడు ఉపాస్య మూర్తి యగును. ఈ ప్రకారమైన రూపములతో పరమాత్ముడు ఆయా దిక్పాలకుల సేవలను స్వీకరించుచు హృదయ కమలము నందు వెలుగొందు చున్నాడు.

మా. సురపనాలయకైదిదొడె మన
వెరగు నదు సత్పుణ్య మార్గది
బరలు వహ్నియ మనెగె నిద్రాలస్య హసిత్పెయు।
తరణి తనయ నికేతనది సం
భరిత కోపాటోప తోరువ
దర విదూరను నిఋతియలి బరె పాపగళ మాళ్ప॥ 22

మూ. హృదయ దొళగె విరక్తి కేసర
కొదగె స్వప్న సుషుప్తి లింగది
మధుహ కర్ణికెయల్లి బరె జాగ్రతెయు పుట్టువదు।
సుదరుశన మొదలాద అష్టా
యుధవ పిడిదు దిశాధిపతిగళ
సదనదలి సంచరిసు తీపరి బుద్ధిగళ కొడువ॥ 24

చ॥ హృదయములో విరక్తియు జనించును లింగము కేసరంబులం
దొదగ సుషుప్తి స్వప్నములు నొప్పును జాగ్రత కర్ణికా గతిం
గదయు సుదర్శనాది కరకంజ యుతుండయి తాదిగీశ స
త్పదనములం జరించుచు నొసంగును శ్రీహరి యిట్టి బుద్ధులన్

తా॥ దళసంచారమును వదలి హృదయ కమలము నందు తన స్థానమైన కమలము మధ్యలో నుందు కర్ణికపై వచ్చి దాని చుట్టును సంచారము చేసినచో విషయ భోగాదు లందు విరక్తి జనించును. మూలేశుదు కమల కర్ణికకు చుట్టుకొని యున్న కింజల్క సంకేతమైనట్టి కేసరము లందు ప్రవేశించి దాని యందు సంచారము చేసినచో స్వప్న సదృశముగా బాహ్య విషయము లందు చిత్త మాసక్తము కాక అంతరంగ మనస్కుడై పరమాత్ముని యందు జ్ఞాపక రూపమైన జ్ఞానమును కలిగించును. కమల కర్ణిక యందు చివరి భాగముల యందు సంచారము చేసినచో సుషుప్తి సదృశమైన ఆనందమును కలిగించును. మధు యుక్తమైన కమల కర్ణిక యందు సంచారము వదలి మరల క్రమముగా అష్ట దళము లందు వచ్చినచో విషయాది వ్యాపారముల యందు మనస్సు ప్రవేశము చేసి కర్మ వ్యాపారముల యందు మేల్కొని యుందుట కలుగును. మఱియు దళ సంచార కాలము నందు జీవులకు జాగ్రదవస్థా మధ్య గతుడైనచో స్వప్నావస్థా కమల కర్ణిక యందు ఉందుటను వదలి దళముల యందు వచ్చినచో మరల జాగ్రదవస్థ ఏర్పడును. శంఖ చక్రాది అష్టా యుధములను కరములందు ధరించి యింద్రాది అష్ట దిక్పాలకుల దేహము లందలి హృదయ కమలము అష్ట దిక్కుల యందు సంచరించు చున్న మూలేశుదు ఈ జీవులను వాయుదేవుని తన పాద మూలము నందు ధరించి వానితో గూడి సంచరించుచు నానా విధములైన బుద్ధుల నిచ్చు వాడగును.

మూ. సూత్ర నామక ప్రాణపతి గా
యత్రి సంప్రతిపాద్య నాగి
గాత్రదొళు నెలెసిరలు తిళి యదె కండ కండల్లి
ధాత్రియొళు సంచరిసి పుత్రక
ళత్ర సహితను దినది తీర్థ
క్షేత్ర యాత్రెయ మాడికెపు ఎందెనుతహంగ్కి పరు॥ 25

తే.గీ. సూత్ర నామకుడమల గాయత్రి మంత్ర
సంప్రతిపత్త్యుడగుచు నిచ్చలు తనువున
వెలయు చున్నను తెలియక వెడలి ధాత్రి
తీర్థ యాత్రల నెల్లను దిరి గితి మని
పొంగు మందురు సకుటుంబముగను జనులు

తా॥ సూత్ర నామకుడను వాయు దేవునకు స్వామి యైన మహాలేశుడను పరమాత్ముడు వేదమునకు మాతృ భూతమైన గాయత్రి మంత్రముచే సర్వోత్తముడని బాగుగా పొగడబడు వాడగుచు అనంత వేద ప్రతి పాద్యుడైన వాడై దేహము నందలి అష్టదళ కమలము నందలి చతుర్వింశతి తత్త్వము లందు బుద్ధులను బుట్టించుచు తత్త్వముల ద్వార చలనాది సర్వ వ్యాపారములను తత్త్వేశుల ద్వార చేయించుచు దేహ మందుండగా తెలియక అజ్ఞానులైన వారు ఈ భూమి యందలి అనేక తీర్థ క్షేత్రములను సంచారము చేసి ప్రతి దిన మందును కుటుంబ సమేతముగా తీర్థ యాత్ర లొనర్చితి మని చెప్పు కొనువారై బింబ రూపకుని వ్యాపారములను తెలియక అహంకారముపొందు వారికి పరమాత్ముడు పాప ఫలము నిచ్చును. అందువలన దేహము నందలి పరమాత్ముని అనుసంధానముచే తెలిసి యాత్రాదులను చేయువలయునని తెలియువలయును.

మూ. నార సింహ స్వరూపదొళగె శ
రీర నామది కరిసువను హది
నారు కళెగళు ఉళ్ళ లింగది పురుషనామకను।
తోరువను అనిరుద్ధదొళు శాం
తీరమణ ననిరుద్ధ రూపది
ప్రేరిసువ ప్రద్యుమ్న స్థూలకళేవరదొళిద్దు॥ 26

మ॥ నరసింహాండు శరీర నామకుఁడునై నానావిధ ప్రాణులం
బరగుష్షోడశ సత్కళాకలిత లింగంబందునం బూరుష
స్థిరనాముం డనిరుద్ధ దేహమున శాంతీభర్త రూపంబునన్
వర ప్రద్యుమ్నుఁడు స్థూలకాయమునఁ బూర్ణ ప్రేరణం జేయుచున్.

4

తా॥ జీవుని స్వరూప దేహమందు నరసింహుడుండి ఆయా జీవులు మనుష్యులో మృగములో పక్షులో ఆయా శరీరముల నామములచే జీవాకారుడై పిలువ బడును. దశేంద్రియములు, పంచ భూతములు మనస్సు తోడి పదునారు కళలతో గల అనాది లింగదేహము అను లింగ దేహము మహత్తత్త్వ శరీరములయందు పురుష రూపుడైన పరమాత్మడు అనిరుద్ధ శరీర మందును, శాంతి పతియైన అనిరుద్ధుడను పరమాత్ముడును, స్థూల శరీరము నందు ప్రద్యుమ్నుడను పరమాత్ముడును అంతర్యాములై యుండి జీవుని యందు బ్రహ్మాది తాత్త్విక దేవతా రూపముల ద్వార జీవుల కిచ్ఛారూపమైన ప్రేరణము ప్రేరేపించు వాడగును. లింగ దేహము నందున్న బ్రహ్మాది దేవతలకు పురుష రూపముతో ప్రేరేపించు వాడగును. అనిరుద్ధ శరీర మందలి రుద్రాది దేవతలకు ప్రేరణచేయు వాడగును. ప్రద్యుమ్నుడు స్థూల దేహ మందు దేవత లందరికిని ప్రేరణ చేసి అనంతరము స్థూల దేహముచే వ్యాపారము చేయించు వాడగును. జీవునిచే ఒక కార్యము జరుగవలసినచో ఈ పరంపర ఒక స్థూల దేహ మందు కార్యములగును. ఈ విధముగా ప్రతి క్షణ మందును అనుసంధానమున్న జ్ఞానులకు గోచరించును. స్థూల దేహము నందున్న బింబ రూపకుడు అపరోక్షముచే తోచువాడగును.

ము. మొదలు త్వక్చర్మగళు మాంసవు
రుధిర మేధో మజ్జ వస్థిగ
ళిదరొళగె ఏకోనపంచాశన్మరుద్గణవు।
నిధన హింకారాది సామగ
అదరనామది కరెసు తొంబ
త్తధిక నాల్వత్తెనిప రూపది ధాతుగళొళ గిప్ప॥

5

27

తే.గీ. మొదలు త్వక్చర్మములు మాంస మును రుధిరము
మేధ మజ్జా స్థులందున మెలగు మంద్రు
నలువదిం దొమ్మిదియు మరు త్తులును వారి
యందు నిధన హింకృతయు సామాదులైన.

కII ఆయా నామంబులచే
శ్రీయధి పతి పిలువఁ బడును శ్రీరూపములం
దాయాధాతువు లందున
వే యలర నవాధికమును వింశతి ద్వయమౌ.

తాII మొదలు స్థూల శరీరమునకు పై నుండ దగిన చర్మ ప్రభేదము. దీని యందు నిధన నామకుడైన పరమాత్ముడున్నాడు. ఈ చర్మము లోపలి భాగము నందు హింకార నామకుడైన పరమాత్ముడున్నాడు. చర్మము లోపలి మాంసము నందు ఆది నామకుడైన వాడును రక్తము నందు ప్రస్తావ నామకుడును, రక్తము నందలి మేధ యందు ప్రతిహార నామకుడును మజ్జ యందు ఉద్గీథ నాముడును ఎముకల యందు ఉపద్రవనాముడును ఇట్లు సప్త సామ రూపములతో పరమాత్ముడున్నాడు. ఈ సప్త భగవద్రూపములు, నలువదిందొమ్మిది మరుత్తులు ఒక్కొక్క ధాతువులకు ఏడుగురు మరుత్తుల క్రమముతో నలువది తొమ్మిది రూపముల యందును సప్తధాతువుల యందును పరమాత్ముడున్నాడు. ఎట్లనగా ఒక్కొక్క ధాతువునకు లోపలి ఏడు మరుత్తుల నామ సంకేత మొకటే. ఈ ఒక భగవద్రూపమే. ఏడు రూపములను ధరించి ఏడు మరుత్తుల యందున్నది. ఇదే రీతిగా సప్త ధాతువు లందు గణించినచో ధాతువొక్కటికి మరుత్తులతో గూడి పదునాలుగు ప్రకారము ఏడు ధాతువు లందు 98 (తొంబది యెనిమిది) భగవద్రూపములున్నవి.

మూ. సప్తధాతుగళొళ హురగె సం
తప్తలోహగతాగ్ని యందది
సప్తసామగ నిప్ప నన్నమయాది కోశదొళు।
లిప్తనాగదె తత్తదాహ్వాయ
క్లుప్తభోగవ కొడుత స్వప్నసు
షుప్తిజాగ్రతియావ తైజస ప్రాజ్ఞ విశ్వాఖ్య॥ 28

ఆ.వె. ధాతు సప్తకమునఁ దానుండు వెలిలోనఁ
దప్త లోహమందుఁ దనరువగ్ని
చందమునను సప్త సామగుఁడా హరి
లిప్త రహితుఁడగుచు లీలమెఱయు.

తే.గీ. అరయ నన్నమయాది కోశాంతరములఁ
దత్త దాహ్వయుఁడగుచు నేతద్విభోగ
ముల నొసంగుచు నిద్రాది మూడుగతులఁ
బ్రాజ్ఞ తైజస విశ్వాఖ్య పరుడొసంగు.

తా॥ సప్తకాల నామకమైనదియు నిధనాది యేడు భగవద్రూపములును, స్థూల దేహము నందలి సప్తధాతువులును, లోపలను వెలుపలను బాగుగా అగ్ని యందు కాచ బడిన లోహము నందలి అగ్ని వలె నున్నాడు. అన్నమయాది అయిదు కోశములు సప్తధాతువుల యందును అంతర్భూతములగును. సప్తధాతువులతో గూడిన అన్నమయాది కోశములందును నిధనాది భగవద్రూపములు వ్యాప్తమై ఆయాకోశనామములతో నుండి ఆయాకోశములతో గాని, తత్కార్యములతో గాని వానికి సంబంధింపక ఆయా జన్మములందాయా దేహములచే పూర్వ కర్మము ననుసరించి క్లుప్తముగా భోగింప దగిన సుఖ దుఃఖాది భోగముల నిచ్చుచుండు వాడగును. ఈ భోగార్థము విశ్వనామకుడైన పరమాత్ముడు దక్షిణ నేత్ర మందుండి జాగ్ర దవస్థను, ప్రాజ్ఞనామకుడు హృదయమందుండి నిద్రావస్థను తైజసనామకుడు కంఠ దేశ మందుండి స్వప్నావస్థను ఈ మూడు రూపములచే ప్రసిద్ధుడై అవస్థా త్రయములను గుణత్రయముల ద్వార పొందించును.

మూ. తీవికొండిహ వల్లి మజ్జ క
ళే వరది అంగులియ పర్వద
తావి నలి మున్నూరు అరవత్తెనిప త్రిస్థళది।
సావిరద ఎంబత్తు రూపవ
కోవిదరు పేళువరు దేహది
దేవతిగళొడగూడి క్రీడి సువను రమారమణ॥ 29

త్రిపాది సీసము

ఈ కళేబరమునం దెసఁగు మున్నూటర్వ
దగులెక్క యస్తులు నట్టివాని
నంటి మజ్జయుఁ గడు హత్తియున్నవి చూడ
నంగుళీ పర్వత్ర యంబులందు

స్థూలమైకొన్నియు సూక్ష్మంబులై కొన్ని
యుట్టి దేహంబున నీశ్వరుండు

తే.గీ. వేయు నెనుబది రూపాల వెలయు బొంది
యీ విధం బగు రూపంబు లెవ్వియనిన?
నస్థి గతమౌ యుపద్రవ మనెడు పేర
నట్టి సాంకేత రూపంబు లౌనుగాదె.

వా॥ ఈ స్థూల దేహమందు మున్నూటరువది అస్థులు స్థూల సూక్ష్మములై యున్నవి. మజ్జ సాంకేతమైన ధాతువు ఆయా అస్థుల యందు హత్తు కొని యున్నవి. వ్రేళ్ళ కీళ్ళు దానిననుసరించిన యెముకలు ఏ రీతి నున్నవో అదే రీతి దృశ్యాదృశ్యములై కీళ్ళును యెముకలు నున్నవి. మున్నూటరువది కీళ్ళుండు చోట కీళ్ళును కీళ్ళకు రెండు వైపుల నుండు యెముకలు ఈ విధముగా ఒక్కొక్క కీలుకు మధ్య నుండు మధ్య స్థలముల యందు మజ్జ ధాతువుతో లేపమై జిడ్డుతో గూడి యున్నది. బండి చక్రమునకు కందెన యెట్లుండునో అట్లున్నది. మున్నూటరువదికి మూడు మూడు స్థానముల మేరకు 1080 అగును. ఇన్ని భగవద్రూపములను జ్ఞానులైన వారు ఈ దేహ మందు దేవతలతో గూడి యున్నవని చెప్పుదురు. లక్ష్మీపతి యైన నారాయణుడు ఆయాస్థానములందుండి ఆటలాడు చున్నాడు. ఈ రూపములే వనగా? అస్థి యందున్న ఉప ద్రవ నామము గల భగవద్రూపములు అంశలని యర్థము. మఱియు మున్నూటరువది దినముల కభిమానులైన దేవతలు వారి అంతర్యామి యైన భగవద్రూపములు.

మూ. కీటు పేశస్కార నెనవిలి
కీట భావవనైది యాడువ
ఖేట రూపవనైది యాడువ తెరది భకుతియలి।
కైట భారియ ధ్యానదింద భ
వాటవియ నతిశీఘ్రదిందలి
దాటి సారూప్యవను ఐదువరల్ల జీవిగళు॥ 30

ఉ॥ కీటము పక్షి సాయమున గీట శరీరము వాసి యెంత యుం
ఖేట సురూప మొం గొనుచు ఖేపథమందున నాడునట్లుగా

గైటభవైరి ధ్యానమును గాంచి భవాఖ్యవనంబుఁ జెచ్చెలిం
దాటి స్వరూప సౌఖ్యమును దాల్తురుగా భువినల్ప జీవులున్

తా॥ రెక్కలు లేని చిన్న కీటకమును మఱి యొక రెక్కలతో గూడిన చిన్న కీటకము మట్టితో నొక గూటిని గట్టి దానిలో నా చిన్న కీటకము నుంచి తన వంటి రెక్కలు గల కీటకముగా మార్చి పోషించును. ఆ కీటకము తన పూర్వ రూపమును చింతించుచు ఆకాశములో నెగురుచు సంచరించును. ఆ విధముగా పరమాత్ముని నిరంతరమును ధ్యానించుటచే అహం మమకారముం తోడి అరణ్యమును దాటి తరువాత దానికి కారణమైన లింగ దేహమును విరజానదియను అడవి యందు వదలి సారూప్య ముక్తిని పొందును. ఈ దృష్టాంతము సర్వసామ్యము కాదు. పరమాత్ముని యందు తదేక నిష్ఠమైన వాడై యుండ వలయుననుటకు దృష్టాంతము. దీనివలన వారు వారు లింగ దేహ భంగమును పొంది సారూప్యమనగా వారి వారి జీవాకారమైన బింబ రూప మేదియున్నదో ఆ రూపమును అపరోక్షముతో బొందగలరు. సారూప్య మనగా సమాన రూపము. ఇచట సమాన రూప మేదనగా జీవుని ఆకారమునకు సమానమైన రూపము బింబ రూపము. ఈ రూపము అపరోక్షమగును.

మూ. ఈ పరియదేహదొళు భగవ
ద్రూపగళ మరియదలె మనదిప
దేపదే భకుతియలి స్మరిసుతలిప్ప భకుతరను।
గోపతి జగన్నాథ విఠ్ఠల స
మీపగను తానాగి సంతత
సాపరోక్షియ మాడి పొరెవను ఎల్లకాలదలి॥ 31

క॥ ఈ లీల దేహమునఁ గల
మేలగు రూపముల స్మృతిని మీఱక మది నే
వేళను భక్తిందలఁచు బు
ధాలికి నపరోక్ష మొసఁగి హరిరక్షించున్.

తా॥ ఈ విధముగా సర్వకాలము లందును స్థూలాది దేహములందుండు అనేకమైన భగవద్రూపములను దేహేంద్రియాదులచే జరుగు శుభా శుభ కర్మము లందలి భగవద్రూపములను వ్యాపారములను మరువ కుండునట్లు మనస్సు నందు మాటి మాటికి మిక్కిలి భక్తితో స్మరించు చున్నట్టి భగవద్భక్తులను

అనంత వేదములచే ప్రతి పాద్యుడైన జగన్నాథ విట్ఠలుడు తన యిచ్ఛచే తానే జీవుని హృదయాకాశ మందు అప రోక్షమునకు సమీపమైన వాడై నిరంతరమును వాసనా రూపమును ధ్యానము చేయ దగిన అధికారులకు వాసనారూపమును దూరము చేసి నిజ రూపమైన తన అప రోక్షముచే సన్నిహితుడైన వాడై లింగ భంగమును పొందించి తన దగ్గరకు చేర్చుకొని స్వరూపానందమును వ్యక్తము చేసి మోక్ష స్థాన మందుంచి కాపాడును.

ఇది శ్రీహరికథామృతసారమంది ఉదాత్తానుదాత్తసంధి

# సర్వప్రతీకసంధి (పదవ సంధి)

మూ. హరికథామృతసార గురుగళ
కరుణదిందా పనితు పేళువె
పరమ భగవద్భక్తరిద నాదరది కేళువుదు॥

తే.గీ. హరికథామృతసారము గురువుల దయ
మెఱియవర్ణింతు వాఁడను పరమభక్త
వరులు సజ్జను లాదర భావమొదవ
వినవలయు భక్తిమీఱగ వీనులలర

మూ. ఆవపర బొమ్మనలి విమలాం
గావ బద్ధరు ఎందెనిప రా
జీవ భవ మొదలాదమర రనుదినది హరిపదవ।
సేవిపరి గనుకూల రల్లదె
తావు ఇవరన కెడిస బల్లరె
శ్రీవిలాసాస్పదన దాసరిగుంటె అపజయవు॥ 1

ఉ॥ ఏ విమలాంగుఁడైన పరమేశుని నిర్మల దేహబద్ధులౌ
నా వనజాసనాది సురలందరు శ్రీహరిపాదపద్మముల్
సేవ యొనర్చు వారలకు శ్రేయదులే కద; వారిఁ జేద్రుదం
బోవ ఘటింతురే దనుజముఖ్యు; లజేయులుగారె దాసులున్

తా॥ వైకుంఠ మందు ఏ పరమాత్ముడున్నాడో అటువంటి గుణ పరిపూర్ణుడైన వాసుదేవుని శరీరము నందును అవయవము లందును తమ తమ యోగ్యతానుసారముగా వారి వారి స్థానముల యందు లింగ దేహమును పొందిన వారు అంగసా యుజ్యమును సర్వాంగసా యుజ్యమును భోగింప దగిన వారగుదురు. బ్రహ్మ దేవుడే మొదలైన చతుర్వింశతి తత్వాభిమాన దేవతలను, ప్రతి దిన మందు హృదయ పద్మ మందలి పరమాత్ముని దర్శనమును కోరిన వారై వాసనా ప్రతీకను హృదయ మందు నిలిపి అంతర్యామియైన పరమాత్ముని అనుసంధానము చేసి పరమాత్ముని పాద ద్వయమును మానస నిర్మితమైన పూజా ద్రవ్యము లందు అంతర్గతుడైన పరమాత్ముని ఐక్యచింతనముతో పూజించి సేవించు వారికి తత్వాభిమానులైన

దేవతలు సర్వ విషయము లందు అనుకూలురే కాని ప్రతి కూలురు కారు. భగవంతుని ఆజ్ఞచే ప్రతికూలమైన అజ్ఞానాదుల నీయ కుందురు. దేహ మందలి తత్త్వాభిమానులైన అసురులును బాహ్య మందలి అసురులును భక్త జనులను చెడుపుటకు సమర్థులు కాజాలరు. పరమాత్ముని దాసులకు ఎప్పటికిని అపజయమనునది లేనే లేదు.

మూ. శ్రీదనంఘ్రి సరోజ యుగళే
కాదశస్థా నాత్మ దొళగి
ట్టాదరది సంతుతిసు వవరిగె ఈ నవగ్రహవు।
ఆదితేయరు సంతతాధి
వ్యాధిగళ పరిహరిసుత వరను
కాదుకొండిహరెల్ల రొందా గీశనాజ్ఞెయలి॥ 2

ఉ॥ శ్రీదు పదాంబు జాతములఁ జిత్తమున న్ముదమార దాల్చి స
మ్మోదము మీఱఁగాఁదలఁచు ముక్తుల కెల్ల నవగ్రహంబు లా
యా దివిజాదులున్ సతతమాధుల వ్యాధులఁ బారఁద్రోలి య
త్యాదరమొప్పఁ గావఁగల రాహరి యానతిఁ దాల్చి నిచ్చలున్

తా॥ పరమాత్ముని పాద పద్మములను తమ ఏకాదశ ఇంద్రియ స్థానముల యందు నిలిపి మిక్కిలి భక్తితో ధ్యానించు ముక్తి యోగ్యులైన భక్తులందరికిని నవగ్రహంబులును దేవతలును వ్యాధుల నెల్లను పరిహారము చేసి అభిమానముతో భగవంతుని ఆజ్ఞను సారముగా రక్షింతురు.

మూ. మేదినియు మేలుళ్ళ గోష్పా
దోదక గళెల్లవుల తీర్థవు
పాదపాద్రి ధరాతళవె సుక్షేత్ర జీవగణ।
శ్రీదన ప్రతిమెగళు అవరుం
బోదనవె నైవేద్య నిత్యది
హోది నడెవుదె నర్తనగళెం దరితవనె యోగి॥ 3

క॥ మేదినిపైఁగల గోష్పా
దోదకములె పుణ్యమైన యురు తీర్థము లా

సీ॥ ముక్కోటి పైఁబడి చక్కఁగాంచెదు రోమ
కూప సంగతమైన రూపములను
డెబ్బది రెండువేల్ బ్రబ్బిన నాడుల
నలరు మారుతు హృదయాబ్జవర్తి
యైనట్టి మాధవుఁడనుదిన మందున
నీ దేహమందున మోదమెసఁగఁ
దా రమించు నటించుఁ దలఁచి యెఱింగిన
సూరులే దేవతా సూరులనుచు

తే.గీ. వారి దేహంబులే క్షేత్రవరములనుచు
వారి యర్చనలే హరి పరమపూజ
అనుచు మదిలో నెఱింగిన యట్టివారు
ధరణి బ్రహ్మజ్ఞులంచును దలఁపవలయు

తా॥ మూడున్నర కోటి రోమ కూపములందలి రూపములు డెబ్బది రెండు వేల నాడులుండ దగిన రోమ కూపము లందును, నాడుల యందును ప్రధాన వాయుదేవుడు ఒక్కొక్క దానియందు ఒక్కొక్క రూపము మేరకు డెబ్బది రెండు వేల నాడుల యందును, మూడున్నర కోటి రోమ కూపముల యందును ప్రకాశ మానుడై యున్నాడు. ఈ వాయుదేవుని అంతర్యామియైన మాధవుడను పరమాత్ముడు ప్రతిదిన మందును తాను రమాస మేతుడై సర్వదేవతా పరివారములతో గూడి అచట నుండ దగిన తీర్థముల యందు నదుల యందు విహారము చేయుచు జలాకారముతో మత్స్య రూపముతో నుండునని తెలిసి అనుష్ఠానము చేయుచు నుండ దగిన భక్తులైన జ్ఞానులే దేవతలు. వీరు తమ సాధనము కొఱకు అవతరించిన వారే కాని మానవులు కారు. వీరి శరీరములే మహా క్షేత్రములని పిలువ బడును. ఇట్టి భక్తులుండదగిన స్థానములకు నడచి పోయి వారిని పూజించుటయే హరి పూజ యనియు తీర్థక్షేత్రములు యాత్రా సంచారమగుననియు తెలియవలయును. సమస్త తీర్థాభి మానులు వారి పాదము లాశ్రయించి యుందురు. సర్వ తీర్థక్షేత్రములు వారి శరీరములందే యుండుట వలన సర్వ తీర్థక్షేత్రాదుల యాత్రా ఫలము లభింపగలదు.

పాదప నగ భూతలమే
యాదర సుక్షేత్రగణము లాజీవములే

కII శ్రీ విభునకుఁ బ్రతిమంబులు
నైవేద్యము వారి యోదనంబులు నిచ్చల్
ఈ వసుమతి నడచుట నా
నా విధ నర్తనలెటింగినన్ యోగియగున్

తాII బ్రహ్మాండ మను నదే ఒక పెద్ద పుణ్యక్షేత్ర మనియు గోష్పా దోదకమే సరోవరములు నదులు బావులు తీర్థము లనియు ఈ క్షేత్రము నందలి బావులు తీర్థములని యు ఈ క్షేత్రము నందలి జీవరాసులన్నియు చల ప్రతి మలనియు తదంతర్యామియైన పరమాత్ముడే భగవన్మూర్తి యనియు జీవులందరును భుజించు భోజనమే నైవేద్యమనియు సంచారము నర్తనలనియు ఉపచారములే పూజలనియు అనుసంధానము చేసిన పరమాత్ముడు సంతృప్తుడగును. ఈ విషయములను తెలిసిన పురుషునకు సార్థక్యమగును. ఇది బాహ్యాను సంధాన క్రమము. శరీరము నందు సమస్తతత్త్వాభిమాన దేవతలు సార్ధ త్రికోటి దేవతలును తీర్థ క్షేత్రా భిమానులును తదం తర్యామియైన భగవంతుడు విరాజిల్లుటచే ఈ దేహమునే పుణ్యక్షేత్రముగా భావించుట అంతరంగాను సంధానమగును.

మూ. సర్వదేశవు పుణ్యదేశవు
సర్వకాలవు పుణ్యకాలవు
సర్వజీవరు దాన పాత్రరు మూరు లోకదొళు।
సర్వమాతుగ ళెల్ల మంత్రవు
సర్వకెలస గళెల్ల పూజెయు
శర్వవంద్యన విమలమూర్తి ధ్యానవుళ్ళవగె॥ 4

ఉII సర్వములైన దేశములు సర్వములై విలసిల్లు కాలముల్
సర్వముఁ బుణ్య సంయుతమె సర్వసుజీవులు దానపాత్రులే
సర్వములైనభాషణలు సంతతమంత్రములెల్ల కార్యముల్
శర్వ వివంద్యు పూజలగు శౌరిఁదలించిన యట్టివారికిన్

తాII పై విధముగా అను సంధానము చేయు అధికారికి అన్ని స్థలములు పుణ్య

స్థలములే. పుణ్య క్షేత్రములే. మున్నూట అరువది దినములు మంచి దినములే. పదునాలుగు లోకములందున్న సర్వ త్రివిధ జీవరాసులు దానపాత్రులే. సర్వ విధములుగా ఆడు మాటలే మంత్రములు. చేయు పనులన్నియు పూజలే. రుద్రునిచే పొగడదగిన నిర్దోషుడైన భారతీ రమణ ముఖ్య ప్రాణాంతర్యామియైన పరమాత్మని ధ్యానము నిరంతరము చేయు భక్తుడు బ్రహ్మజ్ఞానియే అగును.

మూ. దేవఖాత తటాక వాపిస
రోవరగళ భిమాని సురరు క
ళేవరదొళిహ రోమకూపగ ళొళగె తుంబిహరు।
ఆవి యద్గంగాది నదిగళు
భావిసువ దెప్పత్తెర డెనిప
సావిర సునాడిగళొళగె ప్రవహిసుతలిహ వెందు॥ 5

చ॥ దివిజ సునిర్మితంబులయి దీప్తివహించు సరస్తటాకముల్
ప్రబవి మలమైన పుష్కరిణి వాపి సమూహము వాని దేవతా
ప్రవరులు రోమకూపముల భాసిలు చుందురు దేవవాహినీ
వివిధ నదుల్ శరీరగత విశ్రుతనాడులం బారు చుండెడున్।

తా॥ దేవతలచే నిర్మితములైన పర్వతాదుల యందున్న దొనలు, పుష్కరిణులు, చెఱువులు, దిగుడు బావులు, సరోవరములు ఇవన్నియు మూడున్నర కోటి తీర్థములకు అభిమానులైన దేవతలు ఈ స్థూల దేహమందుండ దగిన మూడున్నర కోటి రోమ కూపములందు నిండుకొని వసించుచున్నారు. గంగ మొదలైన నదులు తదభిమానిదేవతలు డెబ్బది రెండువేల నాడులయందు ప్రవాహ రూపముగా సంచారము చేయుచున్నవి అని తెలియవలయును.

మూ. మూరుకోటియ వ్యాళశోభిప
ఈరధిక ఎప్పత్తుసావిర
మారుతాం తర్యామి మాధవ ప్రతిదివసదల్లి।
తారమిసు తహనెందు తిళిదిహ
సూరిగళె దేవతెగళవర శ
రీరగళె సుక్షేత్ర అవరర్చనెయె హరిపూజె॥ 6

మూ. శ్రీవరిని గభిషేక వందరి
దీ వసుంధరె యొళగె బల్లవ
రావ జలదలి మిందరెయు గంగాది తీర్థగళు।
తా వొలిదు బిందల్లె నెలెగొం
డీవఖిళార్థగళ నరియద
జీవరమర తరంగిణియ నైదిదరు ఫలవేను॥ 7

ఉ॥ శ్రీవరునందొనర్చు నభిషేక మటంచు నెఱింగి భూమిపై
నే విబుధుండు గాని నదినే జలమందు మునింగెనేని యుం
బావన గంగ మున్నుగల వావిరితీర్థములుం బ్రసన్నమౌ
భావనలేక తీర్థముల వంగిమునింగిన నేఫలంబగున్?

తా॥ అధికారి అనుసంధాన మెంతటిదో అంత మాత్రపు ఫలము లభించును. మిక్కిలి విలువయైన ఒక జీవ రత్నము నిచ్చి కడుపు నొప్పిని పోగొట్టుకొనుటకు వాము అను పదార్థమును లాభముగా పొందినట్లు అల్పమైన ఫలము లభించును. గంగాది తీర్థములందు సర్వదా సన్నిధానముండును. దీనిని అనుసంధానముచే తెలిసి స్నానము చేయవలయును. ఇవి రెండును లేక స్నానము చేసినచో వాని స్నానము జల చరాదుల స్నానములై దేహాయాసము ధనవ్యయము మాత్రము మిగులును. నిష్ఫల మగును. తక్కువయైన దేవతలు స్నానము చేయునపుడు వారి కంటె ఉత్తమమైన దేవతలు ఆ తీర్థము లందు జల రూపమున నుండి ఫలము నిత్తురు. సర్వ మానవులకు పుష్కరుడు ఫలము నిచ్చువాడగును. ఈ అనుసంధానముతో సర్వ దేహము లందుండు దేవతలకు సర్వభగవద్రూపములకు స్నానము చేయించి వారి శేషమైన ఉదకమును తాను స్నానము చేయవలయును.

మూ. నదది గళిళి యొళగె పరివపు
ఉదధి పరియంతరది తరువా
యదలి రమిసువపల్లి తన్నయవాగి తోరదలె।
విధి నిషేదగ ళాచరి సువరు
బుధరు భగవద్రూప సర్వ
త్రదలి చింతనె బరలు త్యజిసువరఖిల కర్మగళ॥ 8

చ॥ ధరణి నదీ నదంబులు ముదంబునఁ బారుచు వార్ధిఁజేరి సు
స్థిరముగ నిర్వికారమయి చెల్వువహించెడురీతి పూర్వముం
దరతమ భేదకర్మములఁ దామొనరించుచు శ్రీశుచింతనన్
మఱగిన మీద కర్మము లమందతవైౖ త్యజియింతు రెంతయున్ 24

తా॥ నదములనగా పురుషరూపములు. నదులనగా స్త్రీరూపములు. ఇట్టివి భూమి యందు ప్రవహించుచు సముద్రమును చేరగలవు. అట్లు చేరిన తరువాత నదీ నదముల జలము సముద్ర జలముగనే కన్పట్టును. ఈ విధముగా బ్రహ్మ జ్ఞానులైన వారు సర్వదా భగవచ్చింతనము జ్ఞానము ప్రాప్తమగుటకు పూర్వము విధి నిషేద కర్మములను ఆచరించు చుందురు. భగవచ్చింతనము జ్ఞానము ప్రాప్తించిన తరువాత విధి నిషేద కర్మలను వదలి పరమాత్మని సన్నిధానము ను చేరుదురు.

మూ. కలియ మొదలా దఖిళ దానవ
రొళగె బ్రహ్మభవాది దేవ
ర్కళు నియామకరాగి హరియాజ్ఞెయలి అవరవర।
కలుషకర్మవ మాడి మాడిసి
జలరు హేక్షణ గర్పిసుత ని
శ్చల సుభక్తిజ్ఞాన పూర్ణరు సుఖిపరవరొళగె॥ 9

చ॥ కలి మొదలైన యాయసుర కాయములందున బ్రహ్మశంకరా
ద్యలఘు సుదేవతా వితతి యాహరి యాజ్ఞను వారియందు దు
ష్కలుషము లాచరించుచును గ్రమ్మఱ వారలచే నొనర్పగా
గలిగి సుఖింతురాహరికిఁ గర్మ సమర్పణ చేయువారలై 25

తా॥ తమో యోగ్యులంద త్యంత నీచులైన కలి మొదలైన సమస్త దైత్యులందు బ్రహ్మ వాయువులు కలియందు నియామకులు. ఈ కలికంటె కొంచెముత్తముడైన దైత్యునందు బ్రహ్మ వాయు రుద్ర మొదలైన దేవతలు ఆయా దైత్యుల స్థూల దేహము లందు తారతమ్యాను సారముగా తత్త్వనియామకులై పరమాత్మని యాజ్ఞచే ఆయా దైత్యుల యొక్క భగవద్ద్వేషాది దోష కర్మములను పరమాత్మని క్రియ వలన చేయించి బింబరూపి పరమాత్మునకు తాము చేసినట్టి పాపముల నర్పించు చుందురు. అచంచలమైన భక్తి జ్ఞానాదులచే పరిపూర్ణులైన దేవతలు ఆయా దైత్యులందుండి నను సుఖవంతులై యుందురు.

బౌద్ధ
ములు

మూ. ఆవజీవరొళిద్ద రే ని
న్నావ కర్మవ మాడలేని
న్నావ గుణరూపగళుపాసనె మాడలేనవరు।
కావనయ్యన పరమ సత్కారు
నావలోకన బలది వరిసువ
దేవతెగళను ముట్టలాపవె పాపకర్మగళు॥ 10

తా॥ ఏ యే జీవులలో వసించినను తామేకర్మలం జేసిన
న్నేయే రూపగుణంబులం దలంచి యాత్మేశు న్నుపాసించినన్
శ్రేయో రూపకుండా రమేశు కరుణాశ్రీ చేత రంజిల్లు నా
కీయుల్ వారినిఁ దాకఁ గల్గునె? పునః ఖేదాత్త పాపంబులున్

తా॥ పైన పేర్కొనిన దేవతలు త్రివిధులైన యేజీవుల యందు వ్యాప్తులై యున్ననేమి? ఆయా జీవుల అనాది కర్మములననుసరించియు ఆగామి సంచిత కర్మములను అనుసరించియు పాప పుణ్యములను ఉదాసీన కర్మములను మఱియునే కర్మల చేసినను యేయే గుణ రూపములను ఉపాసించిననేమి? నీచాధిష్ఠాన దైత్యులు మధ్యమాధిష్ఠానులైన నిత్య సంసారులు ఉత్తమాధిష్ఠానులైన దేవతలు ఈ అధిష్ఠానములందు ఏ అధిష్ఠానగతమైన భగవద్రూపములను ఆ రూప నందలి గుణములను ఉపాసించిన నేమి? పరమాత్ముడు మిక్కిలి కరుణచే చూచునట్టి బలముతో సంచారము చేయదగిన దేహమందలి తత్త్వ నియామకులను దోష కర్మము లైనవి ఫలరూపములో భోగమునకు వచ్చి స్పర్శ చేయ గలవా? ముట్టజాలవు. దేవతలను పాప కర్మములు ముట్టకుండుటకు వారు పరమాత్మునకు నిష్కపటముగా సర్వ సమర్పణము చేసిన భక్తియే కారణము. అందువలన జీవులు సర్వ పాప పుణ్యములను పరమాత్మునకు సమర్పింప వలయును.

మూ. పతి యొడనె మనబంద తెరదలి
ప్రతిదివసదలి రమిసి మోదిసి
సుతర పడెదిళియొళు జితేంద్రియళెందు కరెసువళు।
కృతిపతి కథామృత సుభోజన
రత మహాత్మరిగితర దోష
ప్రతతిగళు సంబంధి సువువే వ్యుతన దాసరిగె॥ 11

మ॥ ప్రతినిత్యంబును స్వేచ్ఛగా స్వపతితో రక్తిన్ సుఖంబొందుచున్
సుతులం గాంచెదు కాంత శీలవతియై శోభిల్లు నిచ్చ్యముగాఁ
గ్రతి వాధామల సత్కథామృతరస శ్రీ లోలురౌవారిఁ బా
ప తతుల్ దాకఁగఁ గల్గునే? హరిపదాబ్జప్రీతులౌ దాసులన్

తా॥ శాస్త్రోక్తముగా వివాహము చేసుకొనిన స్త్రీయైన తన యొక్క పతి యు ధర్మరాశై అతని అజ్ఞానుసరించి సంతోషముతో బిడ్డలతో సుఖించు చుండును జితేంద్రియురాలని పిలువ బడును. తన పతి యందు విముఖురాలైనచో దోషి యనబడి కష్టములనుభవించును. ఆ విధముగా సృష్టి పతి యైన ప్రద్యుమ్నుడను పరమాత్ముడు స్త్రీలకు వలె జీవులకు పతియైన వాడు. ఆ ప్రద్యుమ్నుని అజ్ఞాధారకులై అతని యందే ధ్యానము గలవారై జ్ఞాన భక్తి వైరాగ్యములను పుత్రులను పొందినచో జీవుడు కూడ జితేంద్రియుడనబడును. అందువలన పతియైన పరమాత్ముని సేవించు దాసులకు దోషము లేదు.

మూ. సూసి బహు నదియొళగె తప్పన
హాస తోరువ వెందు జలకెదు
రీసిదరె కైసోతు ముణుగువ హారయు బిట్టువను
క్లేశ వదువవాది యులిసా
ర్వేశ క్లుప్తియ మాడిదుడ వి
ట్టాశయిందలి అన్యరారాధిసువ మానవను॥ 12

మ॥ తన సామర్థ్యము చూపనెంచి యొకఁడుద్దండంబుగాఁ బొంగి ప
ర్వు నదిం దానెదురీది లోనుమిఁగి సంక్షోభించు చందంబునన్
వనజాక్షుఁ దొసంగినట్టి సుఖముల్ త్యజించు నవ్యేశులన్
మనమందుం భజియించు వాఁడు కడుహీనంబైన దుఃఖాత్ముఁడౌ

తా॥ ఒక వ్యక్తి తన సామర్థ్యమును చూపనెంచి పరిపూర్ణ జలముతో నిండి ప్రవహించు నదికి అభిముఖముగా ఈది నదిలో మునిగినట్లు సర్వ స్వామియైన పరమాత్ముడను గ్రహించిన భోగాదులను వదలి తన యిష్టానుసారముగా భోగములు ప్రాప్తింప వలయునని అన్యులైన ఉచ్ఛిష్ట గణపతి మొదలైన దేవతల పూజా సేవాదుల చేయుదగిన అజ్ఞానియై హరిని వదలిన మానవుడు రుద్రాదుల అంతర్యామియైన పరమాత్ముని తెలియక ఇహపర లోకములందు దుఃఖములను భవించు వాడగును.

మూ. నాను నన్నదు ఎంబ జడమతి
మానవను దినదినది మాడువ
స్నాన జప దేవార్చనెయు మొదలాద కర్మగళ
దాన పరు శెళ దొయిపరల్లదె
శ్రీనివాసను స్వీకరిస మ
ద్దానె పక్వ కపిత్థఫల భక్షిసిదవోలహుదు॥ 13

ఉ॥ నే ననువాఁడు నాదియను నీచుఁడు నిచ్చలుఁ దానొనర్చునా
స్నాన జపార్చనాది కరణంబుల దానవు లాహరింపఁగాఁ
బూనుదు రట్లుగాక కొనఁబోపునె? శ్రీహరి; యా మదేభ ముం
దాను భుజించినట్టి ఫలదంపు కపిత్థ ఫలంబు వైఖరిన్

తా॥ అహం మమతాదులతో గూడిన వాడై చేయు కర్మము లను నేను చేసితిని దీని ఫలము నాది యను నీచుడు చేయు స్నానము, సంధ్యా వందనము, జపము, అర్చనము మొదలైన కార్యములను తత్ఫలితములను దైత్యులు స్వీకరింతురు గాని భగవంతుడు స్వీకరించునా? ఎట్లనగా మదపు టేనుగు భుజించిన వెలగ పండును చూచినచో అందలి గుజ్జు భేదింప బడకయే యెట్లు మాయ మగునో అట్లు నీచు లొనర్చిన సత్కార్యములు నిష్ఫలములగును.

మూ. ధాత్రి యొళగుళ్ళఖిల తీర్థ
క్షేత్ర చరిసదరేను పాత్రా
పాత్రనరితన్నాది దానవ మాడిఫలవేను।
గాత్ర నిర్మలవాగి మంత్ర
స్తోత్ర పఠిసిదరేను హరి స
ర్వత్ర గతనెందరి యదలె తా కర్త ఎంబవను॥ 14

మ॥ పరమక్షేత్ర సుతీర్థరాజముల సేవంజేయుఁగా నేమియౌ
నరయం బాత్ర మపాత్రతం జలుపునా యన్నాది దానంబులున్
పరమంత్రస్తుతులం బఠింపనవియే పాటిం ఫలంబిచ్చు శ్రీ
హరి సర్వోత్తమ భావనన్మఱచి గర్వాధీనుఁడౌ వానికిన్!

తా॥ అహం మమతాదులతో గూడిన అధికారి ప్రసిద్ధములైన యేయే పుణ్యక్షేత్రములు తీర్థములును సేవించుట, ఆయా స్థలముల యందు అన్నాది దానములు

చేయుట, వలన ఫలమేమి? మంత్రములను స్తోత్రములను పఠించుట వలన ఫలమేమి? అవి యెట్టి ఫలితముల నీయ గలవు? హరియే సర్వోత్తముడు. అతని అధీనముననే యీ కార్యము లన్నియు జరుగుచున్న వను భావన లేనిచో అవన్నియు నిష్ఫలములే యగును. గదా?

మూ. కంద నీరొళు ముణుగి దేహవ
దండిసిద ఫలవేను దండక
మండలు గళనె ధరిసి యతియెంచెనిసి ఫలవేను।
అండజాధిప నంసగన పద
పుండరీకది మనవ హర్నిశి
బండుణియ వోలిరిసి సుఖబడదిప్ప మానవను॥



వా॥ కన పడునట్టి నీరములఁ గాయము ముంచిననేమి? దండముం గొనుచుఁ గమండలంబుఁ గొని క్షోణి యతీంద్రుఁడనంగ నేమి యీ ఘనుఁడగు పక్షివాహను నకల్మషపాద పయోరుహంబులం దనరెడు షట్పదంబులనఁ దా సుఖమొందని మానవుండిలన్!

తా॥ కంటికి కనపడిన తీర్థ జలముల యందు స్నానాదులు చేయుట వలన వచ్చు ఫలమేమి? దండక మండలములను తీసుకొని యతీంద్రుడనిపించు కొనిన దాని వలన వచ్చు ఫలమేమి? గరుడ వాహనుడైన పరమాత్ముని నిర్దోషమైన పాద పద్మముల యందు భక్తియను మకరందమును తుమ్మెద వలె పానము చేయుచు సుఖ మొందని వాని జన్మ మెందుకు?

మూ. వేదశాస్త్ర పురాణ కథెగళ
ఓది పేళిదరేను సకల ని
షేధ కర్మవ తొరెదు
ఓ దనంగళ జరిదు
రోధ గైసిదరేను
క్రోధ పళియదె

వా॥ ప్రకటిత వేద
సకల నిషిద్ధ

ఒక పరి వన్నముందినక యూపిరినిం బిగబట్టి నేమియుగా?
రక్ష యిలఁగావ క్రోధముఁ దొఱంగక నేననిపొంగు గర్వియున్

తా॥ చతుర్వేదములు భారత భాగవతాది శాస్త్రములు ధర్మ ప్రవృత్తి మొదలైన ధర్మశాస్త్రములు, అష్టాదశ పురాణములు బాగుగా అభ్యసించి పఠించి పురాణములను ఉప దేశములను చేయుట వలన ఫలమేమి? నిషేధమైన కర్మలను త్యజించుట వలన గలుగు ఫలమేమి? అన్నోదకాదులను వదలి శ్వాస నిరోధమును గావించి ఆయుర్వృద్ధి చేసుకొని మహాత్ముడని లోకుల వలన పిలువ బడుటచే ఫలమేమి? సకాము కర్మలు చేసి అందరికి మనస్తృప్తి లేని పనులు చేసి జనుల దయను సంపాదించుట కొఱకు కోపమును వదలక వాడి నేనను మమకారముతో. సత్కార్మలు చేసిన దాని వలన వ్యర్థమగునే కాని ప్రయోజనము లేదు.

మూ. ఏను కేళిదరేను నోడిద
రేను ఓదిద రేను పేళిద
రేను పాడిద రేను మాడిదరేను దిన దినది!
శ్రీనివాసన జన్మ కర్మ వ
దానురాగది వెనెదు తత్తత్
స్థానదలి తద్రూప తన్నామకన స్మరిసదవ॥ 17

ఆ.వె. ఏమి విన్ననేమి? యేమి చూచిన నేమి?
ఏమి చదువ నేమి? యేమి పలుక
నేమి? పాడనేమి? యేమి చేసిన నేమి?
దిన దినంబు తనదు మనము నందు.

క॥ శ్రీనిలయు జన్మ కర్మల
జ్ఞానముతో నెఱిఁగి భక్తి సల్పుచు తత్తత్
స్థానము లం దద్రూప సు
ధానామస్మరణ లేని తజ్జనులకిలన్.

తా॥ ఏయే శాస్త్రములు వినుట వలన ఫలమేమి? ఏయే క్షేత్ర తీర్థములు చూచుట వలన ఫలమేమి? ఏయే గ్రంథములు చదువుట వలన ఫలమేమి? ఏ యే కీర్తనలను పాడిన దానివలన ఫలమేమి? ఎల్లప్పుడు పరమాత్ముని

రూపమును చూడక మనస్సులో అతనిని స్మరించ లేని మానవుడు జీవించుట వలన సార్థక మేమునను?

మూ. బుద్ధి విద్యా బలది పేళిద
శుద్ధ కావ్యవిదల్ల తత్త్వ సు
పద్ధతి గళను తిళిద మానవనల్ల బుధరిందా
మధ్వవల్లభ తానె హృదయ దొ
ళిద్దు నుడి దందరి నుడిదెన
పద్ధతిగళ నోడదలె కివిగొట్టాలిపుద్దు బుధరు॥ 18

ప॥ వర విద్యామతిశక్తిఁ బల్కిన సుకావ్యం బిద్దియా? కాదు సు
స్థిర తత్త్వంబులెఱుంగు సద్బుధులచే శిక్షార్హుఁడా? కాను నే
నరయన్ మధ్వమనోధి రాముఁడు మనంబందుండి పల్కించు త
త్ప్రకరణిం బల్కిత బద్ధముల్ గనక శ్రద్ధన్ సూరు లాలింపుడీ

తా॥ ఈ కావ్యమును స్వబుద్ధిచే నాలోచన చేసి కాని పాండిత్య బలమున కాని చెప్పినది కాదు. భగవద్భక్తులైన జ్ఞానులచే తత్త్వములను ఉత్తమ పద్ధతులను తెలిసిన వాడను కాను. కాని శ్రీ మధ్వానంద తీర్థుల యొక్క అంతర్యామి యైన శ్రీ వేద వ్యాస భగవానుడు తనకు తానే హృదయాకాశ మందు ప్రత్యక్షుడైన వాడై యుండి బింబక్రియ ద్వార పలికించిన విధముగా ప్రతి బింబమైన నేను పలికి యున్నాను. అందువలన దీని యం దేమైనను వాచా ప్రమాదములున్నను జ్ఞానులైన వారు త్రోసి పుచ్చక ఈ గ్రంథమును వినుట యందు మిక్కిలి ప్రీతిని జూప వలయునని ప్రార్థించు చున్నాను. ఏల యనగా? 'సంక్షిప్త వాక్యేమయి మంద బుద్ధౌ సంతో గుణాఢ్యాః కరుణాం క్రియానుః' అను శ్రీ నారాయణ పండితాచార్యుల వారి మధ్వ విజయ వాక్యమే ప్రమాణము.

మూ. కబ్బినొళగిహ రస విదంతని
గబ్బు బల్లదె భాగ్య యౌవన
మబ్బినలి మైమరద పగె హరిసుచరి తామృతవు
లభ్య వాగదు హరిపదాబ్జది
హబ్బి దరె సద్భక్తి రసవుం
డుబ్బి కొబ్బి సుఖాబ్ధి యొళగాడువవ గల్లదరె॥ 19

ఉ॥ చెఱకున నుండు సారపు రుచిం(గ్రహియింప విదంతు(డోపునే?
సిరియును యౌవనాదుల విశేషముచేత మదించు వానికా
హరి చరితామృతంబు( గొననబ్బునె? శ్రీ విభుపాద పద్మ సం
భరిత సుభక్తిసారరస పానవిమత్తున కబ్బునట్లుగన్

తా॥ చెఱకు నందలి తియ్యని రసమును ఆస్వాదింప దంతములు లేని వానికి సాధ్యమగునా? కాజాలదు. అట్లు జ్ఞాన భక్తులను దంతములు లేని వాడును యౌవనాదులచే మదించిన వాడగు వానికి ఈ హరి కథామృతసారమందలి అమృత రసమును అనుభవించుటకు శక్యము కాజాలదు. వానికి రుచింప నేరదు. ఇంకెవరకి ఈ గ్రంథము రుచించు ననగా? పరమాత్ముని పాద పద్మము లందలి భక్తి యను మధురమైన రసము రుచించును.

మూ. ఖగవర ధ్వజ నంఘ్రి భకుతియ
బగెయ నరి యద మాన వరిగిదు
ఒగటె నందది తోరుతిప్పదు ఎల్లకాలదలి।
త్రిగుణ వర్జిత నమల గుణగళ
పొగళి హిగ్గువ భాగవ తరిగె
మిగె భకుతి విజ్ఞాన సుఖ విత్తవర రక్షిపుదు॥ 20

చ॥ ఖగవరవాహనాంఘ్రి యుగ కంజములందలి భక్తి భావమున్
దగ( దెలియంగ లేక మతి తప్పిన వారికి నీ సుకావ్యమే
వెగటుగ( దోచు(గాదె కదువేడుక శ్రీహరి సద్గుణంబులం
బొగడుచు( బొంగు దాసులకు( బూర్ణ సుఖాదు లొసంగి కాచుతన్.

తా॥ గరుడ వాహనుడైన కృష్ణుని పాద పద్మము లందలి భక్తి నెఱుగ కుండు మనుష్యులకు ఈ హరికథామృతసారమందలి అర్థము గర్భీ భూతమైన అర్థము వలె అసాధ్యమగును. విషయాసక్తులైన వారికి దీని ఆచరణ కూడ మనస్సునకు కష్టముగానే తోచును. కాని సర్వ గుణపూర్ణుడైన పరమాత్ముని అనుగ్రహమును పొందిన భగవద్భక్తులకు జ్ఞాన భక్తి వైరాగ్యాదులచే అత్యంత సుఖము నొసంగి ఇహ పరము లందు రక్షింప గలదు.

మూ. పరమ తత్త్వ రహస్యవిదు భూ
సురరు కేళువదు సాదరది ని
ష్ఠురిగళిగె మూఢరిగె పండితమాని పిశుణరిగె।
అరసికరిగిదు పేళ్వుదల్లన
పరత భగవత్పాద యుగళాం
బురుహ మధుకరనెనిసుపరిగిదనరుపు మోదదలి॥ 21

చ॥ పరమ సుతత్త్వ గోప్యమిది బ్రాహ్మణులార వినుండు భక్తి ని
ష్ఠురులకు బుద్ధిమాంద్యులకు సూరివిహీనులకున్ మదాత్మలౌ
నరసికులైన వారికి నన్వర్థము చెప్పుట శౌరిపాద పం
కరుహ సుషట్పదంబు లనఁగాఁదగు భక్తులకున్ వచింపుఁడీ

తా॥ ఈ హరి కథామృత సారమను గ్రంథము నందలి ఉత్తమమైన పరమాత్మని తత్త్వములు మిక్కిలి రహస్యములై గంభీరములైనవి. ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులార! శ్రద్ధతో వినుడు. భక్తి హీనులకు మంద బుద్ధులకు కుబుధులకు మదించిన మనస్సు గల వారికి అరసి కులైన వారికి ఈ రహస్యములను చెప్పుట తగదు. పరమాత్మని పాద పద్మములందు అత్యంతమైన భక్తి గల వారికి ప్రీతితో చెప్పుదు.

మూ. లోకవార్తె యిదల్ల పరలో
కైకనాథన వార్తె కేళ్వరె
కాకు మను జరిగిదు సమర్పకవాగి సొగసుపుదె।
కోకనద పరిమళపు షట్పద
స్వీకరిసు వందదలి జలచర
భేక బల్లుదె ఇదర రస హరిభకుత గల్లదలె॥ 22

మత్త కోకిల

లోకవార్త యిదేలయౌ పరలోకనాథుని వార్తయౌ
నా కుబుద్ధులకున్ సమర్పకమై రుచించునె? చూడఁగా
శ్రీకరాంబుజ సారమాధురిఁ జేకొనున్మధుపంబు నా
భేకమున్ రుచి తానెఱుంగనె? విష్ణుభక్తుఁడె సాటియౌ

తా॥ ఈ గ్రంథము నందలి విషయము ఈ లోకమునకు సంబంధించిన కాదు. వైకుంఠ లోక నాయకుడైన నారాయణుని దివ్య లీలా వార్తలు. బుద్ధి హీనులైన మదించిన పండితుల కిది రుచించునా? పద్మము నందలి మకరందసారమును సదా తుమ్మెద పానము చేసి మాధుర్యమును ఎఱుగును గాని దాని రుచి కప్పలకు తెలియగలదా? దీని యందలి అమృతసారము విష్ణు భక్తులకు మాత్రము రుచించును.

మూ. స్వప్రయోజన రహిత సకలే
ష్టప్రదాయక సర్వగుణ పూ
ర్ణప్రమేయ జరామరణ వర్జిత విగత క్లేశ।
విప్రతమ విశ్వాత్మ ఘృణి సూ
ర్య ప్రకాశానంత మహిమ ఘృ
త ప్రతీకారాధితాంఘ్రి సరోజ సురరాజ॥

23

## మత్తకోకిల

స్వప్రయోజనముం దలంపని సజ్జనేష్ట విధాత యు
న్న ప్రమేయ గుణప్రపూర్ణుఁడనాది రూపుఁడు కోటి సూ
ర్య ప్రకాశుఁడు క్లేశదూరుఁడనంత సన్మహిముండు స
ద్విప్ర సేవ్యుడు శ్రీకరార్చిత దివ్యపాద సురేశుడున్

తా॥ చరాచరములను స్వప్రయోజన రహితుడైన వాడై సృష్టించిన వాడై ఆయా జీవులకు వారి వారి యోగ్య తానుసారముగా అంత్యమునకు నిజగతుల నొసగి పరమ ప్రయోజనము సేయదగిన వాడు. సమస్తమైన త్రివిధ జీవులకు ఇష్టమైన సుఖ దుఃఖ మిశ్రమ సుఖములను లింగ శరీర భంగానంతరము వ్యక్తము చేసి యొసగువాడు. సమస్త గుణ గణములచే పరి పూర్ణమైన వాడు. రమా బ్రహ్మాదులచే తెలియదగిన వాడు. దుఃఖము లేని వాడు. జరామరణ వర్జితుడు. బ్రహ్మ కంటె నుత్తముడు. కోటి సూర్యప్రకాశుడు. అపార మహిమ గల వాడు. లక్ష్మీదేవిచే పూజింప బడు పాద పద్మములు గలవాడు. బ్రహ్మాది దేవతలకు ప్రభువైనవాడు.

ము. వనచరాద్రి ధరాధరనె జయ
మనుజ మృగవరవేష జయ వా
మన త్రివిక్రమదేవ జయ భృగురామ భూమ జయ।
జనకజా వల్లభనె జయ రు
గ్మిణి మనోరథ సిద్ధిదాయక
జినవిమోహక కలివిదారణ జయజయారమణా॥ 24

**తరలము**

వనచరాద్రిధరా! ధరాధిప! భవ్యరమ్య మృగా కృతీ!
ఘన బలీ భుజ గర్వ భంజన! క్ష్మాసురేంద్ర! జయా! జయా!
జనక జా హృద యాబ్జ మందిర! సత్య భైష్మి మనోహరా!
జిన విమోహక రూపకా! కలిచిత్త నాశ కరా! నమో

తా॥ మత్స్య కూర్మ, వరాహ నారసింహ వామన పరశురామ, రామ, కృష్ణ బౌద్ధ కల్క్యవ తారములను ధరించిన ఓ లక్ష్మీ రమణా! నీకు నమస్కారములు అని దాసుల వారు పరమాత్ముని స్తుతించి యున్నారు.

ము. సచ్చిదానందాత్మ బ్రహ్మ క
రార్చితాంఘ్రి సరోజ సుమనస
ప్రోచ్చ సన్మంగళద మధ్వాంతః కరణ రూఢ।
అచ్యుత జగన్నాథ విట్ఠల
నిచ్చ మెచ్చిద జనర బిడకా
డ్గిచ్చ నుండారణ్యదొళు గో గోపరనుకాయిదా॥ 25

తే॥ సచ్చిదానంద హృదయ! కంజాత భవ క
రార్చి తాంఘ్రి సరోజ! వరా మరనుత!
మంగళ ప్రద! మధ్వాంతరంగ నిలయ!
హరి జగన్నాథ విట్ఠల! పరమ కరుణ!

క॥ నిచ్చలు మెచ్చిన జనముల
మచ్చికతోఁ గాచువాఁడ! మహితా టవిలో
హెచ్చిన చిచ్చుం గ్రోలుచు
జెచ్చెలు గోపకులఁగాచి చెలఁగిన దేవా!